**SRI SRI VACHANA VINYASAM**
By Dr. Rapolu Sudarshan

Cover Photos : **G. Bharathbhushan**

Cover Design : **Laxman**



Publication : **Ananya Publications, Hyderabad.**

Price : Rs. 70/-



For Copies :
**Vishalandra Publishing House**
4-1-435, Vignana Bhavan, Bank Street,
Hyderabad - 500 001, & All Branches ;
**Navodaya Book House,** Opp : Arya Samaj, Badichowdi, Hyderabad.
**Disha Pusthaka Kendram,** Chikkadpally, Hyderabad.
And
**T. Anuradha**
H. No. 4-1-64/1, Hanumantekdi,
Hyderabad - 500 001.

DTP : **Soundarya Enterprises,** Chikkadpally, Hyderabad - 500 020.
Printed at : **Padmasri Graphics,** Hyderabad. Ph : 7612283
Cover Printed at : **Kala Jyothi Process Ltd.,** Hyderabad. Ph : 7612337.

---

తెలుగు విశ్వవిద్యాలయ ఆర్థిక సహాయంతో ప్రచురితం

'బడి' లో చేరిన నాటి నుండీ

విశ్వ విద్యాలయం వరకూ

సిలబస్ పాఠాలతో

జీవిత పాఠాలూ

'నేర్పు' గా నేర్పిన

నా గురువు లందరికీ

# అంకితం

# రచయిత పరిచయం

| | |
|---|---|
| జననం | : 03-03-1958 |
| జన్మస్థలం | : నింబోలి అడ్డ, కాచీగుడ, హైదరాబాదు |
| జననీ జనకులు | : నీలమ్మ, యాదగిరి |

<u>విద్య :</u>

| | |
|---|---|
| 1. 7 వ తరగతి వరకు | : చౌడీ నానామియా, పాఠశాల, కాచీగుడ, హైదరాబాదు |
| 2. 810 తరగతులు | : బాలుర ప్రభుత్వోన్నత పాఠశాల, సుల్తాన్ బజార్, హైదరాబాదు |
| 3. డిప్.ఓ.ఎల్. - ఎం.ఎ.(ఎల్.) | : ఆంధ్రసారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల, తిలక్‌రోడ్, హైదరాబాదు |
| 4. ఎమ్.ఫిల్. (M.Phil.) | : ఆర్ట్స్ కళాశాల, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు |
| 5. పిహెచ్.డి. (Ph.D.) | : సాహిత్యపీఠం, తెలుగు విశ్వవిద్యాలయం, బొమ్మూరు, రాజమండ్రి |
| 6. తెలుగు పండిత శిక్షణ | : ప్రభుత్వ సమగ్ర విద్యాతత్త్వ కళాశాల, హైదరాబాదు |
| 7. పి.జి. డిప్లమా (లింగ్విస్టిక్స్) | : ఆర్ట్స్ కళాశాల, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు |
| 8. పి.జి. డిప్లమా (జర్నలిజం) | : డి.ఎన్.ఎఫ్., జర్నలిజం కళాశాల, హైదరాబాదు |

<u>సాంకేతిక విద్య :</u>

| | |
|---|---|
| 1. వైర్‌మన్ | : సెంట్రల్ ట్రైనింగ్ ఇనిస్టిట్యూట్ (సిటిఐ), హైదరాబాదు |
| 2. టైప్ రైటింగ్ | : ఇంగ్లీషు, తెలుగు లోయరు |

<u>వృత్తి :</u>

| | |
|---|---|
| 1. ఇ.డి.ఎమ్.సి. | : పోస్టల్ డిపార్ట్‌మెంట్ |
| 2. లిఫ్ట్‌ఆపరేటర్ - సీ. అసిస్టెంట్ | : స్టేట్ ఫైనాన్షియల్ కార్పోరేషన్, హైదరాబాదు |

<u>ప్రవృత్తి :</u>

| | |
|---|---|
| 1. సాహిత్యం | : కవిత్వ, వ్యాస పఠన పఠనాలు |
| 2. సాంస్కృతికం / క్రీడలు | : అభినయం, చదరంగం, టేబిల్ టెన్నిస్ |

<u>రచనలు :</u>

| | |
|---|---|
| 1. ముద్రిత పుస్తకం | : శ్రీశ్రీ పీఠికలు పరిశీలన |
| 2. ముద్రణలో పుస్తకాలు | : 1. శ్రీశ్రీ వచన విన్యాసం, 2. శ్రీశ్రీ రచనల సూచి |
| 3. వ్యాసాలు, కవితలు | : పాతికేసి చొప్పున వివిధ పత్రికల్లో ముద్రితం |
| 4. పాఠ్య రచన | : డాక్టర్ బి. ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వ విద్యాలయం, 'ప్రసార మాధ్యమాల రచన' కోర్సు |

<u>అవార్డులు :</u>

| | |
|---|---|
| 1. సాంస్కృతిక సమాఖ్య, విజయవాడ | : శ్రీశ్రీ స్మారక కవితల పోటీ 1988లో ప్రథమ బహుమతి |
| 2. ఆం. ప్ర. సినీ గాయనీ గాయకుల సంఘం | : 1980లో కవితల పోటి ప్రథమ బహుమతి |
| 3. 'రంజనీ' సాహితీ సంస్థ | : 1. క్విజ్ పోటీలో ద్వితీయ బహుమతి, కవితల పోటీలో బహుమతి |

<u>సంస్థలు :</u>

| | |
|---|---|
| 1. సమాంతర సాహితీ వేదిక | : ఏ. పరమాత్మతో కలిసి 1988లో స్థాపించి 1988, 89 సం॥లో సభల నిర్వహణ |
| 2. కవిసమయం | : కె. శ్రీనివాస్, పి. రామహనుమాన్‌లతో కలిసి 1990 లో స్థాపించి సభల నిర్వహణ |

# విషయసూచిక

# కృతజ్ఞతలు

ఈ పుస్తకం థీసిస్ రూపంలో ఉన్నప్పుడు చదివిన గురువులు, మిత్రులు ముద్రించమని సలహా ఇస్తూ, అన్ని విధాల సహకారం అందిస్తామనడంతో, ఆ ప్రోత్సాహమే ఊపిరిగా ఈ పుస్తక ముద్రణలోకి దిగాను.

శ్రీశ్రీ వచన రచనలపై పరిశోధన చేయడానికి అవకాశం కల్పించిన తెలుగు విశ్వవిద్యాలయ నాటి ఉపాధ్యక్షులు ఆచార్య సి.నారాయణరెడ్డి గారికీ - ఇదే విశ్వవిద్యాలయం పక్షాన ఈ పుస్తక ముద్రణకై ఆర్థిక సహాయాన్ని అందజేసిన నేటి ఉపాధ్యక్షులు ఆచార్య నాయని కృష్ణకుమారిగారికీ-

'శ్రీశ్రీ పీఠికల'పై ఎం.ఫిల్. చేసిననాకు శ్రీశ్రీ అన్ని వచన రచనలపై పరిశోధన చేయాలనే నా ఆకాంక్షను గమనించి, ఈ పరిశోధనకు పర్యవేక్షక బాధ్యతను స్వీకరించి అడుగడుగునా సలహాలనిస్తూ, నిపుణంగా పర్యవేక్షించడమేగాక, ఈ పుస్తక ముద్రణలో కూడా తమ సహాయ సహకారాలను అందజేసిన గురువు ఆచార్య జయధీర్ తిరుమలరావు గారికీ -

ఈ పరిశోధనలో అమూల్యమైన సలహాలనిచ్చిన ఆచార్య చేకూరి రామారావు, ఆచార్య కె.కె. రంగనాథాచార్యులు, శ్రీ హరి పురుషోత్తమరావు, శ్రీ ఎం.నరహరి, డా॥ డి.చంద్రశేఖర్‌రెడ్డి, డా॥ ఏటుకూరి ప్రసాద్, డా॥ కాచినేని రామారావు, డా॥ కుంటముక్కల లక్ష్మీనారాయణ, డా॥ డి.కె. శ్రీనివాసాచార్యులు గారలకూ -

ఎం. ఫిల్.కై చేరినప్పుడు పర్యవేక్షకులుగా ఉండి పరిశోధనలో మెలకువలను నేర్పడమేగాక, 'తెలుగు పరిశోధన' పత్రికలో పనిచేసే అవకాశాన్ని కల్పించి నా ఎదుగుదలకు నిరంతరం సహకరిస్తూ, ఈ పరిశోధనను సు'దర్శనం'గా పేర్కొంటూ పీఠిక రాసిన ఆచార్య ఎన్.గోపి గారికీ -

నేను ఎం.ఫిల్., పిహెచ్.డి. పరిశోధనలకై చేరిన నాటి నుండీ ఇప్పటికీ శ్రీశ్రీకి సంబంధించిన సమాచారం అందిస్తున్న స్నేహశీలి, 'శ్రీశ్రీ సమాచారానికి చిరునామా' అనే బిరుదాంకితులు అయిన శ్రీ చలసాని ప్రసాద్‌గారికీ - నేను ఎం.ఫిల్.లో చేరినప్పుడు తమ దగ్గరున్న

శ్రీ శ్రీ సాహిత్య వచన సంపుటాల్ని నాకిచ్చి, ఇప్పటివరకూ వాటిని వాడుకోడానికి అవకాశం కల్పించి సహకరించిన ప్రముఖ కవి శ్రీ నిఖిలేశ్వర్ గారికీ -

ఈ పరిశోధన చిత్తు ప్రతినుండి ముద్రణవరకూ నాకు నీడలా నిలిచి ఈ పుస్తకంపై తమ అభిప్రాయాన్ని 'పీఠిక'గా రాసిచ్చిన 'తెలంగాణా మాండలిక కవిత్వ' పరిశోధి అయిన ఆత్మీయ మిత్రుడు ఎ.పరమాత్మకూ - ఈ థీసిస్ రచనలో ఎంతో విలువైన సలహాల నిచ్చిన 'గురజాడ పాత్రల' పరిశోధకుడు, తెలుగు పండిత శిక్షణలో నాసహాధ్యాయి టి.ఎస్. జగన్మోహన్‌కూ - కాలేజీలో చదివే రోజుల నుండీ ఈ పుస్తక ముద్రణ వరకూ తమ సహాయ సహకారాలతో నిరంతరం చేయూతనివ్వడమేగాక ఈ పుస్తకంపై 'వచనంలో కూడా మహాకవే' గా పీఠికనూ రాసిన ప్రముఖ పాత్రికేయులు కె. శ్రీనివాస్‌కూ, ఈ థీసిస్ చదివి చక్కటి సలహాలనిచ్చిన మిత్రులు డా॥ ఎ.కె. ప్రభాకర్, డా॥ నాళేశ్వరం శంకరం గారలకూ -

ఈ పుస్తకం ఈ మాత్రం అందంగా రావడానికి రాత్రింబగళ్ళు నా వెంట తిరిగి తన ముద్రణా అనుభవాన్ని నాకు ధారాదత్తం చేసిన సహృదయ మిత్రుడు శ్రీ దుర్గం రవీందర్‌కూ - డిటిపి పనితో అందంగా అక్షరాలను అమర్చిన మరీచిక గారికీ - ఎంతో బిజీగా ఉన్నప్పటికీ ఒక్కరోజులో కవర్‌పేజీని అలంకరించిన ఆర్టిస్ట్ లక్ష్మణ్‌గారికీ - కవర్ పేజీలకు అవసరమైన ఫోటోలు తీసిన భరత్ భూషణ్ గారికీ - పుస్తకాన్ని అందంగా ముద్రించిన పద్మశ్రీ గ్రాఫిక్స్ వారికీ - ఈ పుస్తక ముద్రణలో కొన్ని అధ్యాయాలు ప్రూఫ్‌లు చూసిన మిత్రులు శ్రీ కె.పి. అశోక్‌కుమార్‌కూ - తమ దగ్గరున్న పుస్తకాల నివ్వడంతోపాటూ, ఆర్థిక సలహాలనిస్తున్న మిత్రులు తార్నాక శాఖ గ్రంథాలయ గ్రంథపాలకులు శ్రీ టి. యాదగిరి గారికీ -

జన్మనిచ్చి జీవితాన్ని ప్రసాదించిన వారు తల్లిదండ్రులైతే, ఈ జీవికి ఉద్యోగమిచ్చి జీతాన్ని అందిస్తున్నది ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక సంస్థ (APSFC). నేను ఏ డిగ్రీ చేయడానికైనా అనుమతించి అన్ని విధాలా చేయూతనిస్తూ, ఈ పుస్తక ముద్రణలో సంస్థ (APSFC) ప్రకటనను ఇచ్చి ఆర్థికంగా ఆదుకున్న ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక సంస్థ 'సంచాలక మండలి' (Board of Directors) కీ, అధ్యక్షులు శ్రీ కె.హరీశ్వర్‌రెడ్డి, MLA గారికీ - ప్రస్తుత కార్యనిర్వాహక సంచాలకులు (MD) శ్రీ పి.కె. రస్తోగి, ఐ.ఎ.ఎస్. గారికీ - మాజీ ఎం.డీ. లు శ్రీ ఎం.ఎస్. ప్రసాద్, ఐ.ఎ.ఎస్. గారికీ - శ్రీ కె.వి. రావు, ఐ.ఎ.ఎస్. గారికీ - శ్రీ కె.నారాయణరావు (ED)గారికీ - శ్రీ ఆర్.పి. మోడి (CGM) గారికీ - మాజీ సిజిఎం శ్రీ కె. రంగస్వామిరెడ్డిగారికీ - జనరల్ మేనేజరులు శ్రీ టి. సత్యనారాయణ, శ్రీ పి.వి.బి. లక్ష్మీనాథ్‌గారలకూ, డి.జి.ఎం. శ్రీ ఎస్. నాగేశ్వరరావుగారికీ - సీనియర్ మేనేజరు

శ్రీ ఎస్. బి. శంకర్‌కుమార్ (శంకు) గారికీ - మాజీ మేనేజర్ శ్రీ కె. యు. శాస్త్రిగారికీ, శ్రీ ఆర్. శ్రీరామచంద్రకుమార్, శ్రీ బి. జాన్ **(John)** అసిస్టెంట్ మేనేజరులు, శ్రీ కె. హరిరాజ్ (JO) శ్రీ ఎం. దయానంద్ (అటెండర్)గారలకూ, ఇలా నా సహోద్యోగులందరికీ-

నాకు తల్లిదండ్రీ తానై ఇప్పటికీ నిరంతరం తన కృపను కురిపించే అమ్మకూ, నా చదువువల్ల ఇంటి పరిస్థితుల్ని పట్టించుకోకున్నా సర్దుకుపోయిన నా అర్ధాంగి తుగ్గడం అనూరాధకూ, తమ్ముడు వినోద్‌కుమార్, మా చిరంజీవులు చైతన్య, సౌజన్య, అనన్యలు ప్రూఫ్‌లు చూడ్డంలో అమితంగా సహకరించినందుకూ - ముద్రణ విషయంలో సలహాలనిచ్చిన రైల్వే ప్రింటింగ్ ప్రెస్ ఉద్యోగి అయిన మా బావ శ్రీ గోవింద్‌బక్స్ యాదగిరి గారికీ-

ఇలా ఇంకా సహకరించిన ఎందరో మహానుభావులందరికీ -

నా హృదయపూర్వక

**కృతజ్ఞతలు.**

# వర్తమాన వచనం అంచున

యూనివర్సిటీల్లోంచి పేజీల కొద్దీ దిగుమతయ్యే పరిశోధనల్లో ప్రామాణికత లేదు. తెలుగు భాషా, సాహిత్య పరిశోధనల స్థాయీ, విలువలు పూర్తిగా దిగజారాయి. అనివార్యంగా పట్టాలు ప్రదానం చేయటం తప్ప పరిశోధకులు కొత్త అంశాల్ని శాస్త్రీయంగా సిద్ధాంతీకరించ లేకపోతున్నారు - అనే అపవాదు ఈ మధ్య మరోసారి పత్రికా ముఖంగా చర్చల్లోకొచ్చింది.

ఇది ఆహ్వానించ దగ్గ చేర్చే అయినా ప్రజాస్వామికమైన, ఆహ్లాదకరమైన వాతావరణంలో ఈ చర్చ సాగలేదు. అది మన విమర్శకుల మానసిక బలహీనతో లేక మొదటే ఏదో ఒక అంశానికి కట్టుబడిపోయి తర్వాత అదెంత మంచిదైనా కాదనగలిగే మనస్తత్వంవల్లో తెలియదుగాని తెలుగు సాహిత్య విమర్శ, సమీక్షకి ఈ జాడ్యం ఇప్పుడు వచ్చింది కాదనుకుంటా.

ఎప్పటికప్పుడు మనంఒకటి మర్చిపోతున్నాం. పాక్షిక నిర్ణయాలు అప్పటికప్పుడ [illegible] సులోని ఐడెంటిటీకి పబ్లిసిటీ ఇస్తాయేమోగాని సహేతుకమైన విమర్శ అనిపించుకోలేదు అనేది. పైగా మనం ఒక అంశాన్ని తీసుకుని పత్రికా ముఖంగా చర్చించుకోవాలనుకుంటున్నప్పుడు మనకు అందిన,చెందిన దాన్ని వెనకేసుకొస్తూ మనకు అందని, చెందని దాన్ని తెగుడుతూ వస్తున్నాం. అదంతా విహంగ వీక్షణంతో చేసే కామెంట్స్‌తప్ప సాధికారికమైన అధ్యయనంతో ధృవపర్చుకున్న రుజువులు కావని తేలిపోతుంది. ఇలాంటి విమర్శ ధోరణి తెలుగు పరిశోధనా స్థాయిని పెంచడానికి ఏ విధంగా తోడ్పడుతుందో అంతా ఆలోచించాలి. పూర్తిగా ''మంచిది'' ఎందులోనూ ఉండనట్టే అంతా ''చెడూ'' కూడా వుండదు. ఆ స్పృహతో అంచనా వేస్తే తెలుగు పరిశోధన వాసి, వన్నె, ప్రామాణికత వగైరా వంటి లక్షణాల్లో కొన్నైనా కనిపించకపోవు. అలాంటి వాటిని ఉదహరిస్తూ బ్యాలన్సుడుగా చర్చించగలిగే ప్రజాస్వామికమైన విమర్శ రావల్సిన అవసరం ఎంతో వుంది. అది అందరికీ ఆమోదయోగ్యం కూడా.

యూనివర్సిటీల్లోని పరిశోధనల స్థాయి, విలువల్ని అంచనా వేస్తున్నప్పుడు ఎకడమిక్ సైడ్‌లోంచి ఆలోచిస్తే, పరిశోధనా అంశాన్ని భుజానికి తగిలించుకుని సమాచార సేకరణకు బయల్దేరే విద్యార్థికి కొన్ని పద్ధతులను, పరిమితులను మార్గదర్శకులైన ఆచార్యులూ, పరిశోధనా నిబంధనలు

నిర్దేశిస్తాయని బుద్ధిజీవులైన విమర్శకులకి తెలియంది కాదు. అయినప్పటికీ విద్యార్థే బలి పశువవుతున్నాడు. ఏది ఏమైనా యూనివర్సిటీల్లోని విధి, విధానాల్లో భారీ మార్పులతో పాటు పరిశోధక విద్యార్థి అభిరుచిని, అభిప్రాయాల్ని, కనీస స్వేచ్ఛనిస్తూ ప్రోత్సహించేగైడు దొరికినప్పుడు తెలుగు సాహిత్య పరిశోధన కొంతైనా ప్రామాణికంగా వస్తుందనీ మిత్రుడు సుదర్శన్‌గతంలో శ్రీశ్రీ పీఠికలపై సమర్పించిన ఎం. ఫిల్. థీసిస్ ఈ కోణంలోంచే వచ్చిన ఒక మంచి సిద్ధాంత వ్యాసమని ఈ సందర్భంగా గుర్తు చేయటం అతిశయోక్తి కాదు.

శ్రీశ్రీ పీఠికల్లో విప్లవం తప్ప ఇంకేముంటుందనుకునేవారి భ్రమల్ని తొలగించి శ్రీశ్రీ సూచించిన 'రసన' అనే కొత్త సిద్ధాంతాన్ని గురజాడ, డికెన్స్‌ల సాహిత్యానికి, చార్లీచాప్లిన్ సినిమాలు, పికాసో 'గుయెర్నికా' చిత్రానికి మొట్టమొదటిసారిగా విపులంగ అన్వయించిన, విశ్లేషించిన తీరు పరిశోధకుడిగా సుదర్శన్‌లోని నిష్ఠ, నిగ్రహము, జిజ్ఞాస, ప్రతిభ, అభిరుచులు వ్యక్తమవుతాయి. ఈ పరిశోధన వెనక గైడ్ ద్వారా సుదర్శన్‌కు లభించిన స్వేచ్ఛను స్పష్టంగా గుర్తించవచ్చు. అది పరిశోధకుడి మీదగైడుకున్న కాన్ఫిడెన్స్‌ను తెలియజేస్తుంది.

ప్రస్తుతం శ్రీశ్రీ వచన రచనల్ని పరిశోధించి డాక్టరేట్ పొందిన సుదర్శన్ నాలుగు మాటలు రాయమంటే మొహమాటం కొద్దీ కాదనలేకపోయాను. సిద్ధాంత వ్యాసానికి పీఠిక రాసే యోగ్యత ఏమిటో నాకు తెలియదు. కాని అంత సులభమైంది మాత్రం కాదని ఈ థీసిస్‌ను సమగ్రంగా అధ్యయనం చేశాక తెలిసింది.

శ్రీశ్రీ కవిగా కంటే ముందుగా సృజనాత్మకమైన వచన రచనలకు శ్రీకారం చుట్టాడు. అప్పటికే తెలుగులో రావాల్సినన్ని వచన ప్రక్రియలు వచ్చేశాయి. ఆ వచ్చిన వచనం ఆధుని ని అనివార్యంగా సంతరించుకుంది. ఆ ఆధునికతకు మూలం హేతువాదం. కాలవాచిగానూ, భావవాచిగానూ ఆధునికత పురోగమిస్తున్న సంధి దశలో తెలుగు భాషా, సాహిత్యాలు సమాజంలో భాగమైన కొందరు రచయితల మీద కొంత బాధ్యతను మోపాయి. ఆ బాధ్యతను అభ్యుదయ భావాలతో మేళవించి రచనలు చేసిన వాళ్ళలో శ్రీశ్రీ ఒకడు.

అప్పటికే అరకొరగానైనా అందుబాటులోనున్న ఆంగ్ల భాషా సాహిత్యాలు, వీరేశలింగం, గురజాడ, సృజించిన వచనం గిడుగు, కొమర్రాజు లక్ష్మణరావు భాషా సంస్కరణలూ, త్రిపురనేని రామస్వామి హేతువాదం శ్రీశ్రీ వచన రచనలకి కావల్సినంత అవకాశాన్ని అనువుని అందించాయి.

శ్రీ శ్రీ చేపట్టిన వచన ప్రక్రియలు రాసిలోనూ వాసిలోనూ కవిత్వం కన్నా ఎక్కువే అయినా వచన రచయితగా శ్రీ శ్రీకి రావాల్సినంత గుర్తింపు రాలేదు అని మిత్రుడు సుదర్శన్ వేసిన ప్రశ్నకి సమాధానం ఒక్క అనంతం తప్ప ఆయన వచనశైలి పాపులర్ శైలికి భిన్నమైంది కావటం చేత కవిగా కన్నా వచన రచయితగా పైచేయి కాలేకపోయిందనవచ్చు. పైగా శ్రీ శ్రీ తన వచన రచనల్లో చేసిందంతా సాహిత్య విమర్శే అని నా అభిప్రాయం. శ్రీ శ్రీ సాహిత్య పరిణామాలని సామాజిక పరిస్థితులతో సమన్వయించి చారిత్రక దృక్పథంతో విశ్లేషించిన తీరుని ఈ పుస్తకంలో వ్యాసాలు, ఉపన్యాసాలు శీర్షికల కింద సుదర్శన్ చక్కగా అన్వయించాడు. ఇంకో టేమిటంటే సాహిత్యంలో మరో అన్యాయం జరుగుతూ వస్తుంది. వంద కథలు రాస్తే రచయితగా రాని గుర్తింపు ఓ కవితా సంకలనం అచ్చేస్తే కవిగా జీవిస్తున్నాడు. కవిత్వం వచనాన్ని మింగేస్తుందేమో ఆలోచించాలి.

శ్రీ శ్రీ వచన రచనలన్నింటిని క్రోడీకరించుకుని పరిశోధన నిమిత్తం విషయ విశ్లేషణకు పూనుకుంటే ఎదురైన కష్టాలేమిటో, అట్టడుగు జనం ఆకలికీ, కన్నీళ్ళకి కలాన్ని అందించిన శ్రీ శ్రీ వచన రచనలమీదే పరిశోధన చేయాల్సిన అవసరం కాని అభిరుచికాని సుదర్శన్‌కు ఎందుకు కలిగిందో ఆయన నేపథ్యం చదవాల్సిందే. శ్రీ శ్రీ వచనాన్ని ప్రధానంగా ఏదో ఒక గాటుకికట్టివేయలేం. ఆయన వచనాన్ని అధ్యాయాలుగా వింగడించిన తీరు బాగున్నా అధ్యాయాలన్నింట్లో కొన్ని విషయాలు పదే పదే పునరావృతం అవుతుంటాయి. అది మొదట పాఠకులకి విసుగు అనిపించవచ్చు కాని శ్రీ శ్రీ ప్రత్యేకత ఏమిటంటే చెప్పే తీరులోనూ, అర్థంలోనూ కొత్తదనముంటుంది. దాన్ని సుదర్శన్ ఈ పుస్తకంలో బలంగా నిరూపించాడు.

శ్రీ శ్రీ సృజనాత్మక వచన రచయితే కాకుండా, క్రియాశీల సాహిత్య, రాజకీయాలూ నడిపాడు. అరసం, విరసం కార్యాచరణల్లోనూ వివిధసాహిత్య సాంస్కృతిక సంస్థల్లోనూ, ఎలక్షన్లూ, పౌర హక్కుల సంఘాలూ చైనా, అమెరికా, మాస్కో, ఇంగ్లాండ్ వేదికలపైనా విద్యార్థి సభల్లోనూ సాహిత్య, సామాజిక, రాజకీయ అంశాల్ని గూర్చి నిర్మొహమాటంగా ఉపన్యాసాలు, సలహాలతోపాటూ మార్గదర్శకత్వం కూడా నెరిపాడు. శ్రీ శ్రీ సంపాదకీయాలు, ఇంటర్వ్యూలు, 'ప్ర/జ' లోనూ మార్క్సిస్టు రచయితగా ఆయన ఆశయాల్ని, ఆలోచనల్ని ఏకరువు పెట్టాడు. శ్రీ శ్రీ సమర్థవంతంగా వీటన్నింటిని నిర్వహించిన తీరూ ఈ పుస్తకంలో స్పష్టంగా వుంది. ఒక్క మాటలో చెప్పాలంటే శ్రీ శ్రీ సాహిత్య జీవితం వైవిధ్యాల పుట్ట దాన్ని స్పృశిస్తే చాలు వింతైన అనుభవాలు, అనుభూతులు, ప్రశ్నలు మనల్ని చుట్టేసి ఆలోచింపచేస్తాయి.

భావకవిత్వంలోంచి అభ్యుదయ కవిత్వానికి మహాప్రస్థానం చేయించిన శ్రీశ్రీ చిరునామా విరసంగా మాత్రమే తెలిసిన ఈ తరం వాళ్ళకి వచన రచయితగా శ్రీశ్రీలోని సృజనాత్మకత, ఆలోచనాధోరణులు శ్రీశ్రీ సంపూర్ణ సాహిత్య వ్యక్తిత్వాన్ని ఈ పుస్తకంలో రచయిత రూపు కట్టించాడు. శ్రీశ్రీ కవిత్వం మీదా, కథలు, నాటికలపైనా పరిశోధనా వ్యాసాలు వచ్చాయి కాని వచన రచనలన్నింటిపై సమగ్రమైన పరిశోధనా వ్యాసం ఇదే మొదటిది. ఈ పుస్తకంలో ఆశ్చర్యం కలిగించే విషయం ఏమిటంటే కవిత్వంలో శ్రీశ్రీ ప్రదర్శించిన ఆవేశం కానీ, తీవ్రమైన పదజాలం కానీ వచన రచనల్లో కనిపించకపోగా సహనం, సౌశీల్యంతో నిండిన ఆర్తితో మానవతా వాదిగా కనిపిస్తాడు. ఈ గుణాలే ఆయన్ను ప్రజారచయితగా చేశాయి. మార్క్సిస్టు వర్గదృక్పథంలో హింసకు తావుందన్న మాట వాస్తవమే అయినా అది వాస్తవికమైన మానవత్వాన్ని కాదనేంత హీనమైంది కాదు. ఇదే వాస్తవం శ్రీశ్రీ వచన రచనల్లో కనిపిస్తుంది. కాబట్టి శ్రీశ్రీని మార్క్సిస్టుగా మాత్రమే చూడగలిగిన వాళ్ళు శ్రీశ్రీని మళ్ళీ అధ్యయనం చేయక తప్పదు.

శ్రీశ్రీ జీవనశైలి ఆకట్టుకోనినిదెవర్ని? కాబట్టే ఆయన వచనశైలిని కూడా ఈ పుస్తకంలో విశ్లేషించాడు సుదర్శన్. శ్రీశ్రీ వచన రచనల్లో పదాల ప్రయోగం, వాక్య నిర్మాణ రీతి, కవితాత్మకత వంటి విశేషాంశాలు శ్రీశ్రీ వచన శైలిని ప్రత్యేకంగా గుర్తింపజేస్తాయి. ఇలాంటి విశిష్టతను సంతరించుకున్న శ్రీశ్రీ వచన శైలిని 'శైలీ శాస్త్ర' దృష్ట్యా పరిశీలించిన తర్వాత శ్రీశ్రీది సూత్రప్రాయ శైలిగా సుదర్శన్ సోదాహరణంగా నిరూపించాడు. ఆయన శైలే కాదు ఆలోచనలూ కూడా సూత్రప్రాయంగానే వుంటాయని చాలా రచనల్లో రుజువయింది. ''నా పని Hints ఇవ్వటం వరకే, వాటి ఆధారంతోనే మీ లాంటివాళ్ళు కన్యాశుల్కాన్ని బాగా స్టడీ చేసి ఆ Hints ను విశదీకరిస్తూ వ్యాసాలు రాయాలి'' అని అంటాడు. సూత్రప్రాయమైన ఇలాంటి ఆలోచనలతోపాటూ వైచిత్రీప్రియత్వం కూడా వచన రచనల్లో చాలా చోట్ల కన్పించటంవల్ల శ్రీశ్రీది వైచిత్రీ సూత్రప్రాయ శైలిగా కూడా గుర్తించవచ్చని సుదర్శన్ వివరించాడు. శ్రీశ్రీకి నచ్చిన శైలి కూడా ఇదేనని ఆయన మాటల్లోనే ఈ విధంగా వ్యక్తమయింది : ''కుకవుల శైలి నాకు నచ్చదు. గవర్నమెంటాలిటీ నాకు నచ్చదు. డొంకతిరుగుడు బాట నాకు నచ్చదు. బుర్ర తిరుగుడు మాట నాకు నచ్చదు. రూపాయలు మాట్లాడే శైలి నాకు నచ్చనే నచ్చదు. ఆ రూపాయలు జేబుల్లోగాని, బ్యాంకుల్లోగాని, ఇనుప మందసాల్లోగాని ఇతర చోట్లగాని వినిపించే శైలి నాకు నచ్చదు'' అని అంటాడు శ్రీశ్రీ.

స్త్రీ వాదం, దళితోద్యమం, మాల, మాదిగ దండోరాలు, మైనారిటీలు, హిందూ కుల సంఘాల ఉనికి సమస్యలూ, ప్రజాస్వామిక తెలంగాణా పోరాటాలూ, అగ్రవర్ణ భావజాల వ్యతిరేకత వంటి అంశాలు ప్రస్తుతం సామాజిక రాజకీయ, సాంస్కృతిక రంగాల్ని బాగా ప్రభావితం చేస్తున్న ఈ తరుణంలో శ్రీ శ్రీ వచన రచనల పాత్ర ఏమిటో శ్రీ శ్రీ చేపట్టి వచన ప్రక్రియలూ, శైలి, అంశాలూ ఏ విధంగా ఇప్పటి తరం ఉపయోగించుకోవచ్చో కాలమే నిర్ణయిస్తుంది. శ్రీ శ్రీ వచన రచనల్లో పై అంశాల్లో కొన్ని అక్కడక్కడ చోటు చేసుకున్నాయి. కాని వాటినైనా ప్రధానంగా చిత్రీకరించలేకపోయాడు. అది ఆయనకు తెలియంది కాదు గాని అప్పటి సామాజిక, రాజకీయ రంగాలు ఆ కోణంలోంచి రంగం సిద్ధం చేయలేకపోయాయి. పైగా అంతా వర్గ దృక్పథంలోనే వుందన్న కాన్ఫిడెన్స్ కూడా కొంత కారణం అయ్యుంటుంది. శ్రీ శ్రీ అగ్ర కులం వాడనో లేకఅగ్ర కుల భావజాలం వుందనో ఇప్పటి సాహిత్యానికి దూరంగా వుంచేవాళ్ళెవరైనా సంకుచిత స్వభావులే అవుతారు. సాహిత్యం వ్యాపారం కాకూడదని అది ప్రజల ఆస్తి కావాలని కర్షక, కార్మిక వర్గ పక్షపాతం వహించిన శ్రీ శ్రీ వచన రచనలపై వెలువడిన ఈ సిద్ధాంత వ్యాసం ప్రజల్ని ఆ ప్రజల సమస్యల్ని తమ రచనల్లో చిత్రిస్తున్న రచయితల్ని తప్పక ప్రభావితం చేస్తుందనే నమ్మకం నాకుంది.

- ఎ. పరమాత్మ

# వచనంలో కూడా మహాకవే

ఇరవయ్యో శతాబ్దం ముగిసిపోతున్నది.

ప్రశ్నల్ని ఝుళిపిస్తూ రంగస్థలాన్ని ఆక్రమించుకుంటున్న కొత్త శక్తులు తన అక్షరాలకు యెన్ని మార్కులు వేస్తాయోనని భయంభయంగా వినయంగా ఒక 'మహాకవి' నిరీక్షిస్తున్నాడు.

ఒక చారిత్రక విభాతం అందించిన అహంకారంతో 'యీ శతాబ్దం నాది' అని ప్రకటించుకున్న మహాకవి అతడు.

★ ★ ★

పతితులు, భ్రష్టులు, బాధాసర్పదష్టులు వంటి అర్ధనైరూప్య శ్రేణుల్లో ఇమడడానికి ఇష్టపడక అనేక ప్రజా సమూహాలు కొత్త నామకరణాలు స్వీకరించిన కాలంలో, భాషా ప్రయుక్త రాష్ట్రాల భావనలో దాగిన వలసవాద దుష్టసమాసాలని గుర్తిస్తున్న స్థలంలో నిలబడి మిత్రుడు 'తెలంగాణ బహుజన' సుదర్శన్ శ్రీశ్రీ వచన రచనల గురించి పరిశోధనకు ప్రయత్నించడం కొంత ఆశ్చర్యంగానే వుంటుంది. పరిశోధనల పరిమితుల్ని, సుధర్శన్ పరిమితుల్ని అర్థం చేసుకోవలసి వుంటుంది.

అలాగని, శ్రీశ్రీ వూసే యివాళ అసందర్భమైపోదు. బతికివున్నని రోజులూ కొత్తతరంతో కలిసి నడవాలని ప్రయత్నించిన యీ కవి తన మరణానంతర సాగుతున్న సామాజిక మహా సంచలనంలో యెంతవరకు మిత్రుడిగా మిగులుతాడో అంచనా వేస్తూపోవాల్సిందే.

★ ★ ★

తెలుగు వచనం గురించిన చర్చకు యీ రోజు సందర్భం వున్నది. కవిత్వం అనేది కేవలం సాహిత్యరంగానికి సంబంధించింది మాత్రమే కానీ, వచనానికి సాహిత్యేతరమైన వినియోగం, జీవితం చాలా వున్నది. విశాలమవుతున్న సమాజ అవసరాలు అందుకు సహాయపడగల భాషకోసం వెదుక్కుంటున్నాయి. విషయం ప్రధానంగా, సమాచారం ప్రధానంగా వున్న రచనలకు పనికివచ్చే

తెలుగువచనం యింకా రూపుదిద్దుకునే దశలోనే వున్నది. సాహిత్యరంగంలో వున్న వారితో పోలిస్తే, ఇతర సామాజిక అవసరాల కోసం సమర్థమైన తెలుగును రాయగలవారి సంఖ్య అతి తక్కువగానే వున్నది.

ఇందుకు బాధ్యులు యెవరు? దీనికి 'అభివృద్ధి' కీ సంబంధం వున్నది. 'అభివృద్ధి' చెందిన సమాజాల భాషలతో పోల్చుకుని, లేదా వాటినుంచి అనువాదాలు చేయడంలో సమస్యలను ఎదుర్కొని మన భాషను 'అభివృద్ధి' చెందని భాషగా చెప్పుకుంటున్నాము. అనువాదం సాధ్యం కానంత స్థానికంగా కవిత్వభాష వుండాలని శ్రీశ్రీ అంటాడు. అభివృద్ధి చెందిన భాషలతో అంతర - అనువదనీయత లేకపోవడం ఒక లోపం అంటుంది ఆధునికత. తెలుగు శాస్త్రభాషగా, స్వతంత్రంగా ఆలోచనలు నిర్మించగలిగే భాషగా లేకపోవడానికి సామాజిక, రాజకీయ కారణాలు వున్నాయి సరే, కానీ ఆ లోపాన్ని భర్తీ చేయడానికి కృత్రిమంగా చేసే ప్రయత్నంలో సాహిత్యరంగానికి చెందిన రచయితల భాగస్వామ్యం తగినంతగా వున్నదా? లేదా? అన్నది యిక్కడ అవసరమైన ప్రశ్న.

గురజాడ అప్పారావు కానీ, గిడుగు రామ్మూర్తి కానీ వాడుకభాషకోసం జరిపిన ఉద్యమం కేవలం కవిత్వాలూ కథలూ మాట్లాడే భాషలో రావడం కోసం కాదనీ, మరింత విస్తృతమైన ప్రయోజనం కోసమనీ శ్రీశ్రీకి కూడా పూర్తిగా యింక లేదు. శ్రీశ్రీ యెక్కడ వాడుక భాష గురించి మాట్లాడినా వెంటనే వాడుకభాషలో కవిత్వం రాయడంలోకి మారిపోతాడు. గురజాడ, గిడుగు చేసిన వ్యావహారిక భాషోద్యమం లోపరహితమైనదేమీ కాదు. గురజాడ భాషావ్యాసాల్లో ఎక్కడా తెలంగాణా ప్రస్తావన వుండదు. ఒక ప్రాంతంలోని 'శిష్ట' జనం మాట్లాడే భాషను ప్రమాణ భాషగా చేయడం ఎంతవరకు సబబు? అన్న ప్రశ్నను వాళ్ళు ఎదుర్కొని యేవో ఇంగ్లండ్ వుదాహరణలతో సమాధానాలు చెప్పారు. అయితే, అన్ని ప్రాంతాలనుంచి వ్యావహారిక భాషలోకి ప్రదానాలుంటాయని, అప్పుడే అది పిసలైన ప్రమాణభాష అవుతుందని గిడుగు రామ్మూర్తి ఆలోచించాడు కానీ, ఆయన సత్ సంకల్పం చరిత్రను నడిపించలేకపోయింది. ప్రమాణభాషగా చెలామణిలో వున్న అధికారభాషలో రాయడానికి 'వెనకబడ్డ' ప్రాంతాల రచయితలకు యిప్పటికీ కష్టంగానే వున్నది.

ఒక చారిత్రక అన్యాయానికి తెలియకుండానే కొంత కారకులు అయినప్పటికీ గిడుగు, గురజాడ రాబోయే ఆధునిక సమాజం అవసరాలను తీర్చే వొక ప్రాథమిక సదుపాయాన్ని అమర్చిపెట్టే కృషి చేశారు. అందుకోసం పోరాడారు. గురజాడ, గిడుగు పేర్లను పదేపదే ప్రస్తావించే శ్రీశ్రీ మాత్రం వచనాన్ని వొకసాహిత్య ప్రక్రియ కిందికి కుదించి, తెలుగు వచనం యిప్పుడు ఎదుర్కొంటున్న సమస్యలను నివారించే ఏ ప్రయత్నమూ చేయలేకపోయాడు. శ్రీశ్రీయే కాదు, అనేకమంది ఆధునిక కవులు, రచయితలు గురజాడ, గిడుగు ప్రారంభించిన ఉద్యమాన్ని అందుకోలేకపోయారు.

విద్యారంగంలో సమర్థమైన భాషని నిర్మించే పనిని అకడమీషియన్లకు, సమాచార రంగంలో భాషను నిర్మించే పనిని జర్నలిస్టులకు వదిలిపెట్టారు.

★ ★ ★

గొప్ప సాహిత్య భాషను సృష్టించగల మహా రచయిత కోసం మనం రంగం సిద్ధం చేయాలని గురజాడ అన్నాడు కానీ, అటువంటి యేకైక మహా రచయిత యెవరూ తెలుగులో పుట్టలేదు. నిజానికి గురజాడ చేసిన వాడుకభాషా ప్రయత్నం అంతా సార్వత్రిక విద్యకు ఉపకరించగలిగిన, సామాన్యులు కమ్యూనికేట్ చేయగలిగిన ఆధునిక భాషకోసం మాత్రమే. వాడుకభాషలో సాహిత్యం అన్నది ఆ ప్రయత్నానికి లభించవలసిన అనుబంధ ఫలితం మాత్రమే. ఆధునిక భాషా నిర్మాణ కృషి జరిగిన చారిత్రక రాజకీయ సామాజిక నేపథ్యంలో వున్న సంక్లిష్టత, వైరుధ్యం, అన్యాయం అన్నీ ఆ కృషి ఫలితంలో కూడా ప్రతిఫలించాయి.

ఒక చారిత్రక అన్యాయానికి తెలియకుండానే కొంత కారకులు అయినప్పటికీ గిడుగు, గురజాడ రాబోయే ఆధునిక సమాజం అవసరాలను తీర్చే వొక ప్రాథమిక సదుపాయాన్ని అమర్చిపెట్టే కృషి చేశారు. అందుకోసం పోరాడారు. గురజాడ, గిడుగు పేర్లను పదేపదే ప్రస్తావించే శ్రీశ్రీ మాత్రం వచనాన్ని వొక సాహిత్య ప్రక్రియ కిందకి కుదించి, తెలుగు వచనం యిప్పుడు ఎదుర్కొంటున్న సమస్యలను నివారించే ఏ ప్రయత్నమూ చేయలేకపోయాడు. శ్రీశ్రీయే కాదు, అనేకమంది ఆధునిక కవులు, రచయితలు గురజాడ, గిడుగు ప్రారంభించిన ఉద్యమాన్ని అందుకోలేకపోయారు. విద్యారంగంలో సమర్థమైన భాషని నిర్మించే పనిని అకడమీషియన్లకు, సమాచార రంగంలో భాషను నిర్మించే పనిని జర్నలిస్టులకు వదిలిపెట్టారు.

★ ★ ★

ఆధునిక తెలుగు రూపొందకపోవడానికి రచయితలను, కవులను నిందించడంలో అసంబద్ధత యేమీ లేదు. ఆధునిక తెలుగు సాహిత్యం, ఆధునిక తెలుగుభాష, సార్వత్రిక విద్యాభావన, జాతీయభావాలు, కులమతాల విషయంలో సంస్కరణ భావాలు అన్నీ ఒకేసారి రంగప్రవేశం చేశాయి. అవి యెంతమేరకు ఆధునికంగా వున్నాయి, యెంత మేరకు సిద్ధించాయి అన్నది మరో ప్రశ్న. తెలుగు సమాజంలో తొలితరం ఆధునిక అక్షరాస్యుల సామాజిక నేపథ్యం, ప్రాంతీయ నేపథ్యం ఇక్కడ ముఖ్యమైనవి. ఆ అక్షరాస్యశ్రేణే సమాజంలోని అనేక రంగాలలో అన్ని కులాలవారికి, అన్ని తరగతుల వారికి అవకాశాలుండాలని సాహిత్యాది రంగాలలో వాదించిన మాట నిజమే కానీ, వారి ఆకాంక్షలు

ఇప్పటికీ నెరవేరకపోగా, వారి శ్రేణిలోని అనంతర తరాలవారు ఆ ఆకాంక్షలకు అవరోధంగా మారిపోయారు. తొలితరం వారి సహృదయతను యథాతథంగా అంగీకరించినా, వారు మోసుకువచ్చిన వారసత్వాన్ని, వారి నేపథ్యం స్వభావాన్ని విస్మరించడం కుదరదు.

సమాజంలోని విశ్రాంతి వర్గాలవారే సాంప్రదాయికంగా విద్యావంతులుగా వున్నారని, వారే ఇంగ్లీషు విద్యను అందుకున్నారని ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. ఇంగ్లీషు విద్య అందిన శ్రేణులవారు శ్రామికవృత్తులతో యేమాత్రం సంబంధం లేనివారు, పరిపాలన, తత్త్వశాస్త్రం, సాహిత్యం, న్యాయవ్యవస్థ మొదలైన రంగాలతో మాత్రమే తరతరాలుగా సంబంధం వున్నవారు. ఈ రంగాలకు చెందిన వ్యక్తీకరణలు, పరిభాష మాత్రమే ఆధునిక తెలుగులో సమర్థంగా ఏర్పడ్డాయి. భౌతిక విజ్ఞానశాస్త్రాల భాష విషయంలో, ఇతర సాంకేతిక రంగాల భాష విషయంలో తెలుగు స్వయం సమృద్ధం కాలేకపోతున్నదని ఇవాళ మనం బాధపడుతున్నాం. అభివృద్ధి చెందిన సమాజాలలో పుట్టుకువస్తున్న కొత్త కొత్త శాస్త్రాలు, భావనల విషయంలో తెలుగు అసమర్థంగా వుండిపోయింది. ఆధునిక ఆలోచన అవసరాలకు తెలుగు సరియైన సాధనం కాలేకపోతున్నది. తెలుగు ఇలా వెనుకబడిపోవడానికి కారణం సమాజ ప్రజాస్వామ్యీకరణకోసం ప్రయత్నించిన తొలితరాలవారి నేపథ్యంలో, పరిమితులలో వున్నదని గుర్తించాలి. తెలుగు సమాజంలోని అన్ని సామాజిక భాషలను, ప్రాంతాల భాషలను ఆధునిక తెలుగులోకి సంలీనం చేయగలిగివుంటే పరిస్థితి మరోరకంగా వుండేది.

సార్వత్రిక విద్యాబోధనకు అనుగుణమైన భాషను నిర్ణయించడంలోను, ఆధునిక భాషా వ్యాప్తికి సాధనాలైన సమాచార సాధనాలలోను సాహిత్యవ్యక్తులే కీలకపాత్ర వహించాలని గమనిస్తే తెలుగు వచనం పరిమితులకు కారణాలు అర్థం అవుతాయి. సంస్కరణవాద భాషావాదులు ప్రజాసమాచార సాధనాలద్వారా, సాహిత్యం ద్వారా పాశ్చాత్య భాషా, శైలీ విలువలను ఆదర్శంగా చూపిస్తూ కొత్త రకం శిష్ట భాషను ప్రతిష్ఠించడానికి ప్రయత్నించగా, వారికి ప్రత్యర్థులుగా వున్న సంప్రదాయ భాషావాదులు అధికార స్థానాలలో బలంగా వుండి పాత గ్రాంథిక శిష్టభాషను ఇంకా కాపాడుకుంటూ వచ్చారు. ఈ బాపతు వ్యక్తులే 1970 దశాబ్దం దాకా పాఠ్యపుస్తకాల కమిటీలలో కూడా పెత్తనం చేసి బోధనాభాషను వాడుకకు యేమాత్రమైనా దగ్గర కాకుండా కాపలా కాశారు. ఈ రెండు ధోరణులు కూడా శ్రామికవృత్తులవారి, అట్టడుగు కులాలవారి భాష ప్రధాన స్రవంతి భాషకు ఆదాన భాష కాకుండా జాగ్రత్త పడ్డాయి.

ఆధునిక, సాంప్రదాయ భాషా వినియోగరంగాలు రెండింటిలోనూ శిష్టులే అధికారంలో వుండడంవల్ల జరిగిన నష్టాలు అనేకాలు. సాంప్రదాయ పండితులేమో సంస్కృత భాషా సాహిత్య

ప్రమాణాల కోసం సమస్త స్థానికతను విసర్జించారు. ఆధునికవాదులేమో, ఆంగ్లమానస పుత్రులుగా మారిపోయి, అన్ని రకాల గతాన్ని వదులుకున్నారు. ఫలితంగా, వలసపాలనకు మునుపు తెలుగు సాహిత్య, సాంస్కృతిక చరిత్రకూ, ఆధునిక సాహిత్యానికి యెటువంటి రక్తసంబంధమూ లేకపోయింది. సంబంధంలేని రెండు వేరువేరు ముక్కలుగా అవి కనిపిస్తున్నాయి. గతంలోని సాంప్రదాయ సాహిత్య పరంపరలోని మంచి అంశాలు కూడా కొత్త సాహిత్యానికి పనికిరానివి అయ్యాయి. అన్ని ప్రక్రియలకూ, అన్ని ధోరణులకూ, అన్ని శైలులకూ పాశ్చాత్యమూలాలే. నాలుగైదు వందల యేళ్లనుంచి రూపొందుతూ వస్తున్న తెలుగు వచనం, అందులోనూ వ్యావహారిక వచనం మూలాలను తెంచుకుని ఇంగ్లీషు ప్రభావాలను వరించింది. ఆధునిక ప్రజాస్వామిక అవసరాలకోసం రూపొందవలసిన వచనాన్ని కొత్తగా సృష్టించుకోవలసి వచ్చింది కానీ, గతంలోని వచనాన్ని మెరుగుపరచుకుని వాడుకునే సహజ ప్రక్రియ జరగలేదు. అందువల్ల స్థానిక పరిమళం వున్న వచనం అభివృద్ధి చెందలేదు. యే నుడికారమూ లేని, యే సాంస్కృతిక ప్రత్యేకతలూ లేని నిస్సారమైన, శుష్కమైన వచనం మనకు ప్రాప్తించింది.

తెలుగు వచన రచయితలు చాలామంది వ్యవహారంనుంచి, జీవితనుంచి భాషను స్వీకరించడానికి ప్రయత్నించారు. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి బ్రాహ్మణ స్త్రీల వ్యవహారంనుంచే తన కథలకు జీవభాష అందిందని చెప్పుకున్నారు. ఆయన కాలంలోనూ, ఆ తరువాతా కూడా యెందరో వచన రచయితలు లిఖిత సాహిత్య పరిధికి బయట వున్న వ్యవహర్తలనుంచి భాషను అధికారభాషలోకి దిగుమతి చేయడానికి ప్రయత్నించారు. కానీ, ఆ ప్రయత్నాలన్నీ మాండలిక ప్రయోగాల పేరుమీద, ఓ ప్రత్యేక తరహా రచనలుగా మిగిలిపోయాయి. ఇప్పుడు తెలుగు పత్రికలు మార్కెటింగ్ అవసరాలకోసం కొంతైనా స్థానిక పదజాలాన్ని వాడాలని అనుకుంటున్నప్పుడు, కనిపిస్తున్న కృత్రిమ మాండలికాన్ని చూస్తే తెలుగు వాడుక భాషను స్థిరీకరించి, ప్రజాస్వామికంగా విస్తరింపజేయడంలో రచయితలు క్రియాశీలంగా పాల్గొనని లోటు స్పష్టంగా తెలుస్తుంది. ఇప్పుడు తెలుగులో సర్వసామాన్య అవసరాలకోసం వాడే భాషను ప్రమాణీకరించి, వ్యాపింపచేసే వ్యవస్థలన్నీ ఆ శక్తిసామర్థ్యాలు లేని వ్యక్తుల సమూహాల చేతిలోనే వున్నాయి. ఈ ప్రక్రియకు వ్యక్తుల ఇష్టాయిష్టాలు కాక అనేక సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. అయితే, వచనాన్ని అభివృద్ధి చేయడంలో సాహిత్య బృందాలు, సంఘాలు, ఉద్యమాలు చూపిన నిర్లక్ష్యాన్ని కూడా గుర్తించాలి. వచనాన్ని అవసరాలకోసం యెంతగా వాడుకున్నారో, దాన్ని అంతగా ముద్దుగా చూడలేదు. వచనశైలిమీద, సమర్థమైన వచనం యెలా వుండాలన్న దానిమీద విమర్శకులు దృష్టి కేంద్రీకరించలేదు. శైలి, శిల్పమూ వంటి గొప్ప గొప్ప మాటలన్నీ పద్యానికే కానీ, వచనానికి కాదని అనుకున్నారు. వాటిని విశ్లేషించవలసిన అవసరం వుందని అనుకోలేదు.

అందుకు కారణం కవిత్వంమీద, రూపంమీద, శబ్దంమీద వున్న లౌల్యం. వచనం విషయం యెలా వున్నా కవిత్వంలో మాత్రం మనం జెగజ్జెట్టీలం అని శ్రీ శ్రీతో సహా ఎందరో పదేపదే చెబుతూ వచ్చారు. భౌతిక శాస్త్రాల విషయంలో పాశ్చాత్యుల ఘనత వుండవచ్చు కానీ, ఆధ్యాత్మిక రంగంలో భారతదేశమే నెంబర్‌వన్ అని చెప్పుకునే సంప్రదాయవాదులకీ వీరికీ యీ విషయంలో తేడా యేమీ లేదు.

రైమూ, రీజనూ రెండూ వున్న శైలే తనకు యిష్టమైన తన వచశ్శైలి అని శ్రీ శ్రీ చెబుతాడు. కవి మాట్లాడే భాష వచనం అంటాడు. 'రెండు నిశ్శబ్దాలు విసిరిన సరిగమ పదనిశల మీద నీడలు పలికించిన విలోల కల్లోలాలు తన వచనం అంటాడు. వచనమే కవిత్వం కవిత్వమే వచనం అని ప్రకటిస్తాడు. అర్థాన్ని అధ్వాన్నపు అడవిలో వదిలేసి గద్యానికి, పద్యానికి పెళ్ళి చేద్దాం రమ్మంటాడు. కొ.కు.ది వినిపించని కవిత్వం అంటాడు.

''నాకు తెలుసు నామీద వచ్చే విమర్శలు, శబ్దగత ప్రాణం శ్రీ శ్రీ కవిత్వం అని, అర్థగత ప్రాణాల అనర్థభాష అది. శబ్దం ప్రథమం అర్థం ఆ తరువాత'' - ఇదీ శ్రీ శ్రీ.

ఇటువంటి కవిత్వపు అభిప్రాయాలు చెప్పిన శ్రీ శ్రీ సరళంగా కవిత్వం రాయడాన్ని ఒక సుగుణంగా చెబుతాడు. కొన్ని పత్రికారచనల్లో రేడియో ప్రసంగ వ్యాసాల్లో యెంతో సూటి అయిన, సరళమైన వచనం రాస్తాడు. ఈ రెండు సుగుణాలకు కూడా ఆయన సంకల్పంకంటే, అనివార్యతే యెక్కువ అయివుండవచ్చు. రచనను బాధ్యతగా, సామాజిక ఆచరణగా భావించే లిఖిత సంప్రదాయపు ఆధునిక రచయిత యెవరైనా కూడా వచనం రాయకుండా వుండలేరు. కొన్ని రకాల భావాలను సరళంగా తప్ప మరో రకంగా చెప్పలేకపోవచ్చు. అయితే, కవిత్వాన్ని వచనీకరిస్తానని చెప్పిన శ్రీ శ్రీ అవకాశం దొరికినప్పుడల్లా వచనానికే కవిత్వపు తొడుగులు తొడుగుతాడు. అది అధివాస్తవికత కావచ్చు, చైతన్యస్రవంతి కావచ్చు . . .

కవిత్వంలాంటి వచనం రాయడం మహాపరాధమేమీ కాదు. ఆధునిక వచనానికి ఎక్కువ చరిత్ర వున్న ఐరోపా సాహిత్య కళారంగాలలో, ఈ శతాబ్దంలో సంభవించిన పెద్ద రాజకీయ సంచలనాల కారణంగా వచ్చిన ధోరణులను, ఆధునికత, సార్వత్రిక విద్య ప్రవేశిస్తున్న తొలిరోజులలో వున్న సమాజంలోకి దిగుమతి చేయడం లగ్జరీగా అనిపిస్తుంది.

★ ★ ★

వచనం గురించి మాట్లాడుకునేటప్పుడు మన సాహిత్యరంగంలో జరిగిన ఒక విపరీతం గురించి చెప్పుకోవాలి. అది కవిత్వ ఉద్యమాలకు కిరీటాలు పెట్టడం. గురజాడ అప్పారావును కూడా కలుపుకుని ఈ శతాబ్దం 2,3,4 దశాబ్దాలలో వచ్చిన వచన రచనలు చూస్తే భావకవిత్వోద్యమం అన్నది ఆధునిక సాహిత్య చరిత్రలో అంతటి స్థానానికి తగినదేనా అనిపిస్తుంది. కులం, మతం, స్త్రీ విముక్తి, ప్రాంతీయత - మొదలైననేటి ప్రాసంగిక అంశాలన్నిటినీ స్పృశిస్తూ నాటి వచన రచయితలు రచనలు చేశారు. తెలుగు సమాజం ప్రజాస్వామ్యీకరణ ఎజెండాలో వుండవలసిన అంశాలన్నిటినీ వారు ఆనాడు స్వీకరించారు. గురజాడను గుర్తుచేసుకుంటూ చెలం, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి రాసిన మాటలనీ, శ్రీశ్రీ పదేపదే చేసే గురజాడ స్మరణనీ పోల్చిచూస్తే వచన రచయితలే గురజాడ దారిలో వున్నారని స్పష్టంగా తెలుస్తుంది. అంత పెద్ద ఎజెండాను స్వీకరించిన వచన రచయితల కృషీ, వర్ణవ్యవస్థని ప్రశ్నించిన దళిత పద్యకవుల గొంతూ పోయి, వయా బెంగాల్ ఆంధ్రాకు చేరిన పరాయి భావకవిత్వం అంత గుర్తింపు యెలా పొందిందో కొత్తగా కనుగొనాలి.

శ్రీశ్రీ తనకు తెలిసిన ప్రపంచాన్నీ, జ్ఞానాన్నీ కవిత్వంలో మాత్రమే చెప్పడం సాధ్యం కాదు కనుక, వచనం రాయవలసి వచ్చింది. అదికాక, నాటకాలు, కథలు రాయాలన్న కోరికా వుంది. గురజాడ వారసత్వంగా అనుకోవడం ఒకటి. ప్రయోగాత్మక నాటకాలు, కథలు రాయడానికి విదేశీ సాహిత్యం యిస్తున్న ప్రేరణ మరోవైపు పనిచేసింది. సాధారణ సన్నివేశాలు, యితివృత్తం, కథనం వున్న సృజనాత్మక రచన యేదీ శ్రీశ్రీ చేయలేదు. (పరిణయ రహస్యం తప్ప). శ్రీశ్రీ వచన సాహిత్యం అంతా కొంత కవిత్వానికి పొడిగింపు, మరికొంత ఆయన ప్రజాజీవితం పొడిగింపు. శ్రీశ్రీ వచన రచనలు లేకపోతే మనకు ఆయన సగమే తెలిసేవాడు.



పశ్చిమ దేశాలలో వచ్చిన అంతర్జాతీయ పరిణామాలవల్ల యెక్కువగా ప్రభావితుడై, తెలుగు సాహిత్యంలో అర్ధశతాబ్దానికి పైగా తిరుగులేని ప్రభావం వేసినవాడు శ్రీశ్రీ. భారతదేశంలో ప్రజల స్థితిగతులను మార్చడానికి జరిగిన ప్రయత్నాలలో ఒక పెద్ద కోవకు చెందినకవి, రచయిత ఆయన. ఆయన గురించి చెప్పే యే మాట అయినా, చేసే యే అంచనా అయినా ఆయన మార్గానికి యెక్కువ వర్తిస్తాయి. వ్యక్తిగత పాటవానికి శ్రీశ్రీకి ముగ్ధులం కాకుండా యెప్పటికీ వుండలేమేమో కానీ, ఆయన్ని ఒక క్రమంలో భాగంగా చూసి మంచిచెడ్డలను లెక్కవేయాల్సిన అవసరం మాత్రం వచ్చింది. కవిత్వం మాత్రమే రాసి వూరుకోకుండా యెక్కువ పరిమాణంలో వచనం కూడా రాసి శ్రీశ్రీ తనను, తనను నడిపించిన చరిత్ర శక్తులను అర్థం చేసుకోవడానికి మనకు చాలా సరంజామా ఇచ్చాడు.

దాక్కోవడానికి కుదరనిది వచనం. వచనంలో కూడా కవిత్వాన్ని జొప్పించి శ్రీశ్రీ మాయచేసినా, ఆయన చేత స్పష్టమైన, నికార్సైన వచనం రాయించిన చారిత్రక సందర్భాలున్నందున కొంత మేలు జరిగింది. శ్రీశ్రీ వచన రచనల మీద, శైలిమీద జరిగే యే పరిశోధన అయినా కవిత్వం శ్రీశ్రీకి, వచన శ్రీశ్రీకి తేడాను వెదకాలి, సమర్థమైన వచనానికి ఆయన దోహదం యేమన్నా వుందేమో చెప్పాలి.

70ల తరువాత శ్రీశ్రీని తెలంగాణా ఎక్కువగా ప్రేమించింది. తమ ఆకాంక్షలకు అక్షరాలను జతచేసిన కవిగా గౌరవించింది. 80ల ప్రారంభంలో ఆంధ్రజ్యోతి వారపత్రికలో నిర్వహించిన ప్రశ్నలు - జవాబులు 'ప్రజ' శీర్షికకు వచ్చిన వుత్తరాలలో అత్యధికం తెలంగాణానుంచే వుండేవి. ఇప్పుడు తెలంగాణాలో వివిధ సామాజిక, రాజకీయ శిబిరాలలో వున్న అనేకమంది శ్రీశ్రీనుంచి యెంతో కొంత పొందినవారే.

తమకు మేలు చేసినవారిని మరువకపోవడం తెలంగాణా వెనుకబాటుతనంలో నిలుపుకోదగిన సుగుణం. సుదర్శన్ శ్రీశ్రీపైద పరిశోధన చేయాలనుకోవడంలో కూడా ఆ ప్రేమ వుంది. పరిశోధన పాత పద్ధతుల్లోనే ఎక్కువగా సాగినా, శ్రీశ్రీ వచన రచనలను విషయపరంగా వర్గీకరించడం, భవిష్యత్తులో మరింత నిర్దాక్షిణ్యమైన విమర్శకు అనువుగా సమాచారాన్ని సిద్ధం చేయడం చెప్పుకోదగ్గవి.

కె. శ్రీనివాస్

ఆచార్య ఎన్. గోపి
తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం

# సు 'దర్శనం'

శ్రీశ్రీ వచన విన్యాసం అని పేరు పెట్టిన డా॥ రాపోలు సుదర్శన్ ఈ సిద్ధాంత వ్యాసంలో శ్రీశ్రీ వచన రచనా పరిణామాన్నీ, దానిలో ఆయన భావ పరిణామాన్నీ విశ్లేషించి చూపాడు. శ్రీశ్రీపైన పరిశోధన చేయడం కష్టం. చేసి వొప్పించడం మరీ కష్టం. ఎందుకంటే శ్రీశ్రీ పాదరసం లాంటివాడు. ఏదో వొక స్టేట్‌మెంట్ లాంటి ప్రకటన చేసి సంచలనం సృష్టిస్తాడు. ఇక దానిలోంచి వ్యాఖ్యానాలు లాగటానికి అవస్థపడాలి. ఎక్కడో ఓ ఇంటర్వ్యూలో నా అభిప్రాయమది కాదు అంటూ కాలికింది చాపను లాగేస్తాడు. శ్రీశ్రీ ప్రవాహ గుణం కలవాడు. కవిత్వంపైన వ్యాసంగం మనిష్టం. కాని వచనం అలాకాదు. దానిని జాగ్రత్తగా వింగడించాలి. ఆ పని సుదర్శన్ చేశాడు. ఏడేళ్లక్రితం శ్రీశ్రీ పీఠికలపైన ఎం.ఫిల్. చేసిన అనుభవం అతనికి చక్కగా ఉపకరించింది. అది పుస్తకరూపంలో వచ్చి నలుగురినీ ఆకర్షించింది. నేనతని ఎం.ఫిల్. పరిశోధనకు పర్యవేక్షకుడిగా వున్నాను కాబట్టి అప్పుడతని పరిశ్రమ శీలాన్నీ, చిత్తశుద్ధినీ ప్రత్యక్షంగా చూశాను.

పరిశోధక విద్యార్థిగా ఇష్టుడేకాక వ్యక్తిగా కూడా సుదర్శన్ నాకు ఆత్మీయుడు. కార్యకర్తగా సమాంతర సాహితీవేదిక కార్యక్రమాలను ఆర్గనైజ్ చేసేవాడు. కవితలు రాసేవాడు (ఇప్పుడు ఆపేశాడనుకుంటాను), పత్రికల్లో వ్యాసాలు రాసేవాడు. సుదర్శన్ జీవిక స్టేట్ ఫైనాన్స్ కార్పోరేషన్‌లో లిఫ్ట్‌బాయ్‌గా ప్రారంభమైంది. నాకతనితో అప్పుడే పరిచయం. వృత్తికీ ప్రవృత్తికీ పొంతన కుదరక సాహిత్యంలో కృషిచేసి కళాశాల అధ్యాపకుడిగా చేరాలని కలలుకన్నాడు. అవకాశాలు అందినట్టే అంది చేజారిపోయేవి. ఈలోగా వయస్సుమీరిపోయింది. అయితే సుదర్శన్ గొప్పతనం ఎక్కడుందంటే తన ఆశయం నెరవేరనందుకు బాధపడ్డా, కుంగిపోకుండా నిత్యహరితంగా సాహిత్య కృషి చేస్తూనే వున్నాడు. ఆర్థికంగా అంతంతమాత్రం వనరులతోనే సతమతమవుతూ ఇప్పుడీ పుస్తక ప్రచురణ అనే సాహసానికి ఒడిగట్టాడు. నిజమైన తపన కలవాడిగా సుదర్శన్‌ను నేను ప్రశంసించకుండా వుండలేను.

సుదర్శన్ తన మొదటి పుస్తకాన్ని తండ్రి లేకుండా ఒంటరి పోరాటంతో పెంచి పోషించి ఇంతవాణ్ణి చేసిన అమ్మకు అంకితం చేశాడు. ఇప్పుడీ పుస్తకాన్ని తన గురువులకు అంకితమిచ్చాడు. అదీ అతని వ్యక్తిత్వం! అత్యంత అట్టడుగు పరిస్థితుల్లోంచి వచ్చిన సుదర్శన్ తనను ఏమాత్రం ఆదరించిన వారిని కూడా మర్చిపోలేదు. అది అతని స్వభావం. సెంటిమెంట్‌ను పరపరా కోసేసి అదే ప్రయోజకత్వం అనుకుంటున్న నీచమైన వ్యాపార సంస్కృతిలో సుదర్శన్ అపవాదంగా నిలుస్తాడు. 'నానీలు' లో నేనోచోట ఇలా అన్నాను.

''కృతజ్ఞత
మోయలేని బరువు
పువ్వు వొంగి
వేళ్లకు నమస్కరిస్తుంది''

ఒక కవిత్వ యుగాన్నే నడిపించిన శ్రీశ్రీని మర్చిపోతున్న తరం వచ్చేసింది. ఇటువంటి తరుణంలో అతని వచన రచనలపైన సాధికారికమైన కృషిఫలాన్ని అందిస్తున్న డా॥ సుదర్శన్‌ను మనసారా అభినందిస్తున్నాను.

# నేపథ్యం

''నా గురించి నేను చెప్పుకోగూడదు'' అనే మాట నా జీవితంలో పొసగదు. కారణం నా బతుకులోని ఏ ఒక్క సంఘటనని 'మసిపూసి మారేడు కాయ' చేసి చెప్పలేని బలహీనున్ని. నా గురించి నాకు తెలిసినంతగా ఇతరులకు తెలిసే అవకాశం లేదు. కాబట్టి నా బతుకు గురించి, నా ఈ బతుకులోంచి రూపుదిద్దుకున్న ఈ పుస్తకం గురించి మీతో నాలుగు మాటలు మాట్లాడాలనుంది.

అక్షరం ఎంత సత్యమైందో నా జీవితమూ అంతే సత్యమైంది. కాబట్టే నా బతుకు కాన్వాసు మీద మీ చూపుల సంతకాలు నమోదు చేయిస్తున్నాను. ఇందులోని ఏ అంశమైనా మిమ్మల్ని స్పర్శించి, కదిలిస్తే ఓ క్షణం మౌనంగా ఉండిపోయో లేక డీక్లాస్‌పై అయ్యో నన్ను మీ హృదయాల్లోకి ఒంపుకుంటే నో నా ఈ (సాహిత్య) జీవితం ధన్యమైనట్టే భావిస్తా. అంతేకాక నన్నింతవాన్ని చేసిన నా తల్లి గురించి చెప్పి రుణం తీర్చుకోడానికి ఇంతకన్నా మంచి సందర్భం, అవకాశం వేరే ఉండదనుకుంటాను. కాబట్టే మిమ్మల్ని నా జీవితం లోయల్లోకి తీసుకెళ్ళడం అసందర్భం కాదనుకుంటా.

నా జీవితం గాలానికి చిక్కిన చేపలా నా ఈ 39వ వసంతం ఒక సందిగ్ధ సంధ్య. దీని అంచున నిలబడి నాకు నేనుగా అసెస్‌మెంట్ చేసుకుంటే జాయ్‌గా ఫీలవుతూనే తెల్లని కాగితం మీద సిరా ఒలికినప్పటి సంక్షోభం అనుభవిస్తుంటాను. నా కన్నతల్లి నీలమ్మ. జబ్బుపడ్డ మా నాన్న యాదగిరి మృత్యువాత పడ్డప్పుడు 'బండెడు బలగం ఉండీ' అమ్మ ఒంటరిదై ఐదారేళ్ళ నన్ను గుండెకు హత్తుకొని నిస్సహాయంగా విలపించిన దృశ్యాలెన్నో నాకింకా స్పష్టంగా గుర్తున్నాయి. నాన్నలేని ఇంట్లో అమ్మ ఒంటరిగా దిగులు పక్షై మౌనంగా కన్నీరు కారుస్తున్నప్పుడల్లా ''నీలా (అమ్మా)... ఏడవకు'' అని నా బాల్యమూ... దుఃఖించడం తప్ప ఏమీ చేయలేకపోయింది. బతుకు భారమై తెలియని తనంతో ఛాదర్‌ఘాట్ బ్రిడ్జిపైనుండి దూకి ఆత్మహత్య చేసుకోవాలనుకొని, అమ్మ చాలాసార్లు బ్రిడ్జిపైకి వెళ్ళిన సంఘటనలు మరిచిపోలేను. తను చనిపోతే కొడుకు బతుకు మరెంత దుర్భరమౌతుందోనని ఊహించి, నా కోసమే ఆ ప్రయత్నం విరమించుకొని, తన 'రెక్కలు ముక్కలు' చేసుకుంటూ బాధల బతుకు బండిని ఒంటరిగా లాగుతూ నన్ను చూస్తూ బాధలన్నీ మరిచేది అమ్మ. నన్నూ, నా తల్లినీ కంటికి రెప్పలా చూసిన మా అమ్మమ్మ కీర్తిశేషులు రుక్కమ్మను ఓ క్షణం స్మరించడం తప్ప మరో విధంగా రుణం తీర్చుకోలేని నిస్సహాయున్ని.

సుల్తాన్‌బజార్‌లోని డా॥ జానకీ రామచంద్రన్‌గారి క్లీనిక్‌లో 'ఆయా'గా చేరిన అమ్మ మనసు కాస్త తేలికపడ్డట్టే కనిపించేది. ఆ డ్యాక్టరమ్మే నన్ను స్కూల్లో వేయమని అమ్మను బలవంతం చేసింది. తనకు అక్షరం ముక్క రాకున్నా నన్నుమాత్రం బళ్ళో చేర్పించింది. నింబోలిఅడ్డాలోని చౌడీ నానామియా ప్రభుత్వ ప్రాథమిక పాఠశాల అక్షరాల గోరుముద్దల్తో మాటలు నేరుస్తున్న కాలంలోనే అమ్మ బతుకులోని కష్టాల్ని పంచుకోవాలనే ఆరాటం ఎక్కువైంది. కుల వృత్తి మంగలికత్తి అందుకుంటే పూటగడవక పోతుందా? అనే బంధువుల మాటల్తో అమ్మకు ససేమిరా ఇష్టం లేకున్నా హేర్ కటింగ్ సెలూన్‌లో చేరాను. అక్కడ సేఠ్‌లకి చాయ్, సిగరెట్లు తెచ్చివ్వడం, కష్టమర్ల గడ్డాలకి నీళ్ళు కొట్టి బ్రష్ చేయడం, కాళ్ళ గోళ్ళు వంటి పనుల్లో అనుభవించిన హృదయావేదనకి అక్షర రూపం ఇవ్వలేను కానీ, Dignity of Labour అనే దానికి అర్థం అప్పుడే తెలిసింది. జానకమ్మ (డా॥ జానకీ రామచంద్రన్) గారు ప్రభుత్వ ప్రసూతి ఆసుపత్రిలో అమ్మకు 'ఆయా' (దాయా)గా ఉద్యోగం ఇప్పించి తోబుట్టువులా ఆదుకుంది. మంగలికులంలో పుట్టిన ఆడవాళ్ళు మంత్రసాని పనిచేయడం ఇప్పటికీ మామూలే. ఆ ఉద్యోగం దొరికేనాటికే అమ్మ పురుళ్ళు పోసే మంత్రసాని పనిలో నైపుణ్యంతోపాటు 'హస్తవాచి మంచిది' అనే పేరునూ సంపాదించుకుంది. ఈ విద్యను అమ్మమ్మనుంచి వారసత్వంగా నేర్చుకుంది అమ్మ. కాన్పులు చేసి, రక్త మాంసాలంటిన మురికంతా కడిగి చివరికి దోసిళ్ళు చాచి 'బిచ్చం' అడుక్కోవాల్సి వస్తుందని మదన పడేది అమ్మ. పురిటిళ్ళల్లోంచి తెచ్చిన చద్దన్నం, పాచిన కూరల మరిగిన నా బాల్యానికి ఇవేవీ పట్టేవి కావు.

సుల్తాన్‌బజార్ ప్రభుత్వ పాఠశాలలో 8వ తరగతిలో చేరినప్పుడు డా॥ మహాలక్ష్మమ్మగారు నా చదువుకై ఆర్థిక సహాయం చేశారు. ఈ దశలోనే అమ్మ నిలువెత్తు రూపానికి అర్థాన్నీ, మాతృభాషలోని మాధుర్యాన్ని గ్రహించింది అక్కడే . పదిహేనేళ్ళు వచ్చేప్పటికి 10వ తరగతి పాసై ఇంటర్ చదవాలనుకున్న నేను అమ్మ, బంధువర్గం బలవంతం చేయడంతో చదువుపై నాకున్న కోర్కెను బలంగా తెలియచెప్పలేక సెంట్రల్ ట్రైనింగ్ ఇనిస్టిట్యూట్‌లో 'వైర్‌మెన్' ట్రేడ్‌లోను 1975 నుంచి 1977వరకు పూర్తిచేసి, 1977-78లోనే ఆంధ్రసారస్వత పరిషత్తు వారి ఓరియంటల్ కళాశాలలో Dip. O.L. కొరకు చేరాను. ఇక్కడ చేరడానికి వెళ్ళినప్పుడు ఆచార్య రంగనాథాచార్యులు 'నువ్వు తెలుగు కోర్సులు ఎందుకు చదువుతావు, ఐటిఐ చేసిన వాడివి, ఏ ఫ్యాక్టరీలోనో ఉద్యోగం వస్తే హాయిగా ఉద్యోగంలో చేరుమని చెప్పిన మాటలు నాలో మరింత పట్టుదలని పెంచాయి. అక్కడే అంచెలంచెలుగా ఎం.ఎ. (1984) దాకా చదువు పూర్తిచేస్తున్నప్పుడు కలిసిన మిత్రులు, ఉపన్యాసకుల ప్రోత్సాహం, అనుభవం నేర్పిన పాఠాలూ, మర్చిపోలేని సంఘటనలు, సాహిత్య సుగతుల సాన్నిహిత్యాలు, జిజ్ఞాస, ఆత్మవిశ్వాసం నాలోని తెలుగు భాషా సాహిత్యమూర్తిమత్వానికి సోపానాలై మెరుగులు దిద్దాయి. కాలేజీ 'నెలవంక' ; యువభారతి కవితా సంకలనం 'రవ్వలు' నాలోని సృజనాత్మకతకి తొలి సంతకాలైనాయి.

ఆ తర్వాత ఆంధ్రభూమి, ఉదయం మొదలైన పత్రికల్లో నా రచనలు అచ్చయి, లబ్ద ప్రతిష్టులైన కవి, పండితుల రచనల సరసన నా పేరు చూసుకొని మురిసిపోయాను. నాకు సామాజిక అంశాల్ని మార్క్సిస్టు దృక్పథంతో ఆలోచించడం నేర్పిన గురువులు ఆచార్య కె.కె.రంగనాథాచార్యులు, శ్రీ ఎం.నరహరిగారలే.

పోస్టల్ డిపార్ట్‌మెంట్‌లో ఇడిఎంసి గా రూ.130/-లు పొందే ఉద్యోగం లభించింది. సైకిల్ మీద ఈ ఉద్యోగ విధులపై తిరుగుతుండగా ఆరు బుుతువులూ నాపై నుంచే వెళ్ళేవి. అక్కడ ఉద్యోగం తామరాకు మీద నీటిబొట్టే అని తెలిశాక, దరిద్రుడికి దురదృష్టం ఎప్పుడూ వెన్నంటే ఉంటుందన్న వాదానికి ఎదురీదడం అలవర్చుకున్నాను. సిటిఐలో 'వైర్‌మెన్' ట్రేడ్ సర్టిఫికెట్ ఆధారంగా ఎ.పి.ఎస్.ఎఫ్.సి. లో 'లిఫ్ట్ ఆపరేటర్' ఉద్యోగం (1981) వచ్చింది. అప్పుడు దీని బేసిక్ జీతం రూ.250/-. సంసార బండి లాగడానికి కొంత ఎక్కువే వెసులుబాటు ఏర్పడింది. ఈ ఉద్యోగం వచ్చిన రోజునాకూ, మా అమ్మకూ కళ్ళ కొలుకుల్లోంచి రాలిన ఆనంద బాష్పాలు మాటలకందని ముత్యాల సరాలంటే ఎవరికైనా నమ్మకం కలగకపోవచ్చు. కానీ మా 'గరీబీ జీవితం' లో అదొక మలుపు, వెలుగురేఖే అయ్యింది.

పొద్దునే అమ్మ ఉద్యోగానికి వెళ్ళేది. ఇంట్లో పనంతా నేనేచేసి బడికి వెళ్ళేవాణ్ణి. స్కూల్ సెలవుల్లో ఇంట్లో ఒంటరిగా గడపాల్సిన నా బ్రతుక్కి లైబ్రరీలు ఆశ్రయాన్నిచ్చాయి. చిన్నప్పుడు నింబోలిఅడ్డ శాఖా గ్రంథాలయంలో చందమామ, బాలమిత్ర, పత్రికలతోపాటు దిన పత్రికలతో మొదలై సినీ పత్రిక 'విజయచిత్ర' స్థాయికి ఎదిగాను. మరింత పఠనాసక్తి పెరిగి నవలలు, కవిత్వం చదవనారంభించాను. ఆ దశలోనే సినారే, దాశరథిగార్ల కవిత్వం మొదట నాకు పరిచయమైంది. ఆ తర్వాత శ్రీశ్రీ.

నా చిననాటినుండి స్నేహితులుగా ఉన్న శ్రీ ఎం.సేతుపతి (హిందీ పండిట్), శ్రీ బి.వి.ఎల్.చంద్రమౌళి (దేవి ఫ్యాన్స్‌లో అకౌంటెంట్) గారలతో కలిసి 1974లో లిఖిత మాసపత్రికను నడిపాను. దానిపేరు 'ఆంధ్రరత్న సచిత్ర లిఖిత మాసపత్రిక'. మొదటి సంచికను మాత్రం నేనొక్కడినే తయారుచేశా. ఇందులో 'గులాబి', 'రత్నశ్రీ' అనే మారుపేర్లతో రాశాను. 5 సంచికలు వెలువరించాక జర్నలిజం అంటే ఏమిటో తెలియని మేము ఎన్నో  మర్శలు ఎదుర్కోవలసి వచ్చి మానుకున్నాం.

1987-90లలో మిత్రులు శ్రీ ఎ.పరమాత్మతో కలిసి 'సమాంతర సాహిత్య వేదిక'ను నడిపాను. గత సంవత్సరంలో వచ్చిన సాహిత్యాన్ని ప్రస్తుత సంవత్సరం విశ్లేషించే లక్ష్యంతో సాహిత్య

ప్రక్రియలపై ప్రతీనెలా 3వ ఆదివారం ఉపన్యాసాలను ఏర్పాటుచేసేవాళ్ళం. ఈ సమావేశాలన్నింటికి అధ్యక్షత వహించడానికి ఆచార్య కె.కె. రంగనాథాచార్యులుగారంగీకరించారు. అప్పట్లో నేనూ, పరమాత్మ ఇల్లూ, సంసారాన్ని పట్టించుకోకుండా నా సైకిలు మీదే ఇద్దరం నగరంలోని ఉపన్యాసకుల దగ్గరికి చెమటలు కక్కుకుంటూ వెళ్ళిన రోజులూ, కొందరు వక్తలు వస్తామని రాకుండా బాధపెట్టిన సందర్భాలు, అయిన ఖర్చులు, పడ్డ శ్రమనూ విరసం 20 ఏళ్ళ మహాసభలకు ఏర్పడ్డ ఆహ్వాన సంఘంలో మేమూ (సమాంతర సాహిత్య వేదిక) ఒకరుగా ఉండి కవి కాళోజీగారి సహచర్యం, కరచాలనంతో మర్చిపోయాం.

మిత్రులు కె. శ్రీనివాస్, పి. రామహనుమాన్, నేనూ కలిసి 1992లో 'కవిసమయం' అనే సాహిత్య వేదికను స్థాపించాము. దాని ద్వారా సాహిత్య చర్చ సమావేశాల్ని నిర్వహించాం.

ఇలా ఎస్ఎఫ్‌సిలో ఉద్యోగం చేస్తూనే పొద్దునో, సాయంకాలమో సాహిత్య సంస్థల కార్యక్రమాల నిర్వహణకు తిరుగుతూ, దొరికిన స్వల్ప సమయంలో మరోవైపు ఎం. ఫిల్. లో పి. హెచ్‌డిల కొరకో పరిశోధనకై నిరంతరం ఏదో ఓటి చదువుతూ ఉన్న సమయాల్లో క్షీణిస్తున్న అమ్మ ఆరోగ్యం, పిల్లల చదువులూ పరీక్షలు, నాలో సగమై సంసారాన్నీదుకొచ్చే రాధ కనీస కోర్కెల్ని పట్టించుకోకుండా పోయినప్పుడల్లా ''నీ సదువ్‌కు దగ్గకొల్వు (లెక్చరర్) ఎప్పుడు దొర్కుతదోరా!'' అని గొణుగుతూ నా గురించి బాధపడే అమ్మకు ఎలా సమాధానం చెప్పాలో తెలియని క్షణాలూ ఉన్నాయి. ఎపిఎస్ఎఫ్‌సిలోని గుమాస్తా ఉద్యోగం నుంచి లెక్చరర్‌గా స్థిరపడాలని నేను ఎన్నో ఇంటర్వ్యూలకు వెళ్ళాను. చివరికి తమిళనాడు కాలేజీ సర్వీస్ కమిషన్ రాత పరీక్షరాసి, మౌఖిక పరీక్షకు ఎంపికయ్యాను. ప్రస్తుత సమాజంలో ఉద్యోగం రావాలంటే విద్యార్హతలతోపాటు మనస్సు చంపుకొని ప్రవర్తించే లౌక్యం అవసరమని తెలిసినా అలవర్చుకోలేకపోయాను. కాబట్టే ఉద్యోగం సంపాదించుకోలేకపోయాను. మొదట అందుకే అన్నాను ఈ 39వ వసంతం 'సందిగ్ధ సంధ్య' అని. అంటే మార్చ్ 1998తో నా ఏజ్‌బార్ అయిపోయి, చదివిన చదువులు చేసే వృత్తికి సంబంధం లేకుండా పోతున్నా ఆశావాదినే గాక జీవిత చరమాంకం దాకా ప్రవృత్తి శ్వాసగానే బ్రతకాలని నిర్ణయించుకున్నవాడిని కనుక శ్రీ శ్రీ వచన సాహిత్యాన్ని పరిశోధనాత్మకమైన విమర్శతో మీ ముందు నిలుచున్నాను.

కందుకూరి, గురజాడ, శరత్, కొడవటిగంటి కుటుంబరావు, గోపీచంద్, శ్రీ శ్రీ, చలం, రావిశాస్త్రి, కాళీపట్నం రామారావు, చాగంటి సోమయాజి మొదలైన వారి రచనల్లోని ఆలోచనా విధానాలు నా హృదయ వైశాల్యాన్ని పెంచాయి. మానవత్వమే మానవుల (అభి)మతంగా ధృవపరిచాయి. తెలుగు భాషా సాహిత్య సాంస్కృతిక విప్లవాలకి గురజాడ, శ్రీ శ్రీలు రెండు కళ్ళయితే స్త్రీ మానసిక, ఆర్థిక స్వేచ్ఛా స్వాతంత్ర్యాన్ని తన రచనల్లో చూపిన చలం మూడో నేత్రంగా భావిస్తున్న

నాకు శ్రీశ్రీ కవిత్వమన్నా, వచన రచనలన్నా వల్లమాలిన అభిమానం ఏర్పడింది. ఇండియా అధ్యక్ష పదవికన్నా విరసం అధ్యక్ష పదవే ఉన్నతమైందని ప్రజాగతినీ, ధృతినీ ప్రభావితం చేసిన శ్రీశ్రీ సంస్కారాన్నీ, సాహిత్యాన్నీ కొలిచే కొలమానాలేవి? ప్రజాకవికి ఇంతకన్నా ఇంకేం కావాలి? శ్రీశ్రీ మహాప్రస్థానానికి చలం రాసిన పీఠిక చదివిన కొత్తలో (అప్పట్లో) నన్ను నిద్రపోనివ్వలేదు. ఆ క్రమంలో శ్రీశ్రీ ఇతరులకు రాసిన పీఠికల్ని చదవాల్సొచ్చింది. డా॥ ఎన్.గోపిగారి పర్యవేక్షణలో శ్రీశ్రీ పీఠికలపై 1989లో (ఎం.ఫిల్.) పరిశోధన చేసి శ్రీశ్రీ ప్రతిపాదించిన రసన సిద్ధాంతాన్ని సోదాహరణంగా, అతి విస్తృతంగా మొదటిసారి వివరించాను. ఆ తర్వాత ఆచార్య జయధీర్ తిరుమలరావుగారి పర్యవేక్షణలో శ్రీశ్రీ వచన రచనలపై పరిశోధనచేసి ప్రజారచయితగా, విశ్వమానవతా మూర్తిగా ప్రతిపాదించి డాక్టరేట్ పట్టా పొందాను.



నిజానికి కొందరు చాలా విషయాల్లో కృషిచేసినా, ఏదో ఒక దాంట్లో గుర్తింపు వస్తుంది. అలాంటి వాళ్ళలో శ్రీశ్రీ ఒకడు. కవిత్వంతోపాటూ ఇప్పుడున్న అన్ని వచన ప్రక్రియల్లోనూ కలాన్ని ఝుళిపించి సమాజాన్ని చెవి పట్టి మెలేశాడు. అంతేగాక వాటిల్లో సైన్సులా ఎన్నో ప్రయోగాలు చేసి ఆయా ప్రక్రియలకు వినూత్నత్వం సాధించిపెట్టినప్పటికీ శ్రీశ్రీకి 'వచన రచయిత'గా రావలసినంత గుర్తింపు రాలేదనేది నిర్వివాదాంశం. చాలామంది విమర్శకులు, పరిశోధకులు శ్రీశ్రీ కవిత్వాన్నే విశ్లేషించి చూపారు. కానీ వచన రచనలపై అంతగా దృష్టి సారించలేకపోయారు. కాబట్టి శ్రీశ్రీ కథలు, నవలలు, నాటికలు, వ్యాసాలు, ఉపన్యాసాలు, సంపాదకీయాలు, పీఠికలు, ప్రకటనలు మొదలైన ప్రక్రియల్లోని శ్రీశ్రీ వచన వైవిధ్యాన్ని వివరించడానికి విషయ విభజన తప్పనిసరైంది. శ్రీశ్రీ వచనంలో విషయ విభజనకి లొంగని అంశాలెన్నో ఉన్నాయి. ఉదాహరణకు మృత్యువు, నాస్తికత్వం, సినిమాలు మొదలైన అంశాలతో విభజిద్దామంటే సంపాదకీయాలు, ప్రకటనలు, సందేశాలు వంటి ప్రక్రియల్లోని ఏ ఒక్క రచనలో కూడా ఈ అంశాలు కనబడవు. కాబట్టి కొన్ని ప్రక్రియలకు ప్రక్రియలే చూపడం కష్టమవుతున్నందున ప్రక్రియాపరమైన విభజనే శరణ్యమైంది. ఆ దృష్ట్యా శ్రీశ్రీ వచన రచనల్లో కల్పనాత్మక రచనల్ని 'కథాసహిత సాహిత్యం' (Fictional Literature)గా, కల్పనేతర రచనల్ని 'కథారహిత సాహిత్యం' (Non Fictional Literature) గా, తన గురించి తానే రాసుకునే స్వీయచరిత్ర, అందులో భాగమైన యాత్రా చరిత్రలతోపాటు,

ఎప్పటికప్పుడు తన భావాన్ని తెలిపే 'లేఖా' ప్రక్రియ కూడా చేర్చి 'వైయక్తిక సాహిత్యం' (Personel Literature)గా విభజించాను. ఈ ప్రక్రియలన్నింటిలోనూ భాషాపరంగా శ్రీశ్రీ వైశిష్ట్యాన్ని ప్రకటించే అంశాల్ని 'శ్రీశ్రీ శైలి'గా చెప్పాను. వీటన్నిటికి ముందు తెలుగు వచనంతోపాటూ ఎదిగిన శ్రీశ్రీ వచనాన్నీ, అది ఆధునిక తెలుగు వచనంపై చూపిన ప్రభావాన్ని స్థూలంగా మీ ముందుంచాను.

ఆధునిక అవసరాల దృష్ట్యా వచనంలో అనేక ప్రక్రియలు పుట్టుకొచ్చాయి. ఈ వచనంలో గ్రాంథిక భాషా పీఠాన్ని స్థిరపరచడానికి ఎవరెన్ని విధాలు అడ్డుకున్నా, వ్యావహారిక భాషా ప్రవేశం ఆగలేదు. చివరికి ఆధునిక వచనం మాండలికాన్నీ సంతరించుకొని సామాన్య జనానికి మరింత దగ్గరైంది. ఇలా అన్ని ప్రక్రియల్లోనూ భాషా, భావం, రూపం, పరిమాణాలతో కాలానుగుణంగా వికసించిన వచనం ఎంతవరకు వెళ్ళిందంటే, కవిత్వంలోనూ ప్రవేశించి 'వచనకవిత'గా ప్రసిద్ధిలోకి వచ్చింది. ఈ విధంగా కవిత్వ, కవిత్వేతర ప్రక్రియల్లో 'వచనం' ఆధిపత్యం పొందడంవల్ల పాఠకులూ, కర్తలూ పెరగటంతో ఇవ్వాళ 'తెలుగు సాహిత్యం' అంటే ఒకప్పటి పురాణ, ప్రబంధాది కావ్య కవిత్వం కాక కథ, నవల, వ్యాసంవంటి వచన ప్రక్రియలే సాహిత్యంగా ప్రచారంలోకి వచ్చాయి. అప్పట్లో కవిత్వానికి ఎక్కువ మంది పాఠకులు పండితులే, నేడు దాన్ని తోసి రాజని కథ, నవల వంటివి పండిత, పామర జనరంజకంగా పాఠక స్థానాన్ని ఆక్రమించుకున్నవి. ఇలా ప్రక్రియలన్నీ వచనమయమై ప్రజాదరణ పెరగడంవల్ల ఆధునిక సాహిత్యాన్ని (యుగాన్ని) 'వచన యుగం'గా చెప్పుకోవచ్చు. ఇంతటి ప్రభావాన్ని చూపుతూ శ్రీశ్రీతోపాటూ ఎదిగిన తెలుగు వచనాన్ని 'తెలుగు వచనం - శ్రీశ్రీ' అని ఒకటో అధ్యాయంలో వచనం - ఆరంభం, వచనం - వికాసం, వచనం - శ్రీశ్రీలుగా ఉప విభాగాల్లో సంగ్రహంగా వివరించాను.

'కథా సహిత సాహిత్యం'లోని నవలిక, నవల, కథానిక, నాటిక, యక్షగానం ప్రక్రియల్లోని శ్రీశ్రీ రచనలను రెండో అధ్యాయంలో చేర్చాను. 'విచిత్రమే సౌందర్యమ'నే ఆలోచన ఉన్న శ్రీశ్రీ కొన్ని కథలను వ్యాసాల్లా, వ్యాసాల్ని కథల్లా రాశాడు. ఇది గుర్తించలేక పోవడం వల్లనేమో 'బాధకవిత్వానికి పర్యాయపదం' అనే రచన 'చరమరాత్రి' (తృతీయ ముద్రణ, సెప్టెంబరు 1988) కథల సంపుటిలోనూ, 'శ్రీశ్రీ వ్యాసాలు' (మే 1990) పేరుతో వెలువడిన పుస్తకంలో వ్యాసాల సరసన కూడా ఇది ముద్రితమైంది. శ్రీశ్రీ బతికుండగానే 'చరమరాత్రి' కథల సంపుటి (ప్రథమ ముద్రణ, జనవరి 1980) అచ్చయింది. కాబట్టి ఈ కథ రచయిత అనుమతితోనే కథల సంపుటిలోకి చేరి ఉంటుంది. అందువల్లే దాన్ని కథల్లోనే విశ్లేషించాను. నాటక ప్రక్రియలో 'రేడియో నాటికల'పై ప్రత్యేక పరిశోధన వెలువడినందువల్ల ఆ దృష్ట్యా ఈ పరిశోధనకు వాటిని స్వీకరించలేదు. ప్రదర్శనా కళా రూపాల్లో ఒకటైన 'యక్షగానం' ఒకే ఒకటి రాశాడు శ్రీశ్రీ. దీన్ని కూడా ఈ విభాగంలోనే

చేర్చాను. ఈ విభాగపు పరిధిలోకి వచ్చిన శ్రీశ్రీ రచనల్లోని విషయాన్ని, విశేషాంశాల్ని, పాత్రల ప్రత్యేకత, ఆరంభాల అవస్థ - ముగింపుల చమత్కారాలు వంటి ఎన్నో అంశాలు తెలిపాను.

శ్రీశ్రీ రాసిన వ్యాసాలు, ఉపన్యాసాలు, పీఠికలు, సమీక్షలు, సంపాదకీయాలు, ప్రశ్న జవాబులు, ప్రకటనలు, సందేశాలు 'కథారహిత సాహిత్యం'గా మూడో అధ్యాయంలో వివరించాను. కేవలం వచన రచనలపైనే ఈ పరిశోధన అయినందున పద్య, వచన కవితలుగా శ్రీశ్రీ రాసిన పీఠికల్ని స్వీకరించలేదు. పీఠికల పీఠాన్ని పొందిన శ్రీశ్రీ ఇతర ప్రక్రియా రచనల్ని ('త్వమేవాహమ్'పై రాసిన వ్యాసం, 'మల్లారెడ్డి గేయాలు'పై రాసిన 'బహిరంగ లేఖ') కూడా పీఠకల్లోనే చేర్చి సాహిత్య, సామాజిక, రాజకీయ, ఆర్థిక వంటి పలు రంగాలను శ్రీశ్రీ ఎలా విమర్శించాడో, ఎలా ఉండాలని ఆశించాడో - ఆయన విమర్శక మూర్తిమత్వాన్ని ఇందులో విశదీకరించే ప్రయత్నం చేశాను.

స్వీయ చరిత్ర, యాత్రా చరిత్ర, లేఖా ప్రక్రియల రచనల్ని నాలుగో అధ్యాయంలో 'స్వీయాత్మక సాహిత్యం'గా పరిశీలించాను. స్వీయ చరిత్ర 'అనంతం' లో 'కృష్ణశాస్త్రి జ్ఞాపకాలు'గా రాసిన దానిలో కృష్ణశాస్త్రి కవితా స్వర్ణోత్సవం సంచికలో రాసిన వ్యాసం ఇందులో ఉంది. 'కొంపెల్ల జనార్దనరావు జ్ఞాపకాలు'లో ఒక వ్యాసం, ప్రసంగం, సంపాదకీయాలూ చేర్చబడ్డాయి. ఇలాగే 'సర్రియలిజం', 'అద్దంలో శ్రీశ్రీ' వంటి అంశాల్లో కూడా శ్రీశ్రీ ఇతరత్రా రాసిన రచనలు 'అనంతం'లో ముద్రితమైనాయి. నిజానికి ఇవి ఆయా ప్రక్రియల్లో విశ్లేషించాలి. కానీ శ్రీశ్రీనే వాటికి 'అనంతం' లో చోటు కల్పించాడు (అని 'అనంతం' పీఠికలో శ్రీ చలసాని ప్రసాద్ రాశారు). అందుకే ఈ విభాగంలోనే విశ్లేషించాల్సి వచ్చింది. 'అనంతం' లోనే 'నా విదేశ యాత్రానుభవాలు'గా పేర్కొన్న దానితోపాటు 'చైనాయానం' కూడా చేర్చి 'యాత్రాచరిత్రలు'గా ఉపవిభాగంలో చూపాను. 'Personel Literature' లోకి వచ్చే మరో ప్రక్రియ 'లేఖాసాహిత్యం'. శ్రీశ్రీ లేఖల్ని 'లేఖలు' అనే ఉప విభాగంలో, శ్రీశ్రీ జీవిత విశేషాలు, జరిగిన సంఘటనలు, ఆలోచనా తీరు వంటి అనేక అంశాలతో విశ్లేషించాను.

భాషాశాస్త్రంలో భాగం శైలీ శాస్త్రం. ఈ శైలీ శాస్త్ర దృష్టితో సాహిత్యాన్ని చూడడం ఇటీవలి పరిణామమే. తెలుగులో కవిత్వాన్ని ఈ కోణం నుండి పరిశీలించడం అంతో ఇంతో ఉందికానీ, వచన సాహిత్యాన్ని పరిశీలించడం చాలా తక్కువ. ఇటువంటి దశలో శ్రీశ్రీ వచనంలో శైలీపరంగా అగుపించే అంశాల్ని 'శ్రీశ్రీ శైలి'గా ఐదో అధ్యాయంలో వివరించాను.

ఇలా శ్రీశ్రీ వచన సాహిత్యాన్ని విశ్లేషిస్తూ అందులో అతని వైచిత్రీ ప్రియత్వం, నవనవోన్మేషనంతోపాటూ ప్రయోగపోకడలను, తెలుగు సాహిత్యంలో వచన రచయితగా శ్రీశ్రీ వైవిధ్య భరితమైన వైశిష్ట్యాన్నీ తెలిపే ప్రయత్నమే ఈ పరిశోధనకు లక్ష్యంగా ఎంచుకున్నాను. ఇదే సమగ్రమనిగానీ, సంపూర్ణ విమర్శ అని గానీ నేను భావించడం లేదు. శ్రీశ్రీ మొత్తం వచన రచనలపై చేస్తున్న పరిశోధనల్లో ఇది తొలి పరిశోధనా ప్రయత్నం. సహృదయులు సద్విమర్శనా దృష్టితో ఇందులోని దోషాలను తెలిపితే సవినయంగా స్వీకరిస్తాను. శ్రీశ్రీ రచనలపై స్త్రీవాద, దళితవాదం వంటి ప్రత్యేక దృక్పథాల నుండీ పరిశోధనలు చేయవచ్చు. ప్రధానంగా. ఇప్పటి సామాజిక, సాంస్కృతిక మార్పుల సంధి దశకు అత్యవసరం. ఈ దృక్పథంలోంచి కూడా శ్రీశ్రీ వచనాన్ని అక్కడక్కడ అంచనా వేయడం జరిగింది. అది తర్వాతి వారికి ప్రేరణ ఇస్తుందని, ముందు ముందు అటువంటి ప్రత్యేకమైన కోణంలోంచి పరిశోధనలు రావాలనీ, అప్పుడే శ్రీశ్రీ సంపూర్ణ సాహిత్య మూర్తిమత్వం రూపుకడుతుందని అది గతానికి వర్తమానానికి వారధిగా భవిష్యత్తరాలకి స్ఫూర్తిగా నిలుస్తుందని ఆశిస్తున్నాను.

**- రాపోలు సుదర్శన్**

ఒకటో అధ్యాయం

# తెలుగు వచనం - శ్రీశ్రీ

"ప్రపంచ సాహిత్యాలన్నింటిలోనూ వచన రచన ఇటీవలి పరిణామమే. అంటే ప్రాచీన సాహిత్యకారులకు గద్య గ్రథన తెలియని విద్య అని నా ఉద్దేశం కాదు. అయితే ఆ వచనం ఏదీ ఆధునిక కాలపు ప్రత్యే-కావసరాలకు సరిపోయేదికాదు".

- శ్రీశ్రీ

(మన గురజాడ, పుట 42)

# వచనం – ఆరంభం

తెలుగు సాహిత్యంలో వచనాన్ని విరివిగా వాడడం ఆధునిక కాలంలోనే ఆరంభమైంది. ఇక్కడ 'ఆధునికం' కాల, భావ వాచిగా పేర్కొనడం జరిగింది. ప్రపంచ వ్యాప్తంగా 'ఆధునికత' రావడానికి దోహదమైన 16, 17 శతాబ్దాలను 'పునరుజ్జీవన' (Renaissance) కాలంగా మేధావులు పేర్కొంటున్నారు.[1] ఈ కాలంలోని సాంకేతిక, విజ్ఞాన, సామాజిక శాస్త్రాలు, కళలు వంటి పలు రంగాలలో కలిగిన పరిణామాలు 'ఆధునికత' రావడానికి హేతువైనై.

ఏదో ఒక రంగంలో సాధించిన ప్రగతివల్ల 'ఆధునికత' ఏర్పడలేదు. 'పారిశ్రామిక విప్లవం' వల్ల విజ్ఞాన శాస్త్రాలు, సాంకేతిక రంగాలు అనూహ్యంగా అభివృద్ధి చెందాయి. 'ఫ్రెంచి విప్లవం' నాటి పరిస్థితుల ప్రభావాలతో సామాజిక శాస్త్రాలలో (social sciences) కొత్త కొత్త ఆలోచనలు బయలుదేరినై. ఈ శాస్త్రాల మధ్య ప్రభావం పరస్పరం పడసాగింది. ఉదాహరణకు విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాల ఆధారంగా భూమి గుండ్రంగా ఉందని ఒక శాస్త్రవేత్త చెప్పాడు. దానితో మతాల గూర్చి చెప్పే తత్త్వ శాస్త్రంలో అలజడిరేగింది. చివరికి ఈ విషయంలో హేతువాదమే నిలిచింది. ఈ విధంగా వివిధరంగాల్లోని అభివృద్ధి, తార్కికత ఇత్యాది వాటి వల్ల ఏర్పడిందే ఆధునికత.[2] ఇది 18వ శతాబ్దం నుండి ఆరంభమైంది. దీన్ని కాలవాచిగానే గాక, హేతు వాదానికి నిలిచే నూతనమైన భావాన్ని 'భావ' వాచిగా పేర్కొంటాం.

ఆధునిక కాలంలో వెలువడిన రచనలన్నీ ఆధునికమైనవికావు. అవి కేవలం సమకాలికమైనవి. 'సమకాలికం' అంటే కాలాన్ని మాత్రమే సూచించడం. 'ఆధునికం' అనడం కేవలం కాలాన్నేగాక, ఒక తాత్త్విక దృష్టితో వెలువడిన రచనలను మాత్రమే చెప్పుకుంటాం.[3] ఉదాహరణకు విశ్వనాథ సత్యనారాయణ, శ్రీశ్రీలు సమకాలిక రచయితలు. వీరిలో మొదటి వారు సంప్రదాయానికి, రెండవ వారు ఆధునికతకి ప్రతీకలు.

ముస్లిములు, ఇంగ్లీషు వాళ్ళు భారతదేశంలో భాగమైన ఆంధ్రదేశాన్ని కూడా పాలించారు. వీరిలో ఇంగ్లీషు వారి భాష, సాహిత్యాల ప్రభావమే తెలుగుపై ఎక్కువగా ఉంది. విదేశీ మిషనరీలు, వ్యక్తులు తెలుగు భాషా సాహిత్యాల అభివృద్ధికి ఎంతో కృషి చేశారు. ఇదే విధంగా మరాఠీ భాషకు పాశ్చాత్యుల సేవ గూర్చి డా॥ ఎమ్. ప్రభాకర్ " The modern period begins with the missionaries, who established printing press and brought prose in printed from into vogue"[4] అని చెప్పాడు. ఇది కేవలం మరాఠీ భాషకే చెప్పినప్పటికీ దాదాపు భారతీయ భాషలన్నింటికీ వర్తిస్తుంది.

దక్షిణ భారతదేశంలో తమిళ, మళయాలం, కన్నడం, తెలుగు భాషలు ఉన్నాయి. వీటి సాహిత్యాల పునరుజ్జీవనం గురించి 'Renaissance in South Indian Literature' అన్న వ్యాసంలో "The four South Indian Literatures have a rich literary history and heritage over long periods. Each literature has had its own ups and downs, ... The renaissance not only revived what was great in the past but also infused new elements relevant to the time and spirit. Because of the impact of western thought and literature, ... new forms like the novel, social play, satire, the light essay etc., came to be handled with increasing self-assurance"[5] అని బ్రిటిషు భాషాసాహిత్యాల పరిచయంవల్ల, దక్షిణ భారతదేశ భాషల్లోకి ప్రవేశించిన నూతన ప్రక్రియలను చెప్పడం జరిగింది.

దక్షిణ భారతదేశ భాషలలో ఒకటైన తెలుగు భాషా సాహిత్యాలలో పునరుజ్జీవనానికి ఎందరెందరో కృషి చేశారు. సామాజిక రంగంలో కృషి చేసి 'దక్షిణ భారత దేశపు రాజా రామ్మోహనరాయ్'గా, సాహిత్యరంగంలో కృషి చేసి 'గద్య తిక్కన'గా బిరుదులు పొందిన వీరేశలింగం పంతులు తెలుగు జాతి పునరుజ్జీవనానికి కృషి చేసిన వారిలో ప్రముఖుడు. ఈయనతోపాటు ఇంకా గురజాడ అప్పారావు (సాహిత్యం), గిడుగు రామమూర్తి పంతులు (వ్యావహారిక భాష), కొమర్రాజు లక్ష్మణరావు (విజ్ఞాన సర్వస్వం), త్రిపురనేని రామస్వామి చౌదరి (హేతువాదం) మొదలగువారు తెలుగు వాఙ్మయ పునరుజ్జీవనానికి కృషి చేసిన వారిలో కొందరు.

వీరందరి కృషి ఫలితంగా తెలుగు సాహిత్యంలో పద్యంకంటే వచనం వాడకమే ఎక్కువైంది. దానికి కారణం ఆధునిక విజ్ఞానంతో తయారు చేసుకున్న యంత్రాలు - పరికరాలు కూడా తోడ్పడ్డాయి. ప్రాచీన కాలంల్లో లేఖన పరికరాలు ఇప్పుడున్నంత అనుకూలంగా లేవు. మౌఖిక సాహిత్యాన్ని లిఖితంగా మార్చుకోడానికి మొదట్లో ఘంటాలతో తాటాకులు, బూర్జపత్రాలపై రాసేవారు. ఇంకా ఆనాటి లేఖనానికి శిలా, తామ్ర ఫలకాలు మొదలైనవీ వాడే వారు. ఇలాంటి లేఖన పరికరాలతో రాయడం కష్టమైన పని. రాసిన దాన్ని పదే పదే చదవడమూ ఇబ్బందే. రాసిన ఆకులు ఎంతో కాలం మన్నికగా ఉండవు. వీటిని ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి

తీసుకెళ్ళడమూ సులువైందికాదు. ఇన్ని ఇబ్బందుల దృష్ట్యా ఆనాటి వాఙ్మయమంతా కంఠస్థం (ధారణ) చేసి మేధలో దాచుకొనేవారు. ధారణ చేయడానికి అనుకూలమైంది లయాన్వితమైన ఛందోబద్ధ రచన. అందుకే ఆనాటి శాస్త్రాలు, సాహిత్యము పద్యాల్లోనే రాయబడినవి. 'కలం - కాగితం' వచ్చిన తర్వాత లేఖనానికి సౌలభ్యత ఏర్పడింది. ఆకుల (తాటాకులు, బూర్జ పత్రాలు) కంటే ఎక్కువ కాలం కాగితాలు సురక్షితంగా ఉంటాయి. కానీ కావలసినన్ని ప్రతులు తయారుకావడానికి ఎక్కువ శ్రమ అవసరం. దీన్ని అధిగమించడానికే అచ్చుయంత్రం (1593) వచ్చింది. ఈ అచ్చుయంత్రాన్ని మొదట్లో మత ప్రచార రచనలు అచ్చేయడానికి వాడుకున్నారు. ఆ తర్వాత ఇది వాఙ్మయంలో పలురంగాలకు విస్తరించింది. దీనితో అచ్చయ్యే రచనా ప్రతులు కావలసనన్ని సులువుగా లభ్యమౌతాయి వీటిని ఆధునిక రవాణా సౌకర్యాల ద్వార ఇతర చోట్లకు పంపడం తేలిక. ఇలా ఒక రచన ఏక కాలంలో, భిన్న ప్రాంతాల్లో అనేక మంది చదివి ఎన్నో రకాలుగా ఆలోచించే అవకాశం ఏర్పడింది.

అచ్చైన రచనను పలుమార్లు చదువుకోవచ్చు. కాబట్టి శాస్త్రాలను ధారణ చెసి జ్ఞాపకం ఉంచుకోవల్సిన అవసరంలేదు. అందుకే శాస్త్రాలు ఛందోబంధాన్ని వదిలించుకొని వచనంలో వెలువడడం ఆరంభమైంది. సాహిత్యరంగంలో విషయ ప్రధానమైనవి వచనంలో, విషయం కంటే చెప్పడంలో సౌందర్యానికి ప్రాధాన్యత ఇచ్చినప్పుడు పద్యంగా రాయడం జరుగుతున్నది. ఈ విధంగా ఆధునిక తెలుగు శాస్త్ర, సాహిత్య రచనల్లో వచన ప్రాధాన్యత పెరిగింది. పెరిగిన వచన ప్రభావం కవిత్వంపై పడడంతో ఛందస్సును వదిలించుకొని 'వచన కవిత' (గద్య కవిత) గా రూపు దాల్చింది. ఇలా ఆధునిక సాంకేతిక, ఆలోచనాధోరణుల వల్ల దాదాపు అన్ని ప్రక్రియల్లోను వచనమే కన్పిస్తుంది. తెలుగు సాహిత్యంలో పూర్తి వచన పుస్తకాలు క్రీ. శ. 1600 నుండి ఆరంభమైనై. తంజావూరు, మధుర, పుదుక్కోట, మైసూరు మొదలైన ప్రాంతాల్లో కవిత్వంతో పాటుగా వచన రచనలు కూడా వచ్చాయి. అందుకే సాహిత్య చరిత్రలో ఈ కాలం వచనానికి అతి ముఖ్యమైనది. ఈ విషయాన్నే 'A Historical sketches of Telugu Literature' అన్న పుస్తకంలో " The prose literature of this period is represented by Halasya Mahatmya of Nanja Raja of Mysore (1670) and the Vachana Jaimini Bharatamu of Samukha Venkata Krishnappa (1700). Veerarajah's Vachana Bharatamu has also been recently discoverd. Thus the beginings of Telugu prose have been laid in this age, and mark an important era in the history of the language"[6] అని ఈ కాలంలో వెలువడిన వచన రచనల ప్రాముఖ్యాన్ని పేర్కొంది.

మైసూరు రాజైన నంజరాజు సంస్కృత, కర్నాటక, ఆంధ్ర భాషల్లో రచనలు చేశాడు. తెలుగులో ఇతను శివభక్తికి సంబంధించిన 'హాలాస్య మహాత్మ్యము' అన్న పుస్తకాన్ని కూడా వచనంలో రాశాడు. సముఖం వేంకట కృష్ణప్ప నాయకుడు 'జైమినీ భారతము' ను; విజయరంగ చొక్కనాథుడు 'మాఘ మాహాత్మ్యము', 'శ్రీరంగ మాహాత్మ్యము' లను ; కళువె వీరరాజు 'మహాభారతము' ను వచనంలో రచించి వచన రచనారంభానికి గట్టి పునాదులు వేశారు.

# వచనం – వికాసం

తెలుగు లో మొట్ట మొదటి పుస్తకం 1746 లో అచ్చైంది. అది 'నూరు జ్ఞాన వచనాలు.' దీన్ని రెవరెండు బెంజిమన్ షుల్జ్ ముద్రింపించాడు. అప్పటి నుండి తెలుగులో ముద్రణ యుగం ఆరంభమైంది. ఇది వచన పుస్తకం. అంటే తెలుగులో అచ్చైన మొట్ట మొదటి పుస్తకం వచనంలోనే ఉందన్నమాట. పాశ్చాత్యులు తమ మత ప్రచారార్థం ప్రవేశ పెట్టిన ముద్రణ తెలుగు సాహిత్యానికి ఎంతో మేలు చేసింది. అందులోను వచన సాహిత్యం మరీ ఎక్కువగా అభివృద్ధి చెందింది.

తెలుగేతరులు తెలుగు నేర్చుకోవడానికి అనుకూలమైన వ్యాకరణాలను 1814 లో డా॥ క్యారీ దొర, 1816 లో ఏ.డి. కామ్‌బెల్, 1817 లో సి.పి. బ్రౌన్ గారలు తెలుగు వ్యాకరణాలను రాశారు. ఇవన్నీ వచనంలోనే ఉన్నాయి.

1812 లో ఫోర్టు సెంటు జార్జి కళాశాల స్థాపించబడింది. అప్పుడు తెలుగు వచన బోధనకు పుస్తకాలు లేని కారణంగా ఆ కళాశాల ప్రధానోపాధ్యాయులుగా పనిచేస్తున్న రావిపాటి గురుమూర్తి శాస్త్రి 1819 లో ద్వాత్రింశత్సాలభంజికల కథలు (విక్రమాదిత్యుని కథలు), 1834 లో పంచతంత్రకథలు, 1836 లో తెలుగు వ్యాకరణము పుస్తకాల్ని రాసి ముద్రించాడు. ఇవి చక్కటి వ్యావహారిక భాషలోనే రాయబడి పలుమార్లు ముద్రింపబడినై.

ఆ తర్వాత 1840 లో 'శుకసప్తతి కథలు' ను పాటూరి రామస్వామి శాస్త్రి, 'హరిశ్చంద్ర కథ' ను పాటూరి నరసింహశాస్త్రి ; 1841 లో చేమకూర 'విజయ విలాసము' ను పాటూరి రంగశాస్త్రులు వచనంలో రాశారు. 'నలచరిత్ర' ను టి. రాఘవాచార్యులు; 1842 లో 'హంస వింశతి' ని ధూర్జటి లక్ష్మీపతి; 1943 లో దిలారామకథలు, భూగోళ దీపికలు; 1948 లో 'బేతాళ పంచ వింశతి' ఈ విధంగా దాదాపు 1855 వరకు వెలువడిన వచన రచనలన్నీ సులభంగా అర్థమయ్యే వ్యావహారిక భాషలోనే వెలువడినాయి.

1857 సిపాయిల తిరుగుబాటు రాజకీయంగా ఎంత ప్రాముఖ్యతను సంతరించుకుందో అదే విధంగా అదే ఏడు మద్రాసులో స్థాపించిన విశ్వవిద్యాలయం తెలుగువారి విద్యా సాంస్కృతిక రంగాలలో విప్లవాత్మకమైన మార్పులు రావడానికి దోహదం చేసింది. ఈ విశ్వవిద్యాలయంలోని తెలుగు శాఖకు ప్రధానోపాధ్యాయుడుగా చిన్నయ సూరి నియమితుడైనాడు. ఈయన 1852 లో రాసిన 'నీతిచంద్రిక', 1855 లో రాసిన 'బాలవ్యాకరణము' ఈ రెండు పాఠ్యగ్రంథాలుగా నిర్ణయింపబడినై. వీటిల్లో 'నీతిచంద్రిక' గురించి గురజాడ అప్పారావు "చిన్నయ సూరిని కావ్య భాషలో వచన రచనకు పిత అని అంటున్నారు. సంస్కృత భాషలోని హితోపదేశానికి ఆయన ఆంధ్రీకరణ, ప్రత్యేకించి ప్రథమ భాగం (మిత్రలాభం) కొంత సాహిత్య విలువ గలది. అది చిన్న చిన్న వాక్యాలు, చక్కని నడకగల రచన ఎల్లెడలా అర్థం సుస్పష్టం. గ్రంథకర్త పద ప్రయోగంలో, అలంకారాలు వాడటంలో తెలుగు రచయితల్లో అరుదుగా కనిపించే నిగ్రహం చూపాడు"[7] అని మెచ్చుకొని, ఈ 'నీతిచంద్రిక' ను అనుకరిస్తూ 'హితోపదేశాన్ని' వీరేశలింగంగారు అనువదించిన తీరును ". . . అందరికన్న వీరేశలింగంగారు సాహిత్య పరంగా తీవ్ర అపరాధం చేశారు. అనేక సంవత్సరాలపాటు తెలుగు వచన సాహిత్యం ఈ అనువాద రచన స్థాయికి మించిపైకి వెళ్ళ లేక పోయింది"[8] అని తీవ్రంగా వ్యతిరేకించాడు. ఎందుకంటే 'నీతిచంద్రిక' ను వీరేశలింగం అనువదించిన శైలి తెలుగు వచన రచయితలపై పడింది. ఈ రచనా విధానమే తర్వాతి రచయితలూ అనుకరించారు. ఈ విధంగా తెలుగు వచనం వ్యావహారిక భాషను వదిలి గ్రాంథిక భాషా పరమైంది. ఈ ప్రభావంతో వేదం వేంకటరాయశాస్త్రి, కొక్కొండ వెంకటరత్నము పంతులు, జయంతి రామయ్య పంతులు మొదలైన వారు రచనలు చేశారు.

కొక్కొండ వెంకటరత్నము రాసిన 'ప్రసన్న రాఘవ' నాటకంలోని భాషను గ్రామ్యంగా 'ప్రసన్న రాఘవ విమర్శనము' లో వేదం వేంకటరాయశాస్త్రి విమర్శించారు. అప్పుడు 'ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజం' పేర గిడుగు ఖండన గ్రంథం రాసి గ్రాంథిక వాదులందరిని విమర్శించాడు. దీనితో గ్రాంథిక వాదులందరూ ఏకమయ్యారు. అప్పుడు ఇది 'వ్యావహారిక గ్రాంథిక' ఉద్యమంగా రూపు దాల్చింది. ఇరువర్గాల వారూ ప్రత్యర్థులను ఖండిస్తూ తమ వాదానికి అనుకూలంగా రచనలు చేశారు. అలాంటి వాటిల్లో గురజాడ రాసిన 'A minute of Dissent' (అసమ్మతి పత్రం) ఒకటి.

వ్యావహారిక - గ్రాంథిక' భాషోద్యమంలో ప్రజలకు సులభంగా అర్థమయ్యే వ్యావహారిక భాషనే చివరికి నెగ్గింది. కందుకూరి వీరేశలింగం పంతులు తమ చివరి రోజుల్లో వ్యావహారిక భాషా సభలకు అధ్యక్షత వహించి వ్యావహారిక భాష వైపు మొగ్గాడు. ఇలా అంతిమ విజయం పొందిన వ్యావహారిక భాషకు లక్ష్యంగా గురజాడ రచనల్ని చెప్పుకోవచ్చు. గురజాడను 'ఆంధ్ర గ్రంథ మండలి' వారు 'కళింగదేశ చరిత్ర' రాయమని కోరారు. అది గ్రాంథిక భాషలో ఉండాలని షరతు. దానికి

గురజాడ అంగీకరించక "నాది ప్రజా ఉద్యమం. ఏ ఒక్కరి కోసం దాన్నినేనొదులుకోను" అని చెప్పి చివరికి రాయనేలేదు. వ్యావహారిక భాషపైన ఇంత పట్టుదల ఉన్న గురజాడనే పూర్తి వ్యావహారికంలో 1892 లో 'కన్యాశుల్కం' నాటకాన్ని రచించాడు. గురజాడ తన రచనలన్నీ వ్యావహారిక భాషలోనే రాసి తెలుగు సాహిత్యంలో వ్యావహారిక భాషను ప్రవేశపెట్టినవాడయ్యాడు.

తెలుగు వచనం గ్రాంథికాన్ని వదిలించుకొని, వ్యావహారికాన్ని సంతరించుకొని ఎన్నో ప్రక్రియల్లో మరింత వికసించింది. అవి: నవల, కథ, వ్యాసం, స్థానిక, జీవిత, స్వీయ, యాత్రా, సాహిత్య చరిత్రలుగా, పీఠికలు, సంపాదకీయాలు, నాటికలు ఇలా వివిధ ప్రక్రియలు. ప్రాచీన సాహిత్యమంటే కేవలం కవిత్వమే గుర్తుకొచ్చినట్లు, ఆధునిక సాహిత్యమనగానే గద్యరచనలే గుర్తుకొస్తాయి. అందుకే ఆధునిక సాహిత్య యుగాన్ని 'వచన యుగంగా' పేర్కొంటే అది అతిశయోక్తికాదు.

వచన సాహిత్యంలో ఎక్కువ ప్రక్రియలను వీరేశలింగం పంతులే మొట్ట మొదట చేపట్టి వాటికి ఆద్యుడైనాడు. 'దిద్దుబాటు' కథానిక రాసి గురజాడ కథానికా సాహిత్యానికి మొదటి వాడైనాడు.

ఈవిధంగా ఆరంభమైన ఆధునిక వచన ప్రక్రియల్లో వీరేశలింగం, గురజాడలతో పాటుగా ధర్మవరం కృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావు, కట్టమంచి, విశ్వనాథ సత్యనారాయణ, చలం, అడవి బాపిరాజు, నోరి నరసింహశాస్త్రి, శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి, రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ, కొడవటిగంటి కుటుంబరావు, శ్రీశ్రీ, ఆరుద్ర, రంగనాయకమ్మ, రామలక్ష్మి, వాసిరెడ్డి సీతాదేవి మొదలైన వారెందరో 'వచనం' లోని వివిధ ప్రక్రియల్లో రచనలు చేసి తెలుగులో వచనాభివృద్ధికి తమ వంతు కృషి చేశారు. వీరిలో శ్రీశ్రీ వచన రచనలను స్థూలంగా వివరిస్తాను.

# వచనం – శ్రీశ్రీ

అటు కవిత్వంలోనూ, ఇటు వచనంలోనూ విరివిగా రచనలు చేసిన సాహిత్య సవ్యసాచులకు ఏదో ఒక రంగంలో మాత్రమే గుర్తింపు రావడం కద్దు. అలాంటి వారిలో శ్రీశ్రీ ఒకడు. 'మహా ప్రస్థానం' నుండి 'మరో ప్రస్థానం' వరకు సాగిన కవితా ప్రయాణంతో ప్రజల్ని ఆకట్టుకున్నంతగా 'పరిణయ రహస్యం' నుండి శ్వాస వదిలే వరకు విభిన్న వచన ప్రక్రియల్లో చేసిన ప్రయోగాలు ప్రజల్ని చేరుకోలేదా?! లేక ప్రజలే వాటిని అందుకోలేదా?! ఏమైతేనేమి, 'వచన రచయిత' గా శ్రీశ్రీకి రావల్సినంత గుర్తింపు మాత్రం రాలేదు.

వచనంలో విభిన్న ప్రయోగాలు చేసిన శ్రీశ్రీ "నిజానికి వచనం యొక్క ప్రథమ ప్రయోజనం కథనమే ..."[9] అని చెప్పి కథానికా ప్రక్రియతోపాటు నాటిక, నవలికా, వ్యాసాలు, ప్రసంగాలు, పీఠిక, స్వీయచరిత్ర, యాత్రా చరిత్ర, సంపాదకీయాలతో పాటు, కాలమిస్టుగా కూడా రచనలు చేసి తనదైన ప్రత్యేకతను ప్రదర్శించుకున్నాడు.

తెలుగు కథానికలతోపాటు ఇతర భాషల్లోని కథలనూ చదివిన శ్రీశ్రీ, చైతన్య స్రవంతి ధోరణిని తొలిసారిగా తెలుగు వారికి పరిచయం చేస్తూ 'కోనేటిరావు కథలు' రాశాడు. 'ఒసే తువ్వాలు అందుకో' కథలో అధివాస్తవికత కనిపిస్తుంది. వివిధ విషయాలపై అనూహ్యంగా శ్రీశ్రీ కథలు రాశాడు. ఈ కథలు సమకాలీన సామాజిక, రాజకీయ, ఆర్థిక జీవన విధానానికి దర్పణాలు. 'అనామిక' వంటి కథల్లో అక్కడక్కడ సమకాలీన రాజకీయాలు కన్పిస్తాయి. 'ఐశ్వర్యం ఎదుట దారిద్ర్యం' వంటి వాటిల్లో జీవితంలోని ఆర్థిక అసమానతలు ఎలా ఉంటాయో చూపబడ్డాయి. 'ఒసే తువ్వాలు అందుకో' లో భర్తల ఆధిపత్యం, భార్యలు అణగిమణగి ఉండడం, సమాజంలో స్త్రీల స్థితిగతులు మొదలైనవన్నీ వర్ణించబడ్డాయి. 'చరమ రాత్రి' కథలో ఓ కుర్రాడు ఆత్మహత్య చేసుకోబోయే ముందు అతని ఆలోచనా విధానంతో ఆనాటి సమాజంలో యువకులు ఎలా డిప్రెషన్‌కు లోనయ్యేవారో

తెలుస్తుంది. ఉద్యమకారుడు ఎప్పటికీ మరణించడు. ఓ విప్లవ వీరున్ని చంపితే, ఆ వెంటనే మరో వీరుడు పుట్టుకొస్తాడని సింబాలిక్‌గా "చావూ-పుట్టుకా' కథ ద్వారా తెలుస్తుంది. 'హేమంతం' కథలోని కథానాయిక తన కవిత 'భిక్షు వర్షీయసీ' లోని అవ్వే. ఈమె బిచ్చగత్తెగా మారిన వైనం చెప్పడంతో పరిపాలనా విధానం, ఆర్థిక మాంద్యం, పెట్టుబడిదారుల దారుణాలు పాఠకుడి మనోనేత్రానికి దృగ్గోచరమవుతాయి. తల్లి అనారోగ్యంగా ఉన్నా లెక్క చేయక గుర్రపు పందాల చుట్టూ తిరిగే కొడుకుల జీవితానికి మచ్చుగా 'అశ్వమేధ యాగం' కథను రాశాడు. 'బొమ్మ' పేరుతో రాసిన కథ చిత్ర విచిత్రంగా ఉంటుంది. కథ రాయడంకోసం శ్రీశ్రీ, నారాయణబాబులు చర్చించుకోవడమే 'శూర్పణఖా మాన సంరక్షణం'. లోకంలో ఉండే శాడిస్టులకు ప్రతీకగా 'నేటి హిరణ్యాక్షుడు' కథను రాశాడు. ఇలా వైవిధ్య, వైశిష్ట్య పూరితంగా కథలల్లిన శ్రీశ్రీ, ఇతర భాషా రచయితలైన Edgar Allan Poe, William Saroyan, Guy de Maupassant, Franz Kalfka మొదలైనవారల కథల్ని తెలుగులోకి అనువదించి పరిచయం చేశాడు.

బెంగాల్ నుండి అనువాదమైన అపరాధ పరిశోధనాత్మక నవలల్ని, Charles Dickens, Tolstoy ల నవలల్ని చదివిన శ్రీశ్రీ, తన పెళ్ళికిముందే, 14 వ ఏట (1924) 'పరిణయ రహస్యము' పేరుతో ఓ నవల రాశాడు. ఇందులో పెళ్ళి చేసుకోదలచుకున్న ఒక వ్యక్తి మోసపోవడం, చివరికి కథ సుఖాంతమవుతుంది. ఈ కథనడవడంలో సామాజిక, ఆచార, వ్యవహారాలు మొదలైనవెన్నో విషయాలు తెలుస్తాయి. శ్రీశ్రీ రాసిన మరో నవల 'ఆదర్శజీవులు. దీన్ని రేడియో కొరకు ఆరుగురు రచయితలు రాశారు. అందులో 'సుదర్శనం : లోకం' పేరుతో ఓ అధ్యాయం శ్రీశ్రీ రాశాడు. ఇందులో మూడు తరాల వారి జీవితం ఎలా ఉందో తెలుపుతూ, సందర్భవశంగా సామాజిక, ఆర్థిక విధానాలెలా ఉన్నాయో తెలుస్తాయి. 'మిహాయిల్ షోలొహోవ్' రాసిన నవలను 'మానవుడి పాట్లు' పేరుతో అనువదించాడు శ్రీశ్రీ. ఈ నవలలో శత్రుసైనికులకు దొరికిన ఓ సైనికుడి దీనగాథ వర్ణితమైంది.

జగన్మిత్ర నాటక సమాజంలో బాలనటుడిగా రంగప్రవేశం చేసి, ప్రముఖ నాటక రచయితగా, అందునా రేడియో నాటక కర్తగా ప్రసిద్ధుడైనాడు శ్రీశ్రీ. '1+1=1 మొదలైన రేడియో నాటికలు' పేరున శ్రీశ్రీ కొన్ని నాటికలు ఓ పుస్తకంగా అచ్చయినవి. ఇందులో పదమూడు నాటికలున్నాయి. ఇంకా శ్రీశ్రీ సాహిత్యం వచన విభాగాలు రెండు, మూడుల పేర్లతో ముద్రితమైన వాటిలో కూడా ఉన్నాయి. 'చతురస్రం'లో 1999 డిసెంబర్ నాటికి మానవులు శాశ్వతంగా బతికే ఉండడానికి మందు కనిపెట్టడం ఉంది. 'కొక్కొరొకో' ఈ నాటికకే మరో పేరు 'రాజకీయ కుక్కుటేశ్వరము.' ఇందులో సమకాలీన రాజకీయ వ్యవస్థ చక్కగా చిత్రితమైంది. భారత జాతిపిత గాంధీజీ మరణానికి తనలో కలిగిన బాధను 'సుప్తాస్థికలు' నాటికగా మలిచాడు. 'గ్రామఫోన్ రికార్డుల తిరుగుబాటు' చేయించి అదే పేరున నాటిక రాసి తను తిరుగుబాటుదారుల పక్షం వాడుగా

శ్రీశ్రీ నిరూపించుకున్నాడు. విదూషక పాత్రదారులు జనాన్ని నవ్వించడానికి ఎంతెంత కష్టపడతారో, రంగస్థలం పై ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తుండే వారి జీవితంలో ఎంత విషాదముంటుందో అనూహ్యమైంది. దీన్నే 'విదూషకుడి ఆత్మహత్య' గా రాశాడు శ్రీశ్రీ. తను కలలుగన్న, మరో ప్రపంచం ఎలా ఉంటుందో 'మరో ప్రపంచం' నాటికలో చూపాడు. 'స్వామి-భూస్వామి' లో స్వాములు, భూస్వాములు కలిసి ప్రభుత్వాన్నీ ప్రజల్ని ఎలా మోసగిస్తున్నారో కళ్ళకు కట్టినట్టు రాశాడు శ్రీశ్రీ. సినిమా రచనలో రచయిత స్థానం ఎలా ఉందో చిత్రితమైంది 'దడిగాడు వానసిరా' లో యుద్ధం ఎంత నీచమైందో నిరూపించే నాటిక 'యుద్ధం యుద్ధం యుద్ధం.' దేశంకోసం ఓ తల్లి తన పుత్రులనే త్యాగంచేసిన ఆదర్శమూర్తి ఇతివృత్తంగల కారల్‌చాపెక్ (జెకొస్లొవెకియా) రాసిన నాటికను తెలుగు వారు చదువుకునే అవకాశం కల్గించాడు శ్రీశ్రీ. చెకోవ్ రాసిన The Cherry Orchard నూ 'సంపెంగ తోట' పేరుతో అనువదించాడు. ఇలా నాటికలతోపాటు 'భాగ్యలక్ష్మి' పేర ఓ యక్షగానం కూడా రాశాడు.

వివిధ సందర్భాలలో శ్రీశ్రీ వ్యాసాలను రాయడమేగాక కొన్ని పత్రికల్లో 'వారం-వారం' కాలమిస్టుగా చాలా వ్యాసాల్ని రాశాడు. కేవలం గురజాడపైనే పదికిపైగా వ్యాసాల్ని రాశాడు. 'ముత్యాలసరం-ఒక కృషి' అన్న వ్యాసం 'ముత్యాలసరం' పై నాటికీ నేటికీ ప్రామాణికమైందే. శ్రీశ్రీ పరిశోధనా, విశ్లేషణా దృష్టికి ఈ వ్యాసమొక్కటి చాలు. ఇంకా 'కన్యాశుల్కం' పై ఆరు వ్యాసాల్ని రాశాడు. గురజాడపైనేగాక తనకు బాగా నచ్చిన జేమ్స్ జాయిస్‌పై కూడా వ్యాసం రాశాడు. ఇంకా టాగూరు, గిడుగు, చింతాదీక్షితులు, బుచ్చిబాబు, తిలక్, విశ్వనాథ, చలం, కృష్ణశాస్త్రి, జలసూత్రం కొడవటిగంటి కుటుంబరావు వంటి ఎందరో సాహిత్యకారుల గూర్చి వ్యాసాల్ని రాశాడు. మన సినిమాలు, చిత్ర రచయితలు, నేనూ-నా పాటలు, సినిమా పాటలు, మనకు విప్లవ చిత్రం ఒకటైనా వుందా? మున్నగు వ్యాసాలు పదిహేనుకుపైగా సినిమాల గురించి రాశాడు. తన రచనల గురించి నా తొలి రచన, నా కాలం గురించి, నా గురించీ నేనే చెపుతున్నా, నాకు నచ్చిన వచన శైలి వంటి శీర్షికలతో వ్యాసాలు రాశాడు. అప్పుడూ - ఇప్పుడూ, వస్తాదే మాబావ, వాడేవీడు వంటి అంశాలతో చిత్ర విచిత్రంగా వ్యాసాలు రాశాడు. వివిధ సాహిత్య ప్రక్రియల్ని సమీక్షిస్తూ సాహిత్య రచన: ప్రక్రియలు, 50సం॥ల తెలుగు సారస్వతం (1900-1950), 20వ శతాబ్దపు తెలుగు సాహిత్యం (1900–1950), ఆధునిక తెలుగు సాహిత్యం, పాతికేళ్ళ సాహిత్యం వంటి శీర్షికలతో రాశాడు. సాహిత్య సంఘాల కృషి, సాహిత్య సంఘాల లక్ష్యాలు వంటి అంశాలపై కూడా వ్యాసాల్ని రాశాడు.

ఉపన్యాసం "... వినే వాళ్ళకి నీరసం వచ్చి కళ్ళు తిరిగినా, ఓపికా ఓర్పు నశించినా, ఆఖరికి ప్రాణాలు పోయినా ..."[10] ఆగని మైకాసురుల్లాగాక, తన ఉపన్యాసం కోసం ప్రజ పరితపించే విధంగా ఆకర్షించుకున్న వక్త శ్రీశ్రీ. ఈయన రేడియోలో, అరసం, విరసం సభల్లోనే గాక సాహిత్య, పౌరహక్కుల, ఎలెక్షన్ల సభల్లోనూ ప్రసంగించాడు.

రేడియో ప్రసంగాలలో 'ఆధునిక గద్య వాఙ్మయ ప్రవర్తకుడు', 'గురజాడ ఆధిక్యానికి కారణాలు', 'గురజాడ కథన శిల్పం' అనే అంశాలతో గురజాడపై ప్రసంగించాడు. 'నేటి తెనుగు కవిత: కొత్త పోకడలు', ' జేమ్స్ జాయిస్ చైతన్య స్రవంతి', 'నాకు నచ్చిన వచన శైలి', 'సాహిత్య రచన ప్రక్రియలు', 'ఏదో ఫరవాలేదు', 'తెలుగు సాహిత్యంలో గూఢత-వేమన', 'ఎందుకు వ్రాయాలి?', 'ప్రబంధాల్లోని శృంగారం', 'ఆధునిక సాహిత్యంలో ఆధ్యాత్మిక చింతన', 'సజీవ రచన', 'నా కవిత్వం' మొదలైన ఎన్నో అంశాలతోపాటు సాహిత్య వ్యక్తులైన చలం, వేంకట పార్వతీశ్వర కవుల్లో ఒకరైన బాలాంత్రపు వేంకటరావు వంటి వారి సాహిత్య సేవపై కూడా ప్రసంగించాడుశ్రీశ్రీ.

మొదటి నుండీ శ్రీశ్రీకి అరసంతో అనుబంధం ఉన్నది. మద్రాసు అరసం శాఖ ప్రారంభ సభలో పాల్గొన్నాడు. రాజమండ్రిలో మూడవ మహాసభను 31-12-1945 నాడు ప్రారంభించి ఉపన్యసించడమేగాక, 2-1-1946 నాడు 'సాహిత్యం ఎవరికి ? ఎందుకు ?' అనే అంశంపై ఏర్పాటైన సాహిత్య చర్చలో అధ్యక్షోపన్యాసమిచ్చాడు. ఐదవ మహాసభకు (1955) అధ్యక్షత వహించి ప్రసంగించాడు. ఈ సభలోనే తొలిసారిగా అరసంకు అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. 'నా శాశ్విత చిరునామా విరసం' గా చెప్పుకున్న శ్రీశ్రీకి విరసం ఆవిర్భావంలోనూ ముఖ్యపాత్ర ఉంది. మొదటి నుండీ దానికి తానే అధ్యక్షుడై ముందుకు నడిపాడు. మధ్యలో దీనికి రాజీనామా చేసి పశ్చాత్తాపపడ్డాడు. ఈ సంస్థ నిర్వహించిన దాదాపు అన్ని సభలలోనూ ప్రసంగించాడు శ్రీశ్రీ.

ఇలా అరసం, విరసం సంస్థల సభల్లోనేగాక ఆంధ్ర సారస్వత పరిషత్తు, తెలంగాణా రచయితల సంఘం, నెల్లూరులోని కవిత్రయ జయంతి సభలోనూ, ఢిల్లీ తెలుగు సాహితీ సంస్థ, హైదరాబాదులోని ఏ.జి. ఆఫీసు సాహితీమిత్రులు నిర్వహించే 'రంజని' మొదలైన ఆంధ్రప్రదేశ్ లోని సంస్థల్లోనే గాక, రాష్ట్రేతర ప్రాంతాల్లోని సంస్థల్లోనూ, అమెరికా, ఇంగ్లాండ్ వంటి ఇతర దేశాల్లోని సంస్థలందూ ప్రసంగించాడు.

పౌరహక్కుల సంఘం ఆంధ్రప్రదేశ్ విభాగానికి (1965) అధ్యక్షుడిగా ఎన్నికై ప్రతీ జిల్లాలో తిరిగి పౌరహక్కులకు పోలీసులు, ప్రభుత్వం కలిగిస్తున్న విఘాతాన్ని తన ప్రసంగాల్లో విమర్శించాడు. 1954 లో ఆంధ్రోద్యమాన్ని సమీక్షిస్తూ హైదరాబాదులో జరిగిన సదస్సులో సుదీర్ఘమైన ఉపన్యాసమిచ్చాడు. ఆంధ్రప్రదేశ్ విద్యార్థి ఫెడరేషన్ (విజయవాడ), విద్యార్థి యూనియన్ (హైదరాబాదు) వంటి విద్యార్థి సంఘాల సభల్లోనూ ప్రసంగించాడు. ఇలా సాహిత్య, రాజకీయ, వివిధ ఉద్యమాల సభల్లో పాల్గొని ప్రసంగాల్లో తన అభిప్రాయాల్ని నిర్మొహమాటంగా వ్యక్తపరిచాడు శ్రీశ్రీ.

శ్రీశ్రీ పీఠికలు రాశిలో తక్కువే అయినా, వాసిలో 'ఘాటెక్కిన గంధక ధూమాలు'. సాహిత్యంలోని దాదాపు అన్ని ప్రక్రియల పుస్తకాలకు పీఠిక రాశాడు. తన కంటే సీనియర్ కవి అయిన

కృష్ణశాస్త్రి కూడా శ్రీశ్రీతో పీఠిక రాయించుకున్నాడంటే శ్రీశ్రీ అభిప్రాయాలకు ఎంత ఆదరణ ఉందో అర్థమవుతుంది. తన సమకాలిక కవులు పఠాభి, ఆరుద్ర, కె.వి. రమణారెడ్డి వంటి వారు తమ పుస్తకాలను శ్రీశ్రీ పీఠికతో వెలువరించారు. ఇక ఔత్సాహిక కవులలో చాలా మంది శ్రీశ్రీ పీఠికా పరిచయ వాక్యాలతోనే తమ కావ్యాల్ని ముద్రించారు. ఇలా శ్రీశ్రీ చేత సమకాలిక కవులు చాలా మంది పీఠికలు రాయించుకోవడంవల్ల శ్రీశ్రీ ప్రభావం ఎంతుందో అర్థమవుతుంది. శ్రీశ్రీ తన పుస్తకాలకు కూడా స్వయంగా పీఠిక రాసుకున్న సందర్భాలూ ఉన్నాయి.

పీఠికల్లో ఆయా రచయితల పరిచయం విశేష అంశాలను పేర్కొంటూ, సందర్భం వచ్చినప్పుడల్లా సాహిత్యోద్యమాలు, రాజకీయాలు, సమసమాజ సాధన, నాస్తికత్వం, హేతువాదం వంటి పలు అంశాల్ని పేర్కొన్నాడు. శ్రీశ్రీ పీఠికల్లో రావిశాస్త్రి 'ఆరు సారా కథలు' కు రాసిన పీఠిక ప్రధానమైంది. ఇందులో 'రసన' అనే కొత్త సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు శ్రీశ్రీ. ఇంకా ఈ 'రసన' ఎవరెవరి రచనల్లో నిక్షిప్తమైందో తెలియజేశాడు.

శ్రీశ్రీ సమీక్ష ప్రక్రియ కూడా చేపట్టాడు. పుస్తకాలనేగాక సినిమాలని, నాటకాలని, పత్రికలని కూడా సమీక్షించాడు. మల్లిఖార్జున శతకము, రామదేవ శతకము, ప్రణయ సౌరభము, శ్రీ పుష్పాంజలి మొదలైన పుస్తకాల సమీక్ష రాశాడు శ్రీశ్రీ. ఇంకా విశ్వనాథ సత్యనారాయణ రాసిన కిన్నెరసాని పాటలు, కోకిలమ్మపెళ్ళి, మల్లవరపు విశ్వేశ్వరరావు రాసిన మధుకీల, కె. శివారెడ్డి 'ఆసుపత్రి గీతం' మొదలైన ప్రసిద్ధుల కావ్యాలనూ సమీక్షించాడు శ్రీశ్రీ. బుచ్చిబాబు కథలు, రుక్కాయి కథలు ఇత్యాది కథా సంపుటాలను సమీక్షించాడు శ్రీశ్రీ. మా భూమి, ముందడుగు నాటకాలనూ సమీక్షించాడు. నాటకాలను సమీక్షించేప్పుడు పుస్తకాన్ని చదివిగాక ప్రదర్శన చూసి సమీక్షించడం ఉత్తమ పద్ధతిగా శ్రీశ్రీ పేర్కొన్నాడు. యోగివేమన, మనుషులు మారాలి చలన చిత్రాలనూ సమీక్షించడం జరిగింది. 'యువ', 'కవిత' పత్రికల తీరుతెన్నులూ శ్రీశ్రీ చేత సమీక్షించబడ్డాయి. ఇలా తెలుగు పుస్తకాలనేగాక ఇంగ్లీషు పుస్తకాలను సైతం సమీక్షించాడు. సమీక్షలో స్వంతగొంతుకను పదేపదే నొక్కిచెప్పిన పరిశీలకుడు శ్రీశ్రీ.

శ్రీశ్రీ సంపాదక బాధ్యతలనూ స్వీకరించాడు. వీణ, ఆంధ్రప్రభ, నవత, ఆనందవాణి పత్రికల్లోని సంపాదక శాఖలో పనిచేశాడు. 'వీణ' పత్రిక సంపాదకుల్లో ఒకడుగా సంపాదకీయాలు రాశాడు. 'ఆంధ్రప్రభ' లో సహాయ సంపాదకుడుగా బాధ్యతలు నిర్వహించాడు. 'నవత'కు ప్రధాన సంపాదకుడుగా ఉన్నాడు. 'ఆనందవాణి' లో కూడా సంపాదక విభాగంలో కొంత కాలం పనిచేశాడు. శ్రీశ్రీ రాసిన సంపాదకీయాలన్నింటిలోనూ 'వీణ' పత్రికలో రాసిన సంపాదకీయంలో యువ కవుల్ని, నవ కవుల్ని ఆహ్వానించాడు. పత్రికా వృత్తితో అమూల్య సంపాదకీయాల్ని వెలువరించిన నిరంతర నవ నవోన్మేషణ శీలి శ్రీశ్రీ.

ఆధునిక తెలుగు కవిగా లబ్ధ ప్రతిష్ఠుడైన శ్రీశ్రీ భావాల్ని ఎప్పటికప్పుడు తెల్సుకోవడానికి జనం ఉబలాటపడేది. అందుకే పత్రికల్లో ప్రశ్న జవాబుల (ప్ర/జ) శీర్షికను శ్రీశ్రీ నిర్వహించాడు. ఏ ప్రాంతానికి శ్రీశ్రీ వెళ్ళినా అక్కడి వారు ఇష్టాగోష్ఠులు నిర్వహించి శ్రీశ్రీని ప్రశ్నల వర్షంలో ముంచెత్తేవారు. కొన్ని సంస్థలు, పత్రికలు, కొందరు వ్యక్తులతోపాటు ఆకాశవాణి కూడా శ్రీశ్రీతో ఇంటర్వ్యూ జరిపింది.

ఈనాడు, జనత, ఆంధ్రప్రభ దిన పత్రికలు; ఆంధ్రజ్యోతి, జ్వాల, జయప్రద, ప్రజారథం, ప్రగతి, తెలుగు వెలుగు వార పత్రికలు; జనశక్తి, రాజధాని; పక్షపత్రికలు, సృజన, స్పృహ మాస పత్రికలు శ్రీశ్రీ తో ఇంటర్వ్యూ జరిపాయి. ఆంధ్రజ్యోతి పత్రికలో 'ప్ర /జ' శీర్షికలో సుమారు ముప్ఫయ్ ఐదు వారాలు ప్రజలడిగిన ప్రశ్నలకు శ్రీశ్రీ జవాబులు ఇచ్చాడు.

కిన్నెర ఆర్ట్ థియేటర్, మన సాహితి, జవహర్ భారతి, నల్గొండ జిల్లా రచయితల సంఘం, సాక్షి క్లబ్ మొదలైన సంస్థలు శ్రీశ్రీతో ఇంటర్వ్యూలను నిర్వహించాయి. ఇవి కూడా పత్రికల్లో అచ్చయినవి. రేడియో కొరకు ప్రముఖ సాహితీవేత్తలు ఇంద్రకంటి శ్రీకాంతశర్మ , సుధామ గారలు ఇంటర్వ్యూలు చేసినవి క్రమంగా 1-7-79, 26–3-82 న ప్రసారమయ్యాయి.

తమ ప్రాంతానికి వచ్చినప్పుడో, ఉగాది, దీపావళి వంటి పండుగల సందర్భంగానో కొందరు వ్యక్తులు శ్రీశ్రీతో ఇష్టాగోష్ఠిగానో, పిచ్చాపాటిగానో, ఇంటర్వ్యూ కొరకు అడిగిన ప్రశ్నలకు శ్రీశ్రీ జవాబులు చెప్పాడు. ఇవి కూడా ఆ తర్వాత కొంత కాలానికి వివిధ పత్రికల్లో అచ్చయినవే. దిగంబర కవులు శ్రీశ్రీతో నవంబర్, 1969 లో ముఖాముఖి నిర్వహించారు. వీళ్ళు శ్రీశ్రీని ముప్ఫయ్ ఏడు ప్రశ్నలడిగారు. ఇది 'తెలుగు వెలుగు' (డిసెంబర్, 1969) పత్రికలో ముద్రితమైంది. శ్రీశ్రీని కన్నడ సాహిత్య పరిషత్తు (ఢిల్లీశాఖ) 50వ సమ్మేళనంలో సన్మానించింది. అక్కడే ఉన్న జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం, ప్రగతిసాహితీ సమావేశాలు ఏర్పాటు చేసిన సభల్లోను శ్రీశ్రీ ప్రసంగించాడు. అక్కడే ఢిల్లీ ఆకాశవాణిలో పనిచేసే ఏడిద నాగేశ్వరరావు గారు అప్పుడు శ్రీశ్రీతో ఇంటర్వ్యూ చేశారు. అది ఏప్రిల్, 1979 'జ్యోతి' మాసపత్రికలో ముద్రితమైంది.

నండూరి రామమోహన్‌రావు (ఆంధ్రజ్యోతి దినపత్రిక, సంపాదకులు), పురాణం సుబ్రహ్మణ్య శర్మ (ఆంధ్రజ్యోతి వార పత్రిక సంపాదకులు), వేమూరి బలరాం (స్వాతి మాసపత్రిక సంపాదకులు) గారలు 25–6-1979 నాడు శ్రీశ్రీతో ఇష్టాగోష్ఠి జరిపారు.

30–9-1979 నాడు తిరుపతిలో కాశీపతి, 19–11–1979 న జి.వి. రామారావు గారు, చంద్రశేఖర్, పసుపులేటి రామారావు, టి. ఎల్. కాంతారావు, ఆర్.వి.ఎస్. సుందరం మొదలైన

వారెందరో శ్రీశ్రీతో ఇంటర్వ్యూలను జరిపారు. ఇలా పత్రికలవాళ్ళో, సంస్థలో, స్నేహితులో అడిగిన ప్రశ్నలకు సూటిగా, చమత్కారంగా జవాబులిచ్చిన సందర్భశుద్ధిగల రచయిత శ్రీశ్రీ.

సమాజంలో జరుగుతున్న సంఘటనలకు ఎప్పటికప్పుడు తన స్పందన 'ప్రకటనలు', 'సందేశాలు' రూపంగా వ్యక్తపరిచాడు శ్రీశ్రీ. 1975 లో ప్రపంచ తెలుగు మహాసభలకు, భూమయ్య, కిష్టాగౌడ్‌లను ఉరి తీయబోయే ముందు తన నిరసనను ప్రకటన రూపంలో తెలిపాడు. కొడవటిగంటి కుటుంబరావు, చెరబండరాజు వంటి సాహితీవేత్తలు మరణించినప్పుడు సంతాప సందేశాల్ని తెలిపాడు. ఇలా తన అభిప్రాయాన్ని ఎప్పటికప్పుడు ప్రకటనలు, సందేశాలుగా తెలిపి ప్రజల పక్షపాతిగా, ప్రజాస్వామ్యవాదిగా ఋజువు చేసుకున్నాడు శ్రీశ్రీ.

'ఆత్మచరిత్రాత్మ చారిత్రాత్మక నవల' గా తన స్వీయ చరిత్రను 'అనంతం' పేరుతో రాసి అందులో తను పుట్టి పెరిగిన విశాఖ జ్ఞాపకాలతోపాటు కృష్ణశాస్త్రి, కొంపెల్ల జనార్ధనరావుల జ్ఞాపకాలనూ ఒక్కొక్క ప్రత్యేక అధ్యాయాల్లో తెలిపాడు శ్రీశ్రీ. 'జీవితంలో నా గురువులు' శీర్షికతో రాసిన దానిలో తన తండ్రి, అబ్బూరి రామకృష్ణారావులతోపాటు మరికొందరిని పేర్కొన్నాడు. 'కవిత్వంతో నా ప్రయోగాలు', 'కవిత్వ ఆరంభం' శీర్షికలతో రాసిన చోటనే గాక ఇతర చోట్ల కూడా తన రచనల గురించి తెలిపాడు. తన కష్టాలను 'రాక్షస రాత్రులు' లో వివరించాడు. ఇలా ఇరవైఆరు శీర్షికలలో తన జీవిత చరిత్రను తెలుపుతూ 'నవ్విపోదురుగాక నా కేటి సిగ్గు' అన్న చందంగా తన 'సెక్సు సరదాలు' సైతం పాఠకులకు తెల్పిన సాహిత్య సాహసి శ్రీశ్రీ.

విదేశాలకు వెళ్ళి చూసొచ్చిన తర్వాత 'విదేశ యాత్రానుభవాలు', 'చైనాయానం' పేర్లతో యాత్రా చరిత్రను రాశాడు శ్రీశ్రీ. స్టాక్ హోమ్‌లో జరిగిన ప్రపంచ శాంతి సమావేశం (1954) లో భారత ప్రతినిధుల్లో ఒకడుగా శ్రీశ్రీ పాల్గొన్నాడు. అప్పుడు లండన్, స్టాక్ హోమ్, మాస్కోలను సందర్శించాడు. 1959 లో కూడా స్టాక్ హోమ్‌కు వెళ్ళాడు. 1967 లో 'సోవియెట్ లాండ్ నెహ్రూ అవార్డు' అందుకోడానికై రష్యాకు వెళ్ళే అవకాశం వచ్చింది శ్రీశ్రీకి. చైనాకు వెళ్ళే అవకాశం రెండు సార్లు వచ్చినా మొదటిసారి (1953) పాస్‌పోర్ట్ లభ్యంకాక వెళ్ళలేకపోయినా, రెండో సారి 1976లో వచ్చిన అవకాశాన్ని మాత్రమే వాడుకోగలిగాడు. ఎక్కడికి వెళ్ళినా తను చూసిన ప్రాంత ప్రత్యేకతలను కళ్ళకు కట్టినట్టు వివరించిన యాత్రా చరిత్ర రచయిత శ్రీశ్రీ.

తన ఎదుటలేని వాళ్ళకు తన భావాల్ని, ఆలోచనా విధానాల్ని ఎప్పటికప్పుడు 'లేఖ' ల ద్వారా తెలియపరిచే వాడు శ్రీశ్రీ. అందులో సాహిత్య విషయాల్ని తెలుపుతూగానీ, చర్చల్లో పాల్గొంటూ ఉదయిని, విశాలాంధ్ర, ఆంధ్రపత్రిక మొదలగు పత్రికలకు లేఖలు రాశాడు. తన సాహితీమిత్రులైన జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, పురిపండా అప్పలస్వామి, సోమసుందర్, ఆరుద్ర, చలసాని ప్రసాద్

వగైరాలెందరికో లేఖలు రాశాడు. ఎలక్షన్లో నెగ్గినప్పుడు నంబూద్రిపాద్‌ను అభినందిస్తూ లేఖ రాశాడు శ్రీశ్రీ. విరసం కవుల్ని అరెస్టు చేసినప్పుడు హోమ్ మంత్రికి రాసిన లేఖలో పాలకుల పరిపాలనాతీరును విమర్శిస్తూ లేఖ రాశాడు. ఈ విధంగా 'లేఖా సాహిత్యం' లో తెలుగు సాహిత్య విషయాలేగాక నాటి రాజకీయ, సామాజిక అంశాలపై తన దృక్పథాన్ని వివరించాడు శ్రీశ్రీ.

ఇలా వివిధ వచన ప్రక్రియల్లో రచనలు చేసిన శ్రీశ్రీ కవిత్వంలో ఏ విధంగా ప్రయోగాలు చేశాడో అదే విధంగా వచనంలోనూ వైవిధ్యపూరితమైన ప్రయోగాలు చేసి చూపాడు. "పద్యం / ఎక్కువా లేక గద్యం / ఎక్కువా అనే సమస్య అభేద్యం / ఐనా ఘంటా వాద్యం / గా నేనంటానీ రెండూ నాకే నైవేద్యం"[11] అని చెప్పుకోవటమేగాక "వచన రచన వ్యవసాయం వంటిది"[12] అని భావించి "...వచనంలోని నవ్యత్వం రుచి భేదాలను చదును చెయ్యక తప్పదు"[13] అనే దృక్పథంతో తెలుగు వచన సాహిత్య క్షేత్రాన్ని సుసంపన్నం చేసిన 'శ్రీశ్రీ వచన రచనల విన్యాసా'న్ని ముందు విభాగాల్లో సవివరంగా చర్చిస్తాను.

రెండో అధ్యాయం

# కథా సహిత సాహిత్యం

"కథయినా, కావ్యమైనా, నవలైనా, నాటకమైనా, కళారూపం ఏదైనా సున్నితంగా ఏరోడ్రోము నుంచి బయల్దేరే విమానంలాగా ప్రారంభించి ప్రయాణం యావత్తూ దూరమైనా, చేరువైనా సాగించి తుదకు సురక్షితంగా గమ్యస్థానంలోకి దిగాలి. విమాన చోదకుడిలాగా కళా కారుడెక్కడా కనపడకూడదు."

- శ్రీశ్రీ

(మన గురజాడ, పుట - 52 & 53)

# కథా సహిత సాహిత్యం

ప్రాచీన కావ్య ప్రబంధాల్లోని 'కథ' రానురాను వచన రచనల్లోకి మారింది. మొదట పద్య నాటకాలు ఉన్నా తర్వాత కాలంలో పూర్తి వచన రచనగా రూపాంతరం చెందింది. 'కథ' కూడా వచనంతో 'కథానిక'గా మారింది. నవల మాత్రం మొదటి నుండి పూర్తి వచన ప్రక్రియనే. ఈ ప్రక్రియలు తెలుగులో పాశ్చాత్య భాషా సాహిత్యాల పరిచయం వల్లే ఆధునికంగా ఆరంభమై, ఆధునిక కథానిక, నాటకాలను గురజాడ అప్పారావు, నవలను వీరేశలింగం పంతులు ఆరంభించిన తర్వాత ఇవి ఎంతగానో వికసించాయి. తెలుగు కథానిక దిన దినం అభివృద్ధి చెంది జాతీయ (కేతు విశ్వనాథరెడ్డి), అంతర్జాతీయ (పాలగుమ్మి పద్మరాజు, పురాణం సుబ్రహ్మణ్యశర్మ) స్థాయిల్లో అవార్డులను పొందుతుండగా, నవల పూర్తి వ్యాపార ప్రక్రియగా చలామణిలో ఉంది. నాటక ప్రక్రియ జనాదరణ లేక కుంటుతున్నది.

కథాత్మక సాహిత్య ప్రక్రియలైన నవల, కథ, నాటకాలలో విశ్వనాథ, కృష్ణశాస్త్రి, చలం, శ్రీశ్రీ వంటివారు ఎన్నో రచనలు సృజించారు. ప్రయోగమే ప్రాణంగా భావించి ఈ మూడు ప్రక్రియల్లోనూ వినూత్న ప్రయోగాలు చేసి, తెలుగు కథాత్మక సాహిత్యంలో తనదంటూ ఒక విశిష్ట స్థానాన్ని ఏర్పరుచుకున్న ప్రముఖ కవి శ్రీశ్రీ రచనలు ఇక్కడ పరిశీలించడం జరుగుతుంది. కథాత్మక సాహిత్యంలో మొదట నవలా ప్రక్రియ చేపట్టాడు. ఆ తర్వాత కథ, నాటక ప్రక్రియల్లో క్రమంగా రచనలు చేసినందున ఇదే వరుసలో వివరిస్తాను.

# నవలలు

పదేళ్ళ ప్రాయం (1920) నుండి దాదాపు పదిహేనేళ్ళ (1925) దాకా శ్రీశ్రీ, "ఎక్కువగా వచనం ముఖ్యంగా డిటెక్టివ్ నవలలు చదువుతుండే....."[1] వాడినని తన స్వీయ చరిత్రలో చెప్పుకున్నాడు. ఇవి చదివే రోజుల్లోనే 'గోకులాయి' (1918), 'వీరసింహ విజయసింహులు' (1920), 'పరిణయ రహస్యము' (1924) నవలల్ని రాశాడు. వీటిలో మొదటి రెండు నవలలు అముద్రితాలు. రాత ప్రతులు కూడా లభించలేదు. మూడోనవల మాత్రం ముద్రితమైంది. దాన్ని ఇటీవలే 'తూర్పు సీమ' పత్రిక వెదకి పట్టుకుంది.[2] ఈ నవలల తర్వాత ఇరవైమూడు సంవత్సరాలకు (1947) 'సుదర్శనలోకం' రాశాడు. మిహయిల్ షోలొహోవ్, దొస్టొవస్కిలు రాసిన నవలల్ని క్రమంగా 'మానవుడి పాట్లు', 'నేరము-శిక్ష'లుగా అనువదించాడు. 'నేరము-శిక్ష' అసంపూర్ణానువాదం కాబట్టి ఈ పరిశోధన పరిధిలోకి స్వీకరించలేదు.

'అనంతం' పేరుతో రాసిన స్వీయ చరిత్రను ' ఆత్మచరిత్రాత్మ చరిత్రాత్మక నవల'గా టైటిల్ పేజీలో పేర్కొనడమేగాక "ఇది నా ఆత్మచరిత్ర. ఇక చారిత్రక క్రమంలో ఈ రచన సాగించాలనుకున్నాను. చిన్నప్పటి జ్ఞాపకాలు, అందులోకి మరీ చిన్నప్పటి జ్ఞాపకాలు, అసత్యాలూ, అభూత కల్పనలూ లేకుండా రాయాలని నా సంకల్పం. ఇక వాస్తవానికి చిలవలూ పలవలూ కల్పించి రాసుకుపోతే ఆ రచన చదవటానికైతే బాగానే ఉండవచ్చును. ఒక గొప్ప నవలగా కూడా అది చలామణీ కావచ్చును కాని నేను రాస్తున్నది అటువంటి నవల కాదు"[3] అనడంవల్ల ఇది 'జీవిత చరిత్ర' గా స్ఫురిస్తున్నందుక దీన్ని ఇక్కడ గాకుండా 'జీవిత చరిత్ర' విభాగం (Chapter) లో వివరించాను.

శ్రీశ్రీ రాసిన పరిణయ రహస్యము, ఆదర్శజీవులు, మానవుడి పాట్లు నవలల్లో మూ విభిన్నమైన ఇతివృత్తాలున్నాయి. కాబట్టి వీటిని క్రమంగా విశ్లేషిస్తాను.

## పరిణయ రహస్యము

శ్రీశ్రీ రచనల్లో ముద్రితమై, దొరకుతున్న వాటిల్లో మొదటిది 'పరిణయ రహస్యము'. దీన్ని 1924 లో 'ఆంధ్ర సంజీవనీ గ్రంథమాల' వారు ప్రచురించారు. ఇది ఇటీవలి వరకు లభ్యం కాలేదు. అందుకే దీని గురించి శ్రీశ్రీ "…. నా 'పరిణయ రహస్యము' (అపరాధ పరిశోధక నవలిక) పుస్తకం ఇప్పుడెక్కడా దొరకదు. దీనికోసం ఎందరో మిత్రులు గాలిస్తున్నారు. దొరకుతుందనే ఆశ లేదు"[4] అని నిరాశ చెందాడు. కానీ ఈ నవల దొరికినట్లు 'తూర్పుసీమ' పత్రికవాళ్ళు ఈ మధ్య ప్రకటించడమే గాక మొదటి ప్రకరణం కూడా అచ్చేశారు.[5]

'పరిణయ రహస్యము' అపరాధ పరిశోధన నవలిక. ఇందులో పది ప్రకరణాలున్నాయి. వీటకి పేర్లు కూడా పెట్టాడు. ఈ నవలలో నారాయణరావు, కృష్ణారావు, రాఘవయ్య, రామమోహనరావు, రాజారావు, ఆనందరావు, కామేశ్వరరావు, పద్మనాభరావు (బంగారమ్మ), దత్తు, కాంతమ్మ మొదలైనవి ముఖ్య పాత్రలు. కృష్ణారావు పరిణయం చేసుకోవడం ఇందులోని ఇతివృత్తం. ఇతను పెళ్ళి విషయంలో మోసపోవడంతో కథ ఎన్నో మలుపులు తిరిగి చివరికి సుఖాంతమవుతుంది.

నారాయణరావుకు లేక లేక కలిగిన ఒకే ఒక్క సంతానం కృష్ణారావు. ఇతని పెళ్ళికై ఎన్నో సంబంధాలు వచ్చినా రూపంతో పాటు విద్య కూడా ఉన్న స్త్రీ దొరకనందువల్ల ఎంతకూ పెళ్ళి కుదరలేదు. ఒకనాడు రాఘవయ్య వచ్చి తన కూతురు మొదటి ఫారం వరకు చదివిన విద్యావంతురాలేగాక ఎంతో సౌందర్యవంతురాలని చెప్పి, ఆమె ఫోటోను నారాయణరావుకు ఇచ్చి వెళ్ళిపోతాడు. కృష్ణారావు ఆ పెళ్ళికి అంగీకరిస్తాడు. వివాహము సింహాచలకొండపై జరపడానికి నిశ్చయమవుతుంది. పెళ్ళికి ఒక రోజు ముందు అమ్మాయి (రాఘవరావు) వారు 'పెళ్ళి కొడుకు' వారి నగలు డబ్బుతో సహా పరారవుతారు. వీరిని పట్టుకోవడానికై డిటెక్టివ్ రామమోహనరావును కలుస్తాడు నారాయణరావు. రామమోహనరావు తన బావ కూతురు పెళ్ళికై రాజమహేంద్రవరం వెళ్ళి వచ్చిన తర్వాత ఈ నేర పరిశోధన చేపడతానని నారాయణరావుతో చెబుతాడు. తాను కూడా రాజమహేంద్రవరంలో ఒక కోర్టు కేసుకు వెళ్ళవలసి ఉన్నందున అక్కడికి రేపు వస్తున్నట్లు చెప్పాడు నారాయణరావు. అక్కడ ఇద్దరూ కల్సుకోడానికి నిర్ణయించుకుంటారు.

నారాయణరావు, కోర్టు కేసు కాగితాలు సర్దుతుండగా వాటిలో రాఘవయ్య ఇచ్చిన తన కూతురు (పెళ్ళి కూతురు) ఫోటో దొరకగా, దాన్ని తన వెంట రాజమహేంద్రవరానికి తీసుకు వెళ్తాడు. రామమెహనరావు రైల్వేస్టేషన్‌కి వచ్చి, నారాయణరావును తన బావ కామేశ్వరరావు యింటికి తీసుకుపోతాడు. వీరిద్దరూ ఇంటికి చేరేలోగా, ఒక వ్యక్తి (దత్తు) కామేశ్వరరావు దగ్గరి కొచ్చి మీ కుమారుడు నా దగ్గరున్నాడు, నాకు వెయ్యి రూపాయలిస్తే, మీ కొడుకును మీకు అప్పగిస్తానని

చెప్పగా, కొడుకు దొరుకుతున్నందుకు సంతోషించి వెంటనే తీసుకురమ్మంటాడు. వచ్చిన ఆ వ్యక్తి పద్మనాభరావును తీసుకురావడానికి వెళ్తాడు.

నారాయణరావును తీసుకొని రామమోహనరావు రాగానే దొరకబోతున్న తన కొడుకు పద్మనాభరావు గురించి చెబుతాడు కామేశ్వరరావు. ఆ ఇంట్లో గోడకు వ్రేలాడ దీసిన ఒక ఫోటోలోని పద్మనాభరావే, తన కొడుకుకు చేసుకోవాలనుకుని మోసపోయిన అమ్మాయి అని నారాయణరావు తన దగ్గరున్న ఫోటోను రామమోహనరావు కిచ్చి జరిగినదంతా చెప్పి, పద్మనాభరావును తీసుకొచ్చే వ్యక్తికి, తను మోసపోయిన సంఘటనకు సంబంధం ఉంటుందని నారాయణరావు ఊహించి, ఈ విషయమంతా రామమోహనరావుకు చెబుతాడు. పద్మనాభరావును తీసుకు వచ్చిన వ్యక్తిని బంధించి అడగగా, అతను ఇది చేయించింది రాఘవరావని చెప్పి, అతను నరసీపట్నంలోని ఆనందరావు ఇంట్లో ఉన్నట్లు చెపుతాడు. ఇతన్ని పోలీసుల ద్వారా విశాఖపట్టణం పంపి రామమోహనరావు, నారాయణరావులు ఆనందరావుకై నరసీపట్నానికి బయలుదేరుతారు. అక్కడ అతన్ని వెదకి పట్టుకోగా పోగొట్టుకున్న డబ్బు, నగలు అతని దగ్గర దొరకుతాయి. ఈ ఆనందరావు ద్వారానే రాఘవరావు కూడా దొరకుతాడు. ఈ విధంగా నారాయణరావు పోగొట్టుకున్నవి తిరిగి లభించడము, పెళ్ళి తప్పిపోయిన అతని కొడుకు కృష్ణారావుకి విద్యా, అందం ఉన్న అమ్మాయితో పెళ్ళి జరగడంతో కథ సుఖాంతమవుతుంది. ఇదీ 'పరిణయ రహస్యము' కథ.

1924 లో అచ్చయిన ఈ నవలికలోని కొన్ని అక్షరాలు ఇప్పటికంటే భిన్నంగా ఉన్నాయి. ఉదాహరణకు వలపల గిలకను వాడడం. శీర్షికగా అచ్చేసినప్పుడు 'స్వర్ణాభరణము' అనీ, ఇతర చోట్ల 'స్వణాౕభరణము' అని వలపల గిలక సంప్రదాయంతో అచ్చేశారు. ఇదేగాక 'వొ' ను 'వొ'గాను (దాచితివొ, పోయినవొ), 'నొ' ను 'నొ' గా (నొకటి, నొక్కొక్కరే) లిపి తేడా కూడా కన్పిస్తుంది. పదాల వాడకంలో 'ఉంచబడిన' పదాన్ని 'నుంపబడిన' అనీ ; 'శిక్ష పడునట్లు చేసెను' అనేది 'విధిపించెను', 'వెళ్ళి పోయెను' పదానికి బదులుగా 'నచ్చోట బాసియెను' గా ప్రయోగించాడు. 'ఆశ్చర్యపడి' పదాన్నిగాక 'యద్భుతపడి' అని ఈరకంగా కొన్ని పదాలు అర్థంలో, ఇంకొన్ని పదాలు లిపిలో భిన్నంగా ఉన్నాయి.

'పరిణయ రహస్యము' లో "ఆ మఱునాటి మధ్యాహ్నము సూర్యుడు చండతార తేజస్సంపన్నుడై గగనమున నర్థభాగమునకుఁబైఁగా ప్రయాణము సాగించెను"[6] అనే రీతిలో అక్కడక్కడ వర్ణనలు కన్పిస్తాయి.

శ్రీశ్రీ రచనల్లో సర్వ సాధారణంగా పాత్రలకు పేర్లు పెట్టక మొదటివాడు, రెండవవాడు వంటి సర్వనామాలను వాడాడు. ఈ లక్షణం, శ్రీశ్రీ రచనల్లో లభిస్తున్న వాటిల్లో మొదటిదైన 'పరిణయ రహస్యము' నుండే మొదలైంది. ఇందులోని ఐదవ ప్రకరణలో రాఘవయ్య, దత్తు పాత్రలు సంభాషించుకున్నప్పుడు మొదటివాడు, రెండో వాడుగా పాత్రలను పేర్కొన్నాడు.

ఈ నవలికను శ్రీశ్రీ తన (14వ ఏట) బాల్య దశలోనే రాశాడు. అప్పటికే శ్రీశ్రీకి లోకం తీరు తెలుసన్నది ఈ రచనను బట్టి తెలుస్తుంది. "లోకమున సామాన్యముగా దమ కూతులకీ యెవ్వరైన వరునన్వేషింతురు గాని మన నారాయణరావు కుమారునికే వధువు నన్వేషింపవలసి వచ్చెను"[7] అని చెప్పిన వాటివల్ల ఆనాటి సమాజంలో వధువరుల అన్వేషణ ఎలాఉందో తెలుస్తుంది. ఇలా ఈ నవలికలో అక్కడక్కడ నాటి సమాజ స్థితిగతులు కూడా స్పృశించబడ్డాయి. కానీ భాష విషయంలో ఆధునికత కనిపించదు.

## ఆదర్శజీవులు

'ఆదర్శజీవులు' వివిధ రచయితలు రాసిన నవల. శ్రీశ్రీతో పాటు కొడవటిగంటి కుటుంబరావు, పాలగుమ్మి పద్మరాజు, మునిమాణిక్యం నరసింహారావు, గోపీచంద్, చింతాదీక్షితులు ఈ నవలను రాశారు. వీరిలో ఒక్కొక్కరు ఒక్కొక్క అధ్యాయం రచించారు. దీన్ని ఆకాశవాణి వారు రాయించి ప్రసారం చేశారు.

'ఆదర్శజీవులు' నవలలో 'సుదర్శనం : లోకం' అనే అధ్యాయాన్ని శ్రీశ్రీ రాశాడు. అందులో నాయకుడు సుదర్శనం, నాయిక శకుంతల రెండు పాత్రలే ఉన్నాయి. ఇది ఉత్తమ పురుషలో సాగింది. ఒకనాడు తనకు సంతానం కలుగబోతుందని విన్న సుదర్శనం "ఇంకో ప్రాణిని తీసుకొచ్చి ఏంలాభమని" ఆలోచిస్తుంటాడు. ఆరాత్రి ఎంతకూ నిద్ర పట్టదు. ఐనా కళ్ళుమూసుకుంటే మూడు ప్రపంచాలు కన్పిస్తాయి. అవి: అతని తండ్రిది, తనది, తన కొడుకుది. ఈ మూడు తరాల్ని భూత, వర్తమాన, భవిష్యత్కాలాలుగా చెప్పి, లోకంలో జరుగుతున్న ఎన్నో పరిణామాలు మనిషి ప్రమేయం లేకుండానే జరుగుతున్నాయని పేర్కొని "... దీన్ని నేను ప్రారంభించలేదు. కాని, నా ఇష్టా నిష్టాలతో నిమిత్తం లేకుండా ఇది సాగిపోతుంది. ఆగిపోతుంది. యావత్ప్రపంచం మీదా దీని ప్రభావం పనిచేస్తుంది. ఈ యుద్ధపు వానలో తడియని వాళ్ళెవ్వరూలేరు"[8] అని తన చాలా రచనల్లో యుద్ధ ప్రసక్తి తెచ్చినట్లుగానే ఇందులోనూ ప్రస్తావించాడు. లోకంలో తన గురించి చెబుతూ "లోకం! విశ్వం! లోకం పరిమితం. విశ్వం అనంతం. లోకంలో నా జీవితం పరిమితం. విశ్వంలో నా ఆత్మ అనంతం"[9] అని విచిత్రంగా వ్యాఖ్యానించాడు.

"మళ్ళీ మూడు లోకాలు తలపుకొచ్చాయి. అక్కడలేని మా నాన్న, అక్కడవున్న నేను, అక్కడ వుండీ లేనట్లున్న లేక ఉన్నట్లున్న నా కొడుకూ, ప్రతి క్షణమూ, నేనూ, మానాన్న, నా కొడుకూ పెరుగుతూనే ఉన్నాము. చిట్ట చివరికి మేమింకా మృత్యువు వైపుగానే పెరుగుతున్నప్పటికీ ఎందువల్లనో మా నాన్న మరణం దిక్కుగానూ, నా కొడుకు జీవితం దిక్కుగానూ ఎదుగుతున్నారనిపించింది"[10] అని చెప్పిన దానిలో ముగ్గరూ మృత్యువు వైపు పెరుగుతున్నట్లుగా

కన్పిస్తుంది. శ్రీశ్రీ చాలా రచనల్లో మృత్యు ప్రసక్తి ఉన్నట్లుగానే ఇందులోను ఉంది. తన తండ్రి ప్రపంచంలో ఎన్నో మోసాలుండడంవల్ల దాన్ని గర్హిస్తూ, తన కాలంలోని వాటిపై కూడా సంతృప్తి ఉండదు. ఈ విషయాలు తెలియజేస్తూ తనకు పుట్టబోయే శిశువుకు రాసిన లేఖలో తన ఆలోచనలకు, ప్రపంచపు ఆలోచనలకు తేడా ఉండడంవల్ల అడుగడుగునా, ఘర్షణకు గురవుతున్నట్టుగా రాశాడు. అంతే గాక భవిష్యత్తు ఇప్పటి కంటే ఎక్కువ ఉజ్వలంగా ఉంటుందని భవిష్యత్తుపై అమితమైన నమ్మకాన్ని వ్యక్తీకరించాడు. ఈ విధంగా శ్రీశ్రీ ఆలోచనలు 'సుదర్శనం' పాత్రలో కన్పిస్తాయి.

**మానవుడి పాట్లు**

ఇది అనువాద నవల. రష్యా రచయిత మిహాయిల్ షొలొహొవ్ రాసిన 'ది ఫేట్ ఆఫ్ ఎ మ్యాన్' నవల దీనికి మూలం. ఇందులో కథ ఉత్తమ పురుషలో నడిచింది. దీనిలో ప్రధానంగా జర్మన్, రష్యన్ల మధ్య జరిగిన యుద్ధానికి సంబంధించిన పరిస్థితులు వర్ణితమైనాయి. ఈ నవలా నాయకుడు నికొలోవ్. ఇతను సైన్యంలో డ్రైవరు. యుద్ధంలో శత్రుసైనికులకు పట్టుబడతాడు. ఆయనలా పట్టుబడిన సైనికుల జీవిత విధానమే ఇందులోని ఇతివృత్తం.

శత్రువులకు దొరికిన సైనికులను చిత్రహింసలపాలు చేసి వాళ్ళు నడవలేక పడిపోతే షూట్ చేసి ఘోరంగా చంపడాన్నీ మిగిలినవాళ్ళ చేత దినమంతా రాళ్ళు పగుల గొట్టించి, తినడానికి మాత్రం రంపపు పొట్టు కలిపిన పిండి రొట్టెలనుపెట్టి తినిపించేవారని, నోటికొచ్చిన బూతులను తిట్టి బూటుకాళ్ళతో తన్నే విధానాన్ని హృదయ విదారకంగా చిత్రించాడు శ్రీశ్రీ.

నవలా సాహిత్యంలోకి అడుగిడిన తొలి రోజుల్లో నవలలని ఎక్కువగా చదవడమేగాక తనూ సృజించిన వాటిల్లో లోకం తీరు మనుషుల ప్రవర్తన వారి మానసిక స్థితిగతులు, యుద్ధ వ్యతిరేకత, భవిష్యత్తుపై ఆశ, మానవతాదృక్పథం ప్రధానంగా కన్పిస్తాయి.

# కథానికలు

> "ఆ యేడు (1910) గురజాడ మొట్ట మొదటి సారిగా ముత్యాలసరాల రచన చేశాడు. అనేకానేక సంవత్సరాల తర్వాత మళ్ళీ ఒక తోక చుక్క కనబడడం ఆయేడే. ధూమకేతువును అందరూ అరిష్టదాయకంగా భావిస్తే గురజాడ దాన్ని దూర బంధువుగా గుర్తించాడు. ...అదే యేడే బరంపురంలో నానా జాతి భోజనం. అలాగే ఇంకా ఎన్నో చరిత్ర ప్రసిద్ధమైన సంఘటనలు ఆయేడే జరిగాయి. . . . "[11]

అని శ్రీశ్రీ చెప్పిన వాటితో పాటు తెలుగులో ఆధునిక కథానికా ప్రక్రియ ఆయేడే ఆరంభమైంది. కథా ప్రక్రియలో గురజాడ రాసిన 'దిద్దుబాటు' తొలి కథానిక. ఇది ఫిబ్రవరి, 1910 (ఆంధ్ర భారతి) లో ముద్రితమైంది. ఆ తర్వాత సరిగ్గా రెండే రెండు నెలలకు 30-4-1910 నాడు శ్రీశ్రీ పుట్టాడు.[12] దీన్నిబట్టి ఆధునిక తెలుగు కథానిక, శ్రీశ్రీల వయస్సు దాదాపు ఒకటేనని చెప్పకోవచ్చు.

శ్రీశ్రీ కథలు రాసే నాటికే గురజాడ అప్పరావు, గుడిపాటి వెంకటచలం, చింతాదీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి, అడవి బాపిరాజు వంటి గొప్ప కథకులున్నారు. వీరి కథలతో పాటు సర్ ఆర్థర్ కానన్ డాయిల్, చార్లెస్ డికెన్స్ వంటి ఇంగ్లీషు రచయితల కథా సాహిత్యమూ చదివాడు. ఈ కథలను చదవడానికి ముందే చిన్న తనంలో రామాయణ, మహాభారత కాశీమజిలీ కథలను తాత తండ్రుల ద్వారా విన్నాడు. ఈ కథలను తిరిగి తన తోటి పిల్లలకు చెప్పేవాడు.[13] శ్రీశ్రీలో చిన్న తనం నుంచే కథలు చెప్పేగుణానికిది నిదర్శనం. ఈయన సైన్సుతో బి. ఏ. చదివాడు. విద్యార్థిగా ఎన్నో సైన్సు ప్రయోగాలు చేశాడు. బహుశా అప్పటి నుండే శ్రీశ్రీలో ప్రయోగపరత్వం ఆరంభమై ఉంటుంది. విజ్ఞాన శాస్త్రంలో లాగే సాహిత్యంలోనూ ప్రయోగాలు అవసరమనే భావనతో "నిత్య నూతన ప్రయోగాల వల్లనే సాహిత్యం కూడా సైన్సులాగే అభివృద్ధి చెందుతుంది. పాత ప్రక్రియనే పట్టుకు కూర్చుంటే సైన్సయినా సాహిత్యమైనా స్తంబించి పోక తప్పదు"[14] అని నిర్ధారించి లక్ష్యంగా కవిత, కథ, నాటక, జీవిత చరిత్ర మొదలైన ప్రక్రియల్లో ఎన్నో ప్రయోగాలు చేసి చూపాడు. అంతేగాదు "ఏదో

కొత్తదనం కొసమే ఎల్లప్పుడూ నా అన్వేషణ"[15] అని కూడా చెప్పుకున్నాడు. వినూత్నత్వంతో రాసిన శ్రీశ్రీ కవిత్వపాదాల్ని తర్వాతి కథా రచయిత లెందరో శీర్షికలుగా వాడుకున్నారు.[16] అదే విధంగా కథారచనలో కూడా కొత్తదనం కన్పిస్తుంది. కథానికా ప్రక్రియలో 'చైతన్య ప్రవంతి' ధోరణి శ్రీశ్రీ ప్రవేశపెట్టి తెలుగులో దానికి ఆద్యుడైనాడు.[17] పలు ప్రయోగాలతో, వినూత్న రీతులతో రాసిన కథలను పరిశీలిద్దాం.

**కథల విభజన**

శ్రీశ్రీ మొట్టమొదటి కథ 'చిత్ర రహస్యము' (1928 జూలై 'భారతి' మాస పత్రిక). ఈ కథకు సర్ ఆర్థర్ కానన్ డాయిల్ రాసిన 'షెర్లాక్ హోమ్స్ కథలు' మూలం. దీన్ని బట్టి అనువాద కథతో కథానిక రంగంలోకి శ్రీశ్రీ ప్రవేశించాడని చెప్పుకోవచ్చు. 'చావు పుట్టుకా' (అక్టోబర్ 1978–జనవరి 1979 'అరుణతార' మాస పత్రిక) కథ ఇంతవరకు దొరికిన శ్రీశ్రీ కథల్లో చివరిది. ఈ రెండు కథల ఆధారంగా 1928–1978 ల మధ్య కథలను రాశాడని తెలుస్తుంది. ఈ ఏభై ఏళ్ళలో నలభై కథల దాకా రాశాడు. ఈ కథలు ప్రత్యేకమైన విభజనకు లొంగవు. చాలా కథల్లో ఒక విధానం (Uniformity) కనిపించదు. అంతేగాక తాను కథని రాస్తున్నాననే ప్రస్తావనని చాలా కథల్లో వ్యక్తం చేశాడు. ఇలాంటి కథా ప్రస్తావన ఉన్న కథలు, కథా ప్రస్తావనలేని కథలు అని రెండు విధాలుగా విభజించవచ్చు. ఈ విధంగా కథా ప్రస్తావనతో విభజించడం అంత మంచిది కాదేమో. ఇదే విధంగా కథల మీద కథ. ఇక ఇతివృత్తాన్ని బట్టి చూస్తే సాంఘికాలు, జానపద, డిటెక్టివ్ మొదలైనవి ఉన్నాయి. ఈ రకం విభజనతో చూస్తే ఒకే ఒక డిటెక్టివ్ కథ (చిత్ర రహస్యం) ఉంది. పైగా అది అనువాద కథ. అందువల్ల ఈ ఒక్క కథ కోసం 'డిటెక్టివ్ కథా విభాగం' ఏర్పర్చడం సబబుగా ఉండదు. 'మొహబ్బత్ ఖాన్' అనేది జానపద కథగా, చారిత్రకంగా ఎప్పుడు జరిగిందో కథలో చెప్పబడింది. అందువల్ల దీన్ని జానపదం అనో, చారిత్రికమనో ఏ ఒక్క దానిక్రింద విభజించలేం. శ్రీశ్రీ కథల్ని సాంఘికాలుగా వింగడిస్తే కొన్ని (శూర్పణఖా మాన సంరక్షణం, పంచపాండవులు మొదలైనవి) కథలు పౌరాణికానికీ, సాంఘికానికీ లొంగవు. కాబట్టి మొత్తం మీద ఇతివృత్తాన్ని బట్టీ కథల్ని విభాగించడం సాధ్యం కాకుండా ఉంది. శైలిని బట్టి చైతన్య ప్రవంతి, చైతన్య ప్రవంతేతర ధోరణి కథలుగా గానీ, ఉత్తమ పురుష, ప్రథమ పురుషల్లో చెప్పిన కథలుగా గానీ విభజించాలి. అయితే ఈ విధమైన వింగడింపుతో ఎక్కువ ప్రయోజనం ఉండదు. పాత్రల ననుసరించైతే శ్రీశ్రీ కథల్లో చాలా నాయక పాత్రలకు సాహిత్య కళతో గానీ, ఇతర కళలతో గానీ పరిచయముంటుంది. దీన్ననుసరించి కళాకారులు (ఒసే తువ్వాలు అందుకో, కవి సన్మానం మొదలైన కథలు), కళాకారేతరులైన నాయక పాత్రలున్న (ఐశ్వర్యం ఎదుట దారిద్ర్యం, చావూ – పుట్టుకా మొదలైనవి) కథలుగా విభజిస్తే కొన్ని కథలు నాయకుడే లేనివైతే (పంచ పాండవులు, శూర్పణఖా మాన సంరక్షణ మొదలైనవి), మరి కొన్ని కథల్లో తానే (రచయితే)

నాయకుడు (క్షణంలో సగం, కరక్కాయ ముక్క - అరక్కాయ కుక్క మొదలైనవి). ఓ కథలో తన కవితలోని పాత్రే ప్రధాన పాత్ర (హేమంతం). ఇంకొన్ని కథల్లో ఒకే ఒక్క పాత్ర చుట్టూ కథంతా నడుస్తుంది. (సీతయ్య, బక్కల, చరమరాత్రి మొదలైనవి). కేవలం జంతువులే పాత్రలుగా గల కథ (కపీశ్వరుడు), జంతువూ, మనిషి కలిసి పాత్రలుగా ఉన్న కథలు (చిన్నబాబు, కుర్రాడు - చుంచెలుకా, వింత జంతువు), మరికొన్ని కథలైతే అసలు పాత్రలు లేకుండానే నడిచినవి. (అనామిక, సశేషము మొదలైనవి) ఇట్లా పాత్రల పరంగా కూడా శ్రీశ్రీ కథల్ని విభజించడంవల్ల అనేకానేకమైన చిక్కులున్నాయి. బహుశా దీనికి కారణం రొటీన్ కథా సృజన శ్రీశ్రీకి నచ్చక పోవడమేనని ఊహించవచ్చు. ఎందుకంటే "జీవితంలోనూ, కవిత్వంలోనూ నాకు ఇమిటేషన్ అంటే ఇష్టంలేదు. ఇన్వెన్షన్ కోసమే ఎప్పుడూ అన్వేషిస్తాను. ఇన్వెన్షన్ కాకున్నా కనీసం ఇన్నోవేషన్‌కోసం ! . . ."[18] అని తన కవిత్వాన్ని గూర్చి చెప్పినా, అది ఆయన కథలకూ వర్తిస్తుంది. అందువల్లే తనకు ముందు తెలుగు 'కథానిక' ఉన్న తీరుగా గాక తనదంటూ ఒక ప్రత్యేక తరహాగా ఎక్కువ కథలను రాశాడు. అందుకే కె.వి. రమణారెడ్డి, శ్రీశ్రీ కథల గురించి "శ్రీశ్రీ కథలు కథలే కావు. . . . వాటి సుపరిచిత స్వరూపం, వాటి లక్షణం వాటికి అగుపించి అన్వయించదు. ఇవి పూర్తిగా అతని ఇచ్ఛాదీనాలు. ఆ ఇచ్ఛ ఒక్కొక్కప్పుడు పరమ నిరంకుశమైన స్వేచ్ఛ. దానికి అది వాస్తవిక స్పర్శ సమకూరితే మరి చెప్పవలసిన పని ఉండదు. . ."[19] అని చెప్పిన దానివల్ల 'నిరంకుశః కవయః' అన్నది శ్రీశ్రీలో బాగా ఉన్నట్టనిపిస్తుంది. ఇది కేవలం శ్రీశ్రీ కవితల్లోనే గాక కథల్లోనూ చూడొచ్చు. అందుకే శ్రీశ్రీ కథలు పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో రాసినవి. వీటిని స్వంత కథలు, అనువాద కథలని విభజిస్తే కొంతలో కొంత ఔచిత్యంగా ఉంటుంది. అందుకే స్థూలంగా శ్రీశ్రీ కథల్ని ఈ విధమైన విభజనతోనే వింగడించడం జరుగుతుంది.

**స్వంత కథలు**

శ్రీశ్రీ రాసిన స్వంత కథల్లో దొరికినంత వరకు 'సశేషము' మొదటిది.[20] ఇది అచ్చయ్యేనాటికి (జూన్, 1929) శ్రీశ్రీ మద్రాసులో బి. ఏ. చదువుతున్నాడు. అప్పటికే 'సావిత్రి సత్యవంతులు' పద్య నాటకం, 'వీరసింహవిజయసింహులు', 'పరిణయ రహస్యము నవలలు' ; ఎన్నో పుస్తక సమీక్షలు రాసినా 'వచన రచయిత' గా చెప్పుకోదగ్గ పేరు రాలేదు. అయితే 'ప్రభవ' (1928) కావ్యం అచ్చైయిన తర్వాత మాత్రం కవిగా గుర్తింపు వచ్చింది. 'సుప్తాస్థికలు' (1929) కవితలోని విధంగా అభ్యుదయ భావాలు అప్పుడప్పుడే శ్రీశ్రీలో అంకురిస్తున్నై. ఈ తరుణంలోనే 'సశేషము' రాశాడు. ఇది ప్రథమ పురుషలో నడిచింది. ఈ కథ "అనేకమైన కారణాలచేత ఒక కథ వ్రాయడానికి మొదలు పెట్టాను. అన్నిటి కంటే ముఖ్య కారణము ఏదో కథ వ్రాయవలెనన్న పట్టుదలే . . ."[21] అని ఆరంభమవుతుంది. ఇలా కథలో కథారచనకు సంబంధించిన అంశాల్ని చర్చించడం శ్రీశ్రీలో ఈ మొదటి కథ నుంచే

చూడొచ్చు. ఇంకా ఇందులో తనకున్న కథా సాహిత్య పరిజ్ఞానం గురించి తను ఎన్నో కథలు, ఆ కథలపై విమర్శ చదివినట్లు చెప్పుకున్నాడు.[22] ఇది తన స్వీయ చరిత్రలో చెప్పిన రీతిలో ఉంది. కథ యొక్క కథ తెల్సినా కథ రాయడం మాత్రం కష్టమేనని చెప్పుకోవడంవల్ల శ్రీశ్రీ నిజాయితీని పాఠకులు గుర్తిస్తారు. ఈ విధంగా కథలో సగంవరకు కథా చర్చ చేస్తూ అసలు కథను ఆరంభించక పోవడంవల్ల పాఠకులు కోపగిస్తారేమోనని భావించి "ఔను (కథను ఇంకా) మొదలు పెట్టలేదు. కాని ఇంకా పూర్తి చెయ్యలేదుగా"[23] అని చమత్కరిస్తూ, మిగిలిన కథనూ చదివిన వాళ్ళనే నాయకుల్ని చేస్తాననీ చెప్పాడు. ఈ కథ రాసే నాటికి పాఠకుడినే నాయకుడిగా చేసే ఆలోచన ఉన్న కథలు నాకు తెల్సినంత వరకు వెలువడలేదు. రొటిన్‌గా వస్తున్న కథల్లా గాకుండా పాఠకుడినే నాయకుణ్ణి చేస్తూ ఆకర్షించడం శ్రీశ్రీలోని నూతనత్వానికిది తార్కాణం. అంతేగాక పాఠకుడ్ని పట్టించకోకుండా సీరియస్‌గా రాసే కథకుడు క్షమార్హుడు కాడనీ, పాఠకుడి కాలం ఎంతో విలువైందని సీతయ్య కథలో చర్చించాడు శ్రీశ్రీ.

కథల గురించి రాసిన కథల్లో మరో ముఖ్యమైన కథ 'అనామిక'. ఇందులో కథలెలా రాయాలి, ఎలా రాస్తున్నారు, కథల శైలి, కథానాయకుల తీరు మొదలైన కథానిక ప్రక్రియకు సంబంధించిన సమాచారాన్ని చర్చించడం జరిగింది. "కథ వండుదామని కలంపట్టుకొని కాగితాలు పెట్టుకొని కూచున్నాను. ఇతివృత్తాన్ని ఎసరు మీదికెక్కించాను . . . "[24] అని ఆరంభంలోనే తానొక కథ రాయడానికి ఉపక్రమించినట్లు చెబుతాడు. ఇదే విధంగా కథ రాస్తున్నట్లుగా పేర్కొన్న మరికొన్ని కథలు 'ఒక్కల', 'పంచపాండవులు', 'బాధకవిత్వానికి పర్యాయ పదం', 'కరక్కాయ ముక్క అరక్కాయకుక్క' మొదలైన వాటిల్లో కథా వస్తువు, కథా కథనం, శైలి, పాఠకుడి కాలం విలువలపై విమర్శనాత్మకంగా కథల్లోనే విశ్లేషించాడు.

ఇలా కథా నిర్మాణ ఇతివృత్తాలతోనేగాక రకరకాలైన అంశాలతో కలగలసినవీ ఉన్నాయి. 'ఒసే తువ్వాలు అందుకో'లో భార్యా భర్తలు రెండే రెండు పాత్రలు. భర్త స్నానం చేస్తున్నంతసేపూ తన్నుతాను గొప్పగా ఊహించుకోవడం అతనికి నచ్చని వాటిని గూర్చి తిట్టుకోవడం, అందులో భాగంగానే భార్యను వెధవముండ, ఒసే తువ్వాలందుకో, వంటైందా ? వంటి అనేక పురుషాహంకార పదాలతో వ్యవహరిస్తోంటే ; మరో పక్క అతని భార్య వంటింట్లో పెళ్ళితో ఏర్పడే కట్టుబాట్లు, నిర్బంధ ఆధిపత్యం వంటి సహజ సిద్ధమైన ఆలోచనలతో విసుగునూ ప్రదర్శిస్తుంది.

'చరమరాత్రి' కథలో నరకం, భూమి, స్వర్గం అనే మూడు కాలాలలో ఆలాపనగా, ఆశనిరాశలు, సత్యాసత్యాలు, స్నేహాలు, ఆర్థిక, రాజకీయ అంశాలతో తన ఉనికిని అధివాస్తవికతతో చిత్రించాడు.

సమాజంలో ఉండే విభిన్నమైన వ్యక్తుల్లో ఒక ప్రత్యేక తరహామనిషిని విశ్లేషనాత్మకంగా 'నమశ్శివాయ' పాత్ర ద్వారా చూపే కథ 'నేటి హిరణ్యాక్షుడు'. ఇలా విచిత్రమైన కల్పనలతో కథలు రాయడం శ్రీశ్రీకి అలవాటే. దీనికి ఉదాహరణగా ఒక్కల, మొహబ్బత్ ఖాన్, గాలిదారాల దేవతావస్త్రాలు, పెద్దాపురం ముదనష్టం కథల్ని పేర్కొన వచ్చు. తన జీవిత చరిత్రలోని ఒకరోజు జరిగిన కొన్ని సంఘటనలతో 'కరక్కాయ ముక్క – అరక్కాయ కుక్క' కథను రాశాడు. కమ్యూనిజాన్ని నమ్మే కుర్రాడి బ్రతుకు పోలీసులు అంతమొందిస్తే, మరో శిశువు అదే సమయంలో ఉదయించడంవల్ల కమ్యూనిజం కోసం పోరాడేవారు పుట్టుకొస్తుంటారనే భావం 'చావూ – పుట్టుకా' లో చిత్రితమైంది. ఇలా శ్రీశ్రీ కథలు, ఒక కథకు, మరోకథకు పోలికలుండనంత వైవధ్యంగల ఇతివృత్తాలతో ఉంటాయి.

శ్రీశ్రీ కొన్ని కథల్ని 'సింబాలిక్' గా రాశాడు. 'ఐశ్వర్యం ఎదుట దారిద్ర్యం', 'ప్రారంభం', 'చావూ–పుట్టుకా' మొదలైన కథల్లో ఈ ధోరణి మరీ ఎక్కువగా కన్పిస్తుంది. వీటిలో కథను మొత్తం 'సింబాలిక్' గానే నడుపుతాడు.

జేమ్స్ జాయిస్ ఇంగ్లీషు సాహిత్యంలో ప్రవేశపెట్టిన 'చైతన్యస్రవంతి' ధోరణితో కొన్ని కథల్ని రాశాడు శ్రీశ్రీ. "మనిషి మనః ప్రపంచంలో చెలరేగే విభిన్నమైన, విరుద్ధమైన భావాలను కల్తీలేకుండా యధాతథంగా ప్రదర్శించే ప్రయత్నమే చైతన్య స్రవంతి రచనావిధానం."[25] ఈ ధోరణితోనే కోనేటిరావు కథల్నేగాక, ఒక్కల, ఒసే తువ్వాలు అందుకో మున్నగు కథల్ని రాశాడు. వీటిల్లో జటావల్లభుల కోనేటిరావు పంతులు నాయకుడుగా మూడు కథల్ని రాశాడు. వాటిల్లో మొదటిది 'కోనేటిదినం'. ఇందులో కోనేటిరావు దిన చర్య వర్ణితమైంది. ఈ కథలో "హెడ్డు గుమాస్తా కోనేటిరావు పంతులు పదకొండు గంటలయింది. గుమాస్తా కోనేటి హెడ్డు పదకొండు గంటలు కొడుతున్నారు. ఆఫీసువేళ కోనేటి గంటల గందరగోళం తొందర భోజనం ముగించుకొని చుట్ట బిగించుకొని బట్ట సవరించుకొని పాగా తగిలించుకొని ఒసే కుర్రాళ్ళు జాగ్రత్త"[26] అని ఆఫీసుకు వెళ్ళడానికి ఆలస్యమైతే ఆ ఉద్యోగి మనస్సులో ఏర్పడే గందరగోళ స్థితిని వర్ణించాడు. ఇదే విధమైన గందరగోళ మనఃస్థితులు 'కోనేటిరాత్రి', 'కోనేటి జన్మ' కథల్లోనూ వున్నాయి. ఇలా ఒకే పాత్రను తీసుకొని మూడు కథలను 'చైతన్య స్రవంతి' ధోరణిలో రాయడం బహుశా తెలుగు రచయితల్లో శ్రీశ్రీ మొదటివాడు. ఈ విధానం ఓ మానాన కొరుకుడు పడదు. అందుకే 'చైతన్య స్రవంతి' ప్రక్రియకు ఆద్యుడైన జేమ్స్ జాయిస్ గురించి "జేమ్స్ జాయిస్ వచనం చదివిన వారెవ్వరు ? దానిని జీర్ణం చేసుకున్న వారెవ్వరు? నేనే ఎల వారసుణ్ణి."[27] అని శ్రీశ్రీ చెప్పింది తనూ ఈ ధోరణితో రాసిన కథలకూ వర్తిస్తుంది. ఈ కోనేటిరావు కథలపై 'శ్రీశ్రీ కవిత్వం మనోవిశ్లేషనాత్మక పరిశీలన'లో " . . . కోనేటిరావు కథలలో సగటుమనిషి జీవిత దైన్య చిత్రణ . . ."[28] ఉన్నట్లు దేవరాజు కృష్ణమరాజు అన్నారు. కథలను ఏదో

ప్రత్యేకతతో రాయపూనుకొంటాడని శ్రీశ్రీ కథలను చదివిన వారెవరైనా గుర్తిస్తారు. అలాంటి కథల్లో 'హేమంతం' ఒకటి. చెలం రాసిన 'కొత్త చిగుళ్ళు' కథను చదివి ఆ స్పందనతో ఈ కథ రాసినట్లు ఈ కథలోనే శ్రీశ్రీ స్వయంగా చెప్పుకున్నాడు. తన 'భిక్షువర్షీయసీ' కవితలోని అవ్వే ఈ కథలో ప్రధానపాత్ర. ఆ అవ్వతో శ్రీశ్రీ కూడా ఒక పాత్రై సంభాషించడమే కథలోని ఇతివృత్తం. అవ్వ యౌవ్వనంలో తాను ఎంత అందంగా ఉండేదో శ్రీశ్రీతో చెప్పడమేగాక ఇంకా "డెబ్భయి ఆశ్వాసాల నా మహాకావ్యాన్ని ఒక చిన్న గీతంలోకి ఆవిరిపట్టి నాకొక శాశ్వతత్వం ప్రసాదించావు. సంఘ దురన్యాయానికి యజ్ఞ పశువునైన నన్ను పరి పీడితుల పరాజితుల సమూహానికొక చిహ్నంగా నిలబెట్టావు. జరామరణ దుఃఖాలను స్మరించే వాళ్ళందరికీ నన్నే జ్ఞాపకం చేస్తున్నావు"[29] అని తన పాత్రతోనే తాను పొగడబడ్డాడు. ఇలా శ్రీశ్రీ రాసిన ఇరవైఆరు కథల్లో ఏదో ఒక విశిష్టత కన్పిస్తుంది. ఈ ప్రత్యేకత యధేచ్ఛగా సాగడం మరీ విశేషం.

**అనువాద కథలు**

దొరికినంత వరకు శ్రీశ్రీ కథల్లో అనువాద కథే మొట్టమొదటిది. అది 'చిత్ర రహస్యము'. దీనికి మూలం సర్ ఆర్థర్ కానన్ డాయిల్ రాసిన 'షెర్లాక్ హోమ్స్ కథలు'. ఇది డిటెక్టివ్ కథ. ఇది అచ్చంగా తెలుగు కథే అన్నంత గొప్పగా అనువదించబడింది. ఎందుకంటే కథలోని పాత్రల పేర్లేగాక, కథలోని ప్రదేశాలకూ తెలుగు పేర్లనే పెట్టడం వల్ల ఇది అనువాద కథగాగాక సొంత కథలాగా ఉంటుంది. అలాగే సోములు చెప్పిన కథ, నీయుద్ధం నువ్వే చేసుకో మొదలైన కథలు కూడా అనువదించాడు శ్రీశ్రీ.

శ్రీశ్రీ అనువాదం చేసిన కథల్లో అమెరికాలోని ప్రఖ్యాత రచయిత విల్లియం సారోయాన్ రాసిన కథలే ఎక్కువ. అవి 'కుర్రాడు-చుంచెలుకా', '1,2,3,4,5,6,7,8', 'గొల్లవాడి కూతురు', 'దేవతార్చన' , 'డియర్ గ్రేటాగార్బో', 'చలికాలపు రాత్రి', 'నీ యుద్ధం నువ్వే చేసుకో' ఈ కథల్లో జీవితంలోని కష్టాలు, ఆకలి, దారిద్ర్యం మొదలైన అంశాలు స్పృశించబడ్డాయి.

ఇంగ్లీషు నవలా రచయితల్లో చార్లెస్ డికెన్స్ ప్రముఖుడు. ఈయన రచనలంటే శ్రీశ్రీకి మొదటి నుండీ అమితమైన అభిమానం. అందుకే ఈయన రాసిన 'పికివిక్ పేపర్స్'ను సోములు చెప్పిన కథగా అనువదించాడు. అంతేగాదు తను ప్రతి పాదించిన 'రసన' సిద్ధాంతానికి ఉదాహరణగా పేర్కొన్న రచయితల్లో డిక్కెన్స్ ఒకడు. ప్రపంచ ప్రసిద్ధ కథా రచయితల్లోగెడి మొపాసా శ్రీశ్రీకి చాలా ఇష్టమైన రచయిత. ఈయన రాసిన ఒక కథను 'హంతకుడు' పేరుతో అనువదించాడు.

కవిత్వంలో శ్రీశ్రీని అమితంగా ఆకర్శించిన కవుల్లో 'ఎడ్గార్ ఎలెన్ పో' ముఖ్యుడు. తన కవితలపై 'పో' ప్రభావం ఉన్నట్లు స్వయంగా చెప్పుకున్నాడు. 'పో' రాసిన కవిత్వాన్నేగాక కథల్నీ శ్రీశ్రీ

చదివాడు. అంతటితో ఊరుకోక ఆయన రాసిన ఓ కథను 'ఆ గుండెల చప్పుడు' గా అనువదించి, తెలుగు పాఠకులకు 'పో' కథా తీరును రుచి చూపాడు.

ఇంతవరకు పేర్కొన్న రచయితలేగాక ఫ్రాన్జ్ కాఫ్కా (వింత జంతువు) ; బ్రెటన్, ఎల్యూర్డ్ గారలు కల్సి రాసిన కథ (అలవాటు బలిమి), విక్టర్ సాడల్ ప్రిటీఛెట్ (కపీశ్వరుడు) రచయితల కథల్నీ తెలుగులోకి దిగుమతి చేశాడు. వీటిలో 'కపీశ్వరుడు' కథను ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ఇందులో కోతులే పాత్రలు. ఈ కోతుల ద్వారా కమ్యూనిజం సిద్ధాంతాన్ని బలంగా తెలియజేయడం జరిగింది.

ఇలా పద్నాలుగు అనువాదాలు, ఇరవైఆరు స్వంత కథలు శ్రీశ్రీ రాశాడు. వీటిల్లో శీర్షికలు, వస్తువు, ఎత్తుగడ-ముగింపు, వర్ణనలు, పాత్రలు మొదలైన వాటితో పాటు ఈ కథల్ని మొత్తంగా పరిశీలించినప్పుడు కనిపించే సాధారణ అంశాలూ పరిశీలిద్దాం.

**శీర్షికలు**

శ్రీశ్రీ కథానికలకు పెట్టిన పేర్లు గమనిస్తే సూటిగా, వ్యంగ్యంగా, ప్రతీకాత్మకంగా, విచిత్రంగా, సంఘటనలతో వైవిధ్యంగా కన్పిస్తాయి.

కథ పేరు చదవగానే వస్తువు సూటిగా స్ఫురించేట్టుగా కొన్ని కథలకు పేరు పెట్టాడు శ్రీశ్రీ. వీటికి ఉదాహరణగా చరమరాత్రి, సోములు చెప్పిన కథ, చావూ - పుట్టుకా ఇత్యాది కథల్ని తీసుకోవచ్చు. అశ్వమేధ యాగం, కవి సన్మానం మొదలైన కథల పేర్లు వ్యంగ్యంగా వున్నాయి. ప్రతీకకు 'ఐశ్వర్యం ఎదుట దారిద్ర్యం' అనే కథను చెప్పుకోవచ్చు. పాత్రల పేర్లు కూడా కథలకు పెట్టడం రివాజు. చిన్నబాబు, సీతయ్య, గాలి దారాల దేవతా వస్త్రాలు, పెద్దాపురం ముదనష్టం మొదలైన కథలకు పాత్రల పేర్లే ఉంచాడు.

'విచిత్రమే సౌందర్యం - సౌందర్యమే విచిత్రం' అన్న భావం మనసులో ఉన్న శ్రీశ్రీ కథలకు కూడా విచిత్రమైన పేర్లనే పెట్టి వైవిధ్యాన్ని సాధించాడు. ఒక్కల; 1,2,3,4,5,6,7,8 మొదలైన కథల్ని ఇందుకు ఉదాహరణగా చూపవచ్చు. కాబట్టి శ్రీశ్రీ తన కథలకు పేర్లను పెట్టడంలో ప్రత్యేకమైన శ్రద్ధ చూపినట్లు గమనిస్తాం.

**వస్తువు**

కథానికల్లో అన్నింటికంటే ముఖ్యమైంది 'వస్తువు. ఈ దృష్ట్యా శ్రీశ్రీ కథల్ని పరిశీలించి చూస్తే ఒకసారి తీసుకున్న వస్తువు ఇతర కథల్లో దాదాపుగా కనబడదు. కొన్ని కథలు అసలు వస్తువే లేనట్లు భ్రమింపజేస్తాయి. ఇదే శ్రీశ్రీ ప్రత్యేకత. ఇలా వైవిధ్యంతో కూడిన కథల్లో వస్తువును చూద్దాం.

'సశేషము' కథలో కథ రాయడానికి పూనుకోవడం వస్తువైతే, సాంప్రదాయ వలయంలో ఒక బ్రాహ్మణ కుర్రవాడి జీవన స్థితి 'చిన్నబాబు' కథలో చిత్రితమైంది. 'అనామిక' కథలో 'కథలు రాస్తున్న తీరే' ఇతివృత్తం. 'సీతయ్య' లో సీతయ్య 'పాత్ర నిర్మాణం' వస్తువు. 'ఒసే తువ్వాలు అందుకో' లో మధ్యతరగతి స్త్రీ-పురుష సంబంధాలు ఇతివృత్తం. 'కోనేటి' కథల్లో గుమాస్తా ఇక్కట్లే ఇతివృత్తం. గుర్రప్పందాలకు అలవాటు పడిన వాడి జీవిత స్థితి 'అశ్వమేధయాగం'లో వస్తువైతే, రచనల్లో అనుకరణ విధానం నిరసించే ఇతివృత్తం 'బాధ కవిత్వానికి పర్యాయ పదం' అనే కథలో ఉంది. వికలాంగుడైన బిచ్చగాడి దౌర్భల్యస్థితే 'ఐశ్వర్యం ఎదుట దారిద్ర్యం'. లైంగిక జీవితాన్ని నిషేధిస్తే ఎలా ఉంటుందో తెలిపే ఇతివృత్తం 'మొహబ్బత్ ఖాన్' కథ. ఆత్మహత్య చేసుకోబోయే కుర్రవాడి ఆలోచనా తీరే 'చరమరాత్రి' లోని ఇతివృత్తం. విప్లవకారుడు పోలీసులకు చిక్కితే ఎలా ఉంటుందోన్న ఇతివృత్తం 'చావూ-పుట్టుకా' కథలో ఉంది. శూర్పణఖా మాన సంరక్షణకై చేసిన ఆలోచననే 'శూర్పణఖామానసంరక్షణలో' లో ఇతివృత్తమైతే, ఒకనాడు తను (శ్రీశ్రీ) బస్సెక్కితే తన జేబులో డబ్బులను కాజేసిన దొంగల తీరు 'కరక్కాయ ముక్క – అరక్కాయ కుక్క' లోని ఇతివృత్తం. 'హేమంతం' లో తన (శ్రీశ్రీ) ఓ కవిత (భిక్షువర్షీయసీ)లోని అవ్వ పాత్ర యౌవనంలో పడ్డ కష్టాలే ఇతివృత్తం. ఇలా విచిత్రమైన వస్తువులను ఎన్నుకొని కథలను రాశాడు. ఇంకా ఇతర కథలనూ వస్తుపరంగా పరికిస్తే విభిన్న ఇతివృత్తాలు కన్పిస్తాయి.

**ఎత్తుగడ - ముగింపు**

కథలోని ఆరంభ వాక్యాలే ఆ కథకు ప్రాణం. కథానికల్లో 'ఆరంభం – ముగింపు'ల గురించి శ్రీశ్రీ "ప్రారంభం, నిర్వాహణ, ఉపసంహారం, ఇవే కళా వస్తువు నాణ్యం తెలియజేసే నికషాలు"[30] అని తెల్పి, ఇంకా ఇందులో ఏరోడ్రము నుండి విమానాన్ని అతి సున్నితంగా పైకి తీసుకెళ్ళి, అదే విధంగా గమ్యస్థానంలోనూ సురక్షితంగా దింపే పైలట్ ఎలా కనబడడో రచనల్లో రచయిత కూడా కనబడకూడదని కథా రచయిత లక్షణాన్ని తెలిపాడు.[31] ఈ ఆరంభం – ముగింపులు ఒక్కో రచయిత ఒక్కొక్క కథలో ఒక్కొక్కరకంగా నిర్వహించాడు. విషయం మారినప్పుడల్లా సాధారణంగా ఇదీ మారుతుంది. ఈ 'ఆరంభం-ముగింపులు' శ్రీశ్రీ కథల్లో ఎలా ఉన్నాయో పరిశీలిద్దాం.

"రాత్రి పదకొండు గంటలయింది. ఇంకొక గంట. ఇంకొక్క అరవై నిమిషాలు. సరిగ్గా పన్నెండుకాగానే చనిపోదలచుకున్నాను".[32] అని 'చరమరాత్రి' కథను ఉత్కంఠ భరితంగా ఆరంభిస్తాడు శ్రీశ్రీ. అర్ధరాత్రి కావస్తున్న సమయంలో ఓ వ్యక్తి ఆత్మహత్యా ప్రయత్నానికి కారణమైన అనేక విషయాల్ని చర్చిస్తున్నవైనం మన చేత ఈ కథ చివరి వరకూ చదివిస్తున్న ఆరంభంతో పాటు, ముగింపును "ఇది నా కామ్యం / ఇది నా గమ్యం / ఇది నా స్వర్గం"[33] అని

ముగించడంవల్ల ఆత్మహత్య చేసుకోబోయే యువకుడి ఆశయం చరమరాత్రిని జయించడంగా శ్రీశ్రీ చూపాడు. ఈ ముగింపు శ్రీశ్రీ కవిత 'ఐ'లోని "నేనొక దుర్గం / నా దొక స్వర్గం / అనర్గళం, అనితర సాధ్యం నా మార్గం"[34] అనే పాదాల్ని స్ఫురణకు తెస్తుంది.

"ఒక్కల, ఒక కల, ఓకల. నిన్న రాత్రి నేను కన్న ఒక కల"[35] అని 'ఒక్కల' కథ ఆరంభమవుతుంది. 'ఒక కల' అనేది చెప్పడానికి భాషా పరంగా పదాల్లోని సౌలభ్యాన్ని, ఉచ్ఛారణా వైవిధ్యాన్ని చూపాడు. పై రెండు వాక్యాలను చదివితే పాఠకుడికి 'కల' యొక్క కథ అని అర్థమవుతుంది. అంటే రచయిత నిన్న రాత్రి కన్న కల కళాత్మకమైన కథగా మారబోతున్నదన్న విషయం అర్థమవుతుంది. ఈ కలని "మాటల్లోనో, రంగుల్లోనో, సంజ్ఞల్లోనో, ధ్వనుల్లోనో లేదా సినిమాలలో లాగా ఈ అన్నింట్లోనో తెలియజెయ్య గలగడం కళ"[36] అని 'కల'ను కళాత్మకంగా చెప్పాలని ఈ కథలో శ్రీశ్రీ సూచించాడు.

'చిన్నబాబు' కథ "శిశిరాగమవేళ అది. మాఘ మాసము లోకానికి మంచుతెరలు కట్టుచున్నది."[37] అని ప్రకృతి వర్ణనతో ఆరంభమవుతుంది. "దారి చెయ్యండి – కథా నాయకుడికి దారి చెయ్యండి – సీతయ్య వస్తున్నాడు. దారి చెయ్యండి"[38] అని తాను ఏ పాత్ర గురించి కథ రాయబోతున్నాడో ఆ పాత్ర గురించి రాజులు వచ్చేప్పుడు వందిమాగదులు చెప్పినట్లుగా పాత్ర ప్రవేశాన్ని శ్రీశ్రీ సూచించాడు. అంతేగాక నాటకాల్లోని పాత్రల ప్రవేశ రీతి కథల్లో చొప్పించడంలో శ్రీశ్రీ సిద్ధహస్తుడు.

కొన్ని కథలను "అనేకమైన కారణాల చేత ఒక కథ వ్రాయడానికి మొదలు పెట్టాను" (సశేషము), "కథ వండుదామని కలం పట్టుకొని కాగితాలు పెట్టుకుని కూచున్నాను" (అనామిక) అని కథ రాయడానికి ఉపక్రమించినట్లు చెప్పుకొని ఆ కథలను ఆరంభిస్తాడు. ఈ కథల ఆరంభాలను పరిశీలిస్తే చాలా మట్టుకు చెప్పదలచుకున్న విషయంతోనే సూటిగా కథల్లోకి దూసుకుపోయే గుణం శ్రీశ్రీకి ఉన్నట్లు గ్రహిస్తాం.

'సశేషము' కథ 'స–శే–ష–ము' అన్న నాలుగు అక్షరాలతో ముగుస్తుంది. అంటే ఈ కథలో తాను చెప్పదలచుకున్న కథ ఎప్పటికీ శేషముతో కూడినదని పై నాలుగక్షరాలతో చమత్కారంగా ముగించాడు. 'కవి సన్మానం' కథలో సాధారణంగా కవులకు గండపెండేరమో, శాలువా కప్పడమో ఏదోరకంగా కవికి ఈ కథలో సన్మానం జరుగుతుందేమో అని భావించి కథను పఠించ నారంభించిన పాఠకుడు ఊహించని విధంగా 'కవికి పోలీసు బేడీల సన్మానం' తో కథ ముగుస్తుంది. ఇలా కొన్ని కథలు ఊహించని విధంగా ముగుస్తాయి.

"చేసుకున్న పాపంలాంటిది కొనుకున్న బొమ్మ" (బొమ్మ), "'కమ్యూనిస్టులను పాతేస్తున్నాం అన్నారు దొరతనంవారు. పాతేస్తున్నారు. వానలు కురిస్తే దేశం అంతటా కావలసినంత పంట" (క్షణంలో సగం); "ఔను ఎడంచేతి వేపు నుంచి రమణ మహర్షిని అంటూ అవ్వ అంతర్ధానమయింది" (హేమంతం); "రెక్కలు ధరిస్తే మాత్రం ఎక్కడికి వెళ్ళగలవోయ్ మానవుడా ?" (పంచ పాండవులు) అని ఈ రకంగా చాలా కథలకు మంచి సూక్తులు జాతీయాల్లాంటి వాక్యాలతో ముగింపు నిచ్చాడు శ్రీశ్రీ.

**వర్ణనలు**

శ్రీశ్రీ కథల్లో అక్కడక్కడ సందర్భోచితమైన చక్కటి వర్ణనలున్నాయి. రోజంతా తెగవాగిన మ్రోగిన టెలిఫోనులూ, టైపురైటర్లూ మూకీ భావం వహించాయి. "... రోజంతా మనుష్యుల్ని మోసిన కుర్చీలు తీరు బాటుగా తమ అరణ్య ప్రారంభాలని జ్ఞాపకం చేసుకుంటున్నాయి"[39] అనడంతో మధ్యాహ్నమంత కోలాహలంగా కనిపించే ఆఫీసులు సాయంత్రానికి ఎలా ఉంటాయో 'ఐశ్వర్యం ఎదుట దారిద్ర్యం' కథలో వర్ణించాడు. ఇక్కడ టెలిఫోన్, టైప్‌రైటర్లు, కుర్చీలకూ మానవీయ లక్షణాల్ని ఆపాదించడం కవితాత్మకంగా ఉంది. 'చిన్నబాబు' కథలో "ఆకసమాక్రమించినవి మేఘమాలికలు. లోకమును ముంచినది వర్షధార. ప్రకృతి నొక్కట ప్రబలముగ ఊగించినది చలి. జగతికి కారు క్రమ్మిన చీకటి కప్పికొనుటకు కంబళి ఐనది"[40] అని వర్షాకాలపు వాతావరణాన్ని హృద్యంగా చిత్రించాడు. మొత్తం మీద శ్రీశ్రీ కథల్లో అక్కడక్కడ వున్న వర్ణనలు చాలా మంది రచయితల్లా గా కాక, కథా గమనానికి సానుకూలంగా వున్నాయి. అంతేగాదు ఈ వర్ణనలు పేజీలకు పేజీలుగా కాక వీలైనంత సంక్షిప్తంగా వుంటాయి.

**పాత్రలు**

శ్రీశ్రీ రాసిన కథల్లో పాత్ర చిత్రణపై ప్రత్యేక శ్రద్ధ వహించినట్టు కనిపిస్తుంది. తన కథల్లో పాత్రలెట్లా ఉండాలో కథాంతర్భాగంగా చర్చిస్తాడు. 'సశేషము' కథలో 'నాయకుని' గూర్చిన చర్చ ఉంది. ఈ కథ సగం వరకు రాసిన తర్వాత "... మిగిలిన సగానికీ లోభించినట్టైతే నా కథకి వాళ్ళనే (పాఠకుల్ని) నాయకుల్ని చేస్తాను"[41] అని చెప్పి, నిజానికి పాఠకులను నాయకులుగా చెయ్యడం సాధ్యంకాదు కాబట్టి ఈ కథ Thackery అనే రచయిత రాసిన Vanity Fair నవలలో నాయకుడు లేని విధంగా అయ్యే అవకాశం ఉంటే ఈ కథ రాయడం మానివేస్తానని నిర్ణయించుకుంటాడు. దీన్ని బట్టి చూస్తే నాయకలోపమైన కథ రాయడం శ్రీశ్రీకి ఇష్టం లేదని అర్థమవుతుంది. నాయక చర్చ ఉన్న మరో కథ 'సీతయ్య'. ఇందులో నాయక పాత్ర గురించి "... నా కథకు నాయక పదవికి నోచుకొన్నవాడు చాలా అదృష్టవంతుడు. ఒకంతకుగాని బయటపడడు. అలా, అలా నా

పాఠకులలో ఔత్సుక్యం పెంపొందించి తంటాలు పెడతాడు"[42] అని తన నాయకపాత్రపై చర్చించాడు శ్రీశ్రీ. ఈ కథలో నాయకుడు సీతయ్యే. ఈ పాత్రను తెలుగు, ఇంగ్లీషు సాహిత్యాలలోని గొప్ప పాత్రలలాగ శాశ్వతంగా జ్ఞాపకం ఉండేట్టుగా తీర్చి దిద్దాలనుకుంటాడు. చివరికి ఈ పాత్రను కథలో ప్రవేశపెట్టకుండానే 'నీడగా, మబ్బుగా, దోబూచిగా' ఊహించుకోమని కథను ముగిస్తాడు. ఇలా నాయక ప్రసక్తి ఉన్న మరో కథ 'అనామిక'లో నాయక పాత్ర లేనందుకు తను కథ రాయలేకపోతున్నట్లు, ఆ కథ ముందుకు సాగట్లేదని చెప్పి, ఈ పాత్ర బజారులో దొరికే సరుకులాగా చిన్న చూపు చూడొద్దని పాఠకుల్ని హెచ్చరించాడు[43] దీన్ని రాజకీయ నాయకులకు కూడా వర్తించే విధంగా ద్వంద్వార్థ పూరితంగా చెప్పాడు. నాయక పాత్రల గురించి కథల్లోనే చర్చ చేసిన శ్రీశ్రీ 'సశేషము', 'అనామిక' కథలను పాత్రలు లేకుండానే రాశాడు.

'శూర్పణఖ మాన సంరక్షణం', 'కరక్కాయ ముక్క - అరక్కాయ కుక్క', 'క్షణంలో సగం' మొదలైన కథల్లో రచయిత అయిన శ్రీశ్రీనే నాయకుడు. అంటే తనకు తానుగా నాయక పాత్రను చేసుకొని కథలల్లాడు. 'నేటి హిరణ్యాక్షుడు' కథలో శాడిస్టుని నాయకున్ని చేశాడు. "మన నిత్య జీవితంలో ఎవడూ అచ్చం హీరోగాని, పూర్తిగా విలన్‌గాని కాడు"[44] అని చెప్పిన శ్రీశ్రీ 'ఒసే తువ్వాలు అందుకో' లో దానికి నిదర్శనంగానే శర్మ పాత్రను రూపొందించాడు. లోకంలోని గుమాస్తాల తీరుకు ప్రతీకగా 'కోనేటిరావు' పాత్ర శాశ్వతంగా పాఠకులు జ్ఞాపకం వుంచుకొనేట్టుగా సృష్టించాడు. ఈయన కథల్లోని కొన్ని పాత్రలకు పేర్లు లేవు. అవి 'చరమరాత్రి', 'బాధ కవిత్వానికి పర్యాయపదం' మొదలైనవి. ఈ రకంగా పేర్లు లేని పాత్రలు కొన్నైతే మరికొన్ని కథల్లో పాత్రలకు చాలా విచిత్రమైన పేర్లు పెట్టాడు. ఉదాహరణకు 'మెహబ్బత్ ఖాన్', 'గాలి దారాల దేవతావస్త్రాలు', 'పెద్దాపురం సుందర ముదనష్టం' వంటివి. 'చిత్ర రహస్యము', 'సోములు చెప్పిన కథ' మొదలైన అనువాద కథల్లో పాత్రలకు మూలంలోని పేర్లుగాక తెలుగు పేర్లతో అనువదించాడు. కథేతర ప్రక్రియ అయిన కవిత్వంలో తాను రాసిన 'భిక్షు వర్షీయసీ' ఖండికలో 'అవ్వ' పాత్రను తీసుకొని 'హేమంతం' కథ రాశాడు. కొన్ని కథల్లో సాహితీకారుడే నాయకుడు. అలాంటివి 'చరమరాత్రి', 'ఒసే తువ్వాలు అందుకో', 'గాలి దారాల దేవతావస్త్రాలు', 'దేవతార్చన', 'నీయుద్ధం నీవే చేసుకో', మొదలగునవి. '1,2,3,4,5,6,7,8' అనే కథలో సంగీత ప్రియుడు, 'డియర్ గ్రేటాగార్బో'లో నటుడే నాయకుడు. ఈ విధంగా శ్రీశ్రీ చాలా కథల్లో నాయకుడు కళాకారుడు. ఈ కళాకారుడూ అచ్చంగా శ్రీశ్రీ భావాలు గలవాడే. అంతేగాదు తనను తానే కొన్ని కథల్లో కథా నాయకుడుగా సృజించుకోవడం విశేషం. ఇలా తెలుగులో పాత్రలపై ప్రయోగాలు చేసిన రచయితలు బహు అరుదు.

**కథల్లో 'కథాంశ' చర్చ**

తాను రాస్తున్న కథల్లో కథ ఎలాగుండాలి, ఎలా రాస్తున్నదీ వంటి లక్షణాలు శ్రీశ్రీ కథల్లో కనిపిస్తాయి. ఈ గుణం ఈయన చాలా కథల్లో మనం చూడొచ్చు.

'అనామిక' కథలో "కథ వందుదామని కలం పట్టుకొని కాగితాలు పెట్టుకుని కూచున్నాను" అని ఆరంభంలోనే కథా ప్రస్తావన కన్పిస్తుంది. 'చరమరాత్రి'లోని పాత్ర రచయిత. "నేనెవరు ? అనవసరం. అయితే ఈ రాత కూడా అనవసరమే పోనీ, నేనెవరో చెప్పనా ? ఎవరికి చెప్పను ? ఎందుకీరాత ? అదే ఈ రచన. ... కుడి చేతిలో కలం రాస్తూనే ఉంది"[45] అనే మాటలవల్ల ఈ పాత్ర తన కథను తానే రాస్తున్నట్టు కన్పిస్తుంది. 'ఒక్కల'లో "కలని కథగా రాయాలన్నా ఫిల్ముగా తీయాలన్నా ఎక్కడ ప్రారంభించాలో ఎక్కడ ముగించాలో తెలియదు" అని శ్రీశ్రీ తన కలను కథగా రాయబోయే ముందు చేసిన చర్చ కథా ప్రస్తావన అవుతుంది. 'ఐశ్వర్యం ఎదుట దారిద్ర్యం'లో "... ఆ యింటి ముందు నిలబడడంవల్ల లాభం లేదని ఆఖరికి అతని కాళ్ళకి బోధపడితే అప్పుడే కథ అంతమవుతుంది" అని ముగింపులో కథా ప్రస్తావన తెస్తాడు. 'బాధ కవిత్వానికి పర్యాయ పదం'లో "... ఎందుకు పొమ్మన్నానో చెప్పడానికే ఈ కథ" అని ఈ కథ తానెందుకు రాస్తున్నాడో కారణం చెప్పాడు. కవి సన్మానం లో "అందరూ నిరాకరించిన రౌడీలూ, కేడీలూ, లేడీలూ మనకు ఆధ్యాత్మిక బంధువులు. వాళ్ళ కథల్లోంచి మహాభారతం పిండి వాళ్ళ జీవితంలో రామాయణం చదువుతాం"[46] అని చెప్పడంవల్ల ఇక్కడ శ్రీశ్రీ 'ఋక్కులు' కవితలో చెప్పిన "కాదేదీ కవిత కనర్హం" అనే విషయాన్నే 'కాదేదీ కథల కనర్హం' అని చెప్పుకోడానికి ఆస్కారం ఏర్పడుతుంది. 'సీతయ్య' కథలో "... ఎన్నో సంవత్సరాలు ఏకదీక్షగా సీతయ్య జీవితం గురించి పరిశోధనలు చేసి తుదకి అసలు కథ చెప్పగలుగుతున్నాను"[47] అనీ, 'శూర్పణఖామాన సంరక్షణం' లో "... ఇటువంటి ఆలోచనల మధ్య హఠాత్తుగా స్ఫురించింది కథ" అనీ, 'గాలి దారాల దేవతావస్త్రాలు' లో "ఇది నాలో సరికొత్త పాతకథ. ఎంచేతనంటే, ఇది వరకే చెప్పవలసింది. ఇప్పుడు చెప్తున్నాను" అనీ, 'పెద్దాపురం ముదనష్టం' లో "... ఇదేదో ఈ రచయిత స్వకపోల కల్పన అనీ ఎవరయినా అనుమానించడానికి ఆస్కారం లేక పోలేదు" అనీ, 'దేవతార్చన'లో "పత్రికల కోసం కథలు రాసుకునే ఈ యువక రచయిత అంటే దాని తాత్పర్యం ... పత్రికలో పడింది కథ" అనీ, 'నీయుద్ధం నువ్వే చేసుకో' లో "...రెండు మూడేళ్ళ తరువాత కూర్చొని కథ రాసుకుంటున్నాను' ' అని ఆ విధంగా వివిధ కథల్లో కథా ప్రస్తావన కనిపిస్తుంది.

కథలను, అందులోని కథా ప్రస్తావన తీరును విశ్లేషించిన తర్వాత ఈ కథల ద్వారా రచయిత ప్రధానంగా ప్రతిపాదించదలచుకున్న అంశమేమైనా ఉందా ? అనే దాన్ని పరిశీలిద్దాం.

**ప్రతిపాదిత అంశాలు**

శ్రీశ్రీ ప్రధానంగా తన కథల్లో 'మానవత్వాన్ని' ప్రతిపాదించినట్లు అర్థమవుతుంది. ఈ మానవత్వం ఎన్ని విధాలుగా వంచింపబడుతుందో, మానవత్వంపై రాక్షసత్వం ఏ విధంగా అధికారం చెలాయిస్తుందో శ్రీశ్రీ కథల్లో చూడోచ్చు. 'చరమరాత్రి' కథలో "నేను ఉండడానికి నా నౌకరును

కష్టపెడతాననడానికి వీలులేదు . . ." అని చెప్పి ప్రకృతి శోభతో భూమండలం శోభిల్లుతూ ఆనకట్టలు, విమానాలు శాస్త్ర పరిశోధనతో వృద్ధిచెంది, చెవుల రేడియోలతో, కళ్ళే టెలివిజనుగా ఉంటూ మానవత్వం అభివృద్ధి చెందాలని ఆకాంక్షించడం వల్ల మానవాభివృద్ధితోపాటు మానవతా విలువల్ని ప్రతిపాదించినట్లు తెలుస్తుంది.[48] ఇదే విధంగా 'ఒక్కల'లో "దేవత్వం ఊర్ధ్వ గమనాన్ని, రాక్షసత్వం అధోయాత్రని ప్రోత్సహించాయని"[49] చెప్పడంతో రాక్షసత్వాన్ని నిరసించి దేవత్వమైన మానవత్వానికే పట్టం కట్టాడు. 'ఒసే తువ్వాలు అందుకో' కథలో " . . . మొగాడు అథార్టీ చేస్తూ ఉంటేనే ఆడది అణిగి మణిగి ఉంటుంది. లేకపోతే ఆడవాళ్ళకి పట్టపగ్గాలుంటాయా"[50] అని ఆలోచించే భర్తల్లోని రాక్షసత్వం నాశనం చేసి 'సంసార బండి' కి భార్య భర్తలు చక్రాలై సమాన భారం మోసే వారు కాబట్టి ఒకరు మరొకరిపై అథార్టీ చెలాయించక మానవతా దృక్పథంతో సమానత్వాన్ని సాధించే ఆలోచన పాఠకుల్లో కలగడానికి ఈ కథ రాసి ఉంటాడని ఊహించగలం.

'కోనేటి' కథల్లో "ఇదివరకు అతణ్ణి (కోనేటిరావు) కనబడకుండా బంధించిన సంకెళ్ళు ఇంగ్లాండులో తయారైనవి. ఇప్పటి సంకెళ్ళను ఇండియా తయారు చేస్తోంది"[51] అని స్వాతంత్ర్యానంతరం కూడా గుమాస్తాల జీవితం పూర్వంలాగే దైన్యస్థితిలో ఉన్నట్లు గుమాస్తా ఉద్యోగం చేసిన శ్రీశ్రీ స్వానుభవంతో చెప్పాడు. ఎందుకంటే స్వాతంత్ర్యానంతరమైనా గుమాస్తాల బ్రతుకు మారాలనే ఆశతో కనీసం ఇండియా ప్రభుత్వమైనా మానవతా దృక్పథంతో గుమాస్తాల జీవితం బాగుపరచాలని శ్రీశ్రీ ఆశ.

'పంచ పాండవులు' కథలో ప్రభుత్వాలు, నిర్బంధాలు లేని స్వేచ్ఛాయుత సమాజానికే శ్రీశ్రీ పరితపిస్తున్నట్లు కన్పిస్తుంది.[52] 'నేటి హిరణ్యాక్షుడు' లో "తూరీగని పట్టుకొని ఒక కాలు లాగి, ఒక రెక్క విరిచీ చిన్న పిల్లడు చెప్పరాని సంతోషం పొందుతాడు. ఇది కేవలం చిన్న తనపు సరదా. నమశ్శివాయ దీనిని అత్యున్నత శిఖరాలకు తీసుకుపోతాడు"[53] అని ఈ లోకంలో నమశ్శివాయ లాంటివారు నవ్వుతూనే గోతులు తొవ్వే భయంకర రాక్షసత్వం నిండి వుంటారని వారి నుండి జాగ్రతపడాలని సూచించాడు శ్రీశ్రీ. ఇలాంటి వారు రాక్షసత్వం నుండి మానవత్వం వైపుకి మారాలని శ్రీశ్రీ ఆకాంక్ష. తల్లి చచ్చినా చూడడానికి వెళ్ళని అమానవీయున్ని 'అశ్వమేధ యాగం' లో చూపాడు. కనీసం తల్లి పట్లనైనా మానవత్వంతో మసలుకోవాలని ఈ కథ ఉద్దేశం. 'ఐశ్వర్యం ఎదుట దారిద్ర్యం' లో అంగ వికలుడైన బిచ్చగాడి దీనస్థితిని చూస్తే 'మానవత్వం' ఉన్నవారి గుండె ద్రవించి కంట నీరు స్రవించక మానదు. 'చలికాలపు రాత్రి'లో ఒక కుర్రాడు ఆకలికి తట్టుకోలేక తన కోటును అమ్ముకొని ఆకలిని తీర్చుకుంటాడు. కోటులేక తీవ్రమైన చలిని భరించలేక చివరికి చస్తాడు. ఇది మానవత్వమున్న వారినెవరినైనా కదిలించే కథ. కనీసం ఇక ముందైనా అనాథలు ఇలా చావకూడదనే మానవతాదృక్పథంతో రాసిన కథ ఇది. ఈ రకంగా శ్రీశ్రీ రాసిన చాలా కథల్లో మానవతా ప్రతిపాదన

కనిపిస్తుంది. ఇక ఈయన నమ్మిన కమ్యూనిజ సిద్ధాంతం 'చరమరాత్రి'లో "పరస్పర ప్రేమవల్ల మానవులంతా సమానులవుతారు."[54] అనీ, 'కపీశ్వరుడు' కథలో " . . . మాలో మేము సాగించే వర్గ కలహాలని తాత్కాలికంగా కట్టిపెట్టి . . . "[55] అన్నట్లు మార్క్సిజంలోని వర్గ కలహాలు మానవతా దృక్పథంతో మానుకోవాలంటాడు. ఐతే ఈ దృష్టితో చాలా తక్కువ కథలు రాశాడు శ్రీశ్రీ. మొత్తం మీద శ్రీశ్రీ కథల్లో ప్రధానంగా ప్రతిపాదిత అంశం 'మానవత్వమే'. తన కథలపై వచ్చిన విమర్శ " . . . నాకు కథలు రాయడం చేతకాదని పద్యాలు, పాటలూ ఆఖరికి వచనగీతాలో రాసుకోకుండా నేనేమిటి కథా రచనకి పూనుకోవడమేమిటి ? . . ."[56] అని చాలా మంది అన్న దానికి సమాధానంగా " . . . ఈ (కథలు) రాస్తున్న వాళ్ళంతా ఏ లోపాలూ లేని రాతలు రాస్తున్నరా ? ఎంత కల్తీ సరుకు లోకంలో చలామణీ కావడం లేదు"[57] అని చురకలు వేశాడు. ఈ మాటలవల్ల శ్రీశ్రీ నిజాయితీ, నిబద్ధత అంతర్లీనంగా కన్పిస్తాయి.

శ్రీశ్రీ కథలపై ఇతరుల అభిప్రాయాలు చూద్దాం. "శ్రీశ్రీ రాసిన వాటిని కథలనేకన్న వచన ప్రయోగాలనవచ్చు. ...శ్రీశ్రీ ఇంచు మించు కథలకు శత్రువు..."[58] అని భావించిన కొడవటిగంటి కుటుంబరావే " ... అయితే శ్రీశ్రీ (కథా) ప్రయోగాలు పూర్తిగా విఫలం కాలేదు"[59] అని కూడా మెచ్చుకున్నాడు. శ్రీశ్రీ కథలపై వై. రామకృష్ణారావు "తెలుగు వచన రచనలో (కథల్లో) ప్రప్రథమంగా 'చైతన్య స్రవంతి' రచనా శిల్పాన్ని ఉపయోగించిన రచయిత మహాకవి శ్రీశ్రీ. శ్రీశ్రీ రచించిన 'కోనేటిరావు కథలు' (కోనేటి దినం, కోనేటి రాత్రి, కోనేటి జన్మ), 'ఒసే తువ్వాలు అందుకో' అనే కథానికలు చైతన్య స్రవంతి శిల్పంతో రచించబడినవే"[60] అని తెలుగు కథానిక ప్రక్రియలో చైతన్య స్రవంతిని ప్రవేశపెట్టిన వాళ్ళలో ఆద్యుడుగా శ్రీశ్రీని కీర్తించాడు. శ్రీశ్రీ కథలపై ఈ ఇద్దరు మాత్రమే ప్రస్తావించినట్లుగా కనిపిస్తుంది. మొత్తం మీద శ్రీశ్రీ కథలపై విమర్శకుల, సాహితీవేత్తల దృష్టి చాలా తక్కువ పడిందని చెప్పుకోవచ్చు. శ్రీశ్రీ కవిత్వం ద్వారా సమాజంలోని కుళ్ళును ఎత్తి చూపుతూ, వాటిని రూపుమాపడానికి కవితా ప్రక్రియను ఆయుధంలాగా ఎంతగా వాడుకున్నాడో కథానిక ప్రక్రియను మాత్రం అలాకాక ప్రధానంగా ప్రయోగ వైవిధ్యంతో రచించాడు. రొటీన్ కథల్లో ఉన్నట్లుగా కథ, పాత్రలు, సంఘటనలు మొదలైనవి శ్రీశ్రీ రాసిన చాలా కథల్లో కనిపించవు. వీటికి తోడు సామాన్యులు అర్థం చేసుకోవడానికి క్లిష్టతరమైన చైతన్య స్రవంతి, అధివాస్తవికత వంటి ధోరణులు మరికొన్ని కథల్లో ఉన్నాయి. అందువల్లేనేమో మామూలు పాఠకులు చాలా మంది శ్రీశ్రీ కథల్ని అర్థం చేసుకోలేక పోయారనిపిస్తుంది. అలా జరగడానికి కారణం బహుశా పాఠకులు అలవాటుపడిన అంశాల్ని కావాలనే స్వీకరించక పాఠకుల స్థాయిని తక్కువగా అంచనా వేయకుండా పాఠకులకు అంతవరకు పరిచితంకానీ, కలలో కూడా ఊహించని విధంగా కొత్త అంశాల్ని పొందుపరుస్తూ కథలు రాశాడు శ్రీశ్రీ. ఈ రకంగా ఎంతో ప్రత్యేకతను సంతరించుకున్న శ్రీశ్రీ కథలన్నీ పరిశీలించిన తర్వాత ఈ క్రింది అంశాల్ని ప్రతిపాదించవచ్చు.

- శ్రీశ్రీ కథలు చాలా మట్టుకు చిన్నవి. అందులో వర్ణనలు, సంభాషణలు సంక్షిప్తమైనవి

- శ్రీశ్రీ జీవితంలో తొలి రచన యతి ప్రాసల్లేని కందం లాంటి పద్యం. దీన్నిబట్టి చూస్తే శ్రీశ్రీలో ప్రధానంగా కవి హృదయమే ఉన్నట్టనిపిస్తుంది. అందుకే శ్రీశ్రీ కథల్లోనూ ఈ కవితాత్మకతే ఎక్కువగా కనిపిస్తుంది.

- స్థూల దృష్టితో చూస్తే ప్రయోగాత్మకంగా కనిపించినా, సూక్ష్మదృష్టితో చూస్తే అవి భావితరాలకి కథారచనలో నమూనా *(Model)* లుగా అనిపిస్తాయి. అందుకే అవి మామూలు కథలు చదివినట్లు చదవడానికి వీలులేదు.

- శ్రీశ్రీ కథలు వ్యాసాల్లాగా (బాధ కవిత్వానికి పర్యాయ పదం), వ్యాసాలు కథల్లాగ (కాళ్ళు చేతులు లేని కథ, కవిత్రయం) ఉంటాయి. అంతేగాక చాలా కథలను శ్రీశ్రీ, మిగతా రచయితలకి భిన్నంగా, తను కథ రాస్తున్నాననే కథా ప్రస్తావనతోనే కథలు రాశాడు.

- కొన్ని కథల్లో పూర్తిగా, మరికొన్ని కథల్లో పాక్షికంగా 'చైతన్య స్రవంతి' శిల్పం ప్రయోగించాడు శ్రీశ్రీ. ఇంకా అక్కడక్కడ 'అధివాస్తవికత' వంటి ధోరణులు కూడా కనిపిస్తాయి.

- శ్రీశ్రీ కథల్లో సామ్యవాద, హేతువాద భావనలు ఎక్కువగా ఉన్నా , ప్రధానంగా 'మానవతా' ప్రతిపాదనమే గమనిస్తాం.

# నాటికలు

తెలుగులో ఆధునిక సాంఘిక నాటకం 'కన్యాశుల్కం'. ఆ తరువాత చింతా దీక్షితులు, చలం, పి.వి. రాజమన్నార్, శ్రీశ్రీ మొదలైనవారు సాంఘిక నాటకాలు రాసిన వారిలో ప్రముఖులు. "సాహిత్యంలో ప్రయోగాత్మకమైన ప్రక్రియలు చేసి చూపించేవారు ఏరీ, ఏరీ, ఎక్కడ, ఎక్కడ అని వెతుక్కోవలసి వస్తోంది"[61] అని బాధపడ్డ శ్రీశ్రీ, నాటక రంగంలో కృషి చేశాడు. అందునా, రేడియో నాటికల ప్రయోగంలో విశేషంగా రచనలు చేశాడు. 1945కు ముందే 'భాగ్యలక్ష్మి' అనే సాంఘిక యక్షగానం రాశాడు. నాటిక ప్రక్రియకు చెందిన శ్రీశ్రీ రచనల్ని ఇక్కడ పరిశీలించడం జరుగుతుంది.

శ్రీశ్రీ ఇరవైకి పైగా నాటికలు రాశాడు. వీటిల్లో నాటికలు, రేడియో నాటికలు, ఒక యక్షగానమూ ఉంది. వీటిని దృశ్య - శ్రవ్య నాటికలుగా, స్వంత అనువాదాలుగా, గేయ - వచనాలుగా విభజించవచ్చు. ఈ విభజనలన్నిటికంటే విషయ పరంగా విభజించి విశ్లేషించడంలో ఎక్కువ ప్రయోజనం ఉండడమేగాక, విషయ విభజనకు లొంగుతున్నాయి కాబట్టి ఆవిధంగానే వివరిస్తాను. ఈ దృష్ట్యా శ్రీశ్రీ నాటికలను గమనిస్తే మృత్యువు, భవిష్యత్తు యుద్ధ వ్యతిరేకత, రాజకీయాలు ఎక్కువగా కనిపిస్తాయి. ఈ అంశాలకు భిన్నమైనవి, విషయ విభజనకు లొంగని వాటిని 'ఇతరాలు' అనే ఉప విభాగంలో చేర్చి వింగడిస్తాను.

**మృత్యువు**

శ్రీశ్రీ చాలా రచనల్లో మృత్యు ప్రసక్తి ఉంటుంది. ఇదే ధోరణి నాటికల్లోనూ కన్పిస్తుంది. బహుశా ఇలా ఉండడానికి కారణం, తన జీవితంలో మూడు మార్లు మృత్యువుతో పోరాడడం కావచు.[62] మృత్యువుపై విజయానికి సంకేతంగా అమృతాన్ని తాగడం 'చతురస్రం' నాటికలో వస్తువుగా స్వీకరించాడు. ఈ నాటిక ప్రధానోద్దేశాన్ని వివరిస్తూ "ఎప్పటికైనా మానవుడు మరణం

మీద విజయం సాధిస్తాడనే నమ్మకం నాకుంది. ఆ నమ్మకమే ఈ నాటికా రచనకు ఆధారం"[63] అని చెప్పాడు. ఇది 31-12-1999 నాడు ఉదయం నుండి మరుసటి రోజు ఉదయం వరకు జరిగిన కథ. ఒక గంటసేపట్లో ప్రదర్శితమయ్యే నాటిక ఇది. ఇందులో ఐక్యరాజ్య సమితి అమృతాన్ని యావత్ప్రపంచ ప్రజలకు మాత్రలు, ఇంజక్షన్ల రూపాల్లో పంచిపెడుతుంది. దానితో మానవులు మూడు పదుల వయస్సు వాళ్ళవ్వడమేగాక మృత్యుంజయులు కూడా అవుతారు. ఈ విధంగా 'చతురస్రం' నాటికలో మృత్యువుపై మానవుడు విజయాన్ని సాధించాలన్న, సాధిస్తాడన్న ఆకాంక్షను వ్యక్తం చేశాడు.

'చతురస్రం'లో అమృతాన్ని సంపాదించడంతో మానవుల వయస్సు సమంచేస్తే, 'గవేషణ' అనే నాటికలో మృత్యుకాలం ఆసన్నం కాకముందే మరణించిన మానవుడికి పునరుజ్జీవనావకాశం కల్పిస్తాడు. పొరపాటున మృత్యు దూతలు ఇంకా ఆయుస్సు పూర్తికాని ఓ వ్యక్తిని పైలోకాలకు తీసుకు వెళ్తారు. తమ తప్పు తెల్సుకొని అతన్ని తిరిగి భూలోకం పంపేలోగానే అతని శవాన్ని దహనం చేసేస్తారు. అప్పుడావ్యక్తి ఇతర శరీరాల్లోకి ప్రవేశించడం, అసంతృప్తితో తన శరీరమే తనకు కావాలని దేవలోక న్యాయ దేవతనడగడం, చివరకి అప్పుడే జన్మించబోయే శిశువులోకి ప్రవేశించి జన్మిస్తాడు. మొత్తం మీద ఈ నాటికలో 'మృత్యు గవేషకుడు' గా కన్పిస్తాడు. 'గవేషణ' నాటికలో లాగానే 'అనంతర యాత్ర' లోనూ మరణించిన ఒక వ్యక్తి ఆత్మ ఎన్నో ప్రదేశాలలో పరిభ్రమిస్తుంది. ఐతే మనిషిలోని బతుకు తీపి నాణానికి బొమ్మైతే, బొరుసు అతనిలో దాగుండే మృత్యు ప్రీతి. అదే ప్రస్ఫుటం చేస్తూ ఈ నాటికలో "చచ్చి పోవడంలో చాలా హాయుంది"[64], "మరణం ఎలా మధురంగా ఉంది"[65] అనే వాక్యాలు కన్పిస్తాయి. ఈ మృత్యుప్రీతి 'చరమ రాత్రి' కథలోనూ కన్పిస్తుంది.

మృత్యు ప్రసక్తి ఉన్న నాటికల్లో ఎంతో భిన్నమైంది 'సుప్తాస్థికలు. ఇందులో భారత జాతిపిత 'గాంధీజీ' నిర్యాణాన్ని వర్ణిస్తూ, యావత్ప్రపంచ ప్రజలేగాక విశ్వంలోని చుక్కలు సైతం ఎంతగానో స్పందించి పోయినట్లుగా చిత్రించాడు. ఒక పాత్రచే "సకల ప్రాణులనూ సమానంగ ప్రేమించగలిగిన వ్యక్తి మరణమా?"[66] అని ఒక పాత్ర చేత అనిపించి, మృత్యువుకు మనుష్య ధర్మాన్ని ఆపాదించాడు. విదూషక పాత్రలు ధరించే నటుడి జీవితంలోని ఎన్నెన్నో విపత్కర పరిస్థితుల్ని శ్రోతల ముందుంచి, అవి మనిషిని మరణం వైపుకి ఎలా దారి తీయిస్తాయో హాస్య, కరుణ, రసాలతో సమ్మిళితం చేస్తూ 'విదూషకుడి ఆత్మహత్య' రచించాడు. 'బలి' నాటికలో నిర్జీవి పాత్ర ద్వారా "ఇది నా జన్మభూమి / ఇదే నా స్మశానం / మరణాన్ని పరచుకొని / . . ."[67] అనీ, "నరకలోకపు మర్యాదలను / తిరస్కరిస్తున్నావు నీవు / అరవకు అరవకు / ఇక్కడ అరిస్తే / మరణం మేలుకుంటుంది . . ."[68] అని మృత్యు ప్రస్తావన తెచ్చాడు శ్రీశ్రీ. 'ఐన్‌స్టీయిన్' నీ, ఆయన 'థీయరీ

ఆఫ్ రిలేటివిటి' (సాపేక్ష సిద్ధాంతం) నీ అభిమానించే శ్రీశ్రీ, 'మరో ప్రపంచం'లో కాలాన్ని అర్థం చేసుకునేవారికి మరణం లేదని చెప్పాడు.[69] ఈ విధంగా 'అమ్మ' మరియు 'శిరస్సు చెప్పిన రహస్యం' వంటి నాటికల్లో కూడా మృత్యు ప్రస్తావన ఉంది.

**భవిష్యత్తు**

క్రాంత దర్శియైన రచయిత భవిష్యత్తును ఊహిస్తాడు. నాటికల్లో భవిష్యత్తుకి సంబంధించిన విభిన్నాంశాలను పరికించినప్పుడు శ్రీశ్రీని కూడా 'క్రాంతదర్శి' అనడంలో ఎటువంటి సందేహాలకి తావుండదు. తాను రాసిన నాటికల్లో భవిష్యత్తు ఎలా ఉండాలీ, ఎలా ఉంటుందని భావించాడో వివరిస్తాను.

భవిష్యత్తులో మానవుడు మరణాన్ని జయిస్తాడని శ్రీశ్రీ ఆశ. ఈ ఆకాంక్షను మానవుడు అమృతాన్ని సాధించినట్లుగా 'చతురస్రం'లో చిత్రించడంతో వ్యక్తమయింది. 'మరోప్రపంచం' నాటికలో 21 వ శతాబ్దంలో మానవులు ఎలా ఉంటారో ఊహించాడు. ఆ మానవులు ఆకు పచ్చని గాజు బంతిలా కన్పిస్తారు. అలా కనిపించడానికి కారణం పత్రహరితం కలిగి ఉండడమే. ఈ పత్రహరితంవల్ల 'కిరణ జన్య సంయోగక్రియ' ద్వారా ఆహారం తయారు చేసుకోగలుగుతారు. ఇలా మనుషులు ఆహారం తయారు చేసుకోవడం వల్ల ఆహార సమస్య శాశ్వితంగా తీరుతుందంటాడు. ఇక గోళాకారానికి కారణంగా రెండో ప్రపంచయుద్ధంలో పరమాణు బాంబుల ప్రయోగంవల్ల మానవుని లోని జంతుతత్వానికీ, వృక్ష తత్వానికీ మధ్య జరిగిన యుద్ధంలో ఏ తత్వమూ జయించక ఒక కొత్త పరిణామం జరిగినట్లుగా చెప్పాడు. ఈ కొత్తరకపు మానవులు పరస్పరం ఊహలతోనే సంభాషించుకొంటారనీ చెప్పాడు. ఐన్‌స్టీన్ ఊహించిన విధంగా "మేము కాలంలో జీవిస్తాము. కాలాన్ని అర్థం చేసుకున్న వాళ్ళకి మరణంలేదు."[70] అని నూతన మానవునితో అన్పిస్తాడు.

'చరిత్ర చెప్పని సందేశం' నాటికలో భూతకాలంలోని మనుషుల సంభాషణను వినిపించే యంత్రాన్ని గురించి ఊహిస్తాడు. ఈ ప్రయత్నం చరిత్ర పరిశోధనకు బాగా ఉపకరిస్తుంది.

**యుద్ధ వ్యతిరేకత**

శ్రీశ్రీ రచనల్లో యుద్ధ వ్యతిరేకత అతి తీవ్ర స్థాయిలో కన్పిస్తుంది. ఇలా కన్పించడానికి కారణం, మొదటి రెండవ ప్రపంచ యుద్ధాల మధ్య కాలంలో ఏర్పడిన సంక్షోభం. ఈ సంక్షోభ ఫలితంగా ఏర్పడిన ఆర్థిక మాంద్యం భారతదేశంలాంటి బడుగు దేశాలపై, శ్రీశ్రీ వంటి రచయితలపై కూడా పడింది. ఈ రెండు ప్రపంచ యుద్ధాలవల్ల ఏర్పడిన దుష్ఫలితాలను అంతచ్చక్షువుతో దర్శించాడు. అంతేకాదు ఆ ఫలితాలను సునిశితంగా అధ్యయనం చేసి, మానసికంగా అనుభవించి తన రచనలకు రూపాన్ని ఇచ్చాడు. అందుకే యుద్ధం వల్ల కలిగే దుష్పరిణామాలు శ్రీశ్రీ నాటికల్లో విశేషంగా కన్పిస్తాయి.

'చతురస్రం' లో "యుద్ధ రాక్షసికి అహింసాయుతంగా అంత్యక్రియలు జరిగాయి"[71] అనిపించడంవల్ల యుద్ధవాంఛపైనే మానవుడు విజయం సాధించినట్లుగా శ్రీశ్రీ అభివర్ణించినట్టైంది.

'యుద్ధం, యుద్ధం, యుద్ధం' పేరుతోనే ఒక నాటిక రాశాడు. యుద్ధం ఎంత బీభత్స పూరితమో తెలుపుతూ అటువంటి యుద్ధంపై మనకు ఏవగింపు, అసహ్యం కల్గింపజేస్తాడు. ఈ నాటికలోని మూడు భాగాల వివిధ కాలాలలో, విభిన్న స్థలాలలో జరిగిన మూడు యుద్ధాల్ని పాఠకుల కళ్ళముందుంచాడు.

మొదటి భాగంలో మహాభారత యుద్ధానంతరం బ్రహ్మరాక్షసుడు, బ్రహ్మరాక్షసి రణ భూమికి వచ్చి కళేబరాలని భక్షిస్తూ సంభాషించుకుంటారు. రాక్షసులు యుద్ధ వ్యతిరేకులు కాకపోయినా, వాళ్ళు మాట్లాడుకున్న మాటలు పరోక్షంగా యుద్ధాన్ని వ్యతిరేకించేవిగానే ఉండడం రచయిత సంభాషణా చాతుర్యాన్ని చాటుతుంది. రెండో భాగంలో పానిపట్టు యుద్ధానంతరం రణరంగంలోని ఆడ, మగ రాబంధులు "మన కోసమే జరిగినట్టుంది ఈ యుద్ధం"[72] అని మానవుల్ని అపహాస్యం చేస్తున్నట్టుగా మాట్లాడుతూ మృతదేహాల్ని ఆరగిస్తాయి. ఇక మూడో భాగంలో - రెండో ప్రపంచ మహాయుద్ధానంతరం ఇండియాలోని, జాతీయ యుద్ధరంగ కార్యాలయంలో ఎంతో ప్రేమగా మాట్లాడుకుంటున్న దొర, దొరసానిని చూపిస్తాడు. ఒక నల్లటి కవి (భారతీయుడని వ్యంగ్యం) ప్రవేశించి యుద్ధ పిపాసులైన దొర, దొరసానిని పార్వతీ పరమేశ్వరులుగా దర్శిస్తూ, ఆవిధంగానే కీర్తిస్తూ "యుద్ధం చిరకాలం వర్థిల్లుగాక"[73] అని నినాద మిస్తాడు. ఆఖరి భాగంలో, ఆఖరి వాక్యంలో తరతరాలుగా మానవుల, ముఖ్యంగా భారతీయుల నికృష్ట పరిస్థితిని అతి తీవ్రంగా నిరసిస్తాడు. వీటిలాగే 'కొక్కొరొకో', 'అమ్మ' వంటి ఇతర నాటికల్లో కూడా యుద్ధ వ్యతిరేకతను చిత్రించాడు.

**రాజకీయాలు**

సమసమాజాన్ని సాధించే కమ్యూనిష్టు ప్రభుత్వాన్ని మనసారా నమ్మిన శ్రీశ్రీ దాని సాదరంగా స్వదేశానికి ఆహ్వానించాడు. అణగారిన ప్రజలను మరోప్రపంచానికి తీసుకెళ్ళడాని 'మహాప్రస్థానం' లాంటి కవితల్లోనేగాక, వచన రచనల్లోనూ సందర్భం వచ్చినప్పుడల్లా రాజకీయాలను ప్రస్తావించాడు.

'చతురస్రం' నాటికలో ఐక్యరాజ్యసమితి సమావేశం, వివిధ దేశాల ప్రతినిధుల సంభాషణ, ప్రపంచ రాజకీయ స్థితిగతుల్ని తెలిపాడు. అయితే, అంతటితోనే సంతృప్తి పొందడు శ్రీశ్రీ. ఒక దేశంపై మరోదేశం పెత్తనం సాగించక పోవడం అన్ని దేశాలూ రాజకీయ, ఆర్థికాభివృద్ధి, స్వాతంత్ర్యాలను సాధించడం ప్రజల పరిస్థితులు చక్కబడడం వంటివి ప్రధానాంశాలు.

రెక్కవిప్పిన రివల్యూషన్' అనే అనువాద రచనలో ఫ్రాన్సులో 1968 వ సంవత్సరాన జరిగిన విప్లవాన్ని అభివర్ణిస్తూ "ఆహారమే కాక - గులాబీలు కూడా కావాలని కోరిన మొట్ట మొదటి విప్లవం ఇది''[74] అని అభిలషిస్తూ ఆర్థిక స్వాతంత్ర్యమే గాక మానసిక స్వాతంత్ర్యంకూడా మానవాళికి రావాలంటాడు.

స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రముఖ పాత్ర వహించి, అహింసా, సత్యాన్వేషణలతో యావత్ప్రపంచ ప్రజల దృష్టిని ఆకర్షించిన గాంధీజీ నిర్యాణాన్ని 'సుప్తాస్థికలు' నాటికలో ఓ కొత్త ధోరణిలో, తనదైన బాణీలో రచించాడు. ఇందులో గాంధీ మరణానికి ఒక రాష్ట్రం, దేశం, ఖండం, సమస్త ప్రపంచంతో పాటు విశాల విశ్వంలోని తారకాది సముచ్ఛయం కూడా పరితపించినట్లు వర్ణించాడు.

'భాగ్యలక్ష్మి' యక్షగానంలో 1945 నాటి ప్రాంతాల్లో భారతదేశ రాజకీయ స్థితినీ, ప్రజల దుస్థితినీ శ్రీశ్రీ వివరించాడు. ఆయన రాసిన 'కొక్కొరకో' నాటికకే మరోపేరు 'రాజకీయ కుక్కుటేశ్వరము'. పేరులోనే రాజకీయాన్ని పొందుపర్చి, వస్తు నిర్దేశంగావించాడు. ఇందులో రాజకీయ వాదుల్ని కోళ్ళతో పోల్చాడు. ఒక రాజకీయ నాయక కుక్కుటం. " . . . చేతుల్లో అన్ని గొడుగులేటి" ? అని స్వతంత్రకోళ్ళ నడుగగా, అందులో ఇంగ్లీషు స్వతంత్రకోడి "మా రాజకీయ విధానం. మీ రాజకీయ నినాదం 'ఏయెండకాగొడుగు' "[75] అని సమాధానం చెబుతుంది. ఈ సమాధానం రాజకీయ వ్యవస్థలోని అవకాశవాదానికి ప్రతీక. ఇలా నాటిక నిండా దుష్ట రాజకీయాలపై విమర్శ ఉంటుంది. ఈ నాటిక చివరలో " ... అన్ని భాషల కోళ్ళు కలసి కొత్త గూళ్ళు నిర్మించుకుంటాయి. విరోధాలకీ, విభేదాలకీ తావు లేని ఐకమత్యం అప్పుడే ఏర్పడుతుంది. అప్పుడే అరుణ పతాకంలాగా తూర్పు దిక్కున అరుణోదయ మౌతుంది. అప్పుడే మనకు సుభిక్షం ! అప్పుడే స్వస్తి ! అప్పుడే శాంతి" అని భరత వాక్యం పలుకుతాడు శ్రీశ్రీ. 'బలి' నాటికలో స్వర్గంలోని రాజకీయాలనూ, 'దడిగాడువానసిరా' నాటికలో చలన చిత్రరంగంలోని రాజకీయాలనూ వివరంగా చర్చిస్తాడు. ఇలా రాజకీయాల్లోని విభిన్న ధోరణులనూ, వైవిధ్యాలనూ శ్రీశ్రీ నాటికల్లో చూడగలం.

**ఇతరాలు**

ఇంతవరకు విశ్లేషించిన నాటికలేగాక, విషయపరంగా లొంగని నాటికల్ని పరిశీలిద్దాం. ఏప్రక్రియలో రచన చేస్తే ఆ ప్రక్రియకు సంబంధించిన విశేషాంశాలను వస్తువుగా గ్రహించి రచన చేయడం శ్రీశ్రీలో కన్పించే ప్రత్యేక లక్షణం. దీనికి ఉదాహరణగా, కథానికా ప్రక్రియలో కథానికకు సంబంధించిన అంశాలను ఇతివృత్తంగా గ్రహించి ' సీతయ్య', 'అనామిక' వంటి కథల్ని రచించినట్లుగానే రేడియో నాటిక ప్రక్రియలో, రేడియో నాటిక రికార్డును వేయబోతే, ఆ రికార్డు

పలకక పోవడమేగాక, సమ్మెకట్టడాన్నీ, మనుషులపై ఆరోపణ చేయడాన్ని వస్తువుగా తీసుకొని 'గ్రామఫోను రికార్డుల తిరుగుబాటు' నాటికగా రూపొందించాడు శ్రీశ్రీ.

ఈ నాటిక చదివినప్పుడు, గ్రామఫోన్ రికార్డులు కూడా తిరుగుబాటు చేసే అవకాశం ఉందంటే ఆశ్చర్యంతోపాటు, నవ్వూ వస్తుంది. దాంతోపాటే రికార్డులు పుట్టిన నాటి నుండీ మానవుడు వాటిని వినియోగించుకుంటున్న విధానం రూపుకడుతోంది. నాటిక చివర, ప్రోగ్రామ్ డైరెక్టర్ ప్రవేశించి, సూత్రధారుడు వేసిన రికార్డులన్నీ చెడిపోయినవని అంటాడు. ఆ విషయం తనకు ముందే తెలుసుననీ, అయినా ఆ చెడిపోయిన రికార్డులనే వేసి, రికార్డులు సమ్మె చేస్తున్నట్లు అనుభూతిని స్వీయవ్యాఖ్యానం ద్వారా శ్రోతలకు కలిగించాననీ చెప్తాడు. "నేనే గొంతుమార్చాను. నాలో ఒక భాగాన్ని గ్రామఫోన్ పేట్ల నాయకుణ్ణి చేశాను. నాతోనే నేను వాదించాను. సంగీతం చేత తిరుగు బాటు చేయించాను. సమ్మెకట్టించాను. సంగీతం చేత విప్లవం చేయిస్తే ఎలా ఉంటుందో చూపించడానికి అన్ని ప్లేట్లూ ఒక్క సారి వేశాను. అప్పుడే మీరు వచ్చారు"[76] అని సూత్రధారుడు పలికిన పలుకులు, చాకచక్యం పరోక్షంగా శ్రీశ్రీవే. మనుషుల చేత తిరుగుబాటు చేయించడంతో తృప్తిపొందని శ్రీశ్రీ, మానవ నిర్మితాలైన నిర్జీవ పదార్థాలు గ్రామ ఫోన్ రికార్డుల చేత కూడా తిరుగుబాటు చేయించి తన ప్రత్యేకతని నిరూపించుకున్నాడు.

ఊరికి దూరాన నోరావలించి, నీరింకి నిల్చొన్న ఒంటరి బావిలో ఎన్ని ధారుణమైన కథలు దాక్కొని ఉండే అవకాశం ఉందో 'ఒంటరి బావి' నాటిక వివరిస్తుంది. ఒంటరి బావి' ఊరి చివర్న ఉంటే, 'భూతాల కొలిమి' సందు చివర్నే ఉంటుంది. ఆ కొలిమిలో తన ప్రియుడ్ని ఎవరో నరికి పడేశారనీ, అతను జ్వలిస్తూ, కన్పిస్తున్నాడనీ, తనని చుంబించే వాడనీ ఒక స్త్రీ కంఠం శ్రోతలకు చెబుతుంది. ఆమె తల్లి కంఠం అది అబద్ధమనీ, ఆ కొలిమిలో ఉన్నవి బొగ్గు నిప్పులే అనీ చెప్తుంది. భ్రమలకీ, వాస్తవాలకీ మధ్య నున్న సన్నని సరళరేఖని తుడిపేస్తూ, 'ఏది సత్యం, ఏదసత్యం' అనే దిగ్భ్రమకులోను కావిస్తాడు శ్రోతలను శ్రీశ్రీ.

'బలి' లో దేవతల రాజైన దేవేంద్రుడికీ, రాక్షసరాజైన బలి చక్రవర్తికీ మధ్య నున్న వైరుధ్యాలను రమ్యంగా చిత్రించాడు. జారుడైన దేవేంద్రుని బారినుంచి ఒక అమాయకురాలిని రక్షించి బలిచక్రవర్తి తానుండే నరకలోకానికి తీసుకెళ్తాడు. తమ తమ నెలవులైన స్వర్గ, నరకాలలో నివసించే అర్హత లేమిటి? ఎవరి యోగ్యత ఎంత? జారుడైన దేవేంద్రుని కంటే దానశీలుడైన బలి చక్రవర్తి ఏవిధంగా తక్కువ? వంటి ప్రశ్నలను హేతువాద దృక్పథంతో భాగవతాంతర్గతమైన పౌరాణిక గాథను విశ్లేషించాడు. 'స్వామి : భూస్వామి' నాటికలో శరభయ్య 'భూపరిమితి చట్టం' వచ్చిన కాలంలో, ఆచట్టంలో లొసుగులను ఆధారంచేసుకొని తన భూమిని పోగొట్టు కోకుండా తెలివిగా వ్యవహరించి జాగ్రత్త పడడం కన్పిస్తుంది. ఇందుకోసం ఎంత నీచానికైనా ఒడి కట్టడానికి

సంసిద్ధపడే వ్యక్తి శరభయ్య. మూడో భార్యకు విడాకులివ్వడానికీ, ఆమెను స్వామివారి ఆశ్రమంలో ఉంచి 'బ్రహ్మజ్ఞాన యోగం' కలిగించడానికి పూనుకోవడం, మనుషుల్లోని దిగజారుడుతనానికి, విపరీత స్వార్థానికి అద్దంపడుతుంది.

చలనచిత్ర రంగంలో రచయిత స్థానం ఎంత నికృష్టంగా ఉంటుందో తెలిపే నాటిక దడిగాడు వానసిరా' సినీమాలకు రచనలు చేసేవాడు గాడిదతో సమానమనీ వివిధ అనుభవాలతో గ్రహించిన శ్రీశ్రీ, 'రాసిన వాడు గాడిద' అనే పదాన్ని తిరగేసి ఈ నాటికకు పేరు పెట్టాడు. ఎంత వయస్సు వచ్చినా, ఎంతజ్ఞానం పెరిగినా చిన్నపిల్లల్లో ఉండే సున్నితమైన భావాల్ని ఒదులుకోలేదు. బాల్యంలోని మాధుర్యం ఆయన్నెప్పుడూ ఆకర్శిస్తూనే ఉండేది. 'మహాప్రస్థానం' కవితా సంకలనంలోని 'శైశవగీతి' నిరూపించేది ఈ సత్యాన్నే 'విశాఖపట్టణం' ప్రాంతాల్లో, కొన్ని దశాబ్దాల క్రితం చిన్న పిల్లలు మామిడి కాయల్లోని జీళ్ళతో గోడల మీద 'దడిగాడు వానసిరా' వంటి రాతలు రాస్తుండే వారు. ఆ బాల్య స్మృతికి కూడా అద్దం పడుతుంది ఈ నాటిక నామధేయం. పిల్లలు ఉపయోగించే ఓమాట పెద్దల అనుభవాలకీ ఎలా సంకేత మవుతుందో ఈ నాటిక చదివితే బోధపడుతుంది.

'విచిత్రమే సౌందర్యం' అని భావించి విచిత్ర రచనలు చేయడంలో కూడా శ్రీశ్రీ సిద్ధహస్తుడు. ఈయన రచించిన కోనేటి దినం, కోనేటిరాత్రి, కోనేటి జన్మ అనే కథల్లో 'కోనేటి రాత్రి'ని 'గుమాస్తాకల' గా నాటకీకరణ గావించాడు. ఒక రచయిత తను రాసిన కథను, తానే నాటికగా మలచడం తెలుగు సాహిత్యంలో అరుదు. ఈ కారణంగా 'గుమాస్తాకల'ను 'కోనేటి రాత్రి' కథనూ తులనాత్మకంగా పరిశీలిద్దాం.

'గుమాస్తాకల' అనే నాటికలో కోనేటిరావు, అతని భార్య, వాళ్ళ అబ్బాయి సజీవపాత్రలు. కోనేటిరావు పాత్రలోని ఆశా, భయం అనే భావనలను పాత్రలుగా మలిచాడు శ్రీశ్రీ. గుమాస్తా యైన కోనేటిరావు నిజ జీవితంలోని అసాధ్యాలను కలలుగా కంటాడు. ఒక నాటి రాత్రి ఇతను కన్న మూడు స్వప్నాలే ఈ-నాటిక ఇతివృత్తం. ఈ కలలు 1. ఇంజనీరు కోనేటిరావుకు అమెరికా ఆహ్వానం, 2. యుద్ధంలో జర్మనీ దేశకమాండర్‌గా 'కోనేట్' పంచమ ప్రపంచ యుద్ధంలో పాల్గొనడం, 3. కథానాయకుడిగా సినిమాలో నటించడం.

'కోనేటిరాత్రి' కథలో కోనేటిరావు నాలుగు కలల్నికంటాడు. నాల్గవ కలలో భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ఒక భాగంగా సాగిన సత్యాగ్రహోద్యమంలోనూ పాల్గొంటాడు. ఈ రెండు ప్రక్రియల మధ్య ఉన్న ప్రధానమైన తేడా ఇదే.

'జడభరతుడు' పాత్ర పౌరాణిక గాథల్లో ఉంది. ఈ పేరుతోనే శ్రీశ్రీ ఒక నాటిక రాశాడు. అందులో 'జడభరతుడు' అసలు కన్పించడు. జడభరతుడు రాత్రి వేళ 'కాపలాకాయడం' అనే

అంశం మాత్రం ఒక కొత్త రూపంలో సాక్షాత్కారిస్తుంది. అలవాటు ప్రకారం శ్రీశ్రీ ఈ నాటికలో ఎన్నెన్నో విషయాలు చేర్చుకుంటూ పోతాడు. ఉదాహరణకి నాటక సమాజంలో డైరక్టరు, కవికి మధ్య వచ్చే స్పర్థలు, కవుల అవకాశవాదం, గ్రాంథిక భాషని నిరసించడం, తలాతోకాలేని నాటక కథల మీద వ్యతిరేకత మొదలైనవి. ఇవన్నీ నాటికకి ఒక కొత్త రూపాన్నిస్తాయి. ఇందులో శ్రీశ్రీ ముద్ర స్పష్టంగా కనిపిస్తుంది.

'శిరస్సు చెప్పిన రహస్యం' నాటికలో నిబద్ధత కలిగిన కళాకారుడికి జీవితం ఎంత దుర్భరంగా మారుతుందో చూపాడు. చెకోవ్ రాసిన నాటకం 'The Cherry Orchard' ను 'సంపెంగతోట' పేరుతో అనువదించాడు.[77] ఇందులో స్వంత ఇంటిని అమ్ముకున్న వాళ్ళు ఆయింటికి సంబంధించిన జ్ఞాపకాలతో తర్వాత కాలంలో ఎలా సతమతమౌతారో చెప్పబడింది. చెకోస్లవేకియన్ రచయిత కారెల్‌చాపెక్ రాసిన The Mother నాటికను 'అమ్మ' పేరుతో శ్రీశ్రీ అనువదించాడు. ఈ నాటికలో నలుగురు కొడుకుల్నీ దేశంకోసం పోగొట్టుకోవలసి వచ్చిన ఒక స్త్రీ తప్పనిసరి పరిస్థితుల్లో ఐదవ కొడుకును కూడా దేశం కోసం యుద్ధానికి స్వయంగా పంపడమే వస్తువు. తనకంటే మాతృదేశం గొప్పదని ఓ తల్లి త్యాగం చిత్రితమైంది.

ఇలా వివిధ ఇతివృత్తాలతో నాటికల్ని రాసిన శ్రీశ్రీ, ఒక ప్రత్యేక రీతిలో నిర్వహించడం శ్రీశ్రీలోని విశిష్టత. వీటిలో శీర్షికలు ఆరంభం-ముగింపు, పాత్రలు ప్రతిపాదిత అంశాలు ఎలా ఉన్నాయో చూద్దాం.

**శీర్షికలు**

రచనలకు పేర్లు పెట్టడంలో శ్రీశ్రీ ప్రత్యేక శ్రద్ధ వహిస్తాడనిపిస్తుంది. 'చతురస్రం' పేరుతో రాసిన నాటికలో నాలుగు ప్రధాన పాత్రలున్నాయి. మానవ జీవితంలో ప్రముఖ స్థానం ఆక్రమించే నాలుగంశాలు జ్ఞానం, రాజ్యం, సిరి, కళ. వాటినే పాత్రలకు పేర్లుగా పెట్టాడు. వయోభేదాలున్న ఈ పాత్రలు అమృత సేవనం తర్వాత సమవయస్కులుగా, అంటే ముప్పయ్యేళ్ళ వాళ్ళుగా మారుతారు. 'చతురస్రం'లోని సమ బాహుభుజాలు వీరే. గణిత శాస్త్రంలోని పారిభాషిక పదాన్ని ప్రతీకాత్మకంగా ఈ నాటికకు నామకరణం చేశాడు.

'గవేషణ' అంటే వెదకడం. 'గవేషణ' నాటికలో ఆయుస్సు అంతం గాక ముందే పైలోకాలికి తీసుకుపోబడ్డ ఒక వ్యక్తి మళ్ళీ జన్మ ఎత్తడంకోసం శరీరాన్ని వెతుక్కోవడం జరుగుతుంది. వస్తువుకి తగ్గ శీర్షిక 'గవేషణ' అన్న పదం.

"అవి ధరాగర్భమున / మానవాస్థికా పరంపరలు / సుప్త నిశ్శబ్ద సంపుటములు ... "[78] అని 'సుప్తాస్థికలు' కవిత ఆరంభమవుతుంది. ఈ 'సుప్తాస్థికలు' అనే కవిత పేరునే నాటికకు పెట్టాడు.

ఈ నాటిక మరియు కవితలలో ఇతివృత్తం గాంధీజీ నిర్యాణమే. "ఎముకలు మరణానికి చిహ్నం కాబోలు, ఎవరి మరణం. ఏమిటిదంతా?"[79] అనే తాత్విక చింతనతో ప్రారంభమై, ఆ మరణం అసమానుడైన గాంధీజీదని నిర్ధారిస్తాడు శ్రీశ్రీ. సుప్తాస్థికలు మరణానికి సంకేతమైనా, మరణం జగద్విజేత అయినా, ఆ మరణాన్ని కూడా జయించే శక్తి ఒక్క ప్రేమకే ఉందని ఆ ప్రేమ మూర్తిమత్వం చెందితే గాంధీజీగా అవుతుందని ప్రేమతత్వానికి మరణం లేదని ఈ నాటిక ద్వారా నిరూపిస్తాడు శ్రీశ్రీ.

నాటికలలో విదూషక పాత్ర వేసే ఒక నటుడు, తన జీవితం దుర్భరమైపోగా ఆత్మహత్య చేసుకుందామనుకుంటాడు. అయితే, మరణించేది ప్రయోక్త. విదూషకుడి ఆత్మహత్య, విదూషకుడి చేష్టల్లో ఓ భాగంగానే మారి పోయింది. అతను ఎంతో తీవ్రంగా దాన్ని నాటిక రూపంలో శ్రోతల ముందుంచాడు శ్రీశ్రీ. అమలు చేయదలుచుకున్నా, సఫలీకృతంకాని విదూషకుడి ఆత్మహత్యని అదేపేరుతో రాశాడు శ్రీశ్రీ.

గ్రామ్‌ఫోన్ రికార్డుల తిరుగుబాటు, బలి, గుమాస్తాకల మొదలైన నాటికలకు సూటిగా పేరు పెట్టాడు. మనుషుల లక్షణాలను కోళ్ళకు ఆపాదిస్తూ రాసిన నాటికకు 'కొక్కొరొకో'గా నామకరణం చేశాడు. సినీ పరిశ్రమలో రచయిత స్థానాన్ని తెల్పడానికి సూటిగా పేరుంచక 'రాసినవాడు గాడిద' అక్షరాల్ని చివరి నుండి 'దడిగాడు వానసిరా' గా తిరిగేసి పేరు పెట్టాడు శ్రీశ్రీ. ఇతివృత్తాలలో, పాత్ర చిత్రణలో, సంఘటనల చిత్రీకరణలో వైవిధ్యాన్ని చూపించినట్లుగానే పేర్లు పెట్టడంలో కూడా చూపాడు శ్రీశ్రీ.

**ఆరంభం - ముగింపు**

సాధారణంగా శ్రీశ్రీ నాటికల్లో నాందీ ప్రస్తావనలుండవు. అయినా కొన్ని నాటికలు సాంప్రదాయ పద్ధతిలో సాగుతాయి. ఉదాహరణకు 'విదూషకుడి ఆత్మహత్య' సాంప్రదాయ నాటికల్లో సూత్రధారుడు వచ్చి జరుగబోయేది చెబుతుంటే, దానికి అనుసంధానంగా ఉండే ప్రశ్నలకు నటి అతన్ని అడగడం పరిపాటి. 'విదూషకుడి ఆత్మహత్య'లో ప్రయోక్త నాటిక ఆరంభిస్తే మరొక పాత్ర పదేపదే ప్రశ్నలతో 'ఆటంకా'లను కల్పిస్తుంది. ఈ నాటిక ఆరంభంనుంచీ అంతం వరకు ఎంతో కుతూహలాన్ని రేకెత్తిస్తుంది. ప్రయోక్త, ప్రధాన పాత్రలయిన విదూషకుడి పేరేమిటని 'ఆటంకం' అనే పాత్ర అడిగినప్పుడల్లా, మందహాసం, గడియారం, గంగాధరం అని మార్చి మార్చి చెబుతాడు. ఇలా చెప్పడంవల్ల శ్రోతల్లో ఉత్కంఠత పెరుగుతుంది. ఈ నాటిక ఎంత హాస్యంతో మొదలవుతుందో అంతగానూ విషాదాన్ని సమ్మిళితంగావించుకొని అంతమవుతుంది.

శ్రీశ్రీ తన కవితలతో ఆరంభించిన నాటికలూ ఉన్నాయి. 'ఒంటరిబావి' నాటిక "నోరావులించి / ఊరికి దూరాన పొంచి / నీరింకిపోయి నిలుచుందొక ఒంటరిబావి /

దారుణములైన కథలున్నవి దానిగురించి / చెప్పనా, చెప్పనా ఆ బావి గురించి / విప్పనా, విప్పనా నావిషాదాల సంచి"[80] అన్న కవితతో ఆరంభమయితే, కొన్ని నాటికలు కవితలతో అంతమవుతాయి. ఉదాహరణకు 'చతురస్రం' నాటిక "రెండు ఖడ్గాలు / రెండు ఖంజరీటాలు / రెండు అగ్ని పర్వతాలు . . ."[81] అనే సుదీర్ఘ కవితతో అంతమవుతుంది. 'మరో ప్రపంచం' నాటిక 'మహాప్రస్థానం' కవితలోని "కనబడలేదా మరో ప్రపంచపు / కణకణమండే త్రేతాగ్ని" అనే పాదాలతో ముగుస్తుంది.

ఈ రకంగా శ్రీశ్రీ తన నాటికలను సంభాషణతో, కవితలతో గానీ ఆరంభించినట్లుగానే ముగింపుల్లో కూడా అదే విధానాన్ని పాటించాడు.

**పాత్రలు**

నాటకాల్లో పాత్ర చిత్రణ రచయిత వైదుష్యానికి దర్పణంగా నిలుస్తుంది. తన నాటకాల్లో సైంటిస్టులూ, విదూషకులూ, కవులూ, శిల్పులూ సినీకళాకారులూ మొదలైన వివిధ వృత్తులకు సంబంధించిన వారినీ, విభిన్న మనః ప్రవృత్తులను కలిగిన వారినీ పాత్రలుగా మలిచాడు. తనలాంటి లక్షణాలున్న పాత్రలను కూడా సృష్టించుకున్నాడు. 'చతురస్రం' లో 'సిరి' పేర కవి పాత్రను రూపొందించాడు. అంతేగాక ఈ పాత్ర ఒక సారి " . . . ప్రేయసీ ! నీ పేరు రాక్షసి అన్నాడు శ్రీశ్రీ ఈనాడు"[82] అనడంవల్ల 'సిరి' పాత్రే శ్రీశ్రీ అని నిర్ద్వంద్వంగా చెప్పొచ్చు. ఈ నాటికలోనే 'అఖిల ప్రపంచం టీవీ, రేడియో' లో వార్తలు చదివే వ్యక్తి పేరు 'విశ్వం' అని ఉండడం చాలా ఔచిత్య వంతంగా ఉంది.

పాత్రల స్వభావాన్ని బట్టి ఆయా పాత్రలకు నామకరణం చేశాడు. ఉదాహరణకి 'చతురస్రం'లో శాస్త్రవేత్త పేరు 'జ్ఞానం.' 'విదూషకుడి ఆత్మహత్య' లో నాటకాన్ని ఆరంభించడానికి అవరోధం కలిగించే పాత్ర పేరు 'ఆటంకం'. ఇలా స్వభావానుకూలమైన పేరుండడం సాధారణంగా జరగదు. ఈ విషయాన్నే 'కన్యాశుల్కం' విమర్శలో శ్రీశ్రీ, " . . . పాత్రల నామకరణం ఒకటి వాస్తవరచనా సూత్రాలకి విరుద్ధం. మంచివాళ్ళ పేర్లు మంచిగుణాలు సూచించేవిగానూ, చెడ్డవాళ్ళపేర్లు చెడ్డగుణాలు సూచించేవిగాను ఉండడం ప్రాచీన సంప్రదాయం".[83] అని గుర్తించి గురజాడను విమర్శించిన శ్రీశ్రీనే తన నాటికల్లోనూ అదే తప్పు చేశాడు.

'విదూషకుడి ఆత్మహత్య'లో ఒకే పాత్రకి గడియారం, మందహాసం, గంగాధరం వంటి పేర్లన్నీ మాటి మాటికి మారుస్తూ గందరగోళాన్ని సృష్టిస్తాడు. దీనికి వివరణేమో అన్నట్టుగా ప్రయోక్త ద్వారా "...నేను సృష్టించిన పాత్రకి నాయిష్టం వచ్చిన పేరు పెడతాను"[84] అని చెప్పిస్తాడు రచయిత. అందమైన అప్సరసకు అంత అందమైన పేరును వెదకి మరీ పెడతాడు శ్రీశ్రీ. 'బలి'లో 'జలాంతశ్చంద్ర చపల'గా పేర్కొంటాడు. 'గవేషణ'లో న్యాయ దేవతను " . . . వయస్సులేని, నేత్రాలు లేని ఒక స్త్రీ మూర్తి"[85] అని చిత్రంగా ఊహించాడు.

నాటికల్లోని కొన్ని పాత్రలకు మానవుడు ; మృత్యుదూత 1, 2; ఒక గొంతుక, ఇంకో గొంతుక, కనబడని గొంతుక ఇలా రకరకాల పేర్లు పెడతాడు. ఇంతేగాక ఆశ, భయం వంటి మానసిక అవస్థలనూ, కంఠధ్వనులూ, సంధ్య, అంధకారం, నక్షత్రాల వంటి వాటిని కూడా పాత్రలుగా మలిచాడు.

పేర్లు పెట్టడంలో శ్రీశ్రీ కనబరచిన విలక్షణతను గురించి అద్దేపల్లి రామమోహనరావు "... పాత్ర చిత్రణలో సహజత్వంకంటే సాంకేతికత్వం ఎక్కువ"[86] అని అన్నాడు. శ్రీశ్రీ రేడియో నాటికల వివిధ ప్రయోగాలను వివరించిన పి. శివలక్ష్మి "... తన రేడియో నాటికలను స్వల్ప పరిమాణంకల ఇతివృత్తంలో అత్యంత గంభీరార్థాలను శ్రోతల హృదయాలలో స్ఫురింపజేయాలనే ఉద్దేశంతో ప్రయోగించారు,"[87] అని నాటిక రచనా వైశిష్ట్యాన్ని పేర్కొన్నది. మొత్తం మీద శ్రీశ్రీ నాటికలను పరిశీలించిన తర్వాత ఆయన దృక్పథాన్ని అంచనా వేద్దాం.

**నాటికల్లో శ్రీశ్రీ దృక్పథం**

మానవుడు మరణాన్ని జయించడం, రాబోవు శతాబ్దంలో మానవ పరిణామం, కమ్యూనిజం నాస్తిక భావాల వ్యాప్తి, మానవత్వంపై ప్రగాఢ విశ్వాసం వంటి అభ్యుదయాంశాల్ని సందర్భం వచ్చినప్పుడల్లా నాటికల్లో బలంగా ప్రతిపాదించాడు శ్రీశ్రీ. ఈ నాటికల గురించి అద్దేపల్లి రామమోహనరావు "... అతని (శ్రీశ్రీ) ఏ నాటికలో నైనా ... అభ్యుదయ భావన యొక్క మెఱుపు అక్కడక్కడ కన్పిస్తూనే ఉంటుంది. శ్రీశ్రీలో అభ్యుదయ భావన ఒక శ్రీ, శిల్పదృష్టి మరొక శ్రీ. '1 + 1 = 1' లాగా ఈ రెండు కలిసి శ్రీశ్రీ"[88] అని పోల్చడంతో అభ్యుదయ, శిల్ప వైవిధ్యం కలగలిసిన భావకుడూ, పురోగామియైన నాటికా కర్తగా శ్రీశ్రీని భావించవచ్చు.

మూడో అధ్యాయం

# కథా రహిత సాహిత్యం

"సాహిత్య పరిణామాలను సామాజిక పరిస్థితులతో సమన్వయించి చారిత్రక దృక్పథంతో సమీక్షించగలిగిన వాడే సద్విమర్శకుడు. అతడే మార్క్సిస్టు విమర్శకుడు"

-శ్రీశ్రీ

(వ్యాసాలు రివ్యూలు, పుట - 48)

# కథా రహిత సాహిత్యం

ఆధునిక సమాజ అవసరాలకనుగుణంగా వచనంలో ఎన్నో ప్రక్రియలు పుట్టుకొచ్చాయి. వాటిల్లో కొన్ని కథా సహిత 'కల్పనాత్మక' సాహిత్యంగా ఉంటే, మరికొన్ని కథా రహితమై 'విమర్శనాత్మక' సాహిత్యంగా ఉన్నాయి. వీటిల్లో రెండోదయిన 'కథేతర సాహిత్యం'లోని దాదాపు అన్ని ప్రక్రియలూ 'ముద్రణాయంత్రం అందుబాటులోకి వచ్చాకే ఆరంభమయ్యాయి. అచ్చు యంత్రం వలన పుస్తక రూపంలో వ్యాసాలు, పీఠికల వంటివి వెలువడితే పత్రికల ద్వారా సంపాదకీయాలు, సమీక్షలు, ప్రశ్న జవాబులు మొదలైనవి ఆవిర్భవించాయి. ఉపన్యాస ప్రక్రియ అచ్చుయంత్రానికంటే ముందు నుండే ఉన్నప్పటికీ, అది పుస్తక రూపంలో పదేపదే చదువుకోడానికి అనుకూలంగా ముద్రణవల్లే సాధ్యపడుతున్నది. ఇట్లా ఆరంభమైన విమర్శనాత్మక 'కథేతర సాహిత్యా'న్ని తెలుగులో ఎందరో సృజించారు. కందుకూరి వీరేశలింగం, కట్టమంచి రామలింగారెడ్డి, వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి, గుడిపాటి వేంకటచలం, పానుగంటి లక్ష్మీనరసింహారావు, చింతాదీక్షితులు, శ్రీశ్రీ, నార్ల వేంకటేశ్వరరావు, కుందుర్తి ఆంజనేయులు, కొడవటిగంటి కుటుంబరావు మొదలైన వారెందరో ఉన్నారు. వారిలో శ్రీశ్రీ 'కథేతర సాహిత్యం' గూర్చి పరిశీలించడం ప్రస్తుతాంశం.

శ్రీశ్రీ వెలువరించిన వ్యాసాలు, ఉపన్యాసాలు పీఠికలు, సమీక్షలు, సంపాదకీయాలు, ప్రశ్నజవాబులు, ప్రకటనలు, సందేశాలుగా ఉన్న ప్రక్రియల్లోని రచనలు ఈ విభాగంలోకి వస్తాయి.

# వ్యాసాలు

అచ్చమైన ఆధునిక ప్రక్రియ వ్యాసం. శ్రీశ్రీ వ్యాసాలను రాయడానికి ముందే కందుకూరి, గురజాడ, కొమర్రాజు, కట్టమంచి మొదలైన వారెందరో వ్యాసప్రక్రియను పరిపుష్టం చేశారు. ఈ ప్రక్రియ వికసిస్తున్న దశలో శ్రీశ్రీ వ్యాస రచన ప్రారంభించి, మరింత వన్నె చేకూర్చాడు.

ఆనందవాణి, నవోదయ, తెలుగు స్వతంత్ర వంటి పత్రికల్లో 'వారం వారం' వ్యాసం రాసేవాడు శ్రీశ్రీ. ఆయన కాలమిస్టుగానే గాక ప్రత్యేక సంచికలకూ, ఆంధ్ర దర్శిని, మహతివంటి పుస్తకాలకూ రాసిన వ్యాసాలు ఉన్నాయి. కవిత్వం తీరు తెన్నులను తన కవిత్వ పోకడలను సాహిత్య వ్యక్తులపైనా, సినిమాల గూర్చి ఇలా రకరకాల విషయాలపై వైవిధ్యంతో కూడిన వ్యాసాలు రాశాడు. ఈ వ్యాసాలు సంఖ్యా పరంగా నూటాఇరవైకి పైగా ఉన్నాయి. వీటిని వివరించడంలో సౌలభ్యం కొరకు 1). సాహిత్యం, 2). వ్యక్తులు, 3). సినిమాలు, 4). ఇతరాలుగా విభజించడమైనది.

**సాహిత్యం**

శ్రీశ్రీ భిన్న సందర్భాలలో  రాసిన వ్యాసాల్లో వివిధ సాహిత్య ప్రక్రియలపై వెలుబుచ్చిన అభిప్రాయాలనూ, ప్రత్యేకంగా వ్యాసాలుగా రాసినవి, ఇతర వ్యాసాల్లో సందర్భాను సారంగా రాసిన వాటిని (అ). కవిత, (ఆ). కథ, (ఇ). నాటకం, (ఈ). నవల, (ఉ). వ్యాసం (విమర్శ), (ఊ). సాహిత్యంపై సాధారణం (General) గా చెప్పిన అంశాలను ఉపవిభాగాలలో వివరిస్తాను.

**(అ). కవిత**

వచన రచనలెన్ని చేసినా కవిగా ప్రసిద్ధుడైన శ్రీశ్రీ కవిత్వంపై వెలుబుచ్చిన అభిప్రాయాలను ముందు పరిశీలిద్దాం.

తన ఎనిమిదవ ఏట కందంలాంటి పద్యం రాశాడు. అందులో ఛందస్సు లేదు. దాని గురించి 'నాతొలి రచన' అనే వ్యాసంలో "... యతి ప్రాసలు లేని పద్యాలు వ్రాస్తుండడం చూసి మానాన్న గారు నాకు 'సులక్షణ సారం' గ్రంథం కొని పెట్టారు. ఛందస్సు ప్రథమ పాఠం చెప్పారు. .. అప్పటికి నా వయస్సు ఏడెనిమిది సంవత్సరాలకు మించి ఉండదు"[1] అని చెప్పుకున్నాడు. ఇలా మొదలైంది శ్రీశ్రీ కవితా జీవితం.

తన తొలి కవితాయత్నం గూర్చి చెప్పడమేగాక తన తొలి కవితా సంపుటి గూర్చి "1928 లో మొదటి ఖండ కావ్య సంపుటి (ప్రభవ) మా నాన్న గారిచ్చిన డబ్బుతో రాజమండ్రి సరస్వతీ పవర్ ప్రెస్‌లో అచ్చువేయించాను"[2] అని 'పాతికేళ్ళ సాహిత్యం' అనే వ్యాసంలో తెలిపాడు. ఈ కావ్యాన్ని రాయడానికి ప్రభావం చూపిన వాళ్ళుగా ప్రముఖ తెలుగుకవులు కృష్ణశాస్త్రి, విశ్వనాథలను 'నా నుంచి నేటి దాకా' వ్యాసంలో పేర్కొన్నాడు. ఆ తర్వాత వీరి ప్రభావం నుండి బయటపడడానికై "సొంత గొంతుకను వెతుక్కోవడానికి పరిశోధనలు సాగిస్తున్న ఆరోజులలో ఏవో ఏవేవో ఛందస్సులు సుడులు తిరిగేవి నాలో లోలోపలి లోయల లోతులలో"[3] అని చెప్పుకున్న శ్రీశ్రీ మదిలో జరిగిన మార్పుల ఫలితంగానే 1933 లో "నేను సైతం / ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి / ఆహుతిచ్చాను" గేయాన్ని రచించాడు. ఈ (జయభేరి) కవిత వల్ల తన కవిత్వానికే గాక తెలుగు కవిత్వానికి కూడా దాస్య విమోచనం కలిగినట్లు ఒక వ్యాసంలో తెలిపాడు.[4] ఈ కవిత రాసినప్పటి నుండి ఒక దశాబ్ద కాలం వరకు రాసిన కవితలే 'మహాప్రస్థానం' కావ్యంగా ఆవిర్భవించింది.

భావ కవిత్వంలోంచి పుట్టుకొచ్చిన శ్రీశ్రీ, ప్రజల్ని ఏమాత్రం పట్టించుకోని అవకాశవాద కవిత్వంగా 'ఆత్మాశ్రయ కవులు' అనే వ్యాసంలో భావకవిత్వాన్ని తీవ్రంగా నిరసించాడు. భావ కవిత్వానంతరం ప్రజాక్షేమమే ధ్యేయంగా నవీన (అభ్యుదయ) కవిత్వం ఆవిర్భవించింది. దీనిలో భాష, భావం, ఛందస్సు అన్ని వినూత్నమైనవే. ఇలాంటి అభ్యుదయ కవిత్వంలో నియమాలు ఉండవనేది తప్పని, అయితే పాత నియమాల స్థానంలో కొత్త కొత్త నియమాలున్నాయని 'సౌలభ్యం' వ్యాసంలో వివరించాడు. ఇలా అభ్యుదయ కవిత్వం గురించేగాక అభ్యుదయ రచయితల సంఘం గూర్చి '50 సం॥ల తెలుగు సాహిత్యం' అనే వ్యాసంలో 1920-30 ల మధ్యలో 'సాహితీ సమితి' ఎంతబలంగా ఉండేదో '40' ల తరువాత అరసం అలా ఉండేదని వివరించాడు. ఈ విధంగా సాహితీ సమితి, అరసంలను ప్రస్తావించిన శ్రీశ్రీ 1970 (విరసం ఆవిర్భావం) లనుండి ఎక్కడ ఏవ్యాసం రాసినా విరసం ప్రసక్తి తీసుకొచ్చాడు. 'ఝంఝ' కవితా సంకలనం గురించి రాస్తూ "విప్లవరచనా తరంగం విజృంభిస్తోంది. పాతకి స్వస్తి కొత్తకు స్వాగతం చెబుతూ మన మనుమల మునిమనుమల భవిష్యత్తుకోసం రచనలు సాగించడమే మన తక్షణ కర్తవ్యం"[5] అని విరసం లక్ష్యాన్ని చెప్పాడు. ఇలా కవిత్వోద్యమాల గూర్చేగాక కవిత్వంపై కూడా వ్యాసాలు రాశాడు. అలాంటి వాటిల్లో 'చిత్రకవిత్వం'

అనే వ్యాసం ఒకటి. దీన్ని " . . . సామాజిక దృష్ట్యా మనోవైజ్ఞానిక రీత్యా పరిశీలించడం మాత్రమే"[6] అని ఆ వ్యాసాన్ని తాను ఏకోణం నుండి రచిస్తున్నాడో తెలిపాడు. నిజానికి విచిత్రం లేకుంటే కవిత్వమేకాదని, కాబట్టి కవిత్వమైందంతా 'చిత్రకవిత్వం'గా శ్రీశ్రీ చెప్పడం చూస్తే 'విచిత్రమే సౌందర్యం' అన్న దృష్టి శ్రీశ్రీలో ఎంతగా ఉందో ఊహించవచ్చు.

'కవిత్వం ఎప్పుడైనా ప్రజలకు నచ్చలేదంటే' అనే విషయం గూర్చి చెప్తూ "నీ కవిత్వం . . . నా కవిత్వం . . . ఇంకోడి కవిత్వం . . . రుచించ లేదంటే అది నీ తప్పూ . . . నా తప్పూ . . . ఇంకోడి తప్పూ. . . అంతే!"[7] కానీ కవిత్వం తప్పు కాదని 'కావ్యరంగం' అనే వ్యాసంలో చెప్పాడు. ఇంకా కవిత్వ మెప్పుడూ నిత్యనూతనంగా, విచిత్రంగా ఉండాలని శ్రీశ్రీ పై వ్యాసాన్నిబట్టి గ్రహిస్తాం. అలాంటి కవిత్వాన్ని సృష్టించే కవులను ఆస్థాన కవులుగా నియమించడం రాజుల కాలం నుండి వస్తుంది. రాజు తనకు నచ్చిన కవిని 'ఆస్థానకవి' గా నియమించేవాడు. ఈ 'ఆస్థానకవి' పదవినే శ్రీశ్రీ నిరసించాడు. ఒకవేళ ఈ నాటి ఆధునిక కాలంలో 'ఆస్థానకవి'నే నియమించాల్సి వస్తే తప్పక ప్రజాస్వామిక పద్ధతుల్లో ఎన్నుకోవాలని సూచించాడు. అదెలా అంటే ప్రభుత్వం కొందరు కవుల జాబితాను తయారు చేసి, అందులోని ఒక్కొక్కరికి ఒక్కొక్క ఓటు ఇచ్చి, తాము వేసే ఓటు తమకు వేసుకోకూడదనే నియమం ఉంచి, తమలో నుండే తామే ఒక కవిని ఆస్థానకవిగా ఎన్నుకోవాలేగానీ ప్రభుత్వానికి ఇష్టమొచ్చిన వారిని ఆస్థానకవిగా నియమించకూడదని శ్రీశ్రీ 'ఆస్థానకవులు' అన్న వ్యాసంలో వివరించాడు.

ఇలా కవితా ప్రక్రియపై తన వ్యాసాలలో ఎన్నో అభిప్రాయాలను వెలిబుచ్చిన శ్రీశ్రీ "ఫ్యాక్టరీలు ఉన్నంత కాలం నేను పద్యాలు రాసి తీరుతాను"[8] అని చెప్పడం బట్టి కవిత్వాన్ని శ్రీశ్రీ ఎంత శ్రామిక వర్గ పక్షపాతంతో రాస్తున్నాడో తెలుస్తుంది.

**(ఆ). కథ**

'కథ' లంటే శ్రీశ్రీకి చిన్నప్పటి నుండీ ఎంతో ఇష్టం. ఇతర భాషల్లోని కథలూ చదివాడు. కథల గురించి 'సశేషము' కథలో "నేనిదివరలో చాలా కథలు చదివి వుండడము చేత, వాటిమీద విమర్శనము కూడా పఠించడము చేత కథ యొక్క కథ తెలిసింది"[9] అని కథా ప్రక్రియ గూర్చి తన కృషిని 1929 లోనే చెప్పుకున్నాడు. ఇలా కథా ప్రక్రియపై ప్రేమ, అందులో కృషి చేయడం మూలంగానేమో విశిష్టమైన కథలు రాసి తెలుగు కథా సాహిత్యంలో ప్రత్యేకతను సాధించాడు. అలాంటి శ్రీశ్రీ వ్యాసాల్లో అక్కడక్కడ 'కథ' లపై తన అభిప్రాయాన్ని వ్యక్తీకరించాడు. అంతేగాదు తన వ్యాసాలకు 'కథకథ', 'లోక కథలో కథ' అనే పేర్లూ పెట్టాడు.

1935 లో రాసిన 'ఒక సంభాషణ శకలము' అనే వ్యాసంలో ప్రపంచ ప్రఖ్యాత కథకుడు మొపాసా (Maupassant) గూర్చి " . . . కథా లోకంలో అతనిది ప్రపంచ రచయితలలో ప్రప్రథమశ్రేణి.

short story కి, Lyric కీ భేదం లేదని నా ఉత్సాహంలో ఒక్కొక్కప్పుడనేస్తుంటూనే, దానికీతని కథలే కారణం"[10] అని కథా ప్రపంచంలో అతని ప్రత్యేకతను ఉగ్గడించాడు శ్రీశ్రీ అంతే గాక ఇంకా ఇతని కథల్లో చక్కటి ప్రారంభం, నిర్వహణలతోపాటు అనూహ్యమైన కొసమెరుపుతో ముగింపు ఉంటుందని మెచ్చుకొని "ఈ కొసమెరుపు విధానాన్ని ఆ దరిమిలా 'ఓ. హెన్రీ' చాలా డెవలప్ చేశాడు. రచయిత సామర్థ్యానికి ఈ కొసమెరుపు గీటురాయి, వంటిది"[11] అని రచయితల తీరునే గాక దానిపై వ్యాఖ్యకూడా చేశాడు. ప్రపంచ సాహిత్యంలో అయితే మొపాసాను అభిమానించి నట్టుగానే తెలుగు సాహిత్యంలో చింతాదీక్షితులు, చలం, మొక్కపాటి నరసింహశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు, కొడవటిగంటి కుటుంబరావు, రావిశాస్త్రి మొదలైన వారిని మంచి కథకులుగా పేర్కొన్నాడు. తెలుగు కథానిక ప్రక్రియ గూర్చి 'అధునిక తెలుగు సాహిత్యం' అనే వ్యాసంలో తెలుగులో కవిత్వంలాగే కథానిక కూడా ఎదిగిందని ప్రపంచ కథానికల పోటీలలో తెలుగు రచయితలకు బహుమానాలు వచ్చిన విషయం చెప్పి, జీవితంలోని ప్రతి దశనూ, వైఖరినీ తెలుగు కథానిక ప్రతిబింబించిందని పేర్కొనీ, కథ చెప్పడంలో రచయితలు కొత్త పద్ధతులను కనిపెడుతున్నారని తెలుగు కథానిక ఔన్నత్యాన్ని కొనియాడాడు.

రావూరి భరద్వాజ రాసిన 'జీవన సమరం' కథా సంపుటి గూర్చి రాస్తూ "... అయన (చెఖోవ్) కథలు నిరాడంబరంగా, దిగంబరంగా, స్వచ్ఛంగా ఉంటాయి. కథలు చదువుతంటే జీవితాన్ని చదువుతున్నట్లే ఉంటుంది. ఈ 'జీవన సమరం' లోని గాథల్ని చెఖోవ్ రచనలతో నేను పోలుస్తున్నాను"[12] అని రావూరి రచనా విధానాన్ని పేర్కొన్నాడు.

ఆనందవాణి, నవోదయ పత్రికలలో ప్రతీవారం ఒక వ్యాసం రాసేవాడు. ఇలా రాసిన వాటిలో 'కథ'కు సంబంధించినవి మూడు వ్యాసాలున్నాయి. 'కథ కథ' అన్న వ్యాసంలో ఆరుద్రకి ఐదు రూపాయలు కావలిస్తే ఒక కథ రాసినట్లుగా, దానిపేరును (ఆరుద్ర) 'తాబేళ్ళూ - తోడేళ్ళూ' అని పెడితే అది మార్చి శ్రీశ్రీ "తా'ళ్ళూ తో'ళ్ళూ" గా నామకరణం చేసినట్లు చెప్పుకున్నాడు. మిగతా రెండు వ్యాసాల్లో ఒకటైన 'ద్వితీయ ప్రారంభం' అనే వ్యాసాన్ని "బెజవాడ ప్లాట్‌ఫారం మీద కలుసుకున్నారు వాళ్ళిద్దరూ" అని ఆరంభించి, ఇదే వాక్యం చెయ్యి తిరిగిన కథకుడు ఎలా రాస్తాడో విచిత్రంగా చ చేసి చివరికి శైలికి సంబంధించిన అంశాల్ని మాత్రమే వివరించాడు.

'లోకకథలో కథ' అన్న వ్యాసంలో తాను రాసిన కథలో ఏదో వెలితిగా అనిపించడం వల్ల ఆ రచన గూర్చి "నేను మాత్రం కథా రచనకు ఉపక్రమించే ముందు నా పాఠకులకు ఏవేవో మహోజ్వలానుభవాలు కలిగించాలనుకున్నాను. తీరా కథ పూర్తిచేసిన తర్వాత ఒక శుష్కకంకాళమే మిగిలింది. సంకల్పాన్ని సంతృప్తికరంగా సాధించలేకపోవడమే నా కథలో లోపం"[13] అని చెప్పుకోవడంవల్ల శ్రీశ్రీ నిజాయితి తెలుస్తుంది.

## (ఇ). నాటకం

శ్రీశ్రీ కి నాటకాలంటే చిన్నప్పటి నుండీ ఇష్టం. 'జగన్మిత్ర' నాటక సమాజం వారు ప్రదర్శించే నాటకాల్లో బాలనటుడి పాత్రలను పోషించేవాడు. నాటకాల్లో పద్యాల్ని పాడేవాడు. అలా నాటక పరిజ్ఞానాన్ని సంపాదించిన శ్రీశ్రీ తన 12వ ఏట (1922) 'సావిత్రీ సత్యవంతులు' అనే పద్య నాటకాన్ని రాశాడు. ఇది ఇప్పటికీ అలభ్యం. ఇలా నాటక ప్రక్రియలోకి అడుగిడిన తరువాత కొంత కాలానికి అబ్బూరి రామకృష్ణారావు ఆధ్వర్యంలో నిర్వహించబడే 'నటాలి' నాటక సమాజంలో చేరాడు. అబ్బూరి వరద రాజేశ్వరరావుతో కలిసి ప్రపంచ ప్రసిద్ధమైన నాటకాల్ని అధ్యయనం చేశాడు.[14] ఈ విధంగా ఎన్నో నాటకాల్ని చదవడం, ప్రదర్శనలో పాల్గొనడంవల్ల శ్రీశ్రీకి నాటక రంగంలో మంచి పరిజ్ఞానం ఏర్పడింది.

'50 సంవత్సరముల తెలుగు సారస్వతం (1900-1950)' వ్యాసంలో అర్థశతాబ్దపు తెలుగు సాహిత్యంలోని ప్రక్రియల వికాసాన్ని సమీక్షించాడు. అందులో నాటక ప్రక్రియలో 'ప్రజానాట్యమండలి' ద్వారా ప్రదర్శితమైన 'ముందడుగు', 'మా భూమి' నాటకాలు ప్రజలాదరించినట్లుగా చెప్పి, ఆత్రేయ రాసిన ఎన్.జి.వో. నాటకాన్ని సమాజానికి ప్రతిబింబంగా వర్ణించాడు.

శ్రీశ్రీ చాలా వ్యాసాల్లో 'కన్యాశుల్కం' నాటక ప్రసక్తి ఉంది. ఈ నాటకం గురించి " . . . యావద్భారత దేశంలోను శూద్రకుని 'మృచ్ఛకటికం' తరువాత 'కన్యాశుల్కం' వంటి నాటకం ఇంకొకటి వెలువడనే లేదు. సమకాలిక జీవిత వాస్తవికతను ఇంత సమగ్రంగా ప్రతిబింబించిన రచన ఏ భారతీయ భాషల్లోను ఇంకొకటి లేదు. పాశ్చాత్య నాటక రచయితలలో ఇబ్సెన్‌కు గల ప్రత్యేక స్థానం ప్రాచ్య నాటక కవులలో గురజాడదే అనక తప్పదు"[15] అని '20వ శతాబ్దపు తెలుగు సాహిత్యం (1900-1950)' వ్యాసంలో చెప్పిన అంశాల్నే ఆ తర్వాతి వ్యాసాల్లోనూ చెప్పాడు. ఇంకా ఈ వ్యాసంలో వేదం వేంకటరాయశాస్త్రి 'ప్రతాపరుద్రీయం'లో పాత్రోచిత భాషను వాడి తనకు తెలవకుండానే వ్యావహారిక భాషోద్యమానికి అనుకూలత చేకూర్చినట్లుగా పేర్కొన్నాడు.

ఇలా నాటకరంగంపై వ్యాఖ్యానించిన శ్రీశ్రీ, 'ఆధునిక తెలుగు సాహిత్యం' వ్యాసంలో 'సినిమా' ఆగమనంతో నాటక రంగం వెనుకబడిందన్న వాదన సరైంది కాదన్నాడు. అయితే పారిశ్రామికంగా ఆంధ్ర ప్రదేశ్ వెనకబాటుతనమే నాటక రంగం వృద్ధిలోకి రాకపోవడానికి కారణంగా అభిప్రాయపడ్డాడు. ఈ విధంగా వ్యాసాలలో సందర్భం వచ్చినప్పుడల్లా నాటక ప్రక్రియపై తన అభిప్రాయాన్ని ప్రకటించాడు.

### (ఈ). నవల

బాల్యదశలో శ్రీశ్రీ నవలల్ని, అందునా అనువాద నవలన్నీ ఎక్కువగా చదివేవాడు. డిటెక్టివ్ నవలల్ని చదివిన ప్రభావంతోనే 'పరిణయ రహస్యం' అనే నవల రాశాడు. తెలుగు సాహిత్యంలోని నవలా ప్రక్రియలో బెంగాలీ, మరాఠి భాషలనుండి తెలుగులోకి పుంఖానుపుంఖంగా దిగుమతి అవుతుండడం, స్వతంత్ర నవలలు తక్కువగా వెలువడుతున్నందుకు 1960 లో రాసిన ఒక వ్యాసంలో తన బాధను తెలిపాడు.[16]

ఇంగ్లీషు నవలా రచయితల్లో చార్లెస్ డికెన్సు శ్రీశ్రీకి చాలా ఇష్టం. ఇతని నవలల్ని గూర్చి "అవి ఫిక్షన్ – అంటే కల్పనా సాహిత్యపు కోవలోకి వస్తాయి. కాని 'కల్పనా' కు ఒక బ్రాడ్ చేసే నవలల్ని ఒక రకమైన డాక్యుమెంటరీ అని అనవచ్చు"[17] నని డికెన్స్ నవలల తీరును పేర్కొన్నాడు.

తెలుగు నవలలు రాసేవారి ఎదుగుదలను గూర్చి "ముందుగా ఈ నవలలను, ఏ దినపత్రికో, వార పత్రికో ధారావాహికంగా ప్రకటిస్తుంది. ... చాలా కాలంగా పత్రికల్లో ప్రవహించి ప్రవహించి మన బృహన్నలవల్ల గ్రంథరూపం ధరిస్తుంది. ... ఈ గ్రంథరాజం నాన్ డిటేల్డుగా విద్యార్థుల కరకమలాలను అలంకరించవచ్చును."[18] అని నవలాకారులు ఎలా ఎదిగి పోతున్నారో 1946 నాటికే చెప్పగలిగాడు శ్రీశ్రీ. ఈ వ్యాసం ఇప్పుడు రాసి ఉంటే ధారావాహికంగా వచ్చిన నవల వ్యాపార సంస్కృతిలో పుస్తకంగాను, ఆ తర్వాత సినిమాగానూ మారే వైనాన్ని వివరించేవాడు.

మొత్తం మీద శ్రీశ్రీ దృష్టిలో తెలుగు నవల్లో ఆంధ్రుల జీవిత చరిత్ర ఎంత ఎదగాలని ఆశించాడో అంతగా ఎదగలేదని బాధపడ్డాడు. అది 'ఆధునిక తెలుగు సాహిత్యం' అనే వ్యాసంలో "తెలుగులో బాగా నిర్లక్ష్య పరచిన కళారూపం నవల. ... ఆంధ్ర జీవిత బృహత్తర చిత్రాన్ని చిత్రించే నవల, ఆంధ్రలోని ప్రస్తుత మానవ పరిస్థితులను చూపించే నవల ఏది"[19] అని ప్రశ్నించాడు. ఆ తర్వాత అదే వ్యాసంలో "ఇదుగో మా ప్రేమ్‌చంద్, ఇదుగో మా శరత్ అని సగర్వంగా చెప్పుకోదగిన రచయిత అనతి కాలంలోనే ఉద్భవించగలడని ఆశిద్దాం" అని నవలా ప్రక్రియ అభివృద్ధినీ రచనా విలువల్ని గూర్చి ఆకాంక్షించాడు.

**సాహిత్యం - సాధారణాంశాలు**

ఇంతవరకు శ్రీశ్రీ వ్యాసాల ద్వారా ఒక్కొక్క సాహిత్య ప్రక్రియపై ఆయన వెలుబుచ్చిన అభిప్రాయాలను వివరించడం జరిగింది. మరి కొన్ని వ్యాసాలలో ప్రత్యేకంగా ఒక ప్రక్రియ అని గాకుండా సాధారణం (General) గా అన్ని ప్రక్రియలకు పనికొచ్చే విధంగా సాధారణీకరించి చెప్పిన వ్యాసాలూ ఉన్నాయి.

'పొంగ రంగ రంగరాలు' అనే వ్యాసంలో "పొంగరం అయినా తాజమహలయినా చేసిందేదో బాగా చెయ్యడమే కళ"[20] అని చెప్పటం వల్ల 'కళ' అనేది మామూలుగా చెయ్యడంగాక ఏది చేసిన తనదైన ఒక ముద్రతో ప్రత్యేకత సంతరించుకొనే విధంగా తయారు చేయడం అని శ్రీశ్రీ అభిప్రాయం. ఇలాంటి కళలపై కూడా యంత్రాల ప్రభావం పడ్డదని 'యంత్రయుగం' వ్యాసంలో చెప్పాడు. ఎలాగంటే " . . . సాహిత్యం, శాస్త్రం మొదలైనవన్నీ ఇప్పుడు అందరికీ అందుబాటులోకి వచ్చే అవకాశాలు హెచ్చాయి. అచ్చు యంత్రం, సినిమా, రేడియో ఉదాహరణలు"[21] అని చెప్పిన దానిలో అచ్చుయంత్రం వచ్చిన తర్వాతనే పత్రికలు, పుస్తకాలు రావడం మొదలై ఎక్కువ సాహిత్యం రావడం, ఎక్కువమంది చదివే అవకాశమేర్పడడం జరిగింది. సినీమా కొరకు కథల్ని రాయడంతో సినిమా కథలు కొత్తగా ఆవిర్భవించినవి. రేడియోవల్ల కేవలం శ్రవ్య ప్రాధాన్యమైన నాటికలు వెలువడినై. ఇలా సాంకేతిక అభివృద్ధివల్ల సమాజంలోని అన్ని రంగాలపై ప్రభావం పడినట్లుగానే సాహిత్య రంగంపై కూడా పడి ఊహించలేనన్ని మార్పులు వచ్చినవన్నాడు.

'సద్యః స్ఫూర్తి' అనే వ్యాసంలో "అందరికోసం వ్రాయమని అడగడం అసందర్భం. అందరికోసం వ్రాస్తున్నాననుకోవడం ఆత్మవంచన"[22] అని చెప్పిన దాన్ని బట్టి ఒక రచయిత తాను రాసే రచన ఏదో ఒక రకమైన పాఠకుల కొరకై రచిస్తాడేగానీ అందరికీ పనికి వచ్చేట్లుగా రాయలేడని శ్రీశ్రీ భావం. ఉదాహరణకు శ్రీశ్రీ 'మహాప్రస్థానం' కావ్యం భావానికి సంబంధించి పీడితుల కొరకు రాసింది. భాషకు సంబంధించి సాహిత్యంలో అభినివేశం కాస్త ఎక్కువ ఉన్న వారే 'మహాప్రస్థానం' పాఠకులు. కానీ గద్దర్, వంగపండు ప్రసాద్, అల్లం రాజయ్య వంటి వారి రచనలు సాహిత్య పరిజ్ఞానమున్నవారికే గాక, నిరక్షరాస్యులు సైతం విని అర్థం చేసుకోగలరు.

'రచయితలను గురించి' అనే వ్యాసంలో మొత్తం రచయితల్ని మూడు భాగాలుగా విభజించాడు శ్రీశ్రీ. ప్రస్తుతమొస్తున్న సాహిత్యమంతా మంచిదికాదని చెబుతూ గత సాహిత్యాన్నే మెచ్చుకుంటూ అలా రాయబడేదే నిజమైన సాహిత్యమనే అభిప్రాయంగల వారు మొదటి రకమనీ, ఇక రెండో రకం వారి గురించి "ఆ కాలానికి ఏ విధానం అమలులో ఉంటే దానికి నివాళులెత్తుతారు. . . . ఇటువంటి వారే సమయానుకూలంగా ఫాసిజాన్నీ, కమ్యూనిజాన్నీ కౌగలించుకోగలరని"[23] చెప్పాడు. ఇక మూడో రకం వారు "వెనుకటి రచయితలవీ సమకాలికులవీ గ్రంథ జాలాన్ని క్షుణ్ణంగా మథిస్తాడు. ఇదంతా తన రచనా నైపుణ్యాన్ని, టెక్నిక్‌ని పెంపొందించుకోడానికి మాత్రమే. . . . అన్ని విధానాలనూ ఆకళించుకోవడం వల్ల తనదైన ఒకానొక పద్ధతి అతని కలవడుతుంది. అదొక ఆయుధం. దానితో ప్రజాయత్తమైన ప్రయోజనాన్ని సాధిస్తాడు."[24] అని చెప్పి వీళ్ళలో " . . . మొదటి వారి పట్ల జాలి వహిస్తాను. రెండో రకం అంటే అసహ్యించుకుంటాను. మూడో తెగవారి మీద నాకాదరం, గౌరవం"[25] అని తన దృక్పథాన్ని స్పష్టం చేశాడు.

పై మూడు రకాల రచయితలు సాహితీ లోకంలో ఉన్నారు. అందులో చివరి రకం వారంటే తను గౌరవిస్తానని చెప్పిన శ్రీశ్రీ యే 'మనుష్యులు చదివే సాహిత్యం' అనే వ్యాసంలో "ఇరవయ్యో శతాబ్దం త్వరలో పూర్తి కావస్తున్నా, దురదృష్టవశాత్తూ, మనకింకా మనుష్యులు చదివే సాహిత్యం అందుబాటులోకి రాలేదు"[26] అని చెప్పడంవల్ల తను రాసిన రచనలూ, తన దృష్టిలో కవిత్రయమైన తిక్కన, వేమన, గురజాడల రచనలూ, 'మనుష్యులు చదివే సాహిత్యం' కాదా ! అని మనకు అనుమానం కలుగుతుంది. ఐతే శ్రీశ్రీ చెప్పిన ఈ మాటల్ని ఇంకా రావల్సినంత మంచి రచనలు రావడంలేదనే బాధను అతిశయోక్తిగా చెప్పినట్లు మనం భావించవచ్చు.

'ఏది విప్లవపంథా' ? అనే వ్యాసంలో సాహిత్య విమర్శ ఎలా చెయ్యాలో మూడురకాలుగా చెప్పాడు. అందులో మొదటిది ఆ "కాలనిర్ణయం సమకాలికుల నిరూపణ, విషయ విమర్శ ఛందో వివరణలు యీ వర్గంలోనివి"[27] అని, రెండోది గతి తార్కిక భౌతిక దృక్పథం, మూడవది మనస్తత్వ పరిశీలన అనీ మూడింటిని వివరించాడు. వీటిలో "సంఘాన్ని ముందుకు నడిపించడమే విప్లవపంథా, అభ్యుదయరీతి! ఇది కావ్య విమర్శకు గీటురాయి !"[28] అని శ్రీశ్రీ తన దృష్టిలో ఏది ఉత్తమమైందో కూడా తేల్చాడు. ఈ విధంగా వ్యాసాలలో వివిధ ప్రక్రియల్లోని సాహిత్య అంశాల్ని స్పృశించాడు.

**వ్యక్తులు**

శ్రీశ్రీ వ్యాసాలలో సందర్భానుసారంగా ప్రముఖ సాహితీ మూర్తుల్ని పేర్కొనడం కన్పిస్తుంది. అంతేకాదు, కొందరిపై ప్రత్యేకంగా వ్యాసాలే రాశాడు. గురజాడపై తొమ్మిది వ్యాసాలున్నాయి. గాంధీజీని అక్కడక్కడ పేర్కొనడమేగాక ప్రత్యేకంగా రెండు వ్యాసాలనే రాశాడు. ఇలాగే కొంపెల్ల జనార్ధనరావు, బుచ్చిబాబు, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, విశ్వనాథ, చలం, కొడవటిగంటి కుటుంబరావు, రావిశాస్త్రి వంటి వారిపై వివిధ సందర్భాల్లో రాసిన వ్యాసాలున్నాయి.

**గురజాడ అప్పారావు**

శ్రీశ్రీ పై ఎంతో ప్రభావం చూపి, చివరి వరకు తన ప్రభావానికి లోను చేసిన వ్యక్తుల్లో మొట్ట మొదటి వాడు గురజాడ. చాలా వ్యాసాల్లో గురజాడ ప్రసక్తి వస్తుంది. శ్రీశ్రీ తన వ్యాస జీవితాన్ని మొదలెట్టిందే గురజాడ 'కన్యాశుల్కం' పై రాసిన వ్యాసం. అది 'కన్యాశుల్కం లో స్త్రీ వ్యక్తులు'. దీన్ని తన 22 వ ఏట (1932) రాశాడు.

ప్రపంచంలోని గొప్ప రచనల్లో ఒకటిగా 'కన్యాశుల్కం' నాటకాన్ని అభివర్ణించాడు. సమకాలీన భారతదేశంలోనే అలాంటి నాటకం రాలేదని శ్రీశ్రీ అభిప్రాయం. ఇంతటి ఉత్కృష్ట రచన గురించి శ్రీశ్రీ ఆరు వ్యాసాలను రాశాడు. వాటిల్లో మొదటిదే 'కన్యాశుల్కంలో స్త్రీ వ్యక్తులు'.

'కన్యాశుల్కం'లో శ్రీశ్రీని బాగా ఆకర్షించినవి స్త్రీ పాత్రలే. అందునా 'మధురవాణి' పాత్ర మరీను. ఈ వ్యాసం కేవలం మధురవాణి, వెంకమ్మ, బుచ్చమ్మ, మీనాక్షి, పూటకూళ్ళమ్మ, యోగిని ఈ ఆరు పాత్రలపైనే రాశాడు. వీళ్ళలో కూడా 'మధురవాణి' గూర్చి సగానికిపైగా ఉంది.

ఈ వ్యాస రచనకు శ్రీశ్రీ ఉపక్రమిస్తే "...తళుక్కున మధురవాణి మెరుస్తుంది; బుచ్చమ్మ అమాయకముగా చూస్తుంది; వెంకమ్మ కూర తరుగుతూ కనిపెట్టుకుంటుంది; పూట కూళ్ళమ్మ వల్లె వాటులో చీపురు గట్టదాచి ప్రవేశిస్తుంది; మీనాక్షి వెంటనంటుతుంది; యోగిని సైగ చేస్తుంది; మహేశము కూడా పెళ్ళి కూతురై ప్రవేశిస్తానంటాడు"[29] అని ఒక్కో పాత్ర తనవైపు చూస్తున్న తీరు, తన వెంట పడుతున్న వైనం చూపాడు. ఈ పాత్రలన్నీ "నీవేపే చూస్తూంటాయ్! / తమలోతు కనుక్కోమంటాయ్" అన్నట్టుగా చూస్తుంటే " ఇంత మందిలో ఎవరి నెంచుకుందికీ పాలుపోక అప్పుడు నేను అటూ ఇటూ 'కన్యాశుల్కము' పుటలు త్రిప్పుతాను. ఆడువారిలో అందరికంటే మొదట మధురవాణి కానవస్తుంది."[30] అని చెప్పి ఈ వ్యాసంలో మొదట 'మధురవాణి' పాత్ర చిత్రీకరణనే వివరించాడు. ఈ పాత్ర ఎలాంటి స్వభావంకలదో శ్రీశ్రీ చెప్పకుండానే గురజాడ 'మధురవాణి' ని గూర్చి ఇతర పాత్రలతో ఏమనిపించాడో అవన్నీ ఒక్క దగ్గర గుది గుచ్చి ఆమె స్వభావాన్ని వివరించడమేగాక ఆనాటకంలో మధురవాణి అతి ముఖ్యమైన పాత్రగా ఉంటూ కథ అడ్డం తిరిగినప్పుడల్లా చక్రం అడ్డు వేస్తూ కథను సూటిగా సాగేట్లు చేస్తుందని 'మధురవాణి' పాత్ర వైశిష్ట్యాన్ని నొక్కి చెప్పాడు.

ఇలా వ్యాసంలో సగానికి పైగా 'మధురవాణి' ని ప్రస్తావించి "మధురవాణి ని వదలి మరొక పాత్ర వంకకు మరలుట అనగా ఒక సాంఘిక రంగము నుండి మరొక దానిలోకి దూకుట అన్నమాట"[31] అని చెప్పిన ఈ వాక్యాన్ని ఎంతైనా వివరించవచ్చు. 'వేశ్యావృత్తి' ఒక సాంఘిక దురాచారం. ఇందులో దహించుకుపోతున్న 'మధురవాణి' ని తెల్పితే 'వేశ్యావృత్తి' ఎంత ఘోరమైందో మనం ఊహించవచ్చు. ఈ పాత్ర తర్వాత ఇతర పాత్రలైన ఒక్కొక్క స్త్రీపాత్రను విశ్లేషిస్తే ఒక్కొక్క సాంఘిక దురాచారం వ్యక్తమవుతుందని శ్రీశ్రీ విశ్లేషించాడు. వెంకమ్మ - అగ్నిహోత్రావధానులైన భర్త ఆగ్రహావేశాలలో తీసుకునే నిర్ణయాల వల్ల స్త్రీల బ్రతుకు ఎంత నిస్సారమవుతుందో తేలుతుంది. బుచ్చమ్మ - బాల్య వివాహం జరిగి యౌవనదశలో భర్తలేక లైంగిక వాంఛలు తీరక ఎప్పుడూ జీవితాన్ని పోగొట్టుకున్న విరాగిలా జీవించేపాత్ర. మీనాక్షి - యౌవనంలోనే విధవరాలై లైంగిక వాంఛలు తీరక చెడుదారిలోకి వెళ్ళడానికి సిద్ధమయిన మహిళ. ఇలా ఒక్కొక్క స్త్రీ పాత్ర ఒక్కొక్క సాంఘిక దురాచారానికి గురవడంవల్ల, ఒక్కొక్క పాత్ర ఆనాటి దురాచారాలను తెల్పుతుందని శ్రీశ్రీ చెప్పిన ఆ చిన్న వాక్యం మనను ఎంతో ఆలోచింపజేస్తుంది.

'కన్యాశుల్కంలో స్త్రీ వ్యక్తులు' పై వ్యాసంలో సగానికంటే ఎక్కువగా మధురవాణి గురించి రాసినా తృప్తి తీరక 'ఒక కావ్య నాయిక' పేరున కేవలం 'మధురవాణి' పాత్ర గురించే ఒక వ్యాసం

రాశాడు. అందులో భారతీయ సాహిత్యంలోనేగాక ప్రపంచ సాహిత్యంలోని ప్రముఖ గ్రంథాలలో నాయికల తీరు పేర్కొని వారందరికంటే 'మధురవాణి' పాత్ర ఎంత ఉన్నతమైందో ఉదాహరణలతో సహా వివరించాడు.

ఇలాగే మరో పాత్ర గురించి రాసిన వ్యాసం 'బైరాగి'. ఈ పాత్ర గురించి "బైరాగి అన్ని విధాలా అవసరమైన పాత్ర. కాని అతడు లేనిదే కన్యాశుల్కానికి సంపూర్ణతలేదు"[32] అని బైరాగి పాత్ర ప్రాధాన్యతను పేర్కొన్నాడు.

'కన్యాశుల్కం'పై రాసిన మరో వ్యాసం 'కన్యాశుల్కం – మీద' అని. ఇందులో "కన్యాశుల్కం గొప్పది, జీవితమంత గొప్పది" గా చెప్పి మన నిత్య జీవితంలో చూస్తే అన్ని పాత్రలనూ గురజాడ చిత్రించాడని చెబుతూ ముస్లిం పాత్ర కూడా ఉందన్నాడు. ఈ నాటకం వాస్తవానికి దగ్గరగా ఉందనీ, దీనిలోని అధివాస్తవికతను కూడా పరిశీలించాలన్నాడు. ఇందులోని ప్రతీ సంభాషణ మన జీవితంలో ఏ సందర్భానికైనా పనికొస్తుందని చెప్పాడు. ఇందులోని లోపాల గురించి 'కన్యాశుల్కంలో లోపాలు' పేరుతో ప్రత్యేకంగా రాసిన వ్యాసంలో " . . . కన్యాశుల్కంలో శిష్యుడికి పెళ్ళి కూతురు వేషం వేయించి పెళ్ళి జరిపించడం మన నమ్మకానికి అతీతమైనది. అందులోకి పెళ్ళిముందు శిష్యుడికి మీనాక్షి మంగళ స్నానం చేయిస్తుందని మనం మరచి పోకూడదు"[33] అని స్త్రీ వేషంలో ఉన్న వెంకటేశానికి మీనాక్షి స్నానం చేయించడం గురజాడ చేసిన పొరపాటని శ్రీశ్రీ పేర్కొన్నాడు. దీనితో పాటు పాత్రల స్వభావానుకూలంగా పేర్లుండడం కూడా అస్వాభావికమని శ్రీశ్రీ విమర్శించాడు. ఇట్లా లోపాలను చూపించడంవల్ల తనకు ఆనాటకంపై అభిమానంలేక అలా చూపించడం జరిగినట్లు భావించకూడదని చెప్పి "కన్యాశుల్కంలో తప్పులు పట్టడం నాకిష్టంకానిపని. కాని ఉన్న దోషాలని లేవనుకోవడం కూడా నిజమైన అభిమానానికి పుష్టినివ్వదు"[34] అని గురజాడపై తనకున్న నిష్పాక్షికమైన వైఖరిని మరోసారి ఋజువు చేసుకున్నాడు శ్రీశ్రీ.

కన్యాశుల్కంపైనే రాసిన మరో వ్యాసం 'సెల్యులాయిడ్‌లో కన్యాశుల్కం'. 'కన్యాశుల్కం' నాటకాన్ని సినీమాగా తీస్తున్నారన్న విషయం తెలిసి ఈ వ్యాసం రాశాడు శ్రీశ్రీ. ఇందులో గిరీశం రామప్పంతులు, లుబ్ధావధాన్లు మొదలైన పాత్రలు నవ్వు పుట్టించే ట్రాజిక్ హీరోలుగా అభివర్ణించి, ఈ సిన్మాను తీస్తున్న నిర్మాతలను అభినందించాడు.

ఇలా కేవలం 'కన్యాశుల్కం' నాటకంపై ఆరు వ్యాసాల్ని రాసిన శ్రీశ్రీ, గురజాడ ఇతర రచనలపై రాసిన వ్యాసాల్ని పరిశీలిస్తే, వాటిల్లో అతి ముఖ్యమైన వ్యాసమూ, శ్రీశ్రీ గొప్ప పరిశోధకుడూ, వ్యాసకర్తా అని చాటి చెప్పేది 'ముత్యాల సరం - ఒక కృషి'. ఇది వ్యాస ప్రక్రియలో శ్రీశ్రీ రాసిన మిగతా రచనలన్నిటికంటే పెద్దది. విశేష కృషితో రాసింది. దీన్ని నాలుగు భాగాలుగా రాశాడు. మొదటి భాగం Introduction, రెండవ భాగం గురజాడ ప్రయోగంతో పాటు అతనికి ముందూ, తర్వాత వారి

ప్రయోగాలు, మూడవ భాగంలో 'ముత్యాలసరం' ఛందస్సును ఎవరెవరు ఎలా దోష సహితంగా వాడారో చూపాడు. నాలుగవ భాగంలో 'ఛందస్సు ఆవశ్యకతను చెప్పి, భావంతోపాటే ఛందంవల్ల కవిత్వం మరింత ఉత్కృష్ట రచనగా విలసిల్లుతుందని పరిశోధనాత్మకంగా నిరూపించిన వ్యాసమిది. ఈ వ్యాసం చివరిలో

"1. - కవిత్వము<br>- సంవిధానం } అభావ కవిత్వమే కాక అనేక దోష భూయిష్టమైన రచన

2. - కవిత్వము<br>+ సంవిధానము } సలక్షణమైన కన్యక. కాని నిర్జీవ

3. + కవిత్వము<br>- సంవిధానము } ఉదా: ప్రీతి పాత్రమైన పెండ్లాము సచ్చిన<br>యింటి పాడుసూచి యేడ్వలేక<br>చనదు పొలము విడిచి పనిలేక<br>యున్నను పామరుండు కాపువాడు కంటే

**– గాథాసప్తశతి**

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారి అనువాదము

4. + కవిత్వము<br>+ సంవిధానము } ఉదా : Between the green bud<br>and the red

Youth sat and sang by time<br>and shed<br>From eyes and tresses<br>Flowers and tears<br>From heart and spirit hopes<br>and fears<br>- A.C. Swinburne's 'Songs before Sun rise' "[35]

అని కవిత్వం తీరును కవిత్వ, సంవిధానాలలో ఏది ఉండి మరొకటి లేక పోయినా ఏర్పడే లోపాన్ని చక్కగా నాలుగు భాగాలలో వివరించాడు. ఇందులో నాలుగవదానికి ఇంగ్లీషు ఉదాహరణ గాకుండా తెలుగులో చెప్పి ఉంటే ఇంకా బావుండేది.

గురజాడ కథల్లో శ్రీశ్రీకి నచ్చిన కథను తెలిపే వ్యాసం 'నాకు నచ్చిన కథ'. అందులో కవిగా, నాటక రచయితగానే గాక కథారచయితగా కూడా గురజాడ గొప్పవాడని చెప్పి, ఆయన ఒక్కొక్క కథ ఒక్కొక్క వజ్రపుతునకగా అభివర్ణించాడు. వీటిల్లోనూ 'దేవుడు చేసిన మనుషుల్లారా ! మనుషులు చేసిన దేవుళ్ళారా మీ పేరేమిటి' ? అనే కథ మరీ ఎక్కువగా నచ్చినట్లు పేర్కొని ఇందులోని కథను, పాత్రల్ని, శైలినీ ఈ వ్యాసంలో మెచ్చుకున్నాడు.

గురజాడ మీద రాసిన వ్యాసాల్లో విచిత్రమైనది 'నరకంలో' అన్న వ్యాసం. ఇందులో శ్రీశ్రీ, తన మరణాంతరం నరకానికి వెళ్ళడం, అక్కడ గురజాడను కల్సుకొని సంభాషించడమే ఈ వ్యాసం. ఇది ఒక నాటకంగా సాగే రచన. ఇందులో శ్రీశ్రీ (నేను), గురజాడ రెండు పాత్రలు సంభాషించుకుంటాయి. "నువ్వు గొప్ప పాత్రలు సృష్టించావా" అని గురజాడ శ్రీశ్రీని అడిగితే "నాకు గొప్ప వాళ్ళ మీద నమ్మకం లేదు. ఏ ఒక్క వ్యక్తికీ వింజామరలు విసరలేను. సమూహం నా సరదా"[36] అని జవాబిచ్చాడు. తను ఆత్మహత్య చేసుకొని మరణించినట్టుగా, హిందూ పత్రిక రిపోర్టును ఊహించి రాశాడు. ఇలా ఈ వ్యాసం మొత్తం చిత్ర విచిత్రమైన ఊహలతో నిండింది.

1970 లో విరసం ఏర్పడిన తరువాత ఏది రాసినా విప్లవ దృష్టితోనే రాశాడు. గురజాడను కూడా అదే దృష్టితో చూశాడు. అతనిపై 'కామ్రేడ్ - గురజాడ' పేరున 1976 లో వ్యాసాన్ని రాశాడు. ఇందులో గురజాడను కవికాడని అన్న వారిని గాడిదలుగా, వాళ్ళను మనుషులుగానే గుర్తించలేనని తీవ్రంగా తిట్టాడు. కన్యాశుల్కం నాటకాన్ని 'మానవత్వం, సమానత్వా' లకు ఉదాహరణగా పేర్కొని 'మీ పేరేమిటి' కథను, 'పూర్ణమ్మ', 'దేశ భక్తి' గేయాలను పొగిడాడు.

ఇలా గురజాడ రచనలపైనా, అతని వ్యక్తిత్వం గురించి రాసిన వ్యాసాలను బట్టి గురజాడను మొదట్లో నవీన మార్గం వేసిన వాడుగా, తర్వాత అభ్యుదయ రచయితగా ఆ తర్వాత విప్లవ రచయితగా దర్శించాడు శ్రీశ్రీ.

**గాంధీజీ**

శ్రీశ్రీ వ్యాసాల్లో గురజాడ తరవాత పదేపదే పేర్కొనబడిన వ్యక్తి గాంధీజీ. ఈయన నిర్యాణాన్ని పురస్కరించుకొని 'సుస్తాస్థికలు' పేరుతో నాటికనూ, 'గాంధీజీ!' శీర్షికతో కవితనూ, రాసిన శ్రీశ్రీ వ్యాసాల్లో చాలా చోట్ల గాంధీజీ ప్రసక్తి తెచ్చాడు. అంతేగాక అతనిపై ప్రత్యేకంగా 'గాంధీజీ-స్వామిజీ' అనే వ్యాసాన్నే రాశాడు. ఇందులోని విషయం గాంధీజీ మరణం. గాంధీజీ 31-1-1948 నాడు మరణిస్తే, 8-2-1948 నాడు ఈ వ్యాసం అచ్చయింది. గాంధీజీ మరణించిన నాడు ఒక స్వామీజీ వచ్చి తాను బతికిస్తానని చెప్పి, బతికించలేకపోతాడు. అంటే ఇందులో స్వామీజీలు తమ స్పర్శతో బతికిస్తారనే మూఢనమ్మకాన్ని ఖండించాడు శ్రీశ్రీ. 'సద్యః స్ఫూర్తి' వ్యాసంలో గాంధీ జీవిత చరిత్ర కొంత చదివినట్లు తెలిపాడు. 'ఫ్రిస్కాలజీ' అనే వ్యాసాన్ని "ఇరవయ్యో శతాబ్దంతోపాటు మూడో ప్రపంచ మహా సంగ్రామం కూడా ముగిసింది. అప్పటికి గాంధీజీ తాననుకున్న 125 సంవత్సరాల పరిమితి దాటి యింకా బతికే వున్నాడు"[37] అని ఆరంభిస్తాడు శ్రీశ్రీ. '20వ శతాబ్దపు తెలుగు సాహిత్యం (1900-1959)' అనే వ్యాసంలో గాంధీతో గురజాడను పోలుస్తూ "గాంధీజీ నిత్య జీవితంలో నిరాడంబరతను స్వీకరించినట్లే గురజాడ కవితా శిల్పంలో వ్యర్థాలంకారాలనూ,

వాచాలత్వాన్నీ, కరచరణాలు కట్టి పడవేసే కట్టుబాట్లనూ తొలగించాడు"[38] అని తనకెంతగానో నచ్చిన గురజాడ రచనా విధానాన్ని గాంధీజీ జీవన విధానంతో పోల్చాడు. ఇలా శ్రీశ్రీ తన వ్యాసాల్లో అక్కడక్కడ గాంధీ ప్రస్తావన తెచ్చాడు.

**రవీంద్రనాథ టాగూరు**

ఇప్పటి వరకు సాహిత్యంలో నోబుల్ బహుమతి పొందిన ఏకైక భారతీయుడు టాగూర్. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి కావ్యం 'తెనుగువీణ'కు 1934 లో శ్రీశ్రీ పీఠిక రాశాడు. అందులో టాగూర్ చెప్పిన మాటల్ని పొందుపరిచాడు.1948లో 'వాడేవీడు' అనే వ్యాసంలో పాంచకడీదేవుడు రాసిన 'వాడేవీడు' నవల గీతాంజలి కంటే గొప్పదని చెబుతూ "గీతాంజలి కవిత్వం వేషం వేసుకొచ్చి వచనం కాని వచన భావాలను మాత్రమే నాలో ప్రసరిస్తుంది. 'వాడేవీడు' ఏ మోసాన్నీ ప్రకటించకుండా 'నేను ఉత్త వచనాన్నీ, చెత్తడిటెక్టివ్ నవలని' అని చెప్పకొని నాచుట్టూ ఉన్న ప్రపంచాన్నీ, పాపాన్నీ జ్ఞాపకం చేసి 'మదశ్రు కణాళి హేతు' వవుతుంది"[39] అని చెప్పిన దానివల్ల గీతాంజలికంటే 'వాడేవీడు'లో జన జీవితం వాస్తవికంగా వర్ణితమైనదని ఊహించవచ్చు. ఈ వ్యాసం కంటే ఇంకాస్త తీవ్రంగా, 'టాగూరు నా ఎల్లెర్జీ' అనే వ్యాసంలో పేర్కొన్నాడు. 'టాగూరు' ఆధ్యాత్మిక సాహిత్యం రాసినందువలన అతనే గొప్పవాడంటే ఆధ్యాత్మిక సౌందర్యం శ్రీనాథుడు, ధూర్జటీల్లో సౌందర్య 'ఝంఝ' చూడొచ్చని చెప్పాడు. మొత్తంమీద "ప్రపంచమంతా హారతి పట్టినా నేను టాగూరును కవిగా అంగీకరించలేను. ఎవరూ ఎరక్కపోయినా గురజాడను గొప్ప కవిగా ఎన్నిక చెయ్యడం మానలేను"[40] అని టాగూర్‌పై అయిష్టతను చూపాడు.

**విశ్వనాథ సత్యనారాయణ**

అభ్యుదయ కవిత్వం రాసేవరకూ విశ్వనాథ ప్రభావం తనపై ఉందని చెప్పుకున్న శ్రీశ్రీ, ప్రత్యేకంగా విశ్వనాథపై మూడు వ్యాసాలు రాశాడు. మరికొన్ని వ్యాసాల్లో ఆయన ప్రసక్తి తెచ్చాడు. 'పాషాణపాకి' వ్యాసంలో విశ్వనాథను గొప్ప కవిగా కీర్తించేవాళ్ళలో తనూ ఒకడుగా పేర్కొని అతని కొన్ని రచనలు తనకు నచ్చలేదని విమర్శించాడు. ఆ తరువాత విప్లవం నశించాలి ! 'విశ్వనాథ వర్ధిల్లాలి' ! అనే వ్యాసంలో వ్యంగ్యంగా విశ్వనాథను ఎత్తిపొడిచాడు. 'కవివృద్ధ విశ్వనాథ' అనే వ్యాసాన్ని అతని మరణాంతరం రాశాడు. దీనిలో "విశ్వనాథ మృతిపట్ల నేనెక్కడా బహిరంగంగా సంతాప ప్రకటన చెయ్యలేదు. కాని అంతర్గతంగా ఒక ఆత్మీయుణ్ని కోల్పోయినట్లు బాధపడుతున్నాను"[41] అని తన మనసులోని ఆవేదన వ్యక్తపరిచాడు.

**కొడవటిగంటి కుటుంబరావు**

తెలుగు సాహిత్యంలోని మంచి రచయితల్లో కొడవటిగంటి కుటుంబరావు ఒకడు. ఈయన గూర్చి శ్రీశ్రీ నాలుగు వ్యాసాల్ని రాశాడు. 'కుటుంబరావు - ఒక ప్రశంస' అనే వ్యాసంలో

కథకుడిగా కొడవటిగంటి కుటుంబరావును పొగిడి ఛకోవ్‌లాగా నాటకాలూ రాస్తే బావుంటుందని సూచించాడు.

ఇలా శ్రీశ్రీ గిరాంమూర్తి, జలసూత్రం, చలం, కృష్ణశాస్త్రి, చెరబండరాజు మొదలైన సాహితీవేత్తల గూర్చి రాసిన వ్యాసాలే గాక, వారు మరణించినప్పుడు సంతాప సూచకంగా కూడా రాశాడు.

**సినిమాలు**

ఆహుతి' చిత్రంద్వారా రచయితగా చలనచిత్ర పరిశ్రమకు పరిచయమయ్యాడు శ్రీశ్రీ. హిందిలో 'నీరాఔర్‌నందా' చిత్రానికి ఇది డబ్బింగ్ చిత్రం. 1949 లో విడుదలైంది. అలా సినీరంగ ప్రవేశం చేసిన శ్రీరంగం శ్రీనివాసరావు ఎన్నో సినీగీతాలు రాశాడు. కొన్ని చిత్రాలకు మాటలూ రాశాడు. తన గీతానికి (తెలుగు వీర లేవరా ... ) జాతీయ బహుమతినీ అందుకున్నాడు. జాతీయ చలన చిత్రోత్సవానికి న్యాయ నిర్ణేతల్లో ఒకడుగా వ్యవహరించిన శ్రీశ్రీ, సినీ పరిశ్రమపై, తన గీతాలపై వివిధ అంశాల గురించి పదిహేనుకుపైగా వ్యాసాల్ని రాశాడు. ఈ వ్యాసాల్ని 'తనగురించి, శాంబెనెగల్ గురించి, ప్రత్యేకంగా ఒక చిత్రం గురించి, ఇతరాలు' గా విభజించవచ్చు.

తన గురించి రాసుకున్న వ్యాసాలు మూడు. ఈ మూడూ తన పాటల గురించి రాసినవే. 'నా పాటలు, నా పాటలతోటి పాటలు' అనే వ్యాసంలో తన పాటలతో పాటు ఇతర కవుల పాటల్ని వివరించాడు. సినీమాల్లో పాటల గురించి ఎన్నో విషయాలు చెప్పి ఏ పాట ప్రజాదరణ పొందుతుందో రాసినప్పుడు ఊహించలేమని చెప్పాడు. 'నాకు నచ్చిన నా సినీమాపాట' అని రాసిన వ్యాసంలో తను ఇప్పటి వరకు వెయ్యికి పైగా పాటల్ని రాసినట్లు, అన్ని పాటల్లో తనకు నచ్చిన పాటగా 'పంతాలు - పట్టింపులు' చిత్రంలోని "ఇనుకోరా ! ఇనుకోరా ! ఈ మల్లన మాటే ఇనుకోరా" అన్న పాటను చెప్పుకున్నాడు. ఎందుకు నచ్చిందో కారణాల్ని కూడా పేర్కొన్నాడు. మరో వ్యాసం 'నేనూ నా పాటలు, లో తను సినీరంగంలోకి వెళ్ళిన తొలి రోజుల పాటల గూర్చి చెప్పి " . . . సినీమా పాటల క్కూడా ఒక సాహిత్య స్థాయి కల్పించడంలో (ఇతర కవులతోపాటు) నేనూ తోడ్పడ్డాననుకుంటున్నాను"[42] అని చెప్పుకున్న ఈ మాటలు గర్వంతో కూడినవి కావని ఆయన పాటల్ని విన్న వారెవరైనా గుర్తిస్తారు.

బెంగాల్ చలన చిత్ర ప్రముఖ దర్శకుడు శ్యాంబెనెగల్ పై మూడు వ్యాసాల్ని రాశాడు శ్రీశ్రీ. అందులో మొదటిది 'బెంగాల్ కాదు బెనెగల్' అనే వ్యాసం. అందులో సత్యజిత్‌రే కంటే మృణాల్‌సేన్ తన దృష్టిలో గొప్పవాడని చెబుతూ "మృణాల్‌సేన్ నయినా ఒప్పుకుంటానుగాని సత్యజిత్‌రేని హర్షించలేను. సేన్‌లో నిబద్ధత అనే గొప్ప గుణం ఉంది. 1940 లోని ఇటాలియన్ సినీమాల ప్రభావంవల్ల పై కొచ్చిన వాడు రే! సేన్‌లో నిజమైన వ్యక్తిత్వం ఉంది. రేలో నిబద్ధతలేదు, తనదైన

వ్యక్తిత్వమూ లేదు"[43] అని 'బెనెగల్, రే'లను పోల్చాడు. ఈ వ్యాసం పేరును బట్టి బెనెగల్ గూర్చి రాస్తాడని పాఠకులు భావిస్తే కొంత నిరాశే ఎదురవుతుంది. వ్యాసం చివర్లో మాత్రమే బెనెగల్ ప్రస్తావన వస్తుందంతే. 'బెనెగల్ తెలుగు చిత్రానికి శ్రీశ్రీ రచన' అనే వ్యాసంలో శాంబెనెగల్ దర్శకత్వంతో తెలుగులో చిత్రం వెలువడుతున్నట్లు దానికి శ్రీశ్రీ రచన చేస్తున్నట్లు తెలుస్తుంది. 'శ్యాంబెనెగల్‌తో ఇష్టాగోష్ఠి' వ్యాసంలో తాను చేసిన ఉపన్యాసాల్ని ఏ పత్రికా సరిగ్గా రిపోర్టు చెయ్యనందున దానిపై ఫిర్యాదుగా చేసిన రచననే ఈ వ్యాసం.

ఈ విధంగా తన గురించి, బెనెగల్ గురించిన వ్యాసాలేగాక చలనచిత్ర పరిశ్రమ గూర్చి సాధారణమైన వ్యాసాలూ రాశాడు శ్రీశ్రీ. అవి పది దాకా ఉన్నాయి. 'అవాక్కులు' పేరుతో రాసిన వ్యాసంలో 'త్యాగయ్య' చిత్రంలో 'మసిపూసిన మాణిక్యం' అనే సామెతను తప్పుగా ప్రయోగించడాన్ని చర్చించాడు. 'సినీమాలో రచయితల స్థానం' అనే వ్యాసంలో సినీమాని ఒక గొప్ప కళగా పేర్కొంటూ " యిప్పటి వరకు సినీమాకు అనుగుణమైన విధంగా విశిష్ట రచన సాగించగల దిట్టలు సినీమా రచయితలలో తలెత్తినట్టు కనబడదు"[44] అని చెప్పి ఏరంగంలోనైనా పరిశోధనలు జరగాలని చెప్పాడు. ఉదా : Pure Science - Applied Science లాగే Pure Cinema - Commercial Cinema లు రావాలని శ్రీశ్రీ అభిలషించాడు. 'మన సినీమాలు' అనే వ్యాసంలో మన సినీ పరిశ్రమలోని అసమర్థతను నిరసిస్తూ అది బాగుపడాలంటే జాతీయం చేయాలని అభిప్రాయపడ్డాడు. సినీ పరిశ్రమలోని అవినీతిని నిరసిస్తూ చిత్రాలలో సందర్భాను సారంగా సెక్సు ఉండడం తప్పుకాదని అభిప్రాయపడ్డాడు. సినీమా రచయితల గురించి 'చిత్ర రచయితలు', 'విచిత్ర వ్యవస్థ' అనే రెండు వ్యాసాల్లోనూ వివరించాడు. చలన చిత్రరంగానికి సంబంధించి పాత రోజులే మంచివన్న వారి భావాన్ని ఖండిస్తూ 'ఆహాహా ! ఆరోజులు' అన్న వ్యాసం రాశాడు. 'మనకు విప్లవ చిత్రం ఒక్కటైనా ఉందా' ? అన్న వ్యాసంలో 'అల్లూరి సీతారామరాజు' చిత్రం నుండి సిన్మాలలో 'విప్లవం' అన్న పదాన్ని వాడడానికి నిర్మాతలు పెద్దగా అడ్డు చెప్పడంలేదని పేర్కొన్నాడు.

**ఇతరాలు**

ఇప్పటి వరకూ శ్రీశ్రీ రాసిన వ్యాసాల్ని సాహిత్య, వ్యక్తులు, సినీమాలుగా విభజించి వివరించడం జరిగింది. ఈ విభజనకు లొంగని వ్యాసాల్ని ఈవిభాగంలో పరిశీలిద్దాం.

శ్రీశ్రీ ఏ ప్రక్రియ చేపట్టినా, 'యుద్ధం' గురించి చెప్పకుండా ఉండలేడనిపిస్తుంది. దానికి అతని వ్యాసాలేమి అపవాదుకావు. 'తృ-ప్ర-మ- యుద్ధం', 'ఫ్రిస్కాలజీ', మంచు స్వప్నాల త్రివర్ణచిత్రం', 'సంగ్రామాలూ-సమావేశాలూ' మొదలైన వ్యాసాల్లో యుద్ధానికి సంబంధించిన అంశాలున్నాయి. నగర వర్ణన చేసే వ్యాసాలుగా 'విశాఖ పట్టణపు జ్ఞాపకాలు', 'నగర దృశ్యాలు' అనేవి చెప్పుకోవచ్చు. ఇందులో మొదటిది వ్యాసంగా రాసినా శ్రీశ్రీ జీవిత చరిత్ర 'అనంతం' లోనూ చేరింది.

ఈ వ్యాసంలోని అంశాలను పేరును బట్టే ఊహించుకోవచ్చు. రెండో వ్యాసంలో మద్రాసు నగరాన్ని వర్ణించాడు.

'స్వాతంత్ర్యం', 'అష్టాదశ పురాణాల్లో ఆగస్టు 15' అనే రెండు వ్యాసాల్లో స్వాతంత్ర్యానికి సంబంధించిన అంశాలను పేర్కొన్నాడు. ఇలా ఇంకా మృత్యుప్రీతి, పత్రికలు, మద్య నిషేధం వంటి అంశాలను 'ప్రయాణం', 'ప్రవాహం', 'ఆనందమయ జీవితం', 'ఆగ్రహం', 'తెలుగు తనం' మొదలైన వ్యాసాల్లో పేర్కొన్నాడు.

మొత్తం మీద శ్రీశ్రీ వ్యాసాల్ని పరిశీలించి చూస్తే గురజాడ ఔన్నత్యంతోపాటు నాస్తిక భావాలు, సామ్యవాదం, మానవత్వం ప్రధానంగా ప్రతిపాదించినట్లు గ్రహిస్తాం. ఒక వ్యాస కర్తకు ఉండాల్సిన పరిశోధనా దృక్పథం, విశ్లేషణాతీరు శ్రీశ్రీ లో కనిపిస్తాయి. ఇవే శ్రీశ్రీని విశిష్ట వ్యాస కర్తగా నిలబెడతాయి.

# ఉపన్యాసాలు

ఒక వ్యక్తి ఏ రంగంలో గొప్ప వాడైతే ఆరంగానికి సంబంధించిన సమావేశాల్లో ప్రసంగించే అవసరాలు వస్తాయి. అతనికి ప్రసంగించే శక్తీ, అలవాటు లేకున్నా ఉపన్యసించక తప్పదు. ఇక తెలుగు దేశంలోనైతే సన్మానాలు కూడా తప్పించుకోలేడు. ఇప్పుడున్న ఉపన్యాసధోరణి, సభలతీరు విదేశాల ప్రభావంవల్లే ఏర్పడినట్లు గాడిచర్ల హరిసర్వోత్తమరావు, మొక్క పాటి నరసింహశాస్త్రి గారలు అభిప్రాయపడ్డారు.[45] చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గూర్చి " . . . ఏలాటి హేమాహేమీలున్న సభలోనైనా అనర్గళంగా కొన్ని గంటలు మాట్లాడేవారు. . ."[46] అనీ, పానుగంటి లక్ష్మీనరసింహారావును గురించి " . . . వారి ఉపన్యాసాలవల్ల కొందరికి దెబ్బలూ, గాయాలు తగిలినా విన్నంతసేపూ చాలా బాగుండేది"[47] అని మెచ్చుకున్నాడు 'ఉపన్యాసాలు' అనే వ్యాసంలో మొక్కపాటి నరసింహశాస్త్రి. ఇట్లా ఎందరో సాహిత్య వేత్తలు వివిధ రకాలుగా ఉపన్యసించేవారు. వారిలో శ్రీశ్రీ ఒకడు.

"నలుగురూ చుట్టూ చేరి మాటల్లోకి దింపితే ఎంతసేపైనా, ఏమైనా, ఎన్నైనా చెప్తాడు. వేదిక ఎక్కేసరికిమాత్రం నోరు పెగలదు. కాళ్ళు తడబడవు గాని నీళ్ళు నములుతాడు. వినే వారిని ఆకట్టుకునేటట్టు స్పష్టంగా, శ్రావ్యంగా, స్వచ్ఛంగా, సమగ్రంగా మాట్లాడలేడు శ్రీశ్రీ. రాతలో ప్రవహించే మాటలు పలుకులో వినిపించవు[48] అని శ్రీశ్రీ ఉపన్యాస ధోరణిని పరిచయం చేశాడు చలసాని ప్రసాద్. 'సాహితీ ప్రముఖుల ఉపన్యాస విన్యాసాలు' అనే వ్యాసంలో "శ్రీరంగం శ్రీనివాసరావు కూచుంటే ఆరితేరిన ఋషిలా మాట్లాడే చమత్కారం కల్గివున్నా, నిలబడితే వణికిపోయినట్లుండేది. . . . ఎక్కడో మొదలు పెట్టి ఎక్కడో తేలేవాడు"[49] అని శ్రీశ్రీ ఉపాన్యాస తీరును చందు సుబ్బారావు తెలిపారు. ఎలక్షన్లప్రచార సభల్లో, పౌరహక్కుల సభల్లో, సన్మాన, పుస్తకావిష్కరణ వంటి సభల్లో తప్పని సరిగా ప్రసంగించడంవల్ల కొంత అభ్యాసం అలవడింది. 'అభ్యాసం కూసువిద్య' అన్నట్టుగా కొంత కాలానికి ప్రముఖ వక్తల్లో ఒకడయ్యాడు. తన జీవిత

కాలంలో వందకు పైగా వేదికల మీద ఉపన్యాసాలిచ్చాడు. స్వరాష్ట్రంలోనే గాక దేశ విదేశాల్లోనూ ఇచ్చిన ప్రసంగాలు ఉన్నాయి. ఇక ఆకాశవాణిలోనూ చేసిన ప్రసంగాలు సరేసరి. ఇలా వివిధ చోట్లలోని ప్రసంగాలు కేవలం సాహిత్యానికి సంబంధించినవి మాత్రమే గాక పౌరహక్కులు, విశాలాంధ్ర వంటి ఉద్యమ సమావేశాల్లో, 'కేంద్ర సాహిత్య అకాడమీ' వంటి సంస్థలు ఏర్పాటు చేసిన సెమినార్‌లోనూ పాల్గొన్నాడు. ఈ ప్రసంగాలు దాదాపు 1940 ప్రాంతం నుండి మొదలైనాయి. అప్పటి నుండి మరణానికి రెండు మూడు నెలల ముందు వరకూ ప్రసంగించాడు. ఈ ప్రసంగాల్ని ఏడు రకాలుగా విభజించవచ్చు. అవి 1). రేడియో, 2). అరసం, 3). విరసం, 4). సాహిత్య సమావేశాలు, 5). పౌరహక్కుల సభలు, 6). విదేశాల ప్రసంగాలు, 7). ఇతరాలు.

## రేడియో ప్రసంగాలు

రేడియో కొరకు రచనల్ని చేసిన ప్రముఖ రచయితల్లో శ్రీశ్రీ కూడా ఉన్నాడు. ఆయన రేడియో కొరకు నాటికల్ని, ప్రసంగాల్ని రాశాడు. ఇవన్నీ ప్రసారమైనవే. వీటిల్లో రేడియో ప్రసంగాలు ఇరవైకి పైగా ఉన్నాయి. కొన్ని సాహిత్యానికి సంబంధించినవి, మరి కొన్ని తన రచనల్ని విశదీకరించేవి, గురజాడపై ప్రసంగించినవిగా శ్రీశ్రీ రేడియో ప్రసంగాల్ని చెప్పుకోవచ్చు.

రేడియో ప్రసంగాలలో సాహిత్య విషయానికి సంబంధించి 1939 లో 'నేటి తెనుగు కవిత కొత్త పోకడలు' అంశంపై మాట్లాడిన దానిలో దాదాపు సగం ఉపన్యాసం ప్రపంచంలో ఆధునికత రావడానికి దోహదం చేసిన పరిస్థితులను వివరించాడు. ఆ తరువాత గ్రామఫోన్, సినిమా, రేడియో వంటి నూతన యంత్రాలు, క్యూబిజం, ఫ్యూచరిజం, ఎక్స్‌ప్రెషనిజం వంటి ఉద్యమాలను ప్రసవించినట్లుగా చెప్పి, ఆధునిక కాలంలో సాంకేతికాభివృద్ధి, పాశ్చాత్య సాహిత్య ధోరణులు ఆధునిక తెలుగు కవిత్వం పై ఎలా ప్రభావాన్ని చూపాయో వివరించాడు. ఆధునిక తెలుగు కవిత్వం గ్రాంథికాన్ని వదిలి వాడుక భాష స్వీకరించినట్లే ఛందస్సునూ వదిలించుకొని ముత్యాలసరాలు, ద్విపదలు వంటి గేయ ఛందస్సులలో వెలువడడం ఆరంభమైందని చెప్పి విశ్వనాథ, నండూరి, కవికొండల, కృష్ణశాస్త్రి, బసవరాజు అప్పారావు, దువ్వూరి రామిరెడ్డి, ముద్దు కృష్ణ, మల్లవరపు విశ్వేశ్వరరావు మొదలైన కవుల కవితల్ని సోదాహరణంగా వివరించాడు. ఆ తరువాత ఆధునిక కవిత్వం గురించి "వచన గీతం అంటే చేతికి వచ్చిన వ్రాతకాదు" అని కవిత్వ విశృంఖలతను నిరసించాడు. అందులో తమ చుట్టూ ఉన్న సామాన్యుల జీవనోపాధికి శరీరకష్టం తప్ప ఏమీ లేని వాళ్ళు, వారి జీవితాల్లోని దారిద్ర్య పరిస్థితులను వర్ణించి లోకం కళ్ళు తెరవడానికి ఆధునిక కవులు ప్రయత్నిస్తున్నారన్నాడు. ఇలాంటి "ఆధునిక కవిత్వం అర్థం కాలేదంటే ఇతనికి ఆధునిక జీవితమే అర్థం కాలేదన్నమాట"[50] అని ఆధునిక కవిత్వం అర్థం చేసుకోలేని తనాన్ని విమర్శించాడు.

'సాహిత్య రచన ప్రక్రియలు' అనే రేడియో ప్రసంగంలో సైన్సు మాదిరి సాహిత్యంలోనూ ప్రయోగాలు చేసి నిత్య నూతన ప్రక్రియల్ని ఆవిష్కరించాలన్నాడు. నాటక ప్రక్రియలో మంచి నాటకాలు రాక పోవడానికై కొంత ఆవేదనపడి, కన్యాశుల్కం, మాభూమి, ముందడుగు వంటి నాటకాలు తెలుగులో ఉన్నందున సంతృప్తి చెంది కనీసం జిల్లాకొక నాటకశాల ఏర్పడినప్పుడే కొత్త కొత్త ధోరణులతో ఉత్తమమైన నాటకాలు వెలువడగలవని ఆశించాడు. ఆ తరువాత రేడియో నాటికలనూ ప్రస్తావించాడు. నవలా ప్రక్రియ పై తన అసంతృప్తినీ, కథానిక ప్రక్రియ పై కొంత తృప్తిని తెలిపాడు. ఇలా సాహిత్య ప్రక్రియల్ని గూర్చి చెప్పిన శ్రీశ్రీ, 'ఆధునిక సాహిత్యంలో ఆధ్యాత్మిక చింతన' అనే అంశంపై కూడా రేడియోలో ప్రసంగించాడు. అందులో 'ఆధ్యాత్మిక చింతన' అంటే "అంగీకరించిన దానికి అభ్యంతరం చెప్పడం, పాతపుంతల్లో ప్రయాణం మాని నూతన మార్గాలను అన్వేషించడం"[51] గా నిర్వచించాడు. గురజాడ రచనల్లో మతం, దేవుడు మొదలైన భావాలను చర్చిస్తూ 'మనిషి' అనే గీతంలో "ఒక మనిషి ఇంకో మనిషిని పీడించే విధానాన్ని నిర్ద్వంద్వంగా ఖండించాడు. తెలుగు సాహిత్యానికి సంబంధించినంత వరకు మానవతా వాదానికే కాక సామ్యవాదానికి కూడా ఈ గీతంలోనే బీజా వాసన జరిగిందని నా ఉద్దేశం"[52] అని తెల్పాడు. కందుకూరి తన 'రాజశేఖర చరిత్ర' తో ప్రజలలోని మూఢవిశ్వాసాలు పోగొట్టి, హేతువాదం పెంపొందించడానికి ఎన్నో విషయాల్ని తెలిపి సాహిత్యాన్నొక ఆయుధంగా మలుచుకొన్నట్లు శ్రీశ్రీ చెప్పాడు. ఇంకా గోపరాజు రామచంద్రరావు, త్రిపురనేని రామస్వామి చౌదరి గారలు తమ రచనల్లో నాస్తిక భావాలు జోడించి చెప్పినట్లుగా పేర్కొన్నాడు. దేవుడున్నాడో లేడో తనకు సందేహం తీరలేదని చెప్పిన శ్రీశ్రీ, తన కవిత "ఈ సృష్టికి ఏమర్థం? / మానవునికి గమ్యమేది? / ఒక సకలాతీతశక్తి / ఉన్నట్టా? లేనట్టా"[53] అనే ప్రశ్నలతో ప్రసంగాన్ని ముగించాడు.

ఆధునిక సాహిత్యంలో 'ఆధ్యాత్మిక చింత' నే గాక 'జేమ్స్ జాయిస్ చైతన్య స్రవంతి' పై కూడా ప్రసంగించాడు. అందులో జాయిస్‌ను సాహిత్యంలోని మెలకువలన్నీ తెలిసినవాడుగా చెప్పి డబ్లిన్ నగర ప్రజల జీవితాలనే కథా వస్తువులుగా స్వీకరించి రచనలు చేశాడని వివరించాడు. ఈయన రాసిన డబ్లినర్స్, ది పోర్ట్రెట్ ఆఫ్ ఎన్ ఆర్టిస్ట్ ఆజ్ ఏ యంగ్ మ్యాన్, యులిసెస్, ఫిన్నెగన్స్‌వేక్ రచనలు పేర్కొని ఒక్కొక్క దాని గురించి తన ప్రసంగంలో వివరంగా విశ్లేషించాడు. వీటిల్లో యులిసెస్ గురించి "1914-18 మధ్య యావత్ప్రపంచమూ ఒక మహాయుద్ధంలో నిమగ్నమై వుంటే జేమ్స్ జాయిస్ ఒక మహా కావ్య రచనలో నిమగ్నుడైనాడు. ఆ యుద్ధానికి ఫలితంగా రష్యాలో వచ్చిన సామ్యవాద విప్లవానికెంత ప్రాముఖ్యం వుందో సాహిత్య ప్రపంచంలో యులిసెస్ నవలకంత ప్రాబల్యం ఉంది"[54] అని చెప్పి, 'ఫిన్నెగన్స్‌వేక్' నవలలో ఏపుట తీసి చదివినా సంగీతపు వరదలాగా భాష ఉంటుందన్నాడు.

రేడియోలో పిల్లలతో శ్రీశ్రీ పరిచయ కార్యక్రమంలో కందుకూరి, గిడుగు, గురజాడలు తెలుగు సాహిత్యానికి చేసిన సేవను వివరించి ఆ గొప్ప వాళ్ళంతటి వాళ్ళు ఈ పిల్లలు కావాలని ఆశని వ్యక్తం చేశాడు. 'కవిత్రయం' అన్న ప్రసంగంలో తన దృష్టిలో తెలుగు సాహిత్యంలోని తిక్కన, వేమన, గురజాడలను మాత్రమే మహాకవులుగా అంగీకరిస్తానని చెప్పి, 'మహాకవి' అంటే ఏ కవి రచనల వల్ల ఈ లోకం ఒకడుగు ముందుకు వెళ్తుందో ఆ కవినే మహాకవిగా పేర్కొన్నాడు. తిక్కన, వేమన, గురజాడలే తనకెందుకు నచ్చారో, తన ప్రసంగంలో వివరించాడు. తిక్కన రచనలో నాటకీయతను పేర్కొని, గురజాడ మాత్రం నాటకాన్నే (కన్యాశుల్కం) రాశాడని తెలిపాడు. ఇలా తన దృష్టిలో మహాకవులను, వారి విశిష్టతను చెప్పడమేగాక, 'తెలుగు సాహిత్యంలో గూఢత-వేమన' అనే శీర్షికతో కూడా రేడియోలో ప్రసంగించాడు. ఇందులో వేమన కవిత్వ వస్తువు చెప్పే తీరులను పేర్కొన్నాడు. వేమన్న పద్యాలను నడిపే పద్ధతిని చెప్తూ "మొదటి పాదంలో ఒక ఊహని ప్రకటిస్తాడు. దానికి విభిన్నమైన ఊహని రెండో పాదంలో ప్రవేశ పెట్టి రెండింటి చేతా హోరా హోరి పోరాడు కొనిస్తాడు. వెంటనే మూడో పాదంలో తానై జోక్యం చేసుకొని హేళనగానో, ఉపదేశంగానో, అర్థాంతరన్యాసంగానో దీని సంగతిదీ అని తీర్చి చెబుతాడు. వేమన పద్యాలలో చాలా మట్టుకు గోచరించే గతి తార్కిక పద్ధతి ఇదే"[55] నని చాలా సుదీర్ఘంగా వేమన కవితారీతులను విశ్లేషించాడు. ఇలా ఉన్న వేమన పద్యాలను ఆరేళ్ళ పిల్లల నుండి అరవయ్యేళ్ళ వృద్ధుల వరకు అర్థం చేసుకోగలరని చెప్పి తన ఉపన్యాసాన్ని ముగించాడు.

'ప్రబంధాల్లోని శృంగారం' అన్న ప్రసంగంలో తొలి తెలుగు ప్రబంధమేదో చర్చచేసి అల్లసాని వారి 'మను చరిత్ర'నే తొలి ప్రబంధంగా తేల్చాడు. ఇందులోని శృంగారాన్ని వివరించి, ద్వితీయాశ్వాసం మొత్తం నాటకీయంగా నడిచినట్లు పేర్కొని, ఇంకా పారిజాతాపహరణం, చంద్రరేఖా విలాపం, వసుచరిత్రలలోని విశృంఖల శృంగారాన్ని విమర్శించాడు.

'చలం-లోకం' శీర్షికతో ప్రసంగించిన దానిలో 'చలం' ను 20వ శతాబ్దపు వేమనగా అభివర్ణించాడు శ్రీశ్రీ. వీరిద్దరి రచనలలో ఆవేదన సమృద్ధిగా ఉన్నట్లు పోల్చి చెప్పి చలం వివిధ రచనల్లో విశిష్ట గుణాల్ని ఈ రేడియో ప్రసంగంలో వినిపించాడు.

రేడియో ప్రసంగాలలో మరణించిన రచయితలను స్మరిస్తూ వారి వైశిష్ట్యాన్ని వివరించాడు. 'కొంపెల్ల జనార్ధనరావు' ను గూర్చిన ప్రసంగంలో తనకు జనార్ధనరావుతో పరిచయం ఎప్పుడేర్పడిందో, అతని స్వభావం, సాహిత్య, జీవిత లక్ష్యాలు మొదలైనవి చెప్పి, అతి పిన్న వయస్సులో పోయినందుకు బాధపడ్డాడు. వేంకటపార్వతీశ్వర కవుల్లో ఒకరైన బాలాంత్రపు వేంకటరావు మరణించినప్పుడు అతనికి శ్రద్ధాంజలి ఘటిస్తూ "కవిత్వం ఎక్కడో ఆకాశం నుంచి ఊడిపడదనీ, అందుకోగల ఉత్సాహంగల వాళ్ళందరికీ అది అందుబాటులోనే ఉంటుందనీ వేంకట పార్వతీశ్వరుల వల్లనే నేను తెలుసుకున్నాను"[56] అని చెప్పుకున్నాడు.

గురజాడపై మూడు రేడియో ప్రసంగాలున్నాయి. వీటిలో 'ఆధునిక గద్య వాఙ్మయ ప్రవర్తకుడు' అనే ప్రసంగంలో గురజాడ అప్పారావు వచన రచనలను వివరించాడు. ఇందులో మొత్తం గురజాడ రచనల్ని నాటకీయం, కథనాత్మకం, విమర్శనాత్మకం, వ్యక్తిగతంగా విభజించి విశ్లేషించాడు. 'కన్యాశుల్కం'లోని విషయాన్ని పాత్రలను. భాషను, నాటక రచనా వైశిష్ట్యాన్ని వివరంగా తెలిపాడు. ఈ నాటకంతోపాటు 'కొండు భొట్టీయం', 'బిల్హణీయ్యం' నాటకాల గురించీ చెప్పాడు. గురజాడ కథల్ని వివరిస్తూ " . . . మొపాసాలో వర్ణన, సంభాషణ, కవిత్వం, ధర్మబోధ ఎప్పుడు ఏది ఎంతవరకు అవసరమో ఆ మోతాదులో దొరుకుతాయని 'మీ పేరేమిటి' అన్న కథకి కూడా ఈ విమర్శ అక్షరాలా వర్తిస్తుంది"[57] అని గురజాడ కథల్ని మొపాసా కథలతో పోల్చాడు. రచయిత శక్తి సామర్థ్యాలను వ్యక్తీకరించే ప్రక్రియగా వ్యాసాల్ని పేర్కొని గురజాడ వ్యాసాలలో అసాధారణ ధీశక్తి ఉంటుందని చెప్పి వివిధ ప్రక్రియల్లో రాసిన వచన రచనల ద్వారా గురజాడను 'ఆధునిక గద్య వాఙ్మయ ప్రవర్తకుడు'గా నిరూపించేయత్నం చేశాడు శ్రీశ్రీ.

గురజాడ పై మరో రేడియో ప్రసంగం 'గురజాడ ఆధిక్యానికి కారణాలు'. ఇందులో "ఏ కవికైనా సరే అతని చుట్టూ ఒక సమాజం, ఆ సమాజానికొక చరిత్రా, ఆ చరిత్రకొక పరిణామం ఉంటాయి. సామాజిక చారిత్రక పరిణామగమనంలో కవియొక్క సాహిత్య స్థానం నిర్ణీతమవుతుంది. కవి ప్రగతిశీలి, ప్రతిభాశాలీ అయితే ఆ గమనాన్ని అతడు మరింత వేగవంతం చేస్తాడు. సామాజిక పరిణామానికి విప్లవ పంథాలో వేగం సాధించిన మహాకవిగా గురజాడ అప్పారావుకి నేను నమస్కరిస్తున్నాను"[58] అని గురజాడ కవిత్వాన్ని, వచన రచనల్ని పేర్కొని సమాజాన్ని ముందుకు నడిపే అభ్యుదయ రచయితగా కావడం 'గురజాడ ఆధిక్యానికి కారణం'గా చెప్పాడు శ్రీశ్రీ. 'గురజాడ కథన శిల్పం' అనే శీర్షికతో ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో ప్రసంగించాడు. ఇందులో కన్యాశుల్కంలోని 'కథన శిల్పం' చక్కగా వివరించాడు.

కొన్ని రేడియో ప్రసంగాల్లో కేవలం తన రచనల తీరుతెన్నుల్ని తెల్పుకున్నాడు. అలాంటి వాటిల్లో 'నా తొలి రచన' అనే ప్రసంగం ఒకటి. అందులో మొదటి సారి తనకు కవిత్వం రాయాలనిపించి రాసిన తర్వాత ఏదో కొత్తది కనిపెట్టినట్లనిపించిందని చెప్పుకున్నాడు. ఆ తర్వాత యతి ప్రాసలు లేని కందం లాంటి పద్యం రాయడం, దాన్ని తన తండ్రి చూసి 'సులక్షణ సారం' కొనిపెట్టడం వంటి అంశాలనీ చెప్పాడు. 'నా కవిత్వం' అనే సుదీర్ఘమైన రెండు ఉపన్యాసాల్లో 'మహాప్రస్థానం', 'ఖుక్కులు', 'కళారవి', 'భిక్షు వర్షీయసీ', 'కవితా! ఓ కవితా' మొదలైన కవితల్లోని ఛందస్సు, విషయాన్నీ, ఏ ఏ ప్రభావాలతో రాశాడో వివరించాడు. కవిత్వాన్ని ఎడతెగని అన్వేషణగా చెప్పాడు. ఇది అక్షరాల సత్యం అనిపిస్తుంది. ఎందుకంటే తను యతి ప్రాసలు లేని కవిత రాసిన నాటి నుండి తన జీవితంలో చివరి కవిత వరకూ ప్రతీదాన్లో రూప, విషయపరంగా ప్రయోగాలతో, వినూత్న

రీతులతో కవిత్వాన్ని చెప్పిన శ్రీశ్రీ "నేనొక దుర్గం / నాదొక స్వర్గం / అనర్గళం అనితరసాధ్యం నామార్గం" అని చెప్పుకున్నది సార్థకమయ్యేట్టుగా తన జీవితమంతా కవితా గ వేషకుడుగానే జీవించాడు. కవిత్వ మొక తీరని దాహంగానే భావించాడు.

'నాకు నచ్చిన వచన శైలి' అన్న ప్రసంగంలో గవర్నమెంటు కోసం రాసేవీ, సూటిగా చెప్పని రీతివి, చెప్పవలసిన రీతిలో చెప్పని రచనలు, డబ్బుకోసం రాసే రచనలవంటి శైలులంటే తనకు నచ్చదని నిఖచ్చిగా చెప్పేశాడు. తన శైలిని అదో విచిత్రమైన శైలిగా చెప్పి తను జేమ్స్ జాయిస్ వారసునిగా, తనకు జనార్ధనరావు, డిలాన్ థామస్ మొదలైన వారి శైలి నచ్చుతుందని చెప్పుకున్నాడు.

ఇలా తన రచనల్నీ, తన శైలిని చెప్పుకున్న మహాకవి శ్రీశ్రీ, ఏదైనా ఒక రచన ఆరంభించడం ప్రసవ వేదనావస్థ అన్నట్టుగా 'ఆరంభం పెద్ద అవస్థ' అనే ప్రసంగంలో తెలిపాడు. ఇందులో 'మహా ప్రస్థానం' గీతాన్ని రాయడానికి ఏ ఏ కవుల కవితలు తనపై ప్రభావాన్ని చూపాయో, తనలో తాను ఎంత మధన పడ్డాడో వివరించి దీన్ని కేవలం ఐదే ఐదు నిమిషాల్లో రాసినట్లు చెప్పాడు. ఇంకా 'ఋక్కులు', 'గంటలు', 'విద్యున్మాలికలు' మొదలైన కవితారచనల నేపథ్యాన్నీ వివరించి కొన్ని కవితలు రాయడానికి పది నిముషాలైన పట్టకపోవచ్చు. మరి కొన్నిటిని రాయడానికి పది సంవత్సరాలైనా పట్టవచ్చునని చెప్పి తను ఒక్కోరోజు పది సినిమా పాటలు రాసినట్లుగా చెప్పుకున్నాడు. కాని 'సదసత్సంశయం' పూర్తి చేయడానికి పదేళ్ళకంటే ఎక్కువ అయినట్టు పేర్కొన్నాడు. దీన్ని బట్టి ఎంత చెయ్యి తిరిగిన రచయితకైనా 'కృత్యాద్యవస్థ' తప్పదని తన అనుభవాన్ని ఈ ప్రసంగం ద్వారా అందించాడు.

శ్రీశ్రీ రేడియో ప్రసంగాల్లో సాధారణం (General) గా ప్రసంగించిన వాటిల్లో 'ఎందుకు వ్రాయాలి ?' అన్న ప్రసంగంలో రచయితలు ఎందుకు రాయాలో చెప్తూ "సామ్యవాద వ్యవస్థను స్థాపించడానికే కవులీనాడు కలం పట్టుకోవాలని నేను ఖచ్చితంగా చెప్పగలను"[59] అని చెప్పి ఆ లక్ష్య సాధన కోసమే తాను రచనలు చేశానని చేస్తున్నాని, చేయబోతున్నాననీ చెప్పుకున్నాడు. ఇంకా సామాజిక ప్రయోజనాన్ని సాధించని కవిత్వానికి తాను విలువ నివ్వనని తెలిపి నన్నయ, తిక్క వేమనల కవిత్వ ప్రయోజనాన్ని వివరించాడు. 'ఏదో ఫర్వాలేదు' అన్న ప్రసంగం ఒక విచిత్రమైన ప్రసంగం. ఇందులో 'ఏదో ఫర్వాలేదు' అన్న పదాన్ని వివిధ ప్రాంతాల్లో, వివిధ రకాల వ్యక్తులు ఎలా ఊతపదంగా వాడుతారో హాస్యస్ఫోరకంగా ఉపన్యసించాడు.

ఇంకా శ్రీశ్రీ, వివిధ సాహిత్య విషయాలపై మద్రాసు, హైదరాబాదు వంటి ఆకాశవాణి కేంద్రాలలో ప్రసంగించాడు. 'ఎందకు వ్రాయాలి ?' అన్న ఒకే ఒక్క ప్రసంగంలో సామ్యవాద ప్రస్తావన

తీసుకొచ్చాడు. రేడియో ప్రసంగాల్లో మామూలు సభల్లో ప్రసంగించినట్లుగాక కొన్ని అంశాలపై అంక్షలు, చెప్పబోయే విషయంలో ప్రభుత్వ వ్యతిరేక భావాలుంటే సెన్సార్‌కు గురికావడం జరుగుతుంది. ఢిల్లీ ఆకాశవాణి కేంద్రంనుండి వార్తలు చదివే ఉద్యోగం చేసిన శ్రీశ్రీకి ఎలాంటి ప్రసంగాలను రేడియో వారు అంగీకరిస్తారో తెలుసు. అందుకే తన ప్రసంగాలు సెన్సార్ అయ్యే అవకాశమే లేకుండా నిబంధనల మేరకే అంశాలను ఎన్నుకున్నట్టుగా గమనిస్తాం. అలాగని శ్రీశ్రీ తనకు బొత్తిగా నచ్చని ప్రభుత్వానుకూల విషయాలపైనా రాయక కేవలం సాహిత్య అంశాలనే ఎన్నుకోవడంలోనే శ్రీశ్రీ ప్రత్యేకత వ్యక్తమవుతుంది.

**అరసం సభల్లో ఉపన్యాసాలు**

1943 లో తెలుగు దేశంలో అభ్యుదయ రచయితల సంఘం ఆవిర్భవించింది. 1945 లో అరసం మద్రాసు శాఖను ప్రారంభించి ఉపన్యసించాడు శ్రీశ్రీ. ఆ సభలో భాషకు, భావానికి, సంఘానికి అవినాభావ సంబంధముందని చెప్పి "రచన శస్త్రం లాంటిది. దాని నుపయోగించే పద్ధతినిబట్టి ఫలితం వుంటుంది. రచనవల్ల ఉపయోగమూ, ఉపదేశమూ వుండాలని అభ్యుదయ రచయితలు కోరుతున్నారు"[60] అని చెప్పాడు.

ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం (రాజమండ్రి) మూడో మహాసభను (31-12-1945) ప్రారంభించి ఉపన్యసించాడు. అందులో "గత చరిత్రను ప్రస్తుత ప్రయోజనం కోసమూ, భావి అభివృద్ధి నిమిత్తమూ, ఏ విధంగా పఠించక తప్పదో అదే విధంగా పూర్వ సాహిత్యాన్ని సవిమర్శకంగా, సాకల్యంగా చదవకపోతే సారస్వత సృష్టికి అవకాశమే ఉండదు'[61] అని గత చరిత్ర, సాహిత్య పఠనాల ఆవశ్యకతను పేర్కొన్నాడు. ప్రతీ మనిషి ఏదో ఒక రాజకీయ పక్షం వైపు మొగ్గక తప్పదు. అలాంటి రాజకీయము సాహిత్యంలో ఉండకూడదనేది సాధ్యమయ్యేపనికాదని, గత ాహిత్యంలో కృష్ణుడు ప్రత్యక్షమైతే, నేటి సాహిత్యంలో ఎర్రజెండా సాక్షాత్కరిస్తుందని ుమత్కరించాడు. ఇంకా స్పెయిన్ అంతర్యుద్ధం, అరసం కవులపై ఉన్న ఆంక్షలు మొదలైనవి ువరించాడు.

ఈ సభల్లోనే 'సాహిత్యం ఎందుకు? ఎవరికి?' అనే అంశంపై శ్రీశ్రీ ఉపన్యసించాడు. అందులో నూటికి తొంభై శాతం మంది ప్రజలు నిరక్షరాస్యులైనప్పుడు వారికి సాహిత్యం అర్థంకాదు. అలాంటప్పుడు 'సాహిత్యం ఎందుకు? ఎవరికి?' అని ప్రశ్నించి అంధకారంలో, అజ్ఞానంలో, దారిద్ర్యంలో కొట్టుకు పోతున్న వారిని రచయితలే తమ రచనల ద్వారా చైతన్యవంతులుగా మార్చాలని చెప్పి ధనస్వామ్య వ్యవస్థను నిరసించాడు.

అరసం ఐదవ మహాసభకు అధ్యక్షత వహించాడు.[62] ఈ సభలోనే అరసంకు అధ్యక్షుడుగా తొలిసారి ఎన్నికయ్యి సుదీర్ఘమైన ఉపన్యాస మిచ్చాడు. అరసం ఏ రాజకీయ పక్షానికి లొంగి ఉండని నూటికి నూరు పాళ్ళు సాహిత్య సంస్థ అంటూ రచనలు సాంఘిక ప్రయోజనంతోనే చేయాలన్నాడు. దీనికి ఉదాహరణగా తన దృష్టిలోని కవిత్రయం తిక్కన, వేమన, గురజాడల రచనలు సాంఘిక ప్రయోజనంతోనే వెలువడినట్లు చెప్పాడు. మూఢ నమ్మకాల్నీ, అజ్ఞానాన్నీ తీవ్రంగా నిరసించి ప్రజలకు కనీసం తిండి, వసతి, పని ప్రభుత్వం కల్పించేంతవరకు రచయితలు కృషి చేసి మరో ప్రపంచంవైపు మహాప్రస్థానం సాగించడమే అరసం రచయితల లక్ష్యంగా నిర్దేశించాడు. ఆ తరువాత గిడుగు, గురజాడ, వీరేశలింగంలు చూపిన బాటలో నడిచి సాహిత్యానికి, ప్రజలకు సేవ చేయాల్సిందిగా ఉద్బోధించాడు.

**విరసం సభల్లో ఉపన్యాసాలు**

శ్రీశ్రీ షష్టిపూర్తి సభలో విశాఖ విద్యార్థులు పంచిన కరపత్రం 'రచయితల్లారా మీరెటు వైపు' అనేది శ్రీశ్రీ తో పాటు చాలా మంది రచయితలను ఆలోచింపచేసింది. ఈ నేపథ్యంలోనే 1970 లో విరసం ఆవిర్భవించింది. ఈ సంస్థకు మొదటి నుండీ మరణించేవరకూ శ్రీశ్రీనే అధ్యక్షుడు.

విరసం తొలి మహాసభల బహిరంగ సభలో (9–10–1970, ఖమ్మం) శ్రీశ్రీ ప్రసంగించాడు. ఇందులో విరసం జననం వెనుక ఎంతో కథ ఉన్నట్లుగా చెప్పి అరసంలో మార్క్సిస్టులు కాకపోయినా చాలా మంది చేరడం జరిగింది. కానీ 1970 నాటి రచయితలకు తప్పక మార్క్సిజం తెల్సి ఉండాలన్నాడు. మానవతా, మార్క్సిస్టు దృక్పథాలతో సమాజ స్వభావం తెలుసుకొని కవితలు, కథలు, నాటకాలు, బుర్రకథలు రాయాలని రచయితలకు మార్గాన్ని నిర్దేశించాడు.

విరసం రెండో మహాసభలో (1-10-1971, హైదరాబాదు) అధ్యక్షోపన్యాసం చేశాడు. శ్రీశ్రీ పెద్ద ఉపన్యాసాల్లో ఇదొకటి. ఇందులో తమ శత్రువుల గురించి చెప్తూ "నిన్నటికి వత్తాసుగా నిలిచే వాళ్ళంతా మన శత్రువులే. ఆయుధాన్ని ఆయుధంతోనే ఎదిరించాలి. హింసని ప్రతిహింసతో ప్రతిఘటించాలి. అప్పుడు సామ్యవాద విప్లవం సార్థకమౌతుంది"[63] అని తీవ్రంగా చెప్పాడు. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న సామ్యవాద శక్తుల గూర్చి వివరించాడు. విప్లవ రచయితలు మార్క్సిజం సిద్ధాంతానికి నిబద్ధులై గ్రాంథికాన్ని అధిగమించి పూర్తి వ్యావహారికంలోనే రచనలు సాగిస్తున్నారన్నాడు. చేగువేరా పోరాటానికి తన జీవితాన్ని అంకితం చేసినట్లుగా తెలిపి విరసం ప్రచురించిన 'ఝంఝ' కావ్యాన్ని ప్రభుత్వం నిషేధించడాన్ని విమర్శించాడు. సత్యజిత్‌రాయ్ తీసిన 'పథేర్ పాంచాలీ', ఇటాలియన్ చిత్రాలు, రోమ్ ఒపెన్‌సిటీ, బైస్కిల్‌థీవ్స్, రష్యా చిత్రాల గురించి వివరించాడు. ఇలా ఈ ప్రసంగంలో మరెన్నో విషయాలను ప్రస్తావించాడు.

విరసం మూడవ మహాసభలో (5-10-1972, గుంటూరు) మతాన్ని విమర్శించి "విప్లవ రచయితలు మొట్టమొదట పోరాడవలసింది ఈ మూఢ విశ్వాసాలతోనే. నన్నడిగితే ప్రతి గ్రామంలోనూ ఒక్కొక్క విరసం శాఖ కన్నా ఒక్కొక్క నిరీశ్వరాశ్రమం వుంటే చాలనుకుంటాను"[64] అని తన ఆకాంక్షను వెల్లడించాడు. తెలంగాణ సాయుధ పోరాటాన్ని జ్ఞాపకం చేసి ఉపన్యాసం చివరలో అప్పటి అధికారంలో ఉన్న కాంగ్రెస్ పార్టీని దుయ్యబట్టాడు.

విరసం నాలుగో మహాసభలో (13-1-1974, కర్నూలు) అధ్యక్షోపన్యాసం చేస్తూ అరెస్టులూ, నిషేధాలూ, సోదాలను గర్హించాడు. కలాన్నే ఆయుధంగా చేసుకొని విరసం రచయితలు సాయుధ సాహిత్య పోరాటం చేయాలన్నాడు. జాతీయ సమైక్యతకు ప్రభుత్వం ఏలాంటి చర్యలు చేపట్టాలో విజ్ఞప్తి చేశాడు. తన ప్రసంగం ద్వారా గుంటూరులో జరిగిన పౌరహక్కుల మహాసభ, భారత - చైనా మిత్రమండలి సమావేశాలు ఎలా జరిగాయో విపులంగా తెలిపి, చైనాలో జరిగిన 'సాంస్కృతిక విప్లవం' వివరించాడు. 'దైవభక్తి'ని తీవ్రంగా నిరసించి, ఈ ఉపన్యాసం చివరలో 'అరసం'ను విమర్శించాడు.

విరసం 7వ మహాసభల్లో (29, 30 సెప్టెంబర్, 1979, తిరుపతి) కవిత్వంలో వస్తున్న మార్పులను, పరిణామాలను వివరిస్తూ గద్దర్, వంగపండు, చెరబండ రాజుల గీతాల్ని ప్రశంసించాడు. శేషేంద్ర శర్మను గోడమీద కోకిలగా పేర్కొన్నాడు.

ఇలా శ్రీశ్రీ 1970 లో విరసం ఏర్పడిన తర్వాత విరసం సభ్యులకు ఉత్తేజాన్ని కలిగించే విధంగా ఉపన్యాసాలిస్తూ ప్రభుత్వ విధానాలను తీవ్రంగా ఖండించాడు.

**సాహిత్య సభల్లో ఉపన్యాసాలు**

రేడియో, అరసం, విరసం వంటి ప్రత్యేక సంస్థలలోనేగాక, మామూలు సాహితీ సంస్థలు ఏర్పాటు చేసిన సభల్లో కూడా శ్రీశ్రీ ప్రసంగించాడు. ఈ సభలలో కొన్ని కేవలం ప్రసంగం కొరకే ఏర్పాటు చేసినవి. మరికొన్ని సన్మాన సభలు, ఇంకొన్ని పుస్తకావిష్కరణ సభలు.

ఆంధ్ర సారస్వత పరిషత్తు ఏడవ మహాసభలో (11-1-1953, అలంపురం) శ్రీశ్రీ పాల్గొన్నాడు. అందులో కవిత్వాన్ని గురించి ప్రధానంగా ప్రసంగిస్తూ, కవిత్వాన్ని ప్యూర్ పొయట్రి, అప్లయిడ్ పోయట్రీలుగా వివరించి కావ్య నిర్మాణానికి అవసరమయ్యే అనుభూతులు, పరిశోధన, విజ్ఞానం మొదలైనవి ప్యూర్ పొయట్రి అనీ, కవిత్వంగా రాసి ప్రజల దగ్గరకు తీసుకుపోయేది 'అప్లయిడ్ పొయట్రీ' గా చెప్పాడు. మరో ఉపన్యాసంలో[65] "Poetry that is spoken, poetry that is sung"[66] అని కవిత్వాన్ని మాట్లాడేది, పాడేదిగా పేర్కొని, దీనికి ఉదాహరణగా నన్నయ, శ్రీనాథుల కవిత్వం పాడుతున్నట్లుంటుందనీ, తిక్కన, వేమన, చెళ్ళపిళ్ళ గారల కవిత్వం మాట్లాడు తున్నట్లుందన్నాడు.

అధునికుల్లో గురజాడ కవిత్వం మాట్లాడేదిగా, రాయప్రోలుది పాడే కవిత్వంగా తెలిపాడు. ఈ ఉపన్యాసంలోనే దిగంబర కవులపై నాటి సామాజిక ప్రభావాన్ని చెప్పి, వారి కవిత్వాన్ని ప్రశంసించాడు.

'ఆధునిక సాహిత్యం' అనే అంశంపై ఏర్పాటైన సమావేశంలో[67] గురజాడ సాహిత్యాన్ని కొలవడానికి సరైన కొలమానాలు లేవన్నాడు. గురజాడ, రాయప్రోలుల కవిత్వాన్ని క్రమంగా వచన, పద్య రీతుల కవిత్వమని తెలిపాడు. సాహిత్య రచనలో అతి క్లిష్టమైన పని అతి సులభంగా రాయడమేనని చెప్పాడు. ఇంకా నవల, నాటక ప్రక్రియలనూ సమీక్షించాడు.

తెలుగు సాహిత్యంలో మహాకవులుగా తిక్కన, వేమన, గురజాడలను పేర్కొన్న శ్రీశ్రీ, తిక్కన గూర్చి కవిత్రయ జయంతి సభలో ప్రసంగించాడు.[68] అందులో భారత రచనలో తిక్కన డెబ్బయి ఐదు శాతం తెలుగు పదాల్ని వాడాడని, తిక్కనలో నాటకీయత ఉందని పేర్కొని నన్నయది పాటకు అనువైనదైతే, తిక్కనది మాట్లాడే కవిత్వమేగాక సంభాషణాత్మకమైన శైలి (dramatic conversational poetry) గా చెప్పాడు. ఈ విషయం చాలా ప్రసంగాల్లోనూ ఉంది. తిక్కన ఛందో ప్రయోగాలను తెలుపుతూ అతని కందాలే తాను రాసిన 'సిరిసిరిమువ్వా' శతకానికి ప్రేరణన్నాడు. ఇంకా తిక్కన సాహిత్యం, జీవితానికి సంబంధించిన అంశాలనూ వివరించాడు. మరో సభలో[69] కవిత్వానికి ఛందస్సు అనేది వాహనంగా చెప్పి ఎడ్లబండ్లు, గుర్రబ్బండ్లు, సైకిళ్ళు, రిక్షాలు, నాలుగు చక్రాల మోటార్లు వచ్చినట్లుగానే కవిత్వంలో ఛందస్సు ఎడ్లబండ్లనాటి ఉత్పల మాలలను దాటి గేయాల మోటార్ల కాలానికి వచ్చిందన్నాడు.

కేంద్ర సాహిత్య అకాడమి ఏర్పాటు చేసిన సెమినార్ (8-9-1970)లో 'లెనిన్ భారతీయ సాహిత్యం' అనే శీర్షికతో శ్రీశ్రీ ప్రసంగించాడు. ఇందులో మార్క్స్ రాసిన సిద్ధాంతాన్ని పోరాట పటిమతో సామ్యవాదం సాధించినట్లుగా లెనిన్‌ను అభివర్ణించాడు. ఈ సామ్యవాద ప్రభావం ప్రపంచంలోని అన్ని దేశాలపైబడినట్లు చాలా దేశాల్లో సాహిత్యం సామ్యవాద భావాలతో వెలువడుతున్నట్లు చెప్పి, తెలుగు సాహిత్యంపై ఎలా ఉందో వివరించాడు. లెనిన్ సాధించిన సామ్యవాదం ప్రభావంతోనే తెలంగాణా పోరాటం జరిగిందని, ఆ తెలంగాణా పోరాటానికి స్పందించి వెలువడిన 'త్వమేవాహమ్', 'తెలంగాణా' కావ్యాలు పరోక్షంగా లెనిన్ ప్రభావంతోనే రాసినట్లు వ్యక్తీకరించాడు. 'మా భూమి', 'ముందడుగు' లాంటి నాటకాలకు కూడా ప్రేరణ సామ్యవాదమన్నాడు. లెనిన్ సాధించిన సమసమాజ విజయంతో ప్రపంచ వ్యాప్తంగా తమ తమ దేశాల్లోకూడా అదే వ్యవస్థ కోసం రచయితలు కృషి చేశారు. అందులో భాగంగానే లండన్‌లోని 'ప్రోగ్రెసివ్ రైటర్స్' ప్రణాళికను చదివి తను 'ప్రతిజ్ఞ' గేయం రాసినట్లు చెప్పుకున్నాడు. ఇలా ఈ సుదీర్ఘోపన్యాసంలో తెలుగు సాహిత్యంపై లెనిన్ ప్రభావం ప్రత్యక్షంగా కొంతే ఉన్నా పరోక్షంగా మాత్రం ఎంతో ఉందన్నాడు శ్రీశ్రీ.

తెనాలి రోటరీక్లబు ఏర్పాటు చేసిన సభ (26-11-1979) లో మాట్లాడుతూ సాంకేతిక, విజ్ఞాన రంగాల్లో అభివృద్ధి జరుగుతున్నట్టుగానే కవిత్వంలోనూ జరగాలన్నాడు. ప్రస్తుత సమాజంలో పేరుకుపోయిన నిరక్షరాస్యత, నిరుద్యోగం, అనారోగ్యం మొదలైన సమస్యల్ని పోగొట్టి భావవిప్లవం తేవడానికి విప్లవ కవులు కృషి చేస్తున్నారని వివరించాడు.

కాకినాడ (1-3-1980) రాజమండ్రి[70] లలో ఏర్పాటైన సభల్లోనూ మాట్లాడాడు. అందులో గురజాడ నూతన మార్గానికి నాంది పలికితే తను ఆ మార్గాన్ని విశాలం చేసినట్లు వ్యక్తం చేశాడు. తను మొదట గ్రాంథికవాదినని చెప్పి గిరాంమూర్తి, గురజాడల ప్రభావంతో పూర్తిగా వ్యావహారికంవైపు మళ్ళినట్టు చెప్పుకున్నాడు. తన 'మహాప్రస్థానం' కావ్యం ఎవరి జీవితానికి దర్పణమో వివరించి విశ్వ విద్యాలయాలు దాన్ని పాఠ్య గ్రంథంగా చేయడం అభ్యుదయకర మార్పుగా శ్రీశ్రీ భావించాడు. తనకు ఒక నవల, నాటకం రాయాలని ఉందని చెప్పి 'వ్యక్తికి బహువచనం శక్తి' పేరుతో నాటకం రాస్తానని చెప్పాడు. కానీ రాయలేక పోయాడు. హిందీని జాతీయ భాషగా చేయడానికి తన వ్యతిరేకతను తెల్పి ఆ అర్హత తెలుగు భాషకే ఉందని ప్రాంతీయ భాషాభిమానాన్ని తెలుపుకున్నాడు.

'సాక్షి' క్లబ్ మొదటి వార్షిక సమావేశంలో సుదీర్ఘమైన ఉపన్యాసాన్నిచ్చాడు.[71] ఇందులో తన జీవితంలోని ముఖ్య ఘట్టాలను తెలుపుతూ కొంపెల్ల జనార్దనరావు, చెరబండరాజులను ఈ సమాజమే హత్య చేసిందన్నాడు. 'మహాప్రస్థానం' కావ్యం జనార్దనరావుకి అంకితమివ్వాలనుకొని ఇవ్వగలిగినట్లు, 'మరోప్రస్థానం' మాత్రం చెరబండరాజుకు ఇవ్వలేక పోయినందుకు బాధ వ్యక్తపరిచాడు. చెరబండరాజు రాసిన 'కొండలు పగలేసినం, బండలను పిండినం, మానెత్తురు కంకరగా ప్రాజెక్టులు కట్టినం' వంటి గేయాలు విరసానికి ఒక విధమైన ఇన్స్పిరేషన్ ఇచ్చాయన్నాడు. గద్దర్, వంగపండులు ప్రజల్ని ఎక్కువగా ఉత్తేజితుల్ని చేయగల్గుతున్నారని ప్రశంసించి కుందుర్తి, ఆరుద్రల కవిత్వాలనూ వివరించాడు. ఇంకా ఈ ప్రసంగంలో పురిపండా అప్పలస్వామి పరిచయం అయిన నాటి నుండి తను సాహిత్యకారుడుగా ఎదగడానికి ఎలా తోడ్పడ్డాడో జ్ఞాపకం చేశాడు. తన )వరి రోజుల్లో రచయితల నుద్దేశించి ప్రసంగిస్తూ[72] అరసం, విరసంల సాహితీ సేవలను )వరించాడు. ఒక రచన చేసి దానికి జాతీయ స్థాయిలోనో, అంతర్జాతీయ స్థాయిలోనో గుర్తింపు రాలేదని బాధపడడం కాదనీ, ప్రజలకోసం మార్క్సిస్టు దృక్పథంతో రచనలు చేయాలని ఉద్బోధించాడు. విశాఖలోని ఆంధ్రా మెడికల్ కాలేజ్ (1-2-1970) లోని ప్రసంగంలో సామ్యవాదాన్ని బలపరుస్తు ఏ వృత్తి చేపట్టినా నిజాయితీ ముఖ్యమని ఉద్బోధించాడు.

ఇలా ఎన్నో సాహిత్య సభల్లో ప్రసంగించిన శ్రీశ్రీకి లెక్కలేనన్ని సన్మానాలు జరిగాయి. ఇతరులకు జరిగిన సన్మానాల సభల్లోనూ పుస్తకావిష్కరణ సమావేశాల్లోనూ పాల్గొన్నాడు.

సాహిత్య అకాడమీ సభ్యులైన తర్వాత శ్రీశ్రీకి విశాఖలో 1-7-1970న సన్మానం జరిగింది. ఆ సభలో అవార్డులు రావడం, విశిష్ట సభ్యత్వం పొందడం వంటి అంశాల్ని వివరించి తన కవిత డేనిష్ భాషలోకి అనువదించుకున్నారని, దానికిగాను డెన్మార్క్ నుండి తనకు రు॥ 25/- లు వచ్చినట్లు అది సాహిత్య అకాడమీ సన్మానం కంటే గొప్పదని తను భావించాడు.

చెన్న పట్నంలోని 'ఆంధ్ర మహాసభ' 1966 లో శ్రీశ్రీని సన్మానించింది. ఈ సన్మానానంతరం ప్రసంగిస్తూ తనకు ఒక నవల, నాటిక రాయాలనుందని చెప్పి అది తాను రాయగలనో లేదోనని సందేహం వెలబుచ్చాడు.

'రాజ్యలక్ష్మి ఫౌండేషన్' సంస్థ అవార్డు మొట్టమొదట శ్రీశ్రీకే వచ్చింది. ఈ అవార్డును అందుకున్న సభ (19-11-1979)లో ప్రసంగిస్తూ, "నాకు ఎన్ని అవార్డులొచ్చినా నాలోని విప్లవ చైతన్యపు వేడి చల్లారదు. కవిత్వానికి సామాజిక ప్రయోజనం వుందని భావిస్తూ, అదే ధ్యేయంగా కవితా యాత్ర సాగిస్తూ . . ."[73] అని చెప్పిన అసంపూర్ణ వాక్యాన్ని 'జీవిస్తాను' లేక 'మరణిస్తాను' అని ఊహించి చెప్పుకోవచ్చు.

హైదరాబాదులోని ఏ.జి.ఆఫీసు 'రంజని' సాహిత్యసంస్థ శ్రీశ్రీని (2-6-1980) సన్మానించింది. ఇందులో ఏది మంచి కవిత్వమో చెబుతూ, ఇతరులు పేర్కొన్న నిర్వచనాన్ని చెప్పి, జ్ఞాపకం ఉంచుకోవడానికి వీలైన కవిత్వమే గొప్ప కవిత్వమని, మరచి పోయేది చెత్త కవిత్వమని చెప్పాడు. నన్నయకు ముందున్న కవిత్వం నావికులు, రైతులు మొదలైన వారు పాడుకునే మౌఖిక పాటలే సాహిత్యమంటూ అది ప్రజా భాషల్లో, ప్రజాబాణిలోనే ఉండేదన్నాడు. గురజాడ ముత్యాలసరాలతో కొత్తమార్గం వేశాడని, ఆ మార్గాన్ని తనతో పాటు గజ్జల మల్లారెడ్డి వంటి వాళ్ళు విస్తృతం చేశారని పేర్కొన్నాడు. 1930–40 ల మధ్య జాతీయ, అంతర్జాతీయ పరిస్థితుల్ని వివరించాడు. అప్పటి నుండి విప్లవ కవిత్వం వరకు కవిత్వ తీరుతెన్నుల్ని విశదీకరించాడు.

తనకు వనపర్తిలో జరిగిన సన్మాన సభ (14-3-1982)లో నోబెల్, జ్ఞానపీఠ బహుమతి కంటే ఈ సన్మానం గొప్పదని చెప్పాడు. రాజులు, ప్రభుత్వాలు చేసే సన్మానాలకంటే ప్రజలు చేసే సన్మానం గొప్పదన్నాడు. ముందు ముందు విప్లవ కవిత్వం కంటే గొప్పదొస్తే అందులోకి వెళ్తాననీ, అదొచ్చేంతవరకు విప్లవకవిత్వాన్ని వదిలి తిరోగమించలేనని చెప్పుకోవడంవల్ల శ్రీశ్రీ ఆలోచనలోని నిత్య నూతనత్వం తెలుస్తుంది.[74]

తనకు జరిగిన సన్మాన సభలోనేగాక తాపీ ధర్మారావుకు జరిగిన సన్మాన సభలో[75] లో పాల్గొని తాతాజీ మొదట్లో అభ్యుదయ వ్యతిరేకులే అయినా రానూరానూ అభ్యుదయ కాముకుడైనాడని, ఆయన సాహిత్య పరిణామ క్రమాన్ని తెలిపాడు.

కవిగా ఎన్నెన్నో ప్రయోగాలు చేసి సాహిత్యవేత్తల అభిమానాన్ని చూరగొన్న శ్రీశ్రీతో తమతమ పుస్తకాల్ని ఆవిష్కరింపజేసుకోవడానికి కవులు, రచయితలూ కుతూహలపడ్డారు. కాళోజి నారాయణరావు రాసిన 'నా గొడవ' పుస్తకావిష్కరణ సభలో శ్రీశ్రీ ప్రసంగిస్తూ అతన్ని 'లూయి ఆరగన్' తో పోల్చాడు. కాళీపట్నం రామారావు 'యజ్ఞం' కథల సంపుటి ఆవిష్కరించి, కథకుడుగా గురజాడను కీర్తించి, కాళీ పట్నం రామారావు కథల్ని ప్రశంసించాడు.

'దిస్ టెన్స్ టైమ్స్' అన్న ఇంగ్లీషు కవితా సంకలన ఆవిష్కరణ సభ (28-9-1981) లో వేగుంట మోహన ప్రసాద్ ఎంత శ్రమ కోర్చి ఆ సంకలనం తయారు చేశాడో వివరించాడు. ఇటువంటిదే 1900-1982 మధ్య వచ్చిన తెలుగు కవితలను ఇంగ్లీషులోకి అనువదించి '20th Century Telugu Poetry' అన్న ఒక సంకలనం తను చేస్తానని వెల్చేరు నారాయణరావుకి మాట ఇచ్చినట్లు చెప్పుకున్నాడు శ్రీశ్రీ.

**పౌరహక్కుల సభల్లో ఉపన్యాసాలు**

పౌరహక్కుల సభల్లో శ్రీశ్రీ పదిహేనుకు పైగా ఉపన్యాసాలిచ్చాడు. ఇవన్నీ ఒకటో రెండో ప్రదేశాల్లోగాక రాష్ట్ర వ్యాప్తంగా తిరిగి దాదాపు అన్ని జిల్లాల్లోనూ ప్రసంగించాడు. అరసం, విరసం వంటి పూర్తి సాహిత్య పంస్థలకేగాక పౌరహక్కుల సంఘానికి (ఆంధ్రప్రదేశ్) కూడా అధ్యక్షుడు శ్రీశ్రీ.

నల్లగొండ జిల్లా పౌరహక్కుల సభ (7-11-1965)లో ప్రసంగిస్తూ ప్రభుత్వం అత్యవసర పరిస్థితిని విధించి పౌరహక్కుల నాయకులను అరెస్టు చేసిందనీ, దేశంలోని అస్తవ్యస్థ పరిస్థితులకు ప్రభుత్వమే కారణమని విమర్శించాడు. నల్లగొండలోనే మరో సభలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పౌరహక్కుల్ని ఉల్లఘించినట్లు ఆరోపించాడు. ప్రభుత్వం, 'సోషలిజం' అనే పదం వాడడం'నేతి బీరకాయలోని నెయ్యి' వంటిదనీ విమర్శించాడు. మనకింకా నిజమైన స్వాతంత్ర్యం రాలేదన్నాడు. ప్రజలందరికీ, తిండి, బట్ట, యిల్లు, విద్య పని ఇచ్చే వ్యవస్థ నిజమైన సామ్యవాదం, స్వాతంత్ర్యం అని చెప్పి, ఆ స్వాతంత్ర్యం కోసమే ఈ నాటి యువతరమంతా నడుంకట్టాలన్నాడు.

గుంటూరు జిల్లా పౌరహక్కుల సభ (11-4-1971)కు నిఖిలేశ్వర్, చెరబండరాజు, జ్వాలాముఖిలతో పాటు శ్రీశ్రీ కూడా హాజరయ్యాడు. ఆ సభలో సమ సమాజ స్థాపనకు విప్లవం తప్ప మరో మార్గం లేదని చెప్పి, మంత్రి వర్గాలను మార్చాలంటే ఓట్లతో పనిగానీ, సమాజాన్ని

మార్చడానికైతే తూటాలే శరణ్యమని 'బెర్నాడ్‌షా' మాటల్ని ఉటంకించాడు. 'ఝంఝు', 'మార్చ్' పుస్తకాల్ని నిషేధించడం ప్రభుత్వపు అనాగరిక చర్యగా అభివర్ణించాడు. దేశంలోని దారిద్ర్యమూ, దైవభక్తిలలో ఒకటిపోతే మరొకటి ఉండదన్నాడు. ప్రభుత్వ చర్యలకు నిరసిస్తూ " మేం మా భావాలను, మా ఉద్దేశాలను ప్రకటిస్తున్నాం. చేతనైతే మీరు కూడా రచనల ద్వారానే మమ్మల్ని ఎదుర్కోండి. మీ రచయితల (విశ్వనాథలాంటి వారి) చేత మా రచనలకు ప్రతిగా రాయించండి. అంతే గాని మేం కలంతో వ్యవహరిస్తుంటే మీరు కత్తి చూపడమేమిటి?"[76] అని ప్రశ్నించాడు.

ప్రకాశం జిల్లా పౌరహక్కుల సభ (6-6-1971) లో పౌరహక్కుల ప్రాధాన్యత, దాని పట్ల ప్రభుత్వ ప్రవర్తనను "ఈ ప్రభుత్వం జపించేది సామ్యవాదం. ప్రయోగించేది పోలీసు యంత్రం"[77] అని తీవ్రంగా విమర్శించాడు.

గుంటూరు జిల్లా పౌరహక్కుల సభ (22-6-1979) లో 'గరీబీ అటావో' అన్న నినాదం చెప్పిన ఇందిరా గాంధీ పి.డి. చట్టం తేవడాన్ని గర్హించాడు శ్రీశ్రీ. బాపట్ల పౌరహక్కుల సభలో వంద, వెయ్యి, పదివేలు, లక్షమంది నక్సలైట్లని చంపినా, జైళ్ళలో నిర్బంధించినా నక్సలైటు అనే మాటని చంపలేరు. మనకు పౌరహక్కులే కాదు, తినడానికి తిండికూడా లేదు వీటన్నిటి కోసం పోరాడాలి. దీనికి విప్లవ మొక్కటే మార్గం"[78] అని సూచించాడు.

విజయవాడ (4-11-1973), విశాఖపట్నం (24-11-1973), కరీంనగర్ (16-12-1973), హైదరాబాదు (26-10-1974) నగరాల్లోని సభల్లో "ఈ దేశ ప్రజలు సమైక్యమై అప్రమత్తంగా ఉండాలి. ఈ ప్రభుత్వానికి అవసానకాలం సమీపించింది. ఇది కూలిపోవడానికి ఎంతో కాలం పట్టదు"[79] అన్నాడు. చివరిదాకా ప్రజా పక్షపాతి అయిన శ్రీశ్రీ పౌరహక్కుల సభల్లో ప్రభుత్వ, పోలీసు చర్యల్ని ఎప్పటికప్పుడు ఖండిస్తూ తన ఆవేదనను ప్రజలకు వినిపించాడు.

**విదేశాల్లో ఉపన్యాసాలు**

జాతీయ భాష అయిన హిందీలోకి, అంతర్జాతీయ భాష అయిన ఇంగ్లీషులోకి శ్రీశ్రీ కవితలు అనువదించబడి తెలుగేతర ప్రజలచేతకూడా ఆస్వాదించబడ్డాయి. ఇలాగే ఉపన్యాసాలు కూడా ఇతర రాష్ట్రాలలోని మద్రాసు, ఖరగ్‌పూర్ మొదలైనచోట్ల శ్రీశ్రీ ఉపన్యసించాడు. లండన్, చికాగోలాంటి విదేశీ నగరాలలోనూ ప్రసంగించి తన భావాలు ప్రపంచ వ్యాప్తంగా ఎలుగెత్తి చాటాడు.

లండన్‌లోని కామన్‌వెల్తు ఇన్‌స్టిట్యూట్ వారి ఆహ్వానంపై 1980లో వెళ్ళి, అక్కడి సాహిత్య సభలో తెలుగు కవిత్వం గూర్చి చెప్పి తన 'దేశ చరిత్రలు' కవితను కొంత వినిపించి

"ఇప్పుడు నా 70వ ఏట కూడా ఈ నాటి దీనమానవుడే నా కావ్య వస్తువు. . . . ఈ కామన్వెల్తు భావాన్ని ఆహ్వానిస్తూనే మానవ జాతి యావత్తూ ఒకే కామన్వెల్తు కావాలని ఆశిస్తున్నాను. అప్పుడే కవులు అంగీకృత శాసనకర్తలు కాగలరు"[80] అని ఆశించాడు.

చికాగో (26-5-1981) లో మాట్లాడిన దీర్ఘోపన్యాసంలో భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వడానికి అప్పటి బ్రిటన్ నాయకుడైన విన్‌స్టన్ చర్చిల్ అన్న మాటల్ని "ఐ షల్ నాట్ బికమ్ ది ఫస్ట్ మినిస్టర్ ఆఫ్ హిస్ మెజిస్టిస్ గవర్నమెంట్ టు ప్రిసైడ్ ఓవర్ ది లిక్విడెషన్ ఆఫ్ ది బ్రిటిష్ ఎంపైర్ అని ఆయన కాన్ఫిడెంట్‌గా చెప్పిన నాలుగైదు సంవత్సరాల్లోనే బ్రిటిష్ ఎంపైర్ అంతా కూడాను విచ్ఛిన్నమై పోవడం ఆయన కళ్ళతోనే ఆయన చూశాడు"[81] అని తెల్పి స్వాతంత్ర్యం రావడమన్నది మానవ జాతి అభివృద్ధి పరిణామ క్రమంలో తప్పక వచ్చి తీరుతుందన్నాడు. ఐతే వ్యతిరేకులు అది రావడంలో కొంత ఆలస్యం అయ్యేట్టుగా మాత్రమే చేయగలరని విమర్శించాడు. ఇంకా ఈ ప్రసంగంలో గురజాడ కవిత్వం తీరు, కవిత్వంలో వస్తున్న ఛందోమార్పులు, విప్లవ రచయితల కృషి చెప్తూ తెలుగులో వస్తున్న కవిత్వానికి విరసం నాయకత్వం వహిస్తుందని ముగించాడు.

అమెరికాలోని పిట్స్ బర్గ్ (29-5-1981) లో ఉపన్యసిస్తూ జానపద సాహిత్యాన్ని, తెలుగు భాష అత్యంత మాధుర్యాన్ని తెలుగు భాషా సాహిత్యంలోని ముఖ్యమైన అంశాల్ని, గురజాడ రచనల్ని అక్కడి ప్రజలకు పరిచయం చేశారు. తన కవిత్వాన్ని వివరిస్తూ 'ప్రతిజ్ఞ' కవితను ఉదాహరించాడు. విదేశాల్లోని సాహిత్యాభిమానులకు తెలుగు కవిత్వ విశిష్టతనూ తెలుగు సాహిత్యం పొందిన మార్పులను వివరించాడు.

**ఇతర సభల్లో ఉపన్యాసాలు**

విజయవాడలో ఏర్పాటైన 'మా భూమి' చిత్రం యూనిట్ అభినందన సభ (9-4-1980) లో శ్రీశ్రీ ప్రసంగిస్తూ 'మా భూమి' చలన చిత్రాన్ని కళ్ళకు కనిపించే చరిత్రగా అభివర్ణించాడు. దర్శకుడు గౌతమ్ ఘోష్‌ను, నిర్మాతలు నర్సింగరావు, రవీంద్రనాథ్‌లను అభినందించాడు. శ్రీశ్రీ చాలా సినిమా సభల్లో పాల్గొని ప్రసంగించాడు. కాని ఆ ప్రసంగాలు అలభ్యాలయినందున పేర్కొనడంలేదు.

'విశాలాంధ్ర' అనే అంశంపై హైదరాబాద్ (జూన్ 13, 14, 1954)లో ఏర్పాటైన సదస్సులో ప్రసంగ వ్యాసాన్ని చదివాడు. ఇందులో ఆంధ్రోద్యమ సమీక్ష, అతివాద ఉద్యమాలలో ఆంధ్రులు, విశాలాంధ్ర ఆవశ్యకత, సరిహద్దు సమస్య, విశాలాంధ్ర వలన దేశానికి కలిగేమేలు ఐకమత్య సాధన, ఆంధ్రుల ప్రత్యేకత, మన మహాసంకల్పం (ఉపసంహారం) అని విశాలాంధ్ర ఆవశ్యకతని వివరించాడు శ్రీశ్రీ.

1952 లో జరిగిన తొలి జనరల్ ఎలక్షన్లలో లక్ష ఓట్లకుపైగా మెజారిటితో విజయవాడ నియోజక వర్గం నుండి గెలుపొందిన హరీంద్రనాథ్ చటోపాధ్యాయ 'ఓట్ల లక్షాధికారిగా' అభివర్ణించాడు. 1978 లో జరిగిన ఆంధ్ర ప్రదేశ్ అసెంబ్లీ ఎలక్షన్లలో సత్తుపల్లి నియోజకవర్గం (ఖమ్మం) నుండి జలగం వెంగళరావు కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేయగా, ప్రతి పక్షాల ఉమ్మడి అభ్యర్థిగా ప్రముఖ కవి కాళోజి నారాయణరావు పోటీ చేశాడు. కాళోజి పక్షాన కల్లూరులో ఏర్పాటైన ఎన్నికల సభ (10-2-1978)లో ప్రసంగిస్తూ ముగ్గురు నారాయణలను పేర్కొన్నాడు. వారిలో కాంగ్రెస్‌ను ఓడించిన జనతాపార్టీ నాయకుడు జయప్రకాశ్ నారాయణ్, రెండోవాడుగా - కాంగ్రెస్ పార్టీకి మూలస్థంభంగా నిలిచి ఇందిరను ఓడించిన రాజ్‌నారాయణ్, మూడవ నారాయణగా ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్య మంత్రిగా ఉంటూ ఎలక్షన్లలో పోటీ చేస్తున్న జలగం వెంగళరావును ఓడించడానికి కాళోజి నారాయణరావు అని ఎన్నికల వేదిక మీద చమత్కారించాడు.

కృష్ణా జిల్లా యువజన వైజ్ఞానికోత్సవ సభ (28-4-1953) లో సాహిత్యం ఏదో ఒక అభిప్రాయం ప్రచారం చేయడానికి ఉంటుందని చెప్పి, తెలుగు నాటక రంగం అభివృద్ధికి సమిష్టి కృషి కావాలన్నాడు. నాటక రంగం అభివృద్ధి సాధించలేక పోవడానికి తెలుగు వారికీ మహానగరం లేక పోవడమే కారణంగా మరో సభలో చెప్పాడు.[82]

విజయవాడలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర శాంతి మహా సభ (17-10-1954)లో అగ్రరాజ్యాల మధ్య ఉద్రిక్తత తగ్గడానికి కృషి జరగాలన్నాడు. మరో సభలో "ఒక రోజు మారణ హోమం చేసి సాధించడంకన్నా ఒక సంవత్సరం సంప్రదింపులు సాగించి సఫలీకృతం పొందడమే వాంఛనీయం. సామ్యవాదం కోసం సమానత్వంకోసం పోరాడే పార్టీలు నావి."[83] అని చెప్పిన ఈ ప్రసంగంలో శాంతియుత రాజీ ధోరణులను శ్రీశ్రీ లో చూడగలం. ఇదే భావాన్నీ ఇంకో సభలో "నేను శాంతివాదిని. ఇది వరకు యుద్ధాల మాట ఎలా ఉన్న ఇకమీద యుద్ధం రాకూడదు. సహగమనం, నరమాంస భక్షణలాగే యుద్ధం కూడా ఒక అసహ్యించుకోదగ్గ అనాచారమని నా ఉద్దేశ్యం"[84] అని తాను శాంతిని వాంఛించే వాడుగా చెప్పుకున్నాడు. ఇంకా ఈ సభలో సంస్కృతి, నాగరికతలనూ వివరించిన శ్రీశ్రీ, ఉపన్యాసాల్లో అభ్యుదయ భావం, విప్లవ దృష్టి, నిరీశ్వరవాదం, పీడిత జనాభిమానం మొదలైనవి గోచరమవుతాయి. ఇందులోని ఉపన్యాసధోరణి, ఇతర వచన రచనల్లో లాగే ఉపన్యాస ఆరంభం, ముగింపు, ప్రతిపాదిత అంశాలు పరిశీలిద్దాం.

**ఆరంభం - ముగింపులు**

ఎంత నిష్ణాతులైనా లిఖిత రచనగానీ, మౌఖిక రచనగానీ ఆరంభించడం అంత సులువైన పనికాదు. ఈ విషయాన్నే శ్రీశ్రీ 'ఆరంభం పెద్ద అవస్థ' అనే శీర్షికతో రేడియోలో ప్రసంగించాడు. అందులో "కవిత్వమేకాదు ఏది రాద్దామనుకున్నా కృత్యాద్యవస్థే, అయిదు నిమిషాలలో రాసినా,

అయిదేళ్ళలో రాసినా కృత్యాద్యవస్థే"[85] అని ఒక రచన ఆరంభించాడు. ఎంత కష్టమో పైన చెప్పిన అంశాన్ని ఉపన్యాస ఆరంభానికి కూడా వర్తింపజేయవచ్చు.

శ్రీశ్రీ గొప్ప వక్త కాకపోయినా ఆరంభ - ముగింపులను మాత్రం బాగానే నిర్వహించాడు. తాపీ ధర్మారావు సన్మాన సభలో శ్రీశ్రీ తన ప్రసంగాన్ని "తాతాజీ అనే పేరు కలిగిన తాపీ ధర్మారావు మొదలుకొని తాతా అని నన్ను పిలిచే నామనవడి వరకూ ఉన్న ఆంధ్ర ప్రజలందరికి నా నమస్కారాలు"[86] అని చమత్కారపూరితంగా ఆరంభించాడు. విరసం సభలో తన అధ్యక్షోపన్యాసాన్ని "కలాల్ని ఆయుధంగా ధరించిన సహయోధులకు నా విప్లవ జోహార్లు"[87] అని కవితాత్మకంగా ఆరంభించాడు.

శ్రీశ్రీ ఉపన్యాసాల్లో చాలా మట్టుకు ఉపోద్ఘాత ప్రాయపు వాక్కులుండవు. నేరుగా, చెప్పదలచుకున్న విషయంలోకే వెళతాడు. సాంస్కృతిక ప్రదర్శనను తను ప్రారంభించాల్సిన సభలో "సంస్కృతి గురించి మాట్లాడే ముందు మన సంస్కృతి ఏపాటిది అనే ప్రశ్న ఒకటి నాలో ఉదయిస్తోంది" అని నేరుగా విషయంలోకి వెళ్ళిపోయాడు. ఇదే విధంగా 'నాకు నచ్చిన వచన శైలి' అనే ప్రసంగాన్ని "నాకు నచ్చిన వచన శైలినాదే" అని ఆ ప్రసంగం మొత్తంలో చెప్పదలచుకున్న అంశంతోనే ఉపోద్ఘాతం లేకుండా సూటిగా ఆరంభించిన శ్రీశ్రీ, ఉపన్యాసాల్లో ఆరంభం అవస్థగా చెప్పుకొన్నా, అలవోకగా ఆకర్షణీయంగా ప్రారంభించడం ఆయన ప్రత్యేకత.

ఉపన్యాసాల్లోని ముగింపు చూస్తే ఒక సభలో ముగింపు వాక్యాలుగా "ఈ నాలుగు ముక్కలు విన్నందకు మీకు నా కృతజ్ఞతలు . . . Thanks షుక్రియా. . . ."[88] అని జనాన్ని సంతోషపరిచాడు. "సహకార విధానానికి దారితీసి, ముందుకు తీసుకుపోయే విధానమే అభ్యుదయ విధానం. తద్వ్యతిరేకమైనది అభివృద్ధి నిరోధకం"[89] అని ప్రసంగాంశంలోని ముఖ్య విషయాన్ని మరోసారి చెబుతూ ముగించాడు. 'ఏదో ఫరవాలేదు' అన్న పదాన్ని ఎలా ఊతపదంగా వాడతారో ఒక ప్రసంగంలో వివరించి, ముగింపులో "ఇంతవరకూ రాసింతర్వాత ఒక మిత్రుడికి ఇదంతా చదివి వినిపించి ఎలా ఉందని అడిగేను. వెంటనే అతడు తడుముకోకుండా . . . యేదో ఫర్వాలే . . . దన్నాడు. అందులో ఉన్న సూచనను అంగీకరించి ఇంతటితో ఇది చాలిస్తున్నాను"[90] అని చమత్కార పూరితంగా ముగించాడు.

ప్రసంగాల్లో కనిపించే మరో ముఖ్యమైన అంశం హాస్యం. 'సాహిత్య రచన: ప్రక్రియలు' అనే రేడియో ప్రసంగంలో నాటకాల తీరు చెబుతూ ఒక మిత్రుడు 'గయోపాఖ్యాన' నాటక ప్రదర్శనను చూసి వచ్చి శ్రీశ్రీతో "ఆ నాటకంలో ఓ నటుడు పద్యాన్ని పాడుతూ అందులోని

'పాతాళమునగకేగి' అన్న పదాన్ని ఉచ్చరించినప్పుడు పాతాళం పైకున్నట్టు చెయ్యిని పైకి చూపాడంటూ విమర్శిస్తే దానిని శ్రీశ్రీ 'పాతాళమునకేగి' అంటూ అతగాడు పైకి చూపించడంలో తప్పేమిలేదు. ఎంచేతనంటే అతడున్న ఆంధ్ర నాటకరంగం అంతకన్నా అధోగతిలో ఉంది, అందుకే అతడు మీదికి చెయ్యి చూపించాడు - అన్నాను"[91] అని పాతాళం కంటే అధోఃస్థితిలో నాటకరంగం ఉన్నట్లు హాస్యస్ఫోరకంగా చెప్పాడు. చికాగోలో శ్రీశ్రీ ఉపన్యసిస్తూ అందులో డాక్టర్లపై కృష్ణశాస్త్రి చెప్పిన జోకును[92], మరోసభలో[93] 'కవితా సమితి' పై ఓ జోకు చెప్పాడు. ఇలాగే జోకులతో కూడిన హాస్యం, వ్యంగ్యాలతో సాగేవి 'నాకు నచ్చిన వచన శైలి', 'ఏదో ఫరవాలేదు' మొదలైనవి ఉన్నవి.

మొత్తం మీద శ్రీశ్రీ ప్రసంగాలను పరిశీలిస్తే కేవలం సాహిత్య విషయాల్నే గాకుండా సమాజంతో సంబంధముండే పౌరహక్కులపై కూడా ప్రసంగించాడు. శ్రీశ్రీ ప్రసంగాలు ఎంతో వైవిధ్యంతో హాస్య, వ్యంగ్యస్ఫోరకంగా, మానవతా దృక్పథంతో ప్రజాశ్రేయస్సును కోరేవిగా ఉంటాయి.

# పీఠికలు

ఒక పుస్తకం యొక్క అంతర్ బహిర్ సమాచారం తెలిపే ప్రక్రియే పీఠిక. ఇది ఆయా పుస్తకాల్లో సాధారణంగ మొదటి పేజీల్లో ఉంటూ, దానికి ప్రథమ విమర్శగా నిలిచిపోతుంది. ఒక పుస్తకానికి ఎవరు పీఠిక రాస్తే న్యాయం చేకూరుతుందో, ఎవరు 'పరిచయం' చేస్తే పుస్తకానికి మరింత విలువ ప్రచారం పెరుగుతుందో, కర్తో, ప్రచురణ కర్తో లేక వీరికి సన్నిహితులో సర్వసాధారణంగా పీఠిక రాస్తుంటారు. ఇలా పీఠికలు తెలుగులో కోకల్లులుగా వెల్లువడినై. వివిధ పుస్తకాలకి కట్టమంచి రామలింగారెడ్డి, వేటూరి ప్రభాకరశాస్త్రి, విశ్వనాథ, శ్రీశ్రీ, కుందుర్తి, కె.వి. రమణారెడ్డి, చేకూరి రామారావు, జి.వి. సుబ్రహ్మణ్యం, కె.కె. రంగనాథాచార్యులు మొదలైన వారెందరో పీఠికలు రాశారు. వారిలో కట్టమంచి, వేటూరి, కుందుర్తి, శ్రీశ్రీ, మొదలైనవారు రాసిన పీఠికలు ప్రత్యేక పుస్తకాలుగా వెలువడినై. వీరిలో 'శ్రీశ్రీ పీఠిక'ల గురించి వివరించడం జరుగుతుంది.

1910 లో పుట్టిన శ్రీశ్రీ 1934 లో అంటే ఇరవై నాలుగేళ్ళ ప్రాయంలోనే మొట్ట మొదటిసారి పీఠికను రాశాడు. అప్పటికే పరిణయ రహస్యం (నవలిక), ప్రభవ (కావ్యం) పుస్తకాలు ముద్రితమైనవి. 'జయభేరి', 'మహాప్రస్థానం' వంటి ప్రసిద్ధ గీతాలు రాసి కవిగా సాహిత్యవేత్తల గుర్తింపు పొందాడు. అందుకే ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి 1934 లో తొలి కావ్యం 'తెనుగువీణ' ను ముద్రిస్తూ శ్రీశ్రీతో పీఠికను రాయించుకున్నాడు. పీఠికలను రాయనారంభించిన శ్రీశ్రీ తన మరణానికి ఐదు రోజుల ముందు అంటే 10-6-1983 నాడు కె. ప్రభాకర్ కవితా సంపుటి 'తూర్పు ఎరుపు' కు పీఠికను రాశాడు. ఇలా దాదాపు అరశతాబ్దం పాటు అరవైకిపైగా పీఠికలను రాశాడు. ఈ పీఠికల్లో కొన్ని 'పీఠిక' కొరకు రాసినవి కావు. ఆరుద్ర రాసిన 'త్వమేవాహమ్' కావ్యంపై శ్రీశ్రీ రాసిన విమర్శనాత్మక వ్యాసం[94] ఆ పుస్తకం తర్వాతి ముద్రణల్లో పీఠిక స్థానాన్ని అలంకరించింది. ఆధునిక గద్య వాఙ్మయ ప్రవర్తకుడు'[95], 'గురజాడ ఆధిక్యానికి కారణాలు'[96] అనే ఈ రెండు

రేడియో ప్రసంగాలు పలు పత్రికలలో, పుస్తకాల్లో అచ్చయిన తరువాత 'జయంతి పబ్లికేషన్' వారు 'కన్యాశుల్కా'ని ప్రచురిస్తూ, అందులో ఈ రెండు వ్యాసాల్ని 'యుగకర్త గురజాడ సాహిత్యంపై మహాకవి శ్రీశ్రీ సమీక్ష' అనే శీర్షికతో పీఠికా స్థానంలో అచ్చేశారు. ప్రముఖ కవి కాళోజి రాసిన 'నాగోడవ' కావ్యావిష్కరణ సభ (12-1-1953) లో ప్రసంగించిన ప్రసంగాన్నే తర్వాతి ముద్రణల్లో పీఠికగా అచ్చేశారు. 'మల్లారెడ్డి గేయాలు' పుస్తక రచయిత (గజ్జల మల్లారెడ్డి) ని ప్రశంసిస్తూ రాసిన లేఖ 'సవ్యసాచి' పత్రికలో అచ్చయ్యింది. ఆ తర్వాత ఈ లేఖనే పీఠికా ప్రాయంగా ముద్రితమైంది.

కృష్ణశాస్త్రి కవిత 'జైల్లో శ్రావణం' భారతి (1939 మార్చి) సాహిత్య పత్రికలో ముద్రితమైంది. దీనికి కర్తపేరు ముద్రించక ఈ 'కవిత'ను పరిచయంచేస్తూ, ఎవరిదో కనుక్కోవచ్చని రాసిన శ్రీశ్రీ మాటల్ని 'ముందు మాట'లుగా అచ్చేశారు. ఇంతేగాక 'వీణ' పత్రిక సంపాదకుల్లో ఒకడుగా పనిచేసే శ్రీశ్రీ ఆ పత్రికలో అచ్చేసే కవితలకు పరిచయ వాక్యాలను రాసేవాడు. అలా విశ్వనాథ (వర్షర్తువు), కవి కొండల వెంకటరావు (గీతిక), కొడాలి రాజారావు (నీవు కనుక) కవితలకూ రాశాడు. ఇవికూడ పీఠికల పరిధిలోకే వస్తాయి.

ఈ విధమైన శ్రీశ్రీ పీఠికల్లో ప్రధానంగా ఆయా పుస్తకాల విషయ చర్చతోపాటు 1. సాహిత్యం, 2. సాహిత్యోద్యమాలు, 3. రాజకీయాలు, 4. నాస్తికత్వం, 5. స్వవిషయాలు ముఖ్యంగా విశదీకరించాడు.

కవిత్వంపై తెలిపిన అభిప్రాయాల్లో ఎక్కువగా ఆధునిక కవిత్వంపై చెప్పినవే ఉన్నాయి. 'ఫిడేలు రాగాల డజన్'కు రాసిన పీఠికలో " . . . ఒక పదం అనేక అర్థాలను అంతఃపురంలో దాచుకునే వివాహం, ఒక అర్థం అనేక పదాలతో విచ్చలవిడిగా విహరించే వ్యభిచారం, రెండూ నచ్చవు నవకవికి"[97] అని చెప్పిన దానిలో ఆధునిక కవి కోరుకునే విశృంఖల స్వేచ్ఛ వ్యక్తమవుతుంది. దీని ప్రతిఫలంగానే 'విచిత్ర సౌందర్యం' ఆవిష్కృతమవుతుందని భావించాడు శ్రీశ్రీ. "నవకవికి అనుసరణ అసహ్యం" అని స్వంత గొంతుక ప్రాధాన్యాన్నీ ఇదే పీఠికలో చెప్పాడు. 'త్వమేవాహమ్' లో ఇండియా మొత్తానికి ఆధునిక కవిత్వం విషయంలో తెలుగు భాషదే అగ్రస్థానంగా అభివర్ణించాడు.[98] కె.వి. రమణారెడ్డి గారి 'అంగారవల్లరి' కి రాసిన పీఠికలో ఆధునిక కవిత్వంలో 'కథావస్తువు' అక్కరలేదని 'కథ' లేనప్పుడు ప్లాటు, పాత్ర పోషణ, కథనశక్తి, ప్రదర్శన, ఇత్యాదులను తెగడుతూనో, పొగడుతూనో విమర్శ చేయడానికి వీలులేని కారణంగా కొందరు కథ అవసరమంటున్నారని చెప్పి, "కథాకావలిస్తే మీరు నవలలు చదువుకోండి. కవిత్వానికి కావలిసింది కథా వస్తువు కాదు - కావ్య వస్తువు"[99] అని అంటూ, ఆధునిక కవిత్వ వస్తువు, విషయాల పోకడలను, మలుపులను వివరించాడు.

'కథ' ప్రక్రియ గురించి, కథానికా ప్రక్రియ పుస్తకాలకు రాసిన పీఠికల్లోనే గాక ఇతర పుస్తకాలకు రాసిన పీఠికల్లో కూడా అక్కడక్కడ వ్యక్తం చేశాడు. ప్రముఖ తెలుగు కథ రచయిత

చాగంటి సోమయాజులు కూతురు చాగంటి తులసి ఒరియా రచయిత సచ్చిరౌత్‌రాయ్ కథల్ని తెలుగులోకి అనువదించింది. ఈ పుస్తకానికి శ్రీశ్రీ పీఠిక రాశాడు. ఇందులోని కథల్ని, అనువాదరీతిని మెచ్చుకుంటూ ప్రముఖ ఫ్రెంచి రచయిత మొపాసా 'కథానిక' లక్షణాల గురించి చెప్పిన వాటిని "స్పష్టత. స్పష్టత. మళ్ళీ స్పష్టత (మళ్ళీకాదు. 'clarite, clarite, ettojours clarite' అని కాదూ ఫ్రెంచిలో ఉంది ! ఎల్లప్పుడూ స్వచ్ఛత, Always clarity"[100] అని ఉటంకించి మరీ చూపాడు. రాచకొండ విశ్వనాథశాస్త్రి కథల సంపుటి 'ఆరు సారాకథలు' కు రాసిన పీఠికలో తాను ఆశించే 'రసన' ఈ పుస్తకంలోని కథల్లో సమృద్ధిగా ఆవిష్కరించబడినట్లు చెప్పాడు.[101] 'రసన' అంటే ఏక కాలంలో అనేక రసాలు ఏ రచనలో నైతే ఉప్పొంగుతాయో ఆ రచననే 'రసన' గా శ్రీశ్రీ చెప్పి రావిశాస్త్రి, గురజాడ రచనల్లో, డికెన్స్ నవలల్లో, పికాసో చిత్రించిన 'గుయెర్నికా' చిత్రంలో చార్లీ చాప్లిన్ చలనచిత్రాల్లోనూ 'రసన' ను అనుభవించినట్లుగా చెప్పాడు. ఈ భావన అతినవ్యమైంది.

తెలుగులో కవిత్వం, కథలు వచ్చినట్లు నవలలు రాలేదని తన అసంతృప్తిని 'రాజు-మహిషి, నవలకు రాసిన పీఠికలో పేర్కొన్నాడు. భూషణం రాసిన 'కొండగాలి' నవలలో " ఇది జీవిత చిత్రణ, శ్రీకాకుళం జిల్లాలోని ఒకానొక గ్రామం తాలూకు సజీవ చిత్రం. పాటక జనాల జీవితాలలో ఒక్కొక్క మహాభారత గాథ ఇమిడి ఉంటుంది. ఆ మహాభారతానికి వ్యాసుల వారు మన కామ్రేడ్ భూషణం"[102] అని రచయిత ప్రత్యేకతను మెచ్చుకున్నాడు.

నాటకాల పై రాసిన పీఠికల్లో ఆత్రేయ రాసిన 'విశ్వశాంతి' ఒకటి. అందులో " . . . అనేకానేక మనస్తత్వాలు గల ప్రేక్షకుల్ని రంజింపజేయవలసిన నాటక రంగాన్ని బోధనా వేదికగా చేసుకోవాలంటే అసాధారణాధికారాలు కావాలి . . ."[103] అని నాటక రంగవైశిష్ట్యాన్ని చెప్పి, సామ్యవాద స్థాపన, యుద్ధ వ్యతిరేకత మొదలైనవి ఉగ్గడించాడు. గంగిరెడ్డిరాసిన 'నాంది', వంగూరు చిట్టెన్ రాజు రాసిన నాటికల సంపుటాలకు రాసిన పీఠికల్లో ఆయా రచనల్లోని ప్రత్యేకతను ప్రశంసించాడు. డా॥ చిట్టూరి సత్యనారాయణ రాసిన 'జీవిత మధురిమ'ను నాటికగా కాకుండా కావ్యంగా రాసి ఉంటే బాగుండేదని నిర్మొహమాటంగా చెప్పాడు.[104] కారల్ చాపెక్ 'ది మదర్' పేరుతో రాసిన నాటకాన్ని తెలుగులోకి 'అమ్మ' పేరుతో శ్రీశ్రీ అనువదించాడు. ఈ పుస్తకానికి రాసిన పీఠికలో తానెందుకు అనువదించాడో ఆ నాటకంలో ఉన్న ప్రత్యేకతనూ నొక్కి చెప్పాడు.

ఇలా కవిత్వం, కథ మొదలైన సాహిత్య ప్రక్రియలపై పీఠికల్లో తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు. అంతేగాక ఈ పీఠికల్లో భావ, అభ్యుదయ, దిగంబర, విప్లవ మొదలైన సాహిత్య ఉద్యమాల ప్రస్తావన ఉంది. వీటన్నింటిలో విప్లవ రచయితల సంఘం ఏర్పడిన తర్వాత రాసిన పీఠికల్లో ప్రధానంగా విప్లవ భావాలనే పేర్కొనడం ఆయా పుస్తకాలకు రాసిన పీఠికల్లో విప్లవ దృక్పథం ఏలా ఉందో చెప్పడం ఎక్కువగా గమనిస్తాం. 'లే' కవితా సంకలనాన్ని తిరుపతి 'విరసం' యూనిట్ వాళ్ళు

ముద్రించారు. ఈ పుస్తకం కొట్టు, నరుకూ, చంపూ, రక్తం, మంటలూ, బాకులూ, తుపాకులూ, ఆకలీ, దరిద్రమూ వంటివే నిండి ఉన్నాయని చవకబారు విమర్శకులు విమర్శిస్తారని చెప్పి అదే విధంగా భావకవిత్వంలో వెన్నెల, చక్కెర, పువ్వులు, ప్రేయసి, ప్రణయం, విరహం మొదలైనవే ఉంటాయని చెప్పారన్నాడు. జమిందారీ కవిత్వం మీద తిరుగుబాటుగా కవిత్వం వస్తే ఈ భావకవిత్వం పై తిరుగుబాటుగా అభ్యుదయ కవిత్వం వచ్చినట్లుగా సద్విమర్శకుడు గుర్తిస్తాడన్నాడు.[105] ఇంకా ఈ పీఠికలోనే సద్విమర్శకుడి గురించి చెబుతూ "సాహిత్య పరిణామాలను సామాజిక పరిస్థితులతో సమన్వయించి చారిత్రక దృక్పథంతో సమీక్షించ గలిగినవాడే సద్విమర్శకుడు"[106] గా చెప్పి, అతనే మార్క్సిస్టు విమర్శకుడన్నాడు. ఇలా విమర్శకుడి గురించేగాక ఈ నాడు కవిత్వం రాయడానికి కవి ఏర్పర్చు కోవలసిన దృక్పథం గురించి మరో పీఠికలో[107] " . . . ఇవాళ కవిత్వం రాయాలంటే ఉత్సాహం మాత్రమే చాలదు. విప్లవచైతన్యం కూడా కావాలి. ఈ చైతన్యం మార్క్సిస్టు సిద్ధాంతంలో వెలిగించబడినప్పుడే కవిత్వం ఉన్నతోన్నత శిఖరాల నందుకోగలదు"[108] అని ఆధునిక కవికి మార్క్సిస్టు అవగాహన అవసరాన్ని తెలియజేశాడు. ఇలా విరసం ఆవిర్భావం అనంతరం రాసిన చాలా పీఠికల్లో విప్లవ భావాలు శ్రీశ్రీలో చూడవచ్చు.

శ్రీశ్రీలో హేతువాద దృక్పథం ఎక్కువగా కన్పిస్తుంది. చాలా కాలం దేవుడున్నాడా లేడా అనే 'సదసత్సంశయం' లో ఉండి చివర్లో నాస్తికుడుగా మారాడు. ఈ నాస్తికత్వ భావాలు చాలా పీఠికల్లో కనిపిస్తాయి. అడ్డాల సుబ్బరాజు రాసిన 'మానవత్వం' పీఠికలో దేవున్ని నిరాకరించడమంటే, సామాన్య మైన విషయం కాదన్నాడు. మరో పీఠికలో " . . . ఏ భగవంతుడూ భగవతీ అవతరించి మన ఈతి బాధల్ని తొలిగిస్తారనే నమ్మకములేని నాస్తికుణ్ణినేను"[109] అని చెప్పుకున్నాడు. ఈ రకంగా కొన్ని పీఠికల్లో తనలోని నాస్తిక దృక్పథాన్ని వెల్లడించాడు.

అంతర్జాతీయ, జాతీయ, ప్రాంతీయ రాజకీయాలను సందర్భం వచ్చినప్పుడల్లా పీఠికల్లో పేర్కొన్నాడు శ్రీశ్రీ. 1968 ఫ్రాన్స్‌లో నిర్వహించబడిన విప్లవాన్ని తెలిపే 'ది బిగినింగ్ ఆఫ్ ది ఎండ్' అనే పుస్తకాన్ని 'రెక్క విప్పిన రివల్యూషన్' పేర అనువదించి దానికి పీఠిక రాశాడు. అందులో విప్లవాలు తాత్కాలికంగా మాత్రమే ఓడిపోతాయనీ రష్యా విప్లవాన్ని ఉదాహరణగా పేర్కొని, ప్రపంచ వ్యాప్తంగా విప్లవాల స్వరూపాన్ని వివరించాడు. విరసం ఏర్పడిన తర్వాత ఆ సంస్థ నుండి ప్రచురితమైన కొన్ని పుస్తకాల్ని ప్రభుత్వం నిషేధించింది. ఆపుస్తకాలకు రాసిన పీఠికల్లో ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించాడు. 'విప్లవం వర్ధిల్లాలి'కి రాసిన పీఠికలో 'లే' సంకలనంపై ప్రభుత్వ నిషేధం, కోర్టు ఉత్తర్వుతో తొలగింపు మొదలైనవి పేర్కొంటూ "పోలీసు బలం లేకుండా ఒకపూట పరిపాలించమనండి ఈ ప్రభుత్వాన్ని"[110] అని ప్రభుత్వ అసమర్థతని విమర్శించాడు.

పీఠికల్లో తన రచనల గురించీ వివరించాడు. ఇది ప్రధానంగా తన పుస్తకాలకు రాసుకున్న పీఠికల్లో కన్పిస్తుంది. తను రాసిన 'సిరిసిరిమువ్వ', 'ప్రాసక్రీడలు', 'లిమబుక్కులు' ఈ మూడింటిని

కలిపి 'మరో మూడు యాభయిలు' పేర అచ్చయిన పుస్తకానికి రాసిన పీఠికలో కార్టూనులు పత్రికల్లో నిర్వహించే పాత్రను కవిత్వం ద్వారాతాను సాధించదలచుకున్నట్లు చెప్పాడు. తన 'మహాప్రస్థానం' కావ్యాన్ని లండన్‌లోని 'విదేశాంధ్ర ప్రచురణ' సంస్థ అచ్చేసినప్పుడు దానికి రాసిన పీఠికలో "మహాప్రస్థానంలో నేను చేసిందంతా సామాజిక రుగ్మతను నిదానించడం మాత్రమే. . . . మహాప్రస్థానంలో అభ్యుదయ కవిత్వమూ, విప్లవ బీజాలు ఉన్నాయి. విప్లవ సాహిత్యంలేదు"[111] అని మహాప్రస్థాన కావ్యంపై తన దృక్పథాన్ని తెలిపాడు. తన రచనలకు తానే రాసుకున్న పీఠికల్లో ఆయా రచనల ప్రత్యేకత వాటి ద్వారా తను చెప్పదలచుకున్నది వివరించాడు. ఇలా పీఠికల్లో స్వవిషయాలనూ చెప్పుకున్నాడు.

పీఠికల్లో విషయ వివేచనే గాక ఆయా పుస్తకాలకున్న పేర్లపై కూడా చర్చ చేశాడు. ఆరుద్ర 'త్వమేవాహమ్', లోనూ బైసాదేవదాసు, యం. రవీంద్రారెడ్డిలు కలసిరాసిన కవితా సంపుటికి రాసిన పీఠికల్లోనూ ఆ కావ్యాలకు ఏ పేరు పెట్టాలో చర్చచేశాడు. 'లే' కవితా సంకలనానికి రాసిన పీఠికకు 'లే' సమయమిదేలే' అనీ, వంగూరి చిట్టెన్‌రాజు రాసిన పుస్తకానికి శ్రీశ్రీ పీఠిక రాసి దానికి 'రంగంమీద శ్రీరంగం' అనే పేరు పెట్టిన శ్రీశ్రీ, ఈ విధంగా తన మరియు ఇతరుల రచనలకీ శీర్షికలను పెట్టడంలో ప్రత్యేకతను, వైచిత్రిని ప్రదర్శించాడు.

# సమీక్షలు

పత్రికల వల్ల సాహిత్యంలో 'సమీక్ష' పేర ఒక కొత్త ప్రక్రియ ఆవిర్భవించింది. ఇది ఎక్కువగా అక్షరబద్ధమైన పుస్తకాలకే వర్తించినప్పటికీ ప్రదర్శనా కళలైన నాటకాలు, సినిమాలు మొదలైన ప్రక్రియలను పత్రికలు సమీక్షించాయి.

'సమీక్ష ప్రక్రియ' ఈ రోజు తెలుగులో ఎంతో వికసించింది. కొందరి రచనా సంపుటాల్లో వారి సమీక్షలు అచ్చయినాయి. ఆర్. యస్. సుదర్శనం సమీక్షలు 'నూరు సమీక్షలు' పేరుతో ఓ ప్రత్యేక పుస్తకంగానే వెలువడింది. టి.ఎల్. కాంతారావు కూడా ఎన్నో పుస్తకాల్ని సమీక్షించాడు. సమీక్షంటే సాధారణంగా ఎప్పటికప్పుడొస్తున్న పుస్తకాల్ని పరిచయంచేసి ప్రచారంచేసేది. ఈ ప్రక్రియను శ్రీశ్రీ కూడా చేపట్టాడు. దాదాపు మూడు పదుల వరకు సమీక్షలను రాశాడు. అందులో వివిధ ప్రక్రియల్లోని పుస్తకాలకు గాక ప్రదర్శించబడిన నాటకం, సినిమాలను చూసి రాసిన సమీక్షలూ, 'యువ', 'కవిత' పత్రికలపై కూడా రాసినవి ఉన్నాయి. ఈ సమీక్షలలో తన అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా తెలిపాడు. శ్రీశ్రీ సమీక్షల్లో దొరుకుతున్నంతవరకు 1928 డిసెంబర్ 'భారతి' పత్రికలో రాసిన సమీక్షలే మొదటివి. అవి 'కల్యాణ రాధా మాధవము', 'విజయ ప్రతిజ్ఞ', 'రామదేవ శతకము', శ్రీశ్రీ తన మరణానికి రెణ్ణెళ్ళముందు రాసిన సమీక్ష చివరిది. అ 'ఆంధ్రజ్యోతి' (వారపత్రిక) 1-4-1983 సంచికలో 'రావిశాస్త్రీయం' పేర అచ్చయింది. వీటిని బ అరశతాబ్దానికిపైగా సమీక్షలను రాశాడని తెలుస్తుంది. ఈ సమీక్షలను 1) కవిత్వం, 2) కథ, 3) నవల, 4) వ్యాసం, 5) నాటకం, 6) సినిమాలు, 7) ఇతరాలుగా విభజించవచ్చు.

**కవిత్వం**

శతక, ఖండ కావ్య మొదలైన పుస్తకాలకు సమీక్షల్ని రాశాడు శ్రీశ్రీ. 'మల్లికార్జున శతకము' సమీక్షలో "మల్లిఖార్జున స్వామి మీద ఉత్పలములలోను, చంపకముల లోను రచింపబడిన

శతకము. చివర 'శ్రీమద్భ్రమరాంబాష్టకము' ఉన్నది"[112] అని అందులోని ఛందస్సు, చివరలో ఏ అష్టకమున్నదో తెలిపాడే కానీ కవిత్వం తీరు విషయ విషదీకరణ గురించి సమీక్షించలేదు. 'రామదేవ శతకము' గురించి రాసిన సమీక్షలో ఆ శతక ఉపోద్ఘాతాన్ని రాసిన ఉన్నవ లక్ష్మీ నారాయణ మాటల్ని ఉటంకించాడు. దీని గురించి "పద్యాలు దైవప్రార్థనతో సాగినను తర్వాత తర్వాత ఆచారాదులను విమర్శించినవి ఉన్నవి. కొత్తదారులు తీసిన శతకముల వెనుకనే ఇది నడచును"[113] అని సాహిత్యంలో దాని ప్రత్యేకతను తెలిపాడు. 'హనుమచ్ఛతకము' గురించి రాసిన సమీక్షలో "ఇందు శబ్దాలంకారములు దొర్లింపబడినవి"[114] అని అన్నాడు.

'ప్రణయ సౌరభము' కావ్య సమీక్షలో "కథా చిత్రణమున నైపుణ్యము కానరాక పోయినా కథనములో సౌలభ్యము గోచరిస్తుంది"[115] అని కావ్యం తీరును తెలిపాడు. 'శ్రీ పుష్పాంజలి' అనే పద్య సంపుటి గురించి రాసిన దానిలో ఈ పుస్తక రచయితకు ఇంగ్లీషు భాషా పరిచయం, దానిలో భావకవిత్వ ఛాయలున్నట్లుగా పేర్కొన్నాడు. ఈ గ్రంథకర్త రచనల్లో ఈ కావ్యమే మొదటిదైనందున " . . . ప్రథమ ప్రయత్నముగా ఈ నిర్వాహణ తృప్తికరముగనే ఉన్నది"[116] అని సాహితీ లోకంలోకి కొత్తగా అడుగిడుతున్న కవికి 'తృప్తికరముగానే ఉన్నది' అని ప్రోత్సాహపూర్వకముగా చెప్పాడు శ్రీశ్రీ. ఈ గ్రంథకర్తే 'కవిత్వవేది' గా చెప్తూ "పుష్పాంజలి గ్రంథకర్తగారే 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము' (వావిళ్ళవారు ప్రకటించినది) రచించిన 'కవిత్వవేది' అని తెలుస్తున్నది. పుష్పాంజలి, వాఙ్మయ చరిత్రలను పోల్చి చూడగా వీరు కవిత్వ రచన కంటే సారస్వత విమర్శకు దొరకొంటె ఎక్కువ రాణిస్తుందని పొడగట్టగలదు"[117] అనీ అన్నాడు ఈ విధంగా సమీక్షలు చేయడమేగాక ఆ రచయిత ఏ రంగంలో రాణించగలడో గమనించి సూచనలిచ్చాడు.

విశ్వనాథ సత్యనారాయణ రాసిన 'కిన్నెరసాని పాటలు', 'కోకిలమ్మ పెళ్ళి' కావ్యాలకు సమీక్ష రాశాడు. ఈ పాటల్లో 'కిన్నెర నాట్యం', 'కిన్నెరగానం' పాటల్ని పేర్కొంటూ "ఆమ్రేడితాలు తరచుదనం నడకల్లో కంటే నృత్యంలో ఎక్కువ రాణించదేమో!"[118] అన్నాడు. కవిత్వానికి వాడుక భాష 'ముత్యాలసరం' ఎంతగా అతుకుతాయో 'కోకిలమ్మపెళ్ళి' చదివిన వారికి అర్థమవుతుందని విశ్వనాథను ప్రశంసించాడు. "దొంగ నాగరికతలో దేశం / తూలి పోలేదోయ్" అన్న పాదాల్ని ఉటంకించి దాని గురించి " . . . కవిదృక్పథం ఒక పెడకు ఒరిగినట్లు సూచిస్తోంది. ప్రాచీన మయినదంతా పూజ్యం, నవీనమంతా త్యజ్యం అనడమెట్లా!"[119] అని విమర్శించాడు. ఇలా విశ్వనాథలో తనకు నచ్చినవి ప్రశంసించినట్లుగానే, నచ్చని వాటినీ నిర్మొహమంటంగా ఖండించాడు. ఇది 1934 లో రాసిన సమీక్ష అప్పటికే విశ్వనాథనూ విమర్శించడం కన్పిస్తుంది.

మల్లవరపు విశ్వేశ్వరరావు రాసిన 'మధుకీల' సమీక్ష శ్రీశ్రీ సమీక్షల్లో విశిష్టమైందీ, విస్తృతంగానూ రాసింది. దీన్ని రెండు భాగాలుగా రాశాడు. మొదటి భాగం నాటక ఫక్కీలో తనూ తన

మిత్రుడి మధ్య సంభాషణగా సాగింది. కవిత్వాన్ని తూచడానికి వ్యాకరణం చాలదని కవికి ఇష్టం వచ్చిన పదాన్ని వాడే స్వేచ్ఛ ఉంటుందనీ చెప్పి, కవిత్వంలో "భావన, ఉద్రేకం, ఋజుత్వం ఉన్నవో, నీకేమాత్రం సంస్కారం ఉన్నదో చూస్తాను. నీకు వ్యక్తిత్వం ఉన్నదా, ఇతరులను ప్రతిధ్వనిస్తున్నావా అని చూస్తాను. చిత్త శుద్ధి ఉంటేనే నీవు చేసిన రచన శిల్పం అవుతుంది"[120] అని తన దృష్టిలో ఒక రచనలో ఉండాల్సిన విశిష్ట గుణాల్ని పేర్కొన్నాడు. ఈ సమీక్షలో భావ కవిత్వ పోకడలతో పాటు లోకం తీరు చెబుతూ "విప్లవకారుడూ కావడం, మానవ చరిత్రను మార్చడం ప్రతి వ్యక్తిలోనూ లేదు. ఈ అల్పసంఖ్యాకులే చరిత్రక్రమం మార్చేది"[121] అని సమాజాన్ని ముందుకు తీసుకు వెళ్ళే వాళ్ళని ద్రోహులని అనడం, ఇలాంటి వాళ్ళు ఎప్పుడూ తక్కువగానే ఉంటూ సమాజాన్ని మార్చడం జరుగుతుందని చెప్పి, " . . . పాతికేళ్ళ క్రితం గిడుగు రామమూర్తి విప్లవకారుడు, గాంధీరాజద్రోహి నేడో ? వీరికి వీరి వీరి క్షేత్రాలలో ప్రముఖ స్థానం వచ్చింది. వీరితో ప్రపంచం ఆగిపోతుందా ? ఇతర విప్లవాలు మళ్ళీ వస్తాయి. ఇతర 'ద్రోహులు' బయలుదేరుతారు"[122] అని స్వాతంత్ర్యానికి పదేళ్ళ ముందే (1937) తనలోని తీవ్ర భావాల్ని వ్యక్తం చేశాడు. ఇంత తీవ్ర తరం మళ్ళీ 1970 విరసం ఆవిర్భావం తర్వాత శ్రీశ్రీలో బాగా కన్పిస్తుంది. ఇలా 'మధుకీల' సమీక్ష మొదటి భాగంలో సమాజానికి సంబంధించిన విషయాలెన్నో వివరించాడు. రెండో భాగంలో మధుకీల లోని గీతాలు స్వయంగా అనుభవించి రాసినవని చెప్పి రాయప్రోలు, అబ్బూరి, బసవరాజు, నండూరి, నాయని, కృష్ణశాస్త్రి మొదలైన వారి కవిత్వాలతో విశ్వేశ్వరరావు కవిత్వాన్ని పోలుస్తూ చివరగా 'మధుకీల' రచయితలో వస్తున్న స్వంత గొంతుకను ప్రశంసించాడు. ఈ సమీక్ష చదివిన తర్వాత "Dictionary of Literary Term's లో చెప్పిన A descriptive, evaluative account and discussion of a book. A book review is a form of critism, . . . critical commentary that explains, interprets and judges a book in terms of its purpose, scope, and style . . ."[123] అన్న విషయానికి ఉదాహరణలా చెప్పుకొనేంత బాగా రాశాడు శ్రీశ్రీ.

కె. శివారెడ్డి రాసిన 'ఆసుపత్రి గీతం' పై రాసిన సమీక్షలో "ఈ ఆసుపత్రిని ప్రస్తుత వ్యవస్థకి, ఈనాటి సమాజానికి ప్రతీకగా మనం స్వీకరించాలి"[124] అని ఈ కావ్యాన్ని ప్రశంసించాడు. బెంగాలీ కవితలను రణజిత్‌దేవ్ ఇంగ్లీషులోకి అనువదించిన పుస్తకం 'Burning Decade' (దంధహ్యామాన దశాబ్దం) నూ సమీక్షించాడు.

'యౌవన జ్వాల' కావ్యాన్ని సమీక్షిస్తూ, రచయితను "కృష్ణశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణాదులను చదివి కూడా ఈతడు పెమ్మరాజు లక్ష్మీపతి, జాషువా వంటి ఉపకవుల ప్రక్కకు పోదామనే ఆదుర్దా కనపరచడంలో నాకాశ్చర్యం వేసింది. ఇతని దేశాభిమాన గీతాలు విశ్వనాథ సత్యనారాయణ దాకా యెగురబోయి కొడాలి సుబ్బారావునైనా అందుకోలేక పోయినవి"[125] అనీ, 'ఉమర్‌ఖయ్యామ్' రుబాయితులను 'ఉమర్‌ఆలీషా' తెలుగులోకి అనువదించిన రచనను పఠాభి, దువ్వూరి రామిరెడ్డిల అనువాదాలతో పోల్చి నిర్మొహమాటంగా వివరించాడు శ్రీశ్రీ.

ఇలా కవితల సంపుటులకు రాసిన సమీక్షలో కవిత్వంపై తన అభిప్రాయాల్ని, ఆయా కవులు రాసిన పుస్తకాల తీరును వివరించాడు. వీటి తర్వాత 'కథ' ప్రక్రియ పుస్తకాలలో భారత నారీమణులు, బుచ్చిబాబుకథలు, ఇల్లరికం, రుక్కాయి కథలు ఇత్యాది పుస్తకాలకు సమీక్షలు రాశాడు.

**కథ**

కోకా కృష్ణవేణమ్మ రాసిన 'భారత నారీమణులు' పుస్తకాన్ని సమీక్షిస్తూ పురాణాలలోని ప్రసిద్ధ స్త్రీల కథలే ఉన్నట్లుగా పేర్కొని, వీటికి బదులుగా " . . . క్రొత్త వారి కథలు చెప్పబడిన బాగుండును"[126] అని ఆశను ప్రకటించాడు శ్రీశ్రీ. 'బుచ్చి బాబు కథలు' పుస్తక సమీక్షలో సెక్సు గురించి చెప్పి " . . . పత్రికలలో వార్తల వంటి కేవల కథనంలో ఔచితి మాట అటుండగా ఔత్సుక్యం కూడా కనబడదు. 'మల్లెపూలు', 'కలలో కార్చిన కన్నీరు' అనే కథలలో కథనం సున్నితంగా నడిచింది. రెండవ కథ కొంత అనవసరంగా ఈడిగిలబడింది."[127] అని విమర్శించాడు. ఇలా రచయితనే కాక దీన్ని ప్రచురించిన 'నమ్మాళ్వార్సు' వారిని " . . . 'చవక ధనాన్ని' గ్రంథాల వెలకు బదులు విషయానికే సంక్రమింపజేస్తున్నట్లు ఇటీవలి ప్రచురణలను బట్టి ఊహించవలసివస్తున్నది"[128] అని విమర్శించాడు. "మూడు పుస్తకాల పరిచయం' పేర రాసిన సమీక్షలో ముద్దుకృష్ణ రాసిన కథల సంపుటీ, కొడవటిగంటి కుటుంబరావు కథల సంపుటి 'ఇల్లరికం' ను సమీక్షిస్తూ తెలుగులో కథానికల తీరు, స్థాయి చెప్పి, "కొ. కు. ఎంతో చైతన్యం గల కథలు వ్రాస్తున్నా అతనికింకా ఒక Personality ఏర్పడలేదు"[129] అని విమర్శించాడు. జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి గారి 'రుక్కాయి కథలు' సమీక్షిస్తూ 'జలసూత్రం' జీవిత విశేషాలతో పాటు అతని పేరడీలు కథల తీరూ పేర్కొని, క్రికెట్‌లోని 'ఆల్ రౌండర్' వంటి వాడన్నాడు.

**నవల**

'ప్రతిత నళిని', 'విక్టోరియా క్రాసు' నవలలను సమీక్షించిన శ్రీశ్రీ, కథాక్రమము ప్లాటు ఈ నవలలో లేనట్లు చెప్పి " . . . దీనిని చదివిన పిమ్మట వచ్చే భాగము కొరకు ఎవరైనా ఆతృత పొందుతారా అన్నది సందేహాస్పదము. మా మట్టుకు మాత్రము అట్టి ఆతృతలేదు" అని విమర్శించాడు. 'మూడు పుస్తకాల పరిచయం' పేరుతో రాసిన సమీక్షలో శరత్ నవల 'బిందుగారబ్బాయి' నీ, విశ్వనాథ 'అంతరాత్మ'లనూ సమీక్షించాడు. 'విక్టోరియా క్రాసు' సమీక్షలో ఇది చదివిన తరువాత తనకు సంతోషము కలుగనట్టు తెల్పాడు. జార్జ్ ఆర్వెల్ రాసిన ఇంగ్లీషు నవల '1984' ను తెలుగులో సమీక్షించాడు. ఈ నవల ద్వారా ఆనాటి ప్రపంచ పరిస్థితులు, ప్రజల జీవన విధానం తెలుస్తాయని చెప్పి, ఆ రచయితను ప్రతిభావంతుడైన కథా రచయితగా పేర్కొంటూనే కమ్యూనిస్టు వ్యతిరేక కథలు రాయడం వల్ల పెట్టుబడిదారీ విధానానికి మరింత బలం చేకూరుతుందని విచారించాడు.[130]

దీన్ని బట్టి ప్రజల కష్టాల్ని తెలిపే రచయిత కమ్యూనిష్టేతరుడైనప్పటికీ మెచ్చుకునే గుణం శ్రీశ్రీలో కన్పిస్తుంది.

**వ్యాసం**

వ్యాస ప్రక్రియలో 'సైడ్‌లైట్స్', 'కథానిక రచన' పుస్తకాలకు సమీక్షలు రాశాడు. ఖాసా సుబ్బారావు రాసిన 'సైడ్‌లైట్స్' పుస్తక సమీక్షలో "గాంధీజీ మొదలు సర్‌మహమ్మద్ ఉస్మాన్ వరకు అందరూ వీరి నిష్పాక్షిక దృష్టికి గురి అయినవారే. ఆ గ్రంథంలో ఇరవై ఏడుగురి మీద వ్రాసిన వ్యాసాలు మాత్రమే ఉన్నాయి. ... ఖాసా సుబ్బారావు గారి శైలి వారి భావాలలాగే పటిష్టమైనది. పుస్తకంలోపల చాలా చోట్ల అచ్చు తప్పులు ఉండటం పెద్దలోటు"[131] అని విమర్శించాడు. 'కథానికా రచన' గురించిన అంశాలతో రాయబడిన వ్యాసాల పుస్తకం 'కథానిక రచనకు సంబంధించిన లక్షణ గ్రంథమనీ, ఇది కొత్తగా కథలు రాసే వారి కొరకని సమీక్షలో వివరించాడు.

తెలుగు పుస్తకాలనే గాక ఇంగ్లీషులో వచ్చిన పుస్తకాన్ని సమీక్ష చేసి తెలుగు వారికి పరిచయం చేశాడు. అది 'హెలెన్ గ్ర్దొనర్' రాసిన 'టి. ఎస్. ఇలియట్ శిల్పం' అనే విమర్శనా పుస్తకంపై సమీక్ష రాశాడు. ఇందులో ఇలియట్ రచనా నైపుణ్యాన్ని వివరించి, ఆయనకంటే జేమ్స్ జాయిసే గొప్పవాడన్నాడు.

**నాటకం**

నాటక ప్రక్రియకు సంబంధించిన శ్రీశ్రీ సమీక్షల్లో పుస్తకంగా నాటకం చదివి రాసిన సమీక్షలు, ప్రదర్శించిన నాటకాలను చూసి రాసిన సమీక్షలు ఉన్నాయి.

'కల్యాణ రాధా మాధవము' నాటకానికి రాసిన సమీక్షలో "ఇది అయిదంకముల నాటకము. రాధామాధవుల ప్రేమగాథ ఇందు వర్ణింపబడినది. బ్రహ్మదేవుడు వీరికి వివాహము చేయుటతో నాటకము సమాప్తమగును"[132] అని అందులో ఉన్న విషయాన్ని చెప్పాడే కానీ ఈ నాటకంపై ఎటువంటి విమర్శచేయలేదు. 'అపోహ' నాటక సమీక్షలో పాత్రలను, ఇతివృత్తాన్నీ, సంభాషణలను ప్రశంసించాడు. 'విజయ ప్రతిజ్ఞ' నాటక సమీక్షలో "కథా సందర్భము మంచి శైలిలో తెలియబరుపబడుటచే పఠనమునకిది అనుకూలము"[133] అని మెచ్చుకున్నాడు.

ఇలా నాటకాలు చదివి విమర్శ చెయ్యడంగాక నాటక ప్రదర్శనలను చూసికూడా సమీక్షలు చేశాడు. ఈయన దృష్టిలో నాటకం చదివి విమర్శ చేసేకంటే, ఆనాటక ప్రదర్శన చూసి విమర్శ చేయాలన్నది సరైనది. ఈ విషయాన్నే 'త్రిజాకీ యమ దర్శనం' అనే పుస్తకానికి తాను రాసిన పీఠికలో నూ తెలిపాడు[134] ఈ విధంగా 'ముందడుగు' నాటకాన్ని చూసి సుదీర్ఘ సమీక్ష చేశాడు. దీన్ని "కొత్త

సృష్టికి కొత్త విమర్శ కూడా కావాలి"[135] అని ఆరంభించాడు. మొదట పత్రికా రిపోర్టులాగా కొంత రాసి, ఈ నాటక ప్రత్యేకతను, నాటకంలోని లోపాలను, రచయితల పేర్లు, పాత్రల పేర్లు కూడా అకారాది క్రమంలోనే రాశాడు. ఆ తర్వాత డైరెక్టరు, ఆర్కెస్ట్రా మొదలైన సాంకేతిక కళాకారులను కూడా పేర్కొన్నాడు. నాటక ప్రదర్శనను చూసి, విషయంలోనూ, ప్రదర్శనలోనూ ఉన్న ప్రత్యేకతను వివరించాడు. ఇలాగే 'ప్రజా నాట్యమండలి' వారు ప్రదర్శించిన 'మా భూమి' నాటకాన్ని చూసి " 'మా భూమి' నాటకం చదవడానికి బాగుంటుందా అనేది మన సమస్యకాదు. 'నాటక ప్రదర్శన'లో ప్రజానాట్యమండలి వారు ఒక బ్రహ్మాండమైన విప్లవం తీసుకొచ్చారు"[136] అని అతి సుదీర్ఘంగా రాసిన సమీక్షలో ప్రశంసించాడు. 'అడివంటుకుంది' నాటక ప్రదర్శనను చూసి (2-3-1980 నాడు) "కొండ కోనల్లో తిరిగే గిరిజనుడ్ని ఆంధ్రప్రదేశ్ రంగస్థలంపైకి రప్పించిన ఖ్యాతి ఈ రచయితకే దక్కింది"[137] అని మెచ్చుకున్నాడు. నాటక పరిషత్తులు నిర్వహించే నాటక పోటీలనూ, చూసి వాటి మంచి చెడుల్ని సమీక్షించాడు.

**సినిమాలు**

మొదటి నుండీ శ్రీశ్రీకి సినీమాలపట్ల ఎక్కువ మక్కువ కన్పిస్తుంది. తాను సినీ రంగంలోకి వెళ్ళక పూర్వమే 1947 లో 'యోగి వేమన' చిత్రం ప్రివ్యూ చూసి "... చిత్రం ఉండాలనుకొన్న విధంగా ఉండక పోయిందన్న అసంతృప్తి ఒక్కటే నాలో మిగిలింది. కాబట్టి వేమన చిత్రాన్ని మెచ్చుకోలేని వాళ్ళలో నేనొకనిగా మిగిలిపోయాను"[138] అని నిఖచ్చిగా చెప్పేశాడు. 'గంగిగోవుపాలు గరిటెడైనను చాలు' అనే వేమన పద్యాన్ని సినీమాలో చూపడానికి చక్కగా సన్నివేశాన్ని సృష్టించడం జరిగిందని మెచ్చుకున్నాడు. 'మనుషులు మారాలి' చిత్రాన్ని ప్రశంసించి కళాకారుల, రాజకీయ వేత్తల బాధ్యతల్ని గూర్చి "నా మట్టుకు నేను కళాకారుడు వాస్తవికతకు దర్పణం పట్టాలనీ, సమస్యలను పరిష్కరించవలసిన వాళ్ళు (అభ్యుదయ) రాజకీయవేత్తలనీ అనుకుంటున్నాను"[139] అని కళాకారులు రాజకీయవేత్తలు చేయాల్సిన పనులను నిర్దేశించాడు.

**ఇతరాలు**

ఇక్కడ పత్రికలు, రాజకీయం, విజ్ఞాన శాస్త్ర పుస్తకాలపై రాసిన సమీక్షలు, 'తెలుగు కవితా విప్లవాల స్వరూపం' పుస్తకంపై రాసిన రిపోర్టు గురించి వివరిస్తాను.

'పదార్థ విజ్ఞాన శాస్త్రము' పుస్తకాన్ని సమీక్షిస్తూ "ఇందలి పరిభాషా పదములు సమగ్రములు కాకపోవుటయు, ... బడి బాలురకు అనగానే వెల అధికమగు స్థితి ఈ గ్రంథమునకు కలిగినది"[140] అని పాఠ్యాంశాలకు సంబంధించిన పుస్తకాలకు ధరను ఎక్కువ నిర్ణయించి దోచుకోవడాన్ని విమర్శించాడు శ్రీశ్రీ.

నార్ల వెంకటేశ్వరరావు రాసిన 'జెక్ రాజ్య విచ్ఛేదం', 'పాలస్తీనా' అను పుస్తకాల్ని సమీక్షించాడు. ఈ సమీక్షల్లో ఎన్నో ప్రపంచ రాజకీయ పరిస్థితులు, భారతదేశస్థితి వివరించాడు.

వెల్చేరు నారాయణరావు పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసంపై ఆంధ్ర విశ్వ విద్యాలయ రిజిస్ట్రారు కోరిన మేరకు పరీక్షకుల్లో ఒకడుగా ఉండి, ఒక్కొక్క అధ్యాయంపై చాలా వివరంగా రిపోర్టు రాశాడు శ్రీశ్రీ.

పుస్తకాలనే కాక పత్రికలనూ సమీక్షించాడు. అలాంటి వాటిల్లో యువ, కవిత పత్రికలున్నాయి. 'యువ' మూడవ సంపుటి, మొదటి సంచికను సమీక్షిస్తూ "... ఈ పత్రిక నాకు నచ్చింది ... దీనిని చదువుతూవుంటే ఒక హాయి కలిగింది. చల్లని నీరు తాగితే దాహం తీరినట్లయింది"[141] అని చెప్పడమే గాక ఇందులోని కొన్ని రచనల్ని పేరు పేరా చెప్పాడు శ్రీశ్రీ. ఇందులో పత్రికా సంపాదకుడు "కొద్ది మంది రచయితలు సాహిత్య రచయితల సాహిత్య పరిణామం నిర్ణయించే రోజులు గతించినవని నా నిశ్చితాభిప్రాయం" అని చెప్పిన దానితో ఏకీభవించక "ఏమో నా అభిప్రాయం అంత 'నిశ్చింతగా' లేదు" అని తన అభిప్రాయాన్ని తెలిపాడు. 1954, ఆగస్టు - సెప్టెంబరు సంచికతో 'కవిత' అన్న పత్రిక ఆవిర్భవించింది. దీని సంపాదకురాలు అబ్బూరి ఛాయాదేవి. ఈ సంచికను ప్రశంసించి తెలుగు పత్రికల తీరు అవి చేసే ప్రచారం గురించి సమీక్షించాడు. ఇంకా ఇందులో 'కవిత'లోని విభిన్న దృక్పథాలను వివరించే అన్ని రచనలూ ఉండాలనీ, కొత్త కొత్త రచయితల్ని పరిచయం చేయాలనీ, ఇందులో కేవలం కవితలేగాక, కవితా చర్చకు కూడా కొన్ని పుటలు కేటాయించబడాలని చెప్పి 'కవిత' కి స్వాగతం పలికాడు శ్రీశ్రీ.

సమీక్షల్లో శ్రీశ్రీ మనస్తత్వాన్ని చూడొచ్చు. శ్రీశ్రీ కి స్వంత గొంతుక ఉన్న రచయితలంటే ఇష్టం. ఒక సమీక్షలో మల్లాది, అవధాని రచనల గురించి చెబుతూ "ఏదో మాకు గొంతుకలో అతడు మాట్లాడుతున్నాడనిపించుతుంది"[142] అనీ, ఇదే విధంగా మరో సమీక్షలో ఒక రచయిత రచనల్ని చదివినప్పుడు "ఇంకొక రచయితను జ్ఞాపకం చేస్తున్నంత కాలం ప్రథమశ్రేణిలో ఇతనికి స్థలం దొరకడం కష్టం"[143] అని రచయితలకు స్వంత గొంతుక ప్రాధాన్యాన్ని పదే పదే నొక్కి చెప్పాడు. కవితా ప్రక్రియంటే శ్రీశ్రీకి ఎంతో ఇష్టం. అందుకే ఓ సమీక్షలో "కవిత్వం గురించి అప్రియ వచనాలు నాకు వ్రాయడం ఇష్టంలేదు"[144] అని తన మనస్తత్వాన్ని వెల్లడించాడు. ఇంతేగాదు సమీక్షల్లో పుస్తకంపై నిఖచ్చిగా తన అభిప్రాయాల్ని చెప్పడం, తన సలహాలు, సూచనలూ తెలియచేయడం శ్రీశ్రీకి పరిపాటి.

ఇలా సమీక్ష చేసి శ్రీశ్రీ, ఎక్కడ పాఠకులు చదవదగ్గ మంచి పుస్తకం కనిపించినా, అది ఇంగ్లీషు పుస్తకమైనా సమీక్ష రూపంలో పరిచయం చేసేవాడు. ఆయా పుస్తకాల్లో తనకు నచ్చిన, నచ్చని అంశాల్ని నిస్సంకోచంగా తెలిపేవాడు. ఇదే శ్రీశ్రీ సమీక్షల విశిష్టత.

# సంపాదకీయాలు

కవిగా శ్రీశ్రీ ప్రసిద్ధుడు. ఆధునిక కవిత్వంలో అనితర సాధ్యమైందతనిమార్గం. అతని కవిత్వం ఎందరో కవులకు ప్రేరణ నిచ్చింది. అయినా తన కవిత్వం తన ఆకలి తీర్చే ఆదాయాన్ని సంపాదించలేకపోయింది. అందువల్ల పొట్టకూటికోసం చేసిన ఎన్నో ఉద్యోగాల్లో పత్రికా సంపాదక వృత్తి ఒకటి.

శ్రీశ్రీ సంపాదకుడయ్యే నాటికి పత్రికా రంగం ఎంతో ఎదిగింది. ముట్నూరి కృష్ణారావు, సురవరం ప్రతాపరెడ్డి వంటివారు ఈ రంగంలో విశేష కృషి చేసి ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్నారు. ఇటీవల నార్లవెంకటేశ్వరరావు (మూడు దశాబ్దాలు), ఎబికె ప్రసాద్ (మూడు సంపుటాలుగా వచ్చాయి), వరవరరావు (సృజన సంపాదకీయాలు), నండూరి రామమోహనరావు (అనుపల్లవి, చిరంజీవులు) వంటి వారల సంపాదకీయాలు పుస్తకరూపం దాల్చాయి. పత్రికకి సంపాదకీయం ప్రాణం వంటిది. ప్రజల మేధో వృద్ధికి, పత్రిక సామర్థ్యానికి ఈ సంపాదకీయం గీటురాయిగా ఉంటుంది. ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయంగా సమాజంలోని అన్ని విషయాలపై సంపాదకీయాలు వ్రాసే స్వేచ్ఛ పత్రికలకు ఉంటుంది. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ సంపాదకీయాలు శక్తివంతమైన ప్రజాస్వామ్య పక్షాలు అనటంలో అతిశయోక్తిలేదు.

ఇలా పత్రికకు ప్రాణమై విరాజిల్లుతున్న సంపాదక పదవిని శ్రీశ్రీ 1936 లో తొలిసారిగా చేపట్టాడు. అది 'వీణ' త్రైమాసిక పత్రిక. అప్పటికి శ్రీశ్రీ వయస్సు ఇరవై ఆరేళ్ళే. ఆనాటికే 'మహాప్రస్థానం' కావ్యంలోని 'జయభేరి', 'మహాప్రస్థానం', 'ఋక్కులు', 'భిక్షు వర్షీయసీ' మొదలైన ప్రఖ్యాత కవితలురాసి కవిగా పేరు పొందాడు. కథకుడిగా, వ్యాసకర్తగా ప్రఖ్యాతుడయ్యాడు. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి రాసిన పుస్తకం 'తెనుగు వీణ' (1934) కు పీఠిక రాసి పీఠికా కర్త స్థానాన్ని అధిష్టించాడు. ఇలా 1936 నాటికే తెలుగు సాహితీ రంగంలో తనకంటూ ప్రత్యేక స్థానాన్ని

సంపాదించుకున్న శ్రీశ్రీలో " . . . ఎడిటర్‌లో నాయకుడు తత్త్వవేత్త, నిరంతర అన్వేషి ఉండాలి"[145] అని 'జర్నలిజం చరిత్ర - వ్యవస్థ' అనే పుస్తకంలో చెప్పిన లక్షణాల్ని అప్పటికే చూడగలం.

వీణ, ఆంధ్రప్రభ, నవత, ఆనందవాణి పత్రికల సంపాదక విభాగాల్లో శ్రీశ్రీ పని చేశాడు. 'వీణ' పత్రిక సంపాదకుల్లో ఒకడుగా 1936 నుండి 1938 వరకు సంపాదకీయాలు రాయడమేగాక ఆ పత్రికలో అచ్చయ్యే కవిత్వాలకు పరిచయ వాక్యాలు కూడా రాశాడు. ఆంధ్ర ప్రభలో సహాయ సంపాదకుడుగా 1938-42 మధ్య ఉన్నాడు. 1946-49 మధ్య 'ఆనందవాణి'లో చేరాడు. హైదరాబాదు నుండి వెలువడే 'నవత' పత్రికకు ప్రధాన సంపాదకుడుగా ఉండి కవితా విభాగం చూసేవాడు. ఈ పత్రికకు శ్రీశ్రీని సంపాదకుడుగా ఒప్పించడం గురించి ఆ పత్రిక సంపాదకుల్లో ఒకరైన శిష్టా జగన్నాథరావు ఇలా చెప్పారు "నవతకి శ్రీశ్రీని ఎడిటర్‌గా ఉంచడానికి ఒప్పించింది వరవరరావు. . . . మేమొక సాహిత్య పత్రిక నడపదలచుకున్నాం. . . . మీరే ఎడిటర్‌గా ఉంటారు - అని డైరెక్టుగా అడిగేసాం. ఓ. యస్. దానికేం అన్నారు శ్రీశ్రీగారు"[146] అని చెప్పటంతో సాహిత్య పత్రిక మీద శ్రీశ్రీకున్న అభిమానం అర్థమవుతుంది.

సంపాదకుడుగా ఐదు సంపాదకీయాల్ని రాశాడు. అందులో రెండు ఆ పత్రికల ప్రారంభ సంచికలకోసం రాసినవి. మరోరెండు తన తోటి సాహితీ మిత్రులు మరణించినప్పుడు ఆవేదనతో రాసిన సంపాదకీయాలు. మిగతా ఒకటి 'నవ్య సాహిత్య మీ మాంస' చేసింది.

'వీణ, ప్రారంభ సంచికకు 'శ్రుతులు' పేర రాసిన సంపాదకీయమే శ్రీశ్రీ రాసిన సంపాదకీయాల్లో మొట్ట మొదటిది. ఇందులో యువకవుల్ని, నవకవుల్ని ఆహ్వానిస్తూ "నీవు ఎప్పుడు వస్తావో! ఎలాగ వస్తావో! నువ్వు Cyclone లాగో, Sulphuric acid లాగో గంధక సింధురంలాగో గండభేరుండంలాగో రావోయ్! రావోయ్! యువకవీ! నవకవీ!!![147] అని ఉద్వేగంగా ఆధునిక యుగకవిని ఆహ్వానించాడు. అంటే కవి అన్నవాడు ప్రజల్ని నిద్రపుచ్చడానికి గాక మేల్కొల్పడానికి అన్నట్లుగా ఈ మాటల్ని బట్టి భావించవచ్చు. ఇలా సంపాదకీయం వెలువడిన తర్వాతి సంవత్సరం (8-[illegible]1937) లో రాసిన 'నవకవిత'లో ఈ యువకవీ, నవకవి కవనం ఎలాగుండాలో చెబుతూ చివరలో "కదిలేది కదిలించేది, / మారేది మార్పించేదీ, / పాడేదీ పాడించేదీ, / పెను నిద్దుర వదిలించేదీ, / మునుముందుకు సాగించేది / సంపూర్ణపు బ్రదుకిచ్చేదీ / కావాలోయ్ నవకవనానికి"[148] అని ఉద్ఘోదించాడు. ఇంకా ఈ సంపాదకీయంలోనే కవుల స్వంత గొంతుక గురించి చెబుతూ " . . . చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారి కవిత్వం నాకిష్టం. I hate his imitators. దేవుల పల్లి కృష్ణశాస్త్రి గారి కవిత్వం నాకిష్టం. I scorn his followers. ఒకప్పుడు కృష్ణశాస్త్రి తనం అనుకరించి వ్రాసిన పద్యాలు నావి, ఇప్పుడు నాకసహ్యం కలిగిస్తున్నాయి"[149] అని అనుకరణపై తన అసహ్యతను ప్రకటించి స్వంత గొంతుక కావాలన్నాడు. స్వతంత్రతతో రచయితలు వెలువరించే సాహిత్య గౌరవం గురించి

" . . . స్వ సత్వద్యోతకమైన ప్రత్యేకత వాఙ్మయంలో అన్నిటికన్న మిన్నగా ఉపాధేయమనీ అందువల్లనే కవికి ఉన్నత శిఖరాల మీద స్థానం దొరుకుతుందనీ విస్మరించకూడదు"[150] అని చెప్పాడు. వ్యాకరణాలనూ, ఛందస్సు చట్టాలనూ కవులు నాశనం చేస్తారని చెప్పి, ఈ శిథిలాలనుండే " . . . A work of Art can never be repeated. మరో తాజ్‌మహల్ కట్టడంకాని, మళ్ళీ శాకుంతలం వ్రాయడంకాని అసంభవం.[151] మరెవ్వరూ అలాంటివి చేయలేనంత అభ్యుదయ సాహిత్య సృష్టి జరుగుతున్నదని శ్రీశ్రీ అభిప్రాయపడ్డాడు. ఈయన యుద్ధ వ్యతిరేకి. చాలా రచనల్లో దీన్ని వ్యతిరేకించినట్లుగానే ఈ సంపాదకీయంలోనూ 1914 లో ఆరంభమైన మొదటి ప్రపంచ యుద్ధాన్ని గర్హించాడు. దీని ప్రభావం ఇంకా ప్రజలపై ఉందనీ చెప్పి ఇలాంటి తరుణంలోనే కవిత్వం ప్రజల బాధలు, సకల వికల మనో అవస్థలూ పోగొట్టేదిగా ఉండాలని ఆకాంక్షిస్తూ రాజకీయాల్ని, మతాన్ని విమర్శించాడు. ఈ సంపాదకీయం ఉద్రేకభరితమైన శైలితో ఉండటంవల్ల చివరిపేరా 'మరోప్రస్థానం' లో కవితా రూపంకూడా ధరించింది.[152]

ప్రారంభ సంచికలకు సంపాదకీయం రాసిన రెండో పత్రిక 'నవత'. ఈ పత్రిక సంపాదకత్వం తాను నిర్వహించడాన్ని " 'నవత' కవిత్వం నిమిత్తం జన్మించింది. మంత్రసాని తనమూ పౌరోహిత్యమూ వహించడానికంగీకరించిన నేను . . ."[153] అనే మాటల్ని బట్టి దాని పుట్టుక, ఎదుగుదలకు బాధ్యత వహించినట్లు తెలుస్తుంది. ఇంకా ఇందులో నవ నవంగా ఉండే రచనలు వెలువడతాయనీ, జీవిత విజయాల్ని చాటే కలానికి మరణముండదనీ వివరించాడు.

'వీణ', 'నవత' ప్రారంభ సంచికలకు రాసిన సంపాదకీయాల్లో నవ్య కవిత్వాన్ని ఆహ్వానించాడు శ్రీశ్రీ. తన తోటి, సాటి కవుల మరణానికి ఆవేదనతో కూడిన సంపాదకీయాల్ని రాశాడు శ్రీశ్రీ. అందులో మొదటిది కొంపెల్ల జనార్దనరావు గురించి రాసింది. 'వీణ' పత్రికలో 'అశ్రుతర్పణం' పేర అచ్చయింది. ఇది "జనార్దనరావు చనిపోయాడు" అనే వాక్యంతో ఆరంభమవుతుంది. "ఉప్పెనగా ఉద్రేకిస్తున్న విషాదాన్ని వశం వదం చేసుకొని"[154] ఆ సంపాదకీయం రాస్తున్నట్లు చెప్పుకున్నాడు. ఇందులో "జనార్దనరావు మరణం వలన తెలుగు సాహిత్యానికి హేమంతం ప్రాప్తించింది. (వైధవ్యమ్ అందును అతిశయంగా చెప్పాలంటే)"[155] అని జనార్దనరావు లేని తెలుగు సాహిత్య స్థితిని ఊహించాడు. ఇంకా జనార్దనరావు ఆధునిక సాహిత్యాన్ని సరిగ్గా అర్థం చేసుకున్న "విమర్శకుడుగానే కాకుండా అనేక 'కిరణాలు' గా అతడు వికసించాడు" అనీ చెప్పాడు. 'కిరణాలు' గా వికసించడమంటే 'ఉదయిని' పత్రికను స్థాపించి అందులో 'కిరణాలు' పేర సంపాదకీయాలు రాసేవాడు జనార్దనరావు. ఇలా సంపాదకీయంలో జనార్దనరావు మరణానికి తీవ్రంగా విచారిస్తూ అతని ఔన్నత్యం కొనియాడాడు.

ప్రముఖ కవి తిలక్ మరణించినప్పుడు 'ఆనందవాణి' పత్రికలో 'లోకబాల్యతిలక్' అని సంపాదకీయం రాశాడు శ్రీశ్రీ. ఇందులో తిలక్‌ను తెలుగు సాహిత్యంలో మొదటి తరగతి రచయితలలో

ఒకడుగా పేర్కొన్నాడు. అతని సృజనశక్తి విజృంభిస్తున్న సమయంలోనే మరణించడంవల్ల విచారం ప్రకటిస్తూ " . . . తిలక్ చనిపోవడం అంటే మిట్ట మధ్యాహ్నామే సూర్యుడస్తమించినట్టుందని"[156] వ్యాఖ్యానించాడు శ్రీశ్రీ.

'వీణ' పత్రికలో 'నవ్య సాహిత్య మీమాంస సంపాదకుని విన్నపము' అనే పేర సంపాదకీయం రాశాడు. అందులో ప్రధానంగా నవ్య సాహిత్య చర్చచేశాడు. నోరినరసింహశాస్త్రిగారు 'సాహిత్య ప్రయోజనము' అనే వ్యాసంలో "కవుల దృక్పథం ఎలా వుండాలి అనే ప్రశ్నకు శాస్త్రిగారు ప్రాచీనుల మతాన్నే బలపరిచాడు"[157] అని చెప్పాడు. ఈ వ్యాసంపై కొడవటిగంటి కుటుంబరావు రాసిన లేఖను 'ప్రతిభ' పత్రిక ప్రచురించక పోవడాన్ని నిరసించి "సాహిత్య పరమైన వివాదం గనుక దీన్ని ఉద్ధతి, ఉగ్రత లేకుండా శాంతంగా జరిగించుకోవడం అవసరంగా,సత్యం నిరూపించాలి అనే ప్రసన్న బుద్ధితో యీ వివాదం సాగించి ప్రసిద్ధులైన తెలుగు కవులూ, పండితులూ నవ్య సాహిత్య స్వరూప నిర్ణయం చేయవలసినదిగా ప్రార్థిస్తున్నాము"[158] అని సాహిత్య చర్చలు జరుపవలసిన విధానాన్ని సమన్వయపర్చిన సంపాదకీయాలు సంఖ్యాపరంగా స్వల్పమే అయినా ఒక్కొక్కటి ఒక్కొక్క ఆణిముత్యం వంటిది.

# ప్రశ్న జవాబులు

ఆధునిక తెలుగు సాహిత్యాన్ని అభ్యుదయ, విప్లవ పథ నిర్దేశం గావించిన శ్రీశ్రీ, ప్రాచీన కవుల్లో చేమకూర ప్రతి పద్యంలోనూ చమత్కృతి ప్రదర్శించినట్టుగానే, ఆధునికుల్లో దాదాపు ప్రతి రచనలోనూ, చమత్కృతితో, విశిష్ట ప్రయోగమో చేసి చూపి సాహిత్య లోకంలో ప్రత్యేక స్థానాన్ని ఏర్పరుచుకున్నాడు. 1930 తర్వాత తెలుగు సాహిత్యంలోని దాదాపు ప్రతీ సాహిత్యోద్యమంతో కలిసి నడిచిన మహారచయిత. అలాంటి రచయిత అభిప్రాయాన్ని ప్రజలు ఎప్పటికప్పుడు తెలుసుకోవడానికి పత్రికలు 'ప్రశ్నలు-జవాబులు' శీర్షికలో 'ప్రజ' ల ప్రశ్నలకు శ్రీశ్రీ సమాధానాలిచ్చాడు. ఉపన్యాసాలివ్వడానికో, ఆవిష్కరణలకో, సన్మానాలకో ఎక్కడికి వెళ్ళినా అక్కడి వారు శ్రీశ్రీ తో ఇంటర్వ్యూ చేసేవారు. ఒక్కోసారి నలుగురు పోగై శ్రీశ్రీతో పిచ్చాపాటిగా మాట్లాడిన మాటలను రికార్డు చేసేవారు. ఇలా వివిధ విషయాలపై ప్రశ్నలడిగి ఆయన అభిప్రాయాన్ని వినడానికి కుతూహలపడేవారు సాహిత్యాభిమానులు. ఈ ఇంటర్వ్యూలు సుమారు వందదాక ఉంటాయి. ఇవన్నీ కలిపి 'ప్రజ' పేర పుస్తకంగా అచ్చయినాయి. ఒక రచయిత రచనలు గానీ, లేఖలు గానీ, డైరీగానీ పుస్తకరూపం ధరించడం సర్వసామాన్యమైన విషయం. కానీ శ్రీశ్రీ విషయంలో ఇవన్నిటితో పాటు, 'ఇంటర్వ్యూలు' కూడా పుస్తకంగా అచ్చుకావడం బహుకొద్దిమంది సాహితీవేత్తలకు దక్కిన గౌరవం. బహుశ ఇదే మొదటి ప్రయత్నంగా చెప్పుకోవచ్చు.

సాహిత్య విషయాలేగాక సినిమాలు, రాజకీయాలు మొదలైన అనేక అంశాలపై అడిగిన ఇచ్చిన సమాధానాల్ని 1. సాహిత్య, 2. కవిత్వం – రూపం (Form), 3. రాజకీయాలు, 4. , 5. స్త్రీలు, 6. సినిమాలు, 7. స్వవిషయాలుగా విభజించవచ్చు.

## సాహిత్యం

శ్రీశ్రీ ప్రధానంగా సాహితీవేత్త కావడంవల్ల సాహిత్యంపైనే ఎక్కువగా ప్రశ్నలడిగారు. సాహిత్యంలోని దాదాపు అన్ని ప్రక్రియలపైన ప్రశ్నలున్నాయి. ఈ ప్రశ్నలకు జవాబుల్ని ప్రక్రియా పరంగా కవిత్వం, కథ, నవల, నాటకం, విమర్శగా వేరు వేరు వివరించడం జరుగుతుంది.

### కవిత్వం

భావకవితా క్షేత్రంలోంచి పొడుచుకు వచ్చిన కవితా వృక్షం శ్రీశ్రీ. మొదట్లో అభ్యుదయ కవిత్వం రాయడమేగాక, అభ్యుదయ రచయితల సంఘానికి అధ్యక్షుడై కూడా ముందు నిలిచాడు. ఆతర్వాత వచ్చిన వివిధ కవిత్వో ద్యమాలను ఆహ్వానించి 1970 లో ఆరంభమైన విప్లవ రచయితల సంఘానికి అధ్యక్షుడైనాడు. భారత రాష్ట్రపతిగిరీ కంటే ఇదే తన దృష్టిలో ఉన్నతమైందిగా భావించి ప్రజల్ని విప్లవోన్ముఖుల్ని చేయడానికి తన జీవితాంతం వరకు కలాన్ని దించని సాహిత్య యోధుడు శ్రీశ్రీ. అలాంటి శ్రీశ్రీని 'కవిత్వానికి ఏది గీటురాయి?' అని అడిగితే "జ్ఞాపకం ఉండేది కవిత్వం మరచి పోయేది కవిత్వంకాదు ఈ అభిప్రాయం చెళ్ళపిళ్ళ వారు అన్నారు. అంతకు ముందు అల్లసాని పెద్దన కూడా 'రాతిరియున్ పవల్ మరపురాని హోయల్' అని అన్నారు."[159] అని వారి అభిప్రాయాల్ని తన మాటగా చెప్పాడు. తెలుగులో ఆధునిక కవిత్వం ఎప్పుడారంభమైందన్న ప్రశ్నకు తోక చుక్క వెలువడ్డ 1910 లోనే నూతన ఛందస్సు 'ముత్యాలసరాలుతో గురజాడ కవిత్వం రాశాడని సమాధానమిచ్చాడు.[160] ఆధునిక కవిత్వం ఆరంభమైన కాలంతోపాటు ముత్యాలసరాలను పేర్కొనడం వల్ల ఆధునిక కవిత్వ ఆరంభకుడుగా గురజాడను శ్రీశ్రీ చెప్పకనే చెప్పాడు.

అభ్యుదయ సాహిత్యం గూర్చి ఓ ప్రశ్నకు జవాబుగా నిర్దుష్టమైన బతుకును చూపుతూ మానవుల పురోగతికి ఉపయోగపడేదే అభ్యుదయ సాహిత్యం అంటూ ఈ రకం సాహిత్యానికి సంబంధించిన అరసం 1943 లో తాపీ ధర్మారావుగారి అధ్యక్షతన తెనాలిలో ప్రారంభమై, వారి రచనలు ఎలా సాగాయో కాస్త దీర్ఘంగా వివరించాడు.[161]

అరసం, తర్వాత వచ్చిన 'దిగంబర కవిత్వోద్యమాన్ని' శ్రీశ్రీ ఆహ్వానించి, ఆదరించడమేగాక తర్జుమా చేసి ఇంగ్లీషు పాఠకులకు కూడా పరిచయం చేశాడు. ఒక సాహితీ మిత్రుడు యం. మదన్ మోహన్ దిగంబర కవిత్వంపై అడిగిన ప్రశ్నకు చాలా మంది బూతును చూస్తే నేను మాత్రం కవిత్వమే చూశానని సమాధానమిచ్చాడు.[162] ఇలా దిగంబర కవిత్వంపై ఎన్నో ప్రశ్నలకు సమాధాన మివ్వడమేగాక కేవలం దిగంబరకవులూ ఇంటర్వ్యూ చేసి అడిగిన ముప్ఫయి ఏడు ప్రశ్నలకు విలువైన సమాధానాలిచ్చాడు. ఈ ఇంటర్వ్యూ రెండు పత్రికల్లో, రెండు పుస్తకాల్లో అచ్చయింది.[163] ఇందులోనే దిగంబర కవులతోనో, ఆ తరంవారి నుండో మరో నూతన ఉద్యమం

ఆరంభమవుతుందని 1968 మార్చిలో శ్రీశ్రీ ఊహించాడు. ఆ తర్వాత రెండు సంవత్సరాలకు నిజమై దిగంబర కవుల్లోని నగ్నముని, నిఖిలేశ్వర్, జ్వాలాముఖి, చెరబండరాజులు విరసం సంస్థాపక సభ్యులు కాగా శ్రీశ్రీ అధ్యక్షుడుగా 4-7-1970 నాడు 'విప్లవరచయితల సంఘం' ఆవిర్భవించింది.

ఇలా విరసం ఏర్పాటైనప్పటి నుండి మరణించే వరకు శ్రీశ్రీ ఏది రాసినా, ఉపన్యసించినా, వీలైనంతవరకు 'విరసం' ప్రసక్తి ఎక్కువగా తెచ్చేవాడు. ఒక ప్రశ్నకు జవాబుగా విరసం గురించి " . . . సాహిత్య సాంస్కృతిక సామాజిక ప్రయోజనాలకు దోహదం చేయగల్గిన సాహిత్య సంస్థ ఏదయినా వుంటే అది విరసం ఒక్కటే"[164] అని చెప్పాడు. మరో ప్రశ్న "విప్లవ కవిత్వం రాయడానికి తప్పని సరిగా విరసంలో సభ్యులై వుండాలంటారా ?" అన్న దానికి 'అవసరంలేద'ని జవాబిచ్చాడు.

అరసం, విరసం సంస్థల నుండి వెలువడే కవిత్వమే గాక ఇతర కవిత్వాన్నీ గురజాడ, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, చలం చెరబండ రాజు మొదలైన రచయితల గురించి అడిగిన ప్రశ్నలకూ తన అభిప్రాయాన్ని తెలిపాడు.

**కథ**

తెలుగు కథానిక తీరుతెన్నులపై అడిగిన ప్రశ్నలకు ఈ ప్రక్రియలో ఉత్తమ కృషి జరిగినట్లు సంతృప్తిని వ్యక్తపరిచాడు.[165] "మీకు ఎవరి కథలిష్టం?"[166] అన్న ప్రశ్నకు మొపాసా, ఛెకోవ్‌ల కథకులను పేర్కొని వారి రచనా విధానం వివరించాడు. ఇంకా అనేక ప్రశ్నల్లో సందర్భం వచ్చినప్పుడల్లా గురజాడ 'మీ పేరేమిటి' కథ తనకు బాగా నచ్చిన కథల్లో ఒకటిగా పేర్కొన్నాడు శ్రీశ్రీ.

**నవల**

తెలుగు నవలా పరిణామంపై శ్రీశ్రీని అడిగిన ప్రశ్నలకు రావలసినన్ని మంచి నవలలు రాలేదని బాధపడి ప్రేంచంద్, శరత్‌బాబులకంటే డికెన్స్, మాగ్జిం గోర్కీలు గొప్ప నవలా కారులన్నాడు. శరత్, ప్రేంచంద్‌ల కంటే తెలుగు నవలా రచయితలు తక్కువేమి కారని చెప్పి, వీరి ప్రతిభ కవితలు కథానికలలో విజృంభించినట్లుగా నవలల్లో , నాటకాల్లో విజృంభించలేక పోతుందని నిరాశచెందాడు.[167]

**నాటకం**

నాటక ప్రక్రియలో విభిన్న ప్రయోగాలు చేసి రేడియో నాటకాల రచన నిర్వహణలో ఒక ప్రత్యేకతను సంతరించుకున్న శ్రీశ్రీని నాటక ప్రక్రియ పై అడిగిన కొన్ని ప్రశ్నలకి అసంతృప్తిని[168] మరి కొన్నింటిలో తృప్తినీ వ్యక్తపర్చాడు. మంచి నాటకం రాకపోవడానికి కారణం సినిమా, మంచి

స్టేజీలు ఉండక పోవడమేనని[169] ముందడుగు, మా భూమి, కన్యాశుల్కం నాటకాలను అమితంగా మెచ్చుకున్నాడు.

**విమర్శ**

తెలుగు సాహిత్య విమర్శ వివిధ దృక్పథాలతో వెలువడు తుందని మెచ్చుకుంటూ, దానివల్ల యువకుల్లో సాహిత్య జిజ్ఞాస పెరుగుతుందని చెప్పాడు.[170] మార్క్సిస్టు విమర్శకుడిగా చెప్పుకునే రాచమల్లు రామచంద్రారెడ్డిని అతి క్రూరుడైన విమర్శకుడుగా అభివర్ణించాడు.[171]

**కవిత్వం - రూపం**

తెలుగు కవితకు ఛందస్సుల సర్ప పరిష్వంగం వదిలించిన శ్రీశ్రీ, ఛందోబంధంతో కందాల సిరిసిరిమువ్వల్ని రాశాడు. అందుకే ఓ ప్రశ్నకి జవాబుగా ఛందో కవిత్వానికి "నేను వ్యతిరేకిని కాను. ఇది మాత్రా ఛందస్సుల, వచన గీతాల కాలం. మీర పేర్కొన్న ఛందో బద్ధ కవిత్వం పాత కాలానిది"[172] అని చెప్పాడు. ఐతే "1981లో ఛందోబద్ధ కవిత్వం రాసే వాళ్ళు ఏ తెగకు చెందిన కవులవుతారు ?" అన్న ప్రశ్నకు కవిత్వానికి రూపంకంటే ముఖ్యం విషయం. ఈ విషయం సామాజిక స్పృహతో కూడినదై ఉండాలని చెప్పి మాత్రా ఛందస్సులో రామాయణం రాసినంతమాత్రాన అది ఆధునిక కవిత్వం అనిపించుకోదని నిఖచ్చిగా చెప్పాడు.[173]

తెలుగులో వచన కవితను అభ్యుదయ కవిత్వోద్యమం యొక్క పరిణామ క్రమంలో ఒక భాగంగానే స్వీకరిస్తానన్నాడు. ఈ వచన కవితలో కుందుర్తి ప్రతిపాదించిన కథాకావ్యాలను వట్టి 'హంబగ్' గా అభివర్ణించి, వచన కవిత్వం నిలవడానికి కావ్యాలక్కరలేదని[174] అంటూ ఛందో, వచన కవిత్వాలను రథం, రాకెట్టులతో పోల్చాడు.[175]

ఇలా వచన కవితా రూపాన్ని, సామాజిక అవసరాన్ని నిర్వహించిన శ్రీశ్రీ, "మినీ కవిత It is a necessity. అల్పాక్షరముల అనల్పార్థ రచన. The aesthetics of the minimum[176] అని మినీ కవిత్వాన్నీ ఆహ్వానించాడు. ఐతే ఈ కవిత్వంలో కూడా చెత్త, ఊక, మట్టితో కూడిన రచనలు వస్తున్నాయనీ, ఆ మట్టిలో నుండే కొన్ని మాణిక్యాల వంటి మంచి మినీ కవితలూ వెలువడ్తున్నాయని ప్రశంసించాడు.

శ్రీశ్రీ తన కవిత్వాన్ని సామ్యవాదం రావడం కొరకు రాసినట్లుగా చెప్పుకున్నాడు. మయకోవస్కి కవిత్వం ద్వారా రాజకీయాల్లోకి వెళ్ళినట్లుగానే శ్రీశ్రీకి మొదట 'మార్క్సిజం' తెలవకముందే అలాంటి దృక్పథంతో కూడిన బీజాలు వేశాడు 'మహాప్రస్థానం'లో. ఆ తర్వాత లండన్ ప్రోగ్రెసివ్ రైటర్స్ మానిఫెస్టో చదివి దాని ప్రభావంతో 'ప్రతిజ్ఞ' కవిత రాశాడు. ఇలా మార్క్సిజం తనకు తెలవని దశనుండీ అలాంటి రచనలు చేస్తూ, తెలిసిన తర్వాత దాని కొరకై నిబద్ధతతో రచనలు సాగిస్తూ, ప్రత్యక్షంగా ఎన్నికల (1955) ప్రచారం కమ్యూనిష్టుల పక్షాణ చేశాడు. సాహిత్యంద్వారానే రాజకీయాల్ని ఎక్కువగా అధ్యయనం చేశాడేగానీ ప్రత్యక్షంగా రాజకీయాల్లో పాల్గొన్న సందర్భాలు బహు అరుదు. పౌరహక్కుల సంఘం ఆంధ్రప్రదేశ్ శాఖకు అధ్యక్షుడై అంతర్జాతీయ, జాతీయ, ప్రాంతీయ రాజకీయాలపై ఆయాసందర్భాల్లోని ఇంటర్వ్యూలలో తన అభిప్రాయాలు తెలిపాడు.

శ్రీశ్రీలో కనిపించే ముఖ్యమైన వాటిల్లో ఒకటి యుద్ధ వ్యతిరేకత. ఈ భావన అతను చేపట్టిన అన్ని ప్రక్రియల్లోనూ చూడవచ్చు. ఇదే అభిప్రాయాన్ని ఓ ప్రశ్నకు జవాబుగా చెప్తూ "కమ్యూనిస్టులెప్పుడూ యుద్ధాన్ని నిరసిస్తారు. సామ్రాజ్యవాదులే యుద్ధాన్ని, మానవ సంహారాన్ని, అందువల్ల వచ్చే లాభాలని కోరుకుంటారు. ఇంకో యుద్ధం వస్తే తాము కూడా తుడుచుకుపోతామన్న భయంచేతనే సామ్రాజ్యవాదులు తమ వద్దనున్న అణ్వాయుధాలకీ పని కల్పించలేదు"[177] అని సామ్రాజ్యవాదుల చర్యల్ని నిరసించాడు. ప్రపంచమంతటా యువకుల్లోని అశాంతిపై అడిగిన ప్రశ్నకు సమాధానంగా ఈనాడు యువతరంలో పెరుగుతున్న అశాంతి మంచికేనని చెప్పి, 1968 లో ఫ్రాన్సులో వచ్చిన విద్యార్థుల విప్లవాన్ని ఉటంకించాడు.[178] ప్రపంచవ్యాప్తంగా సామ్యవాద వ్యవస్థ రావడాన్ని కారల్ మార్క్స్ చెప్పింది రష్యాలో ఆచరణలోకి వచ్చిందనీ, రెండవ ప్రపంచయుద్ధం తర్వాతి పరిణామాల ప్రభావంగా చైనాలో సోషలిస్టు విప్లవం అధికారం పొందిందని చెప్పాడు.[179] ఇంకా తన 'ప్రశ్నజవాబు'ల్లో స్పెయిన్ అంతర్యుద్ధం హిట్లరు, లెనిన్ మొదలైన నాయకులనూ, ప్రపంచ పరిస్థితులు, పేర్కొన్నాడు శ్రీశ్రీ.

ప్రపంచ పరిస్థితులేగాక భారతదేశ స్థితిగతుల్ని గూర్చి ఒక ప్రశ్నకు జవాబుగా స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మనలో అలసత్వం, అజ్ఞానమూ, పెరిగాయని పాత సంస్కృతే గొప్పదని పాశ్చాత్య సంస్కృతి మంచిది కాదని అంటున్నారేకానీ, పాశ్చాత్యుల నుండైనా మంచిని గ్రహిద్దామనే ఉద్దేశమేలేదని బాధపడ్తూ చెప్పాడు.[180] ఇంకా మంచి రోజులు వస్తాయని ఆశనూ వ్యక్తీకరించాడు. జాతీయ సమైక్యత సాధించాలంటే పీడిత ప్రజల సమస్యలు పరిష్కరించాలనీ, అధికారంలో ఉన్న కాంగ్రెసు పార్టీని తన జవాబుల్లో తీవ్రంగా విమర్శిస్తూ "1972 నాటకి కేంద్రంలో కూడా కాంగ్రెసు కూలిపోతుందని నిస్సందేహంగా చెప్పవచ్చు"[181] అని చెప్పినది 1978 లో నిజమై జనతా ప్రభుత్వం

ఏర్పడింది. గాంధీ, ఇందిరా గాంధీ రాజకీయ విధానాలపై అడిగిన ప్రశ్నకు సమాధానంగా భారతదేశం గాంధీ కాలంలో బానిసత్వం నుండి స్వాతంత్ర్యం వైపు ప్రయాణిస్తే, ఇందిరాగాంధీ కాలంలో స్వాతంత్ర్యం నుండి బానిసత్వంవైపు ప్రయాణిస్తున్నదని చమత్కరించాడు.[182]

'భారతదేశంలో విప్లవం ఎలా వస్తుంది?' అన్న ప్రశ్నకు విప్లవ శక్తులన్నీ ఏకమై ' పీపుల్సు రెడార్మీ'గా ఏర్పడి పోరాడాలని చెప్పాడు.[183] ఇలా భారత దేశ స్థితిగతుల్ని, రాజకీయాల్నీ, భారతదేశంలో సామ్యవాదం గురించీ, గాంధీ, ఇందిరాగాంధీ, రాజాజీ, భగత్సింగ్, సీతారామరాజు మొదలైన నాయకుల గురించీ వివరించాడు.

ఆంధ్రదేశంలోనూ అధికారంలో ఉన్న కాంగ్రెస్ పార్టీని తీవ్రంగా గర్హించాడు. 'తెలుగు దేశం' పార్టీపై అభిప్రాయాన్ని అడిగితే అంతర్జాతీయంగా "నేను కమ్యూనిస్టుని, జాతీయంగా సమగ్రతావాదిని, ప్రాంతీయంగా తెలుగు 'వాడి'ని"[184] అని చమత్కారంగా చెప్పాడు. "యన్.టి.ఆర్. ముఖ్యమంత్రి అయితే ఈ రాష్ట్రం బాగు పడుతుందంటారా?" అన్న ప్రశ్నకు జవాబుగా మన రాష్ట్రానికి యన్.టి. ఆర్.ను ఆశాజ్యోతిగా అభివర్ణించి ఈయన కూడా సరిగా పరిపాలించకపోతే కాంగ్రెస్ పాలన మళ్ళీ తప్పదని ఊహించిందే ఋజువు కావడం అందరికీ తెల్సిందే కదా![185]

అంతర్జాతీయ, జాతీయ, ప్రాంతీయ రాజకీయాలతోపాటు సామ్యవాదం ఎలా వస్తుందో వివరిస్తూ తాను బ్రతికుండగా తన దేశంలో సామ్యవాదం వస్తే ఎంతో సంతోషిస్తానని చెప్పి అది వచ్చేంత వరకూ కలాన్ని దించనని చెప్పుకున్నాడు.

**నాస్తికత్వం**

శ్రీశ్రీ మొదట ఆస్తికుడు.[186] ఆ తర్వాత దేవుడు ఉన్నట్టా? లేనట్టా? అన్న 'సదసత్సంశయం' లో చాలా కాలం కొట్టు మిట్టాడి తన జీవితంలోని చివరి రోజుల్లో నాస్తికుడుగా మారాడు. 1970 లో "మీకు మతం, దేవుడు, జ్యోతిష్యం వంటి విషయాల్లో విశ్వాసం ఉన్నదా?" అని శ్రీశ్రీ ని అడిగినప్పుడు ఇంకా 'సదసత్సంశయం' లోనే ఉన్నట్లుగా చెప్పి, సైంటిఫిక్‌గా ఋజువుచేయలేక పోతున్నానన్నాడు.[187] 1981 లో ఓ ప్రశ్నకు జవాబుగా "ఒకప్పుడు దేవుడు వున్నాడో లేదో నాకు తెలీదు అనే వాడిని. ఇప్పుడు దేవుడు అనే వాడు లేడని ఒక స్థిరాభిప్రాయానికి వచ్చాను . . ."[188] అని చెప్పుకోవడం బట్టి శ్రీశ్రీలో ఆస్తికుడు, హేతువాది, నాస్తికుడుగా క్రమంగా మార్పు వచ్చినట్లు గమనింపవచ్చు.

**స్త్రీలు**

సమాజంలో స్త్రీ, పురుషులిద్దరికి సంబంధించిన అన్యాయాలు అవినీతులను నిరసించి, వ్యవస్థ సామ్యవాదం వైపు వెళ్ళడానికి శ్రీశ్రీ కవిత్వం రాశాడు. కానీ కేవలం స్త్రీల సమస్యలను

మాత్రమే గ్రహించి రచనలు చేయలేదు. ఈ విషయాన్ని చాలా మంది శ్రీశ్రీని అడిగినప్పుడు స్త్రీల సమస్యలు రూపు మాసి పోవడానికి కృషి చేసిన రాజారామ్మోహన రాయ్, వీరేశలింగం, చలం గారల కృషిని ప్రశంసించి, స్త్రీల సమస్యలు గట్టెక్కాలంటే 'వాళ్ళకి ఆర్థిక స్వాతంత్ర్యం అవసరమని సమాధానమిచ్చాడు. ఇక ముందు తాను నవలలు రాస్తే అన్యాయాలకు గురవుతున్న స్త్రీ పాత్రలను తప్పక చిత్రిస్తానని,[189] స్త్రీ, పురుషుల మధ్య సమానత్వం సామ్యవాద సమాజంలోనే సాధ్యమని ఓ ప్రశ్నకు సమాధానముగా చెప్పాడు.[190]

**సినిమాలు**

శ్రీశ్రీ సినీరంగ ప్రవేశంతోనే, తెలుగు సినిమా పరిశ్రమలో డబ్బింగ్ చిత్రాలు ఆరంభమైనై. అంటే శ్రీశ్రీ సినీ పరిశ్రమ కోసం రాసిన (మాటలు పాటలు) మొట్ట మొదటి చిత్రమూ, తెలుగు చలన చిత్ర పరిశ్రమలో మొట్ట మొదటి డబ్బింగ్ చిత్రమూ ఒక్కటేనన్నమాట. ఆ చిత్రం 'ఆహుతి' ఇది 1950 లో నిర్మితమైంది. దీనికి మూలం హిందీ చలన చిత్రం 'నీరాఔర్‌నందా'. ఇలా శ్రీశ్రీ సినీరంగ ప్రవేశం తర్వాత దాదాపు రెండు వేల వరకు గీతాలను రాశాడు. కొన్ని చిత్రాలకు మాటలనూ రాశాడు. ఒకప్పుడు డబ్బింగ్ చిత్రాల రచయితగా శ్రీశ్రీ ప్రసిద్ధుడు. చలన చిత్రోత్సవాలకు న్యాయ నిర్ణేతగా కూడా ఉన్నాడు. ఇలా చలన చిత్ర రంగంలో ఉన్న శ్రీశ్రీని ఇంటర్వ్యూ చేసిన చాలా మంది సినీరంగంపై కూడా ప్రశ్నలడిగేవారు. ఆ ప్రశ్నలకిచ్చిన జవాబులను పరిశీలిద్దాం.

చలనచిత్ర గీతాల గురించి అడిగిన ప్రశ్నకు సినిమాకు పాటలు ఖచ్చితంగా అవసరమనీ, పాటలు లేని సినిమా ఉప్పు లేని భోజనం లాంటిదని,[191] సినిమాల్లేని రోజుల్లో త్యాగరాజు, అన్నమాచార్యుడు, క్షేత్రయ్యలు పాడిన పాటలు సాహిత్యంలో స్వీకరించినట్లుగానే సినిమా గీతాలనూ స్వీకరించాలని తెలిపాడు.[192]

సంగీత స్వరాలకనుగుణంగా కవులు సినిమా పాటలు రాయడం చాలా కాలంగా ఉంది ఇప్పుడిప్పుడే ఇది మారి పాటలకు బాణీలను కట్టడం ఆరంభమైందని,[193] పాటరాసే విధానంలో వస్తున్న మార్పును అంచనావేసి, ఈ పాటల్ని కేవలం డబ్బు కొరకే రాస్తున్నారన్నాడు.[194] ఇలా కేవలం పాటలపైనే కాకుండా ఇతర అంశాలపై కూడా శ్రీశ్రీని ప్రశ్నించడం జరిగింది. సినిమాల్లో 'సెక్సు' ఉండకూడదనే ప్రశ్నపై "సెక్సుకు రియాక్షన్ ప్రొగ్రెసివ్ సెక్సు. . . . సెక్సు వద్దనడం నపుంసకుడు చేసేపని"[195] అని తెల్పి 'ప్రోగ్రెసివ్ సెక్సు' అంటే ఏమిటో, అదెలా చూపాలో తెలిపాడు.[196] సినిమాల ద్వారా 'ఎర్రరాజ్య' స్థాపన గురించి అడిగిన ప్రశ్నకు సమాధానంగా "సినీమా ఒక గొప్ప ఆయుధమని రాజకీయ పార్టీలు గుర్తించలేదు, కానీ తమిళనాడు లో గుర్తించాయి. ... తెలుగు సినిమా రంగంలో చాలా మంది కాముకులేగాని అభ్యుదయ కాముకులు కాదు. అందుచేత

ఈ ఊబిలోంచి బైటపడాలని కొన్నాళ్ళుగా అనుకుంటున్నాను"[197] అని సినీరంగ స్థితిని తెలిపాడు. సినిమాల ద్వారా ప్రజల్ని బాగు చెయ్యెచ్చని చెబుతూ ఈ సెన్సార్ విధానం, హింస, యువతను ఉద్రేకపరిచే సెక్స్ మొదలైనవి పోవాలన్నాడు. మంచి చిత్రాలు రావడానికి ఫిలిం సొసైటీలు పూనుకోవాలంటూ,[198] తెలుగు చలన చిత్రాలు 'తెలుగుదనం' ఉండేలా తీయాలని చాలా సార్లు సలహాలిచ్చాడు.

**స్వవిషయాలు**

ప్రశ్న జవాబులు, ఇంటర్వ్యూల ద్వారా సాహిత్య, రాజకీయ, సినీమా మొదలైన వాటిపై శ్రీశ్రీ వ్యక్తీకరించిన భావాలతోపాటు స్వవిషయాలపై అడిగిన ప్రశ్నలలో కొన్ని శ్రీశ్రీ రచనలు, అతనిపై ప్రభావం చూపిన పుస్తకాలు, రచయితలు అతను భవిష్యత్తులో రాయబోయే రచనలపై కూడా అడిగినవి ఉన్నాయి. తన కవిత్వ రచన గురించి అడిగిన ఓ ప్రశ్నకు సమాధానంగా "నేను కవిత్వం చెప్పడం ప్రారంభించినప్పుడు అది డబ్బు సంపాదించటానికి వీల్లేని వ్యవహారమే. నాకు కలిగిన ప్రేరణ పూర్తిగా ఈస్థటిక్" అని తను కవిత్వం వ్రాయనారంభించిన రోజుల్లోని తన ఆలోచనాధోరణి తెలిపాడు. ప్రస్తుతం తను కవిత్వం మార్క్సిస్టు సిద్ధాంత దృక్పథంతో రాస్తున్నట్లు వివరించాడు.[199] సాహిత్యంలో తన స్థానం గురించి చెబుతూ "నాతో సాటి వచ్చే వాళ్ళెవరూలేరు. నాసాటి నేనే, నన్ను తలదన్నే వాళ్ళెందరో వున్నారు. నా కాలిగోటిని పోలని వాళ్ళూ వున్నారు. నాతో సమానులు మాత్రం సమకాలంలోనే కాదు, ఏకాలంలోనూ ఎవరూలేరు"[200] అని చెప్పుకోవడంలో గర్వమూ, ఆత్మ న్యూనతా రెండూ కన్పించవు. ఎప్పుడూ ఒక వ్యక్తిని పోలినట్లు మరొకరు ఎలా ఉండరో ఒక కవిని పోలిన కవీ ఉండడని చెప్పడమే శ్రీశ్రీ ఉద్దేశంగా ఊహించవచ్చు.

తన గురించేగాక తన రచనలు 'మహాప్రస్థానం', 'ఖడ్గసృష్టి', 'మరో ప్రస్థానం' కావ్యాలపైనా; 'జయభేరి', 'ఐ', 'దేశ చరిత్రలు', 'ప్రతిజ్ఞ', 'కవితా! ఓ కవితా!' 'సుప్తాస్థికలు' 'శరచ్చంద్రిక' మొదలైన కవితలపై; 'చరమరాత్రి', 'విదూషకుడి ఆత్మహత్య' వంటి వచన రచనలపై అడిగిన ప్రశ్నలకూ సమాధానాలిచ్చాడు

ఇంతేగాక తనను ప్రభావితం చేసిన మనుచరిత్ర, వసుచరిత్ర, గురజాడ సమస్త రచనలు, యులిసిస్ (జె.జె.), లెనిన్ (మయకొవ్‌స్కీ కావ్యం) ఇత్యాది పుస్తకాలతోపాటు తనపై ప్రభావం చూపిన కవులుగా విశ్వనాథ, కృష్ణ శాస్త్రి, నజ్రుల్ ఇస్లాం, హరీంద్రనాథ్, స్విన్‌బర్న్, పో, మొదలైన వారి పేర్లనూ, ఉదహరించాడు శ్రీశ్రీ.

భవిష్యత్తులో రాయబోయే రచనల గురించి శ్రీశ్రీని దాదాపు ప్రతీ ఇంటర్వ్యూలోనూ అడిగారు. వాటికి సమాధానంగా 'సామ్యవాద మహాభారతం' (ఫిలిం స్క్రిప్ట్ లాంటి నవల), 'బెండయ్య

గారి గది' (అనే మూడంకాల నాటకం, సుమారు మూడు గంటల ప్రదర్శనాకాలం), 'తిక్కన మీద స్క్రీన్‌ప్లే , 'సాహిత్యం-సామ్యవాదం' (విమర్శగ్రంథం), 'ఏదినేరం-ఏది శిక్ష' (వంద గీతాల్లో రకరకాల Pen-portraits), 'ఆకలి మంటలు' (నవలని ఫిల్ము స్క్రిప్టుగా), 'కన్యాశుల్కం' (తప్పులు లేకుండా డెఫినిటివ్ ఎడిషన్‌గా), 'కన్యాశుల్కం' (సినిమా స్క్రిప్టుగా), 'హంసతో ఆరు నెలలు' (నవలిక), 'శ్రీశ్రీ రామాయణం' ("ఇది చదివితే వేరే రామాయణాలేవీ చదవనక్కరలేదు అని చెప్పి, ఆ కథను సంక్షిప్తంగా చెప్పడం జరిగింది"), రచనలుగా తన కలం నుండి వెలువడనున్నట్లు శ్రీశ్రీ చెప్పాడే కానీ అవిరాయకముందే కన్నుమూశాడు. ఇలా పత్రికల్లో నిర్వహించిన 'ప్ర /జ' శీర్షికలో, ఇంటర్వ్యూలలో సాహిత్యం, రాజకీయాలు మొదలైనవెన్నో విషయాలు వ్యక్తీకరించాడు.

శ్రీశ్రీ లో ప్రధానంగా కనిపించేది చమత్కారం, విచిత్రత. "కవికీ కష్టజీవికీ గల సంబంధం ఎలాంటిది ?' అన్న ప్రశ్నకు కష్టజీవికి రెండు వైపులా నిలిచేవాడు కవి"[201] అని సమాధానమిచ్చాడు. ఇందులో 'కష్టజీవి' అన్న పదంలో మొదటి, చివరి అక్షరాలను కలపితే 'కవి' పదం ఏర్పడుతుంది. 'కష్టజీవి'అనే వాడికి (పదానికి) 'కవి' అనేవాడు (పదం) రెండు వైపులా ('కవి' అని అక్షరాలు 'కష్టజీవి' పదంలో మొదలు, చివర చేరితేనే ఏర్పడుతుంది) ఉండేవాడుగా చమత్కార పూరితంగా జవాబిచ్చాడు. "శ్రీనాథ మహాకవికి, శ్రీశ్రీ మహాకవికిని గల తేడా ఏమి ఓ సిరిసిరి మువ్వా ?" అన్న ప్రశ్నకు "శ్రీనాథుని కావ్యాలను శ్రీశ్రీ చదివాడు, ఆనందించాడు. శ్రీశ్రీ కావ్యాలను చదివే అవకాశం శ్రీనాథుడికి లేకపోయింది"[202] అన్నాడు. మరో ప్రశ్న "ఆడవాళ్ళను ఆదిశక్తి అన్నారు మరి ఇందిరాగాంధీని మీరేమంటారు ?" అన్న దానికి జవాబుగా "ఇది వరలో ఆరి తేరిన శక్తి ఇప్పుడు ఆరిపోయిన శక్తి"[203] గా చమత్కారయుతంగా అభివర్ణించాడు. ఇలా 'ప్ర/జ' లో కొన్ని ప్రశ్నలకు విచిత్ర ధోరణిలో సమాధానాలిచ్చినా ప్రధానంగా ప్రతిపాదిత అంశాలు కొన్ని కన్పిస్తాయి. అవి: మానవత్వం, హేతువాదం, ఆర్థిక స్వాతంత్ర్యం, కమ్యూనిజం మొదలైనవి.

# ప్రకటనలు

వివిధ సంఘటనలకు స్పందించి వీలైనంత సంక్షిప్తంగా వ్యాఖ్యాత్మకంగా గానీ, సూచనాత్మకంగా గానీ, హెచ్చరికగా గానీ - ఇలా వివిధ రకాలుగా వ్యక్తీకరించే భావాన్నే 'ప్రకటన' అని చెప్పుకోవచ్చు. ఈ ప్రకటనల్ని సాధారణంగా సంస్థలు గానీ, ప్రఖ్యాత వ్యక్తులు గానీ తెలియచేయటం పరిపాటి. ఎప్పటికప్పుడు దేశంలో జరుగుతున్న పరిస్థితులకనుగుణంగా స్పందిస్తూ తమ అనుభవాల్ని తెల్పిన ప్రముఖ సాహితీ వేత్తల్లో శ్రీశ్రీ ఒకడు. ఇరవైకి పైగా శ్రీశ్రీ ప్రకటనలున్నాయి. ఇవి వివిధ సందర్భాలకు స్పందించి తన అభిప్రాయాన్ని 'ప్రకటన' రూపంలో తెలిపాడు.

శ్రీశ్రీ ప్రకటనల్లో - ఎన్నికలకు సంబంధించినవి రెండు. 1952 లో మద్రాసు శాసన మండలికి 'పట్టభద్రుల నియోజకవర్గం' నుండి పోటీ చేసినప్పుడు 'ప్రజాశక్తి' పత్రికలో ఒక 'ప్రకటన' చేశాడు. అందులో తనను ఎన్నుకుంటే ఆంధ్రరాష్ట్రం, నిరుద్యోగం, విద్యా విజ్ఞానాలు, లలితకళలు మొదలైన వాటి గురించి సర్వ శక్తులు ఒడ్డి కృషి చేస్తానని అందుకు " . . . మీ మొదటి ఓటును లేదా తర్వాత ఓటును నాకొసంగ గలరని సవినయంగా అర్థిస్తున్నాను"[204] అని కోరిన శ్రీశ్రీ యే 1979 లో మరో ప్రకటనలో ఎలక్షన్లలో పాల్గొనవద్దని ప్రజలను కోరాడు.[205]

1975 లో మొదటి ప్రపంచ తెలుగు-మహాసభలు హైదరాబాదులో జరిగాయి. ఈ సభల్ని విశ్వనాథతో పాటు శ్రీశ్రీ కూడా వ్యతిరేకించాడు. విశ్వనాథ ఒక ప్రకటనలో "ప్రపంచ తెలుగు మహాసభల విషయంలో నేనూ శ్రీశ్రీ ఏకాభిప్రాయాన్ని ప్రకటిస్తున్నాం . . . ఈ సభలు నిష్ప్రయోజనములు"[206] అని ప్రకటించి కూడా ఆ సభల్లో పాల్గొన్నాడు. అందువల్ల విశ్వనాథను విమర్శిస్తూ సృజనలో శ్రీశ్రీ తన అభిప్రాయాన్ని ప్రకటించాడు. అదే ప్రకటనలో "సత్యాన్ని హత్య చేసిన నా ప్రజాకవి పాణిగ్రాహిని చంపేసిన, నా చెల్లెలు నిర్మలను నిలువుగా ప్రాణం తీసిన ఈ

ప్రభుత్వపు కసాయి రక్తపు చేతుల్తో నా చెయ్యి కలపలేను. ... అందుకే నేను బూర్జువా భూస్వామ్య సంస్కృతికి కైవారాలు పలుకుతున్న ఈ సభల్ని బహిష్కరిస్తున్నాను"[207] అని ప్రభుత్వ విధానాన్ని తీవ్రంగా గర్హించాడు. ఇందుకు గాను కొందరిని అరెస్టు చేశారు. అందులో శ్రీశ్రీ కూడా ఉన్నాడు. అరెస్టు చేసినందుకు "దోపిడి దొంగల ప్రభుత్వం జరుపుతున్న తెలుగు మహాసభల్ని బహిష్కరించండని బాహాటంగా చాటినందుకు నన్ను అరెస్టు చేశారు. ... రచయితలను కొట్టి జైల్లోకి నెట్టిన ఈ ప్రపంచ తెలుగు మహాసభల్ని – ప్రజావ్యతిరేక పండుగను ఈ పోలీసు స్టేషన్ నుండి ఖండిస్తున్నాను" అని ఆవేదన ప్రకటించాడు. ఇలా ప్రపంచ తెలుగు మహా సభల సందర్భంగా వాటిని నిరసిస్తూ చేసిన ప్రకటనలు శ్రీశ్రీ నిజాయితీని తెలుపుతాయి.

కాటూరు, ఎలమర్రు గ్రామాల్లో కమ్యూనిస్టు యువకుల్ని పట్టుకొచ్చి వాళ్ళ ఒంటిపై ఉన్న గుడ్డలు ఊడదీసి అక్కడి స్త్రీల ముందు, జాతిపిత గాంధీ విగ్రహం చుట్టూ తిప్పారు. ఈ వార్త తెలిసి కొందరు రచయితలు ఒక ప్రకటన ద్వారా పోలీసుల ఈ చర్యను ఖండించారు. ఈ ప్రకటనలో కొడవటిగంటి కుటుంబరావు, తాపీ ధర్మారావు, మల్లాది రామకృష్ణశాస్త్రి, గోపిచంద్, మాధవపెద్ది గోపాల కృష్ణ, ఆరుద్ర, సెట్టి ఈశ్వరరావులతో పాటు శ్రీశ్రీ పేరు కూడా ఉంది. ఇందులో పోలీసుల, ప్రభుత్వ ప్రవర్తనలను విమర్శిస్తూ "ప్రాణహాని కన్నా దుస్సహం మానహాని'[208] అని ప్రకటించాడు.

ఆదిలాబాదు జిల్లాలోని గిన్నెబరి భూస్వామిని హత్య చేశారన్న ఆరోపణపై భూమయ్య, కిష్టాగౌడలను జిల్లా సెషన్స్ కోర్టువేసిన ఉరి శిక్షను హైకోర్టు, సుప్రీంకోర్టులు కూడా ధృవపరిచాయి. దీనికి నిరసనగా చేసిన ప్రకటనలో "ఎన్నో సభ్య రాజ్యాలు నిషేధించిన ఉరి శిక్షను రద్దు చెయ్యకపోవడంతో ఇండియా ఇప్పటికీ పాతరాతి యుగంలోనే జీవిస్తున్నట్టు మరో మారు నిరూపించుకుంది"[209] అని శ్రీశ్రీ తన బాధను వక్తం చేశాడు.

ఇలా ఎప్పటికప్పుడు తన భావాల్ని ప్రకటించే శ్రీశ్రీ ఒకసారి 'అవ్వయార్' అనే సినిమా మంచి చిత్రంగా ప్రకటించాడు. తెలుగులో అధివాస్తవిక రచనలు చేసిన వారిలో ప్రముఖుడు శ్రీశ్రీ. వీరి రచనలకు గాను 'అశాంతి' పేర ఒక పత్రిక వెలువడబోతున్నట్లు శ్రీశ్రీ ఒక 'ప్రకటన' ఇచ్చి, ఆ పత్రికలోని 'రచనలు' గూర్చి చెప్పాడు. ఇలా వివిధ సంఘటనలకు స్పందించి తన అభిప్రాయాలను 'ప్రకటన'ల రూపంలో వ్యక్తం చేసినవి తక్కువే అయినా వాసిలో ఘాటైనవి.

# సందేశాలు

ఒక సంస్థనో, పత్రికనో ఆరంభించిన ప్రత్యేక సందర్భాలలో గానీ, ప్రముఖులు మరణించినప్పుడు గానీ సానుభూతితో వ్యక్తీకరించే భావాల్ని సందేశంగా పేర్కొంటాం.

సాధారణంగా 'సందేశాలు' ప్రముఖ వ్యక్తుల నుండి ఆశించడం పరిపాటి. పత్రికల తొలి సంచికల్లో, ప్రత్యేక సంచికల్లో, సావనీర్‌ల్లో వెలువడినప్పుడు ఆయా సంచికల్లో గొప్ప వారి 'సందేశ' వాక్యాలుండడం చూస్తాం. ఇలా వెలువడిన కొన్నింటికి మహాకవి శ్రీశ్రీ తన సందేశాన్ని అందించాడు. 'ప్రజాశక్తి' పత్రిక కొరకు తెల్పిన సందేశంలో "అబద్ధాల చీకట్ల మీదికి, స్వేచ్ఛ సత్యపు స్వర్ణకాంతులు, ప్రసరించడానికి రా! ప్రపంచాన్ని మార్చడానికి ప్రజాశక్తి! రా!"[210] అని ఆహ్వానించాడు. విశాలాంధ్ర దిన పత్రిక ఆరంభమైనప్పుడు తొలి సంచికకు 'సమసమాజ సంస్థాపన' కొరకు వర్ధిల్లాలని ఆశించాడు. వారం వారం వెలువడే 'జనశక్తి' పత్రిక దిన పత్రికగా మారినప్పుడు "...'జనశక్తి' దిన పత్రికగా, పీడిత జనుల వాణిని ప్రతిధ్వనిస్తూ, ఫ్రెంచి విప్లవం నాటి స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం' అనే నినాదాన్ని నిజం చేయగలదని ఆకాంక్షిస్తున్నాను"[211] అని తన సందేశాన్ని ప్రకటించాడు. ఇలాగే కాంగ్రేస్ పార్టీ నాయకుడు భాట్టం శ్రీరామమూర్తి ఆరంభించిన 'ప్రజారథం' పత్రిక వృద్ధిలోకి రావాలని సందేశంలో పేర్కొన్నాడు. ఉపాధ్యాయులకు సంబంధించిన పత్రిక 'ఉపాధ్యాయ' కు తన సందేశంలో "...'ఉపాధ్యాయ' ను అక్షరాలనే ఆయుధాలుగా చేసుకొని ఈ వ్యవస్థను నిర్మూలించే పోరాట యంత్రంగా రూపొందించాలి"[212] అని సలహానిచ్చాడు. 'సృజన' పత్రిక నూరవ సంచికను "... విరసం ఆవిర్భవించినప్పటి నుంచీ 'సృజన' విప్లవ సాహిత్యానికి అనధికార వేదికగా నిలిచింది. ఇక ముందు కూడా 'విరసం' ఆశయాలకు 'సృజన' ఒక ప్రముఖమైన ప్రసార కేంద్రంగా పని చేస్తుందని నా దృఢ విశ్వాసం"[213] అని ఆశించాడు. ఈవిధంగా వివిధ పత్రికలకు ఇచ్చిన సందేశాలు శ్రీశ్రీలోని ఆత్మ విశ్వాసాన్ని తెలుపుతాయి.

కొత్త సంస్థల ప్రారంభమప్పుడో లేక సంస్థలు నిర్వహించే సమావేశాలకు సందేశాలు పంపడం ఆచారం. జానమద్ది హనుమచ్ఛాస్త్రి కార్యదర్శిగా ఉన్న 'కడప జిల్లా రచయితల సంఘా'నికి తెల్పిన సందేశంలో "... మీ కేదైనా సందేశం ఇవ్వగలనా అని నా సందేహం"[214] అని అంటూ ప్రజాభ్యుదయ రచనలే చేయాలని తన సందేశంలో కోరాడు. ఇదే విధంగా కాకినాడలో జరిగిన అరసం సభలకూ 'సందేశాన్ని'చ్చాడు.

ఇలా పత్రికలకు సంస్థలకే గాక ప్రముఖ వ్యక్తులు మరణించినప్పుడు కూడా శ్రీశ్రీ సంతాప సందేశాలిచ్చాడు. అఖిల భారత కమ్యూనిస్టు పార్టీకి 1951-62 మధ్య కార్యదర్శిగా ఉన్న అజయ్ కుమార్ ఘోష్ మరణించినప్పుడు ఇది మానవజాతికి సంబంధించిన నష్టం"[215] గా అభివర్ణించాడు. ఆ తరువాత ప్రముఖ తెలుగు కథా రచయిత కొడవటిగంటి కుటుంబరావు మరణించినప్పుడు "... తెలుగు కథానికా వనంలో మహా వటవృక్షం కొడవటిగంటి కుటుంబరావు. ఆ చెట్టు కూడా ఇప్పుడు నేల వాలింది"[216] అని అతని రచనల్లోని ప్రత్యేకతను తన సంతాప సందేశంలో పేర్కొన్నాడు. దిగంబర కవుల్లో ఒకడు, విరసం వ్యవస్థాపక కార్యవర్గ సభ్యుడేగాక 1971-72 మధ్య కార్యదర్శిగా కూడా ఉన్న 'చెరబండరాజు' మరణించినప్పుడు అరుణతార, ఎక్స్‌రే పత్రికల్లో శ్రీశ్రీ సంతాప సందేశాలు వెలుబుచ్చాడు. 'అరుణతార'లో "... The king is dead ; Long live the king రాజు అనే పేరు కొత్త అర్థంలో స్ఫురించింది. మన రాజు (చెరబండ రాజు) చిరంజీవి"[217] అనీ, 'ఎక్స్‌రే'లో "చెరబండరాజు ప్రకృతి సహజంగా కాలధర్మం చెందలేదు. ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం అనే పిచ్చికుక్క కరచి చచ్చిపోయాడు కాని అతని సాహిత్య సృష్టి మాత్రం అజరామరం. అతని స్మృతికి ఇదే నా విప్లవాంజలి"[218] అని చెరబండరాజును 'రాజు'గా అతని మరణానికి ప్రభుత్వమే కారణంగా పేర్కొన్నాడు శ్రీశ్రీ.

ఇలా సాహితీ మూర్తులు మరణించినప్పుడు తన ఆవేదనను సంతాప సందేశాల రూపంగానూ, పత్రికలూ ఆయా సంస్థల ఆరంభాల్లో అభివృద్ధినీ, ఆశ, ఆకాంక్షలను సందేశాలతోనూ ఆశీర్వదించిన శ్రీశ్రీ, 'కథా రహిత సాహిత్యం' లో తాను చేపట్టిన ప్రతీ ప్రక్రియలోనూ తనదైన ఒక ప్రత్యేక ముద్రను సాధించాడు.

నాలుగో అధ్యాయం

# స్వీయాత్మక సాహిత్యం

"నాతో సాటి వచ్చేవాళ్ళెవరూ లేరు. నా సాటి నేనే. నన్ను తలదన్నే వాళ్ళెందరో వున్నారు. నా కాలిగోటిని పోలని వాళ్ళూ వున్నారు. నాతో సమానులు మాత్రం సమకాలంలోనే కాదు, ఏకాలంలోనూ ఎవరూ లేరు."

- శ్రీశ్రీ
(ప్రజ. పుట - 314)

# స్వీయాత్మక సాహిత్యం

స్వకపోల కల్పనలతో కాకుండా, తమ జీవిత సంఘటనలను యథాతథంగా తెలిపే స్వీయ చరిత్ర, లేఖలు, డైరీలు వంటివి సాహిత్య ప్రక్రియలుగా చెప్పుకుంటున్నా, తెలుగు సాహిత్యంలో వీటికి ఇప్పటికీ సరైన ఆదరణ లేదు. వీటన్నిటిని ఏక సూత్రీకరణచేసి చెప్పడానికి 'బ్రిటానికా'లో 'Personal Literature' అనే ఒక విభాగం ఏర్పాటు చేశారు. ఐతే తెలుగులో 'వ్యక్తిగత సాహిత్యం' గానో, 'స్వీయ చరిత్రాత్మక సాహిత్యం' గానో, 'స్వీయాత్మక సాహిత్యం' గానో, ఇవిగాక ఇంకేదైనా పేరుతోగానీ ఇంకా స్థిరపడలేదు. కాబట్టి ఈ విభాగానికి పేరు పెట్టడంలో కొన్ని చిక్కులున్నప్పటికీ, 'వ్యక్తిగత సాహిత్యం' అంటే ఒక వ్యక్తి, వ్యక్తి గత అంశాలే గాక అతని సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, ఆచార, వ్యవహారాలకు సంబంధించిన క్రియలు, ప్రతిక్రియలూ, స్థాయీ భేదాలు, అనుభవాలు, ప్రతిస్పందనలు మానవ సంబంధాలు మున్నగు అంశాల పై వ్యక్తంచేసిన అభిప్రాయాలను వ్యక్తిగత సాహిత్యం పరిధిలోకి గ్రహించే వీలుంది. ఈ వ్యక్తిగత సాహిత్యాన్ని 'స్వీయాత్మక సాహిత్యం'గా చెప్పుకోవచ్చు. ఈ విభాగంలో వచ్చే ప్రక్రియల్లో లేఖలు మినహా స్వీయ చరిత్రలు, యాత్రా చరిత్రలు పాశ్చాత్య ప్రభావంతోనే తెలుగు సాహిత్యంలోకి ప్రవేశించాయి. తెలుగులో 'స్వీయాత్మక సాహిత్య' ప్రక్రియలను కందుకూరి వీరేశలింగం, ఏనుగుల వీరాస్వామి, గురజాడ అప్పారావు, కోలా శేషాచలకవి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీశ్రీ, సంజీవదేవ్ వంటి వారెందరో కవి, పండితులు తమ రచనలతో సుసంపన్నం గావించారు.

"1930 దాకా తెలుగు సాహిత్యం నన్ను నడిపింది. ఆ తర్వాత నుంచీ దాన్ని నేను నడిపిస్తున్నాను. అప్పటి నుంచీ తెలుగు సాహిత్య చరిత్ర శ్రీశ్రీ స్వీయ చరిత్ర"[1] గా ఇరవయ్యో శతాబ్దం మూడవ దశకం నుంచి తెలుగులోని దాదాపు అన్ని సాహిత్యోద్యమాలతో కలసి నడిచిన శ్రీశ్రీ రాసిన స్వీయ చరిత్ర, యాత్రా చరిత్ర, లేఖలను ప్రస్తుతం పరిశీలిస్తాను.

# స్వీయ చరిత్ర

తెలుగులో 'స్వీయ చరిత్ర' గూర్చి "... 1903 వ సంవత్సరమునందు స్వీయ చరిత్రమును వ్రాయనారంభించి"[2] అని కందుకూరి వీరేశలింగంగారు చెప్పుకున్న దాన్ని బట్టి ఇప్పటికి ఈ ప్రక్రియ ఆరంభమై తొంభై నాలుగు సంవత్సరాలవుతున్నది. అయినా తెలుగు సాహిత్య చరిత్ర కర్తలు, సాహిత్య చరిత్రలో ప్రత్యేక ప్రక్రియగా 'స్వీయ చరిత్ర' ను గుర్తించలేదు. అయితే దివాకర్ల వేంకటావధాని రాసిన 'ఆంధ్రవాఙ్మయచరిత్ర' పదవ ముద్రణలో మాత్రమే స్వీయ చరిత్రని ప్రత్యేక విభాగంగా పేర్కొనడం జరిగింది. ఖండవల్లి లక్ష్మీరంజనం, పింగళి లక్ష్మీకాంతం వంటి వారు ఆధునిక సాహిత్యంపై 'సాహిత్య చరిత్ర' రాయనందువల్ల వారి పరిధిలోకి రాలేదు. ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము (కే. వేంకట నారాయణరావు, 1967), తెలుగు వాఙ్మయము సంగ్రహ చరిత్ర (సంకలనకర్త: కూర్మా వేణుగోపాలస్వామి, 1960), తెలుగు సాహిత్య సమీక్ష (జి. నాగయ్య, 1985) మొదలైన సాహిత్య చరిత్ర గ్రంథాల్లో ఆధునిక గద్య సాహిత్యం పేర్కొనడం జరిగింది. కానీ 'స్వీయ చరిత్ర' ను ఒక ప్రక్రియగా గుర్తించి స్థానం కల్పించలేదు. కానీ వీరేశలింగం రచనలను తెలిపే సందర్భంలో ఆయన 'స్వీయ చరిత్ర' ను గురించి వివరించారు. కేవలం వచన రచనలను మాత్రమే పేర్కొనే పుస్తకాల్లో 'ఆంధ్ర వచన వాఙ్మయము' ఒకటి. ఇందులో అంతగా ప్రాముఖ్యాన్ని సంతరించుకోని యాత్రా చరిత్ర, లేఖా రచనలను ప్రత్యేక ప్రక్రియగా పేర్కొనడం జరిగిందేగాని, 'స్వీయ చరిత్ర' ను మాత్రం ఒక ప్రక్రియగా సూచించక కేవలం వీరేశలింగం రచనల్లో ఒకటిగానే తెలిపారు. 'ఆంధ్ర వచన రచనా పరిణామము' లో గొబ్బూరి వేంకటానందరాఘవరావు జీవిత చరిత్రల్లో ఒక భాగంగా స్వీయ చరిత్రలను చెప్పాడు.[3] ఈ విధంగా 'సాహిత్య చరిత్ర' పుస్తకాల్లో నామ మాత్రంగా పేర్కొనడాన్ని బట్టి 'స్వీయ చరిత్ర' కు ప్రక్రియగా ఇప్పటికీ సరైన గుర్తింపు రాలేదనే చెప్పవచ్చు. అందువల్లే "... తెలుగులో స్వీయ చరిత్రలు తక్కువే. సంఖ్యా విషయకంగా చూస్తే

వచన సాహిత్య ప్రక్రియలన్నింటిలోకీ రచయితల ఆదరాన్ని తక్కువగా నోచుకున్న ప్రక్రియ ఇదే"[4] అని కోడూరి శ్రీరామమూర్తి చెప్పిన విషయంలో వాస్తవం గ్రహించవచ్చు.

తెలుగులోనే గాక భారతీయ భాషల్లో కూడా 'స్వీయ చరిత్ర' ప్రక్రియకి ఆదరణ తక్కువగానే ఉన్నది. అయినా పాఠకులకు మాత్రం దీని ప్రాధాన్యం తెలుసు. ఈ ప్రక్రియ పాశ్చాత్య భాషా సాహిత్యాల ప్రభావంతోనే భారతీయ భాషల్లోకి ప్రవేశించింది.[5] అదేవిధంగా తెలుగులో కూడా ఈ ప్రక్రియ ఇంగ్లీషు సాహిత్య ప్రభావంతోనే ఆరంభమైంది.[6] అంతే గాక తెలుగు వారి నుండి వెలువడిన మొట్ట మొదటి 'స్వీయ చరిత్ర' ఇంగ్లీషులో వెన్నెలకంటి సుబ్బారావు 'The Life of Vennela Cunty Soob Row' (1873) గా రాశాడు. ఆ తరువాత, తెలుగులోకి ఎన్నో వచన ప్రక్రియల్ని ప్రవేశపెట్టిన కందుకూరి వీరేశలింగం తన జీవిత చరిత్రను 'స్వీయ చరిత్ర' (1911) గా తెలుగులో రాశాడు. వెన్నెలకంటి, కందుకూరి వీరిద్దరి స్వీయ చరిత్రలలో తెలుగులో రాసిన కందుకూరి 'స్వీయ చరిత్ర' నే మొట్టమొదటి స్వీయ చరిత్రగా కందుకూరితో పాటు[7] ఇతర సాహితీవేత్తలు కూడా పేర్కొన్నారు.[8] ఎందుకంటే వెన్నెలకంటి రాసింది మొదటిదైనప్పటికీ ఇంగ్లీషులో ఉంది. అందువల్లే తెలుగులో ఉన్న వీరేశలింగం 'స్వీయ చరిత్ర' నే మొట్టమొదటిదిగా గుర్తించవలసివస్తుంది.

తెలుగులో ఆరంభమైన 'స్వీయ చరిత్ర' ప్రక్రియకు ఇంగ్లీషులో 'Autobiography' పదం సమానార్థకంగా ఉంది. ఈ పదానికి బ్రౌణ్య ఇంగ్లీషు తెలుగు నిఘంటువు "స్వ చరిత్ర, స్వ చరిత్రను తానే వ్రాసికొను"[9] అని ఒక పదంతోపాటు అర్థాన్నీ వివరించింది. 'స్వీయ చరిత్ర' పదం విస్తృతమైన శ్రీ. సూర్యరాయాంధ్ర నిఘంటువులోకే ఎక్కలేదు. గొబ్బూరి వేంకటానంద రాఘవరావు "స్వీయ చరిత్రలు ఎవరి జీవ చరిత్రలు వారే వ్రాసికొను ఆత్మకథలు"[10] గా చెప్పాడు. 'తెలుగులో స్వీయ చరిత్రలు' పుస్తకంలో "తాను స్వయంగా తన జీవిత గాథను చెప్పటమని ఈ ప్రక్రియకు అర్థం"[11] గా అక్కిరాజు రమాపతిరావు నిర్వచించాడు. 'The New Book of Knowledge' లో ". . An autobiography is the story of a person's life written by himself"[12] గా పేర్కొనడం జరిగింది. మొత్తం మీద ఈ ప్రక్రియకు తమ తమ జీవిత చరిత్రలను స్వయంగా తామే లిఖిత రూపంగా వ్యక్త పరిస్తే దాన్ని 'స్వీయ చరిత్ర' గా పేర్కొనవచ్చు. ఈ ప్రక్రియకు స్వీయ చరిత్ర, ఆత్మచరిత్ర, స్వీయాత్మక చరిత్ర, ఆత్మకథ, గతస్మృతి, స్వచరిత్ర, స్వకీయ చరిత్ర, అనుభవాలూ, జ్ఞాపకాలు మొదలైన పదాలు వాడకంలో ఉన్నాయి. వీటన్నింటిలో 'స్వీయ చరిత్ర'నే అధిక ప్రచారంలో ఉంది. ఈ స్వీయ చరిత్ర రచనకు ఆయా వ్యక్తుల సాహిత్య రచనలతో పాటు, డైరీలు, లేఖలు, యాత్రా చరిత్రలు మొదలైనవి ఉపకరిస్తాయి.

మనుష్య జీవితం సమాజం నుండే రూపొందుతుంది. కాబట్టి సమాజంలోని రాజకీయ, ఆర్థిక ఇత్యాది అంశాలన్నీ 'స్వీయ చరిత్ర'ల్లో అనివార్యంగా చోటు చేసుకుంటాయి. స్వీయ చరిత్రలు

రాసినవారు ఏరంగానికి చెందిన వారైతే ఆ రంగానికి సంబంధించిన అంశాలే ఎక్కుగా ఉంటాయి. వీరేశలింగం 'స్వీయ చరిత్ర' ను 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' గా అభివర్ణించాడు చిలకమర్తి లక్ష్మీనరసింహం.[13] ఉప్పల లక్ష్మణరావు స్వీయ చరిత్ర 'బతుకు' పుస్తకం " . . . ద్వారా యీ శతాబ్దంలో ఆర్థిక, రాజకీయ, భావ విప్లవాలు తెలుగు దేశాన్ని ఏ మేరకు ప్రభావితం చేశాయో తెలుస్తుంది."[14] ఇలా వ్యక్తి తను ఓ రంగంలో రాణించిన విధం, తోడ్పడిన వ్యక్తులు, సంఘటనలూ పేర్కొనడం జరుగుతుంది. సమాజంలోని అంశాలు స్వానుభవంగా స్వీయచరిత్రలో ఉంటాయి. కాబట్టి, వీటివల్ల సమాజంలోని వివిధ రంగాల విషయాలూ వెల్లడవుతాయి.

స్వీయ చరిత్రలు చాలా మంది వచనంలోనే రాశారు. కాని మండపాక పార్వతీశ్వరకవి, తిరుపతి వేంకటకవులు, జాషువా, ఆత్రేయ వంటివారు స్వీయ చరిత్రల్ని పద్యాలలో రచించారు. చాలా మంది రచయితలు మాత్రం వచనంలోనే రాయడంవల్ల ' స్వీయ చరిత్ర' వచన ప్రక్రియగానే ప్రసిద్ధి పొందింది.

తెలుగులో స్వీయ చరిత్రలు రాసిన వారిలో కందుకూరితోపాటు చిలకమర్తి లక్ష్మీనరసింహం, టంగుటూరి ప్రకాశం పంతులు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, తాపీ ధర్మారావు, ఎన్.జి. రంగా, శ్రీశ్రీ మొదలైన వారెందరో ఉన్నారు. వీరిలో శ్రీశ్రీ స్వీయ చరిత్ర 'అనంతం' యొక్క విశిష్టత ఏమిటో వివరించడం జరుగుతుంది.

తెలుగులో వెలువడిన ఇతర 'స్వీయ చరిత్ర'ల కన్నా శ్రీశ్రీ రాసిన 'అనంతం' ఎంతో ప్రత్యేకమైంది. 1945 నుండి ఆనందవాణి పత్రికలో 'అనంతం' రచన ప్రారంభమైంది. ఆ తరువాత 'కథావీధి', 'ప్రజాతంత్ర', 'స్వాతి' పత్రికల ద్వారా 1980 వరకు వెలువడింది. దాదాపు 35 సంవత్సరాలుగా సాగిన రచన ఇది. ఇందులో ప్రముఖంగా కనిపించే అంశాలు 1). అనంతం ఆవశ్యకత, 2). వ్యక్తులు, 3). స్త్రీ, 4). రచనలు, 5). సినిమాలు, 6). నాస్తికత్వం, 7). ఇతరాలుగా విభజించి వివరిస్తాను.

**అనంతం ఆవశ్యకత**

'అనంతం' ఎందుకు రాస్తున్నట్టో, ఎలా రాస్తున్నట్టో శ్రీశ్రీ పలుమార్లు, పలు రకాలుగా వివరించాడు. 'అనంతం' ను 'ఆత్మచరిత్రాత్మ చరిత్రాత్మక నవల' గా పేర్కొన్న విషయాన్ని బట్టి ఆత్మచరిత్రను చరిత్రాత్మకంగా వివరిస్తాడని భావించవచ్చు. ఇందులో 'నవల' పదాన్ని వాడటంవల్ల కల్పిత కథగా భావించే అవకాశం ఉంది. అందుకే దీన్ని నవల్లో ఉన్నట్టు అభూత కల్పనలు గాకుండా తన జీవితంలో జరిగిన సంఘటల్ని యథాతథంగా వివరించాలని, తను తిట్టదలచుకున్న వారిని యథేచ్ఛగా తిట్టడం కొరకే 'నవల' గా పేర్కొంటున్నట్టు వివరించాడు.[15] "నా ప్రతి రచనా నా

ఆత్మకథే"[16] అని బోయి భీమన్న అన్నట్టుగానే కొందరు రచయితలు రాసిన నవలలు వారి జీవిత చరిత్రలుగానే భాసిస్తాయి. అలాంటి వారిలో శ్రీశ్రీకి బాగా నచ్చిన, శ్రీశ్రీ రచనలపై ఎంతో ప్రభావం చూపిన వాడు జేమ్స్ జాయిస్. ఈయన రాసిన నవల 'ప్రొట్రేయిట్ ఆఫ్ ది ఆర్టిస్ట్ ఆజ్ ఎ యంగ్ మ్యాన్' అనేది ఆయన స్వీయచరిత్ర వంటిదే.[17]

నవలగా రాస్తున్న తన ఆత్మ కథను ఉబుసుపోకకు రాయలేదనీ, దీన్ని కళాకారుడిగా గాక, సైంటిస్టులాగా తన జీవిత వాస్తవికతను తెలుపడంకోసమే రచిస్తున్నట్లు చెప్పి, ఇలా రాయడంవల్ల తనపై ఇతరులు పెంచుకొన్న ఇమేజ్ తగ్గి పోయే అవకాశం ఉందనీ, తగ్గినా ఫరవాలేదని[18], ఈ రచన కేవలం సత్యాన్వేషణ కొరకే రాస్తున్నానని అన్నాడు.[19] ఇలా చెప్పుకోవడం చూస్తే, సత్య సందర్శనార్థం రాసిన మహాత్మాగాంధీ స్వీయ చరిత్ర 'సత్యన ప్రయోగా' (My Experiments With Truth) జ్ఞాపకం వస్తుంది.

ఈ 'అనంతం' రచనతో సమాజాన్ని మరమ్మత్తు చేయగలననే భ్రమలు తనకు లేవని సూచిస్తూనే[20] 'అనంతాన్ని' పెట్టుబడిదారీ విధానపు పరువు తీయడమే లక్ష్యంగా రాస్తున్నట్టు పేర్కొన్నాడు[21]. తన బ్రతుకుతో ఎందరో బ్రతుకులు కలిసి ఉన్నాయని, అందువల్ల తన జీవితంతోపాటు ఇతరుల జీవితంపై కూడా ఈ రచన సవిమర్శక వ్యాఖ్యానంగా భావించాడు.[22] ఈ విధంగా తను రాస్తున్న 'అనంతం' అవసరాన్ని విశదీకరించిన శ్రీశ్రీ సాహితీ వ్యక్తిత్వాన్ని అంచనా వేయటానికి ప్రయత్నిస్తాను.

**వ్యక్తిత్వం**

-'స్వీయ చరిత్ర' వల్ల ప్రధానంగా తెలిసేది రచయిత మనస్తత్వం, ఆలోచనా విధానం. వీటివల్ల ఆ వ్యక్తి వ్యక్తిత్వం (Personality) ఎలాంటిదో ఊహించే అవకాశం ఏర్పడుతుంది. 'అనంతం' చదివితే కవిత్వంపై ఆయన దృష్టి, రాజకీయాలపై ఆలోచనా ధోరణి, జీవితంపట్ల అవగాహన మొదలైనవి శ్రీశ్రీలో ఎలా ఉన్నాయో తెలుస్తాయి.

'అనంతం' లో తన మనస్తత్వంతో తన తండ్రి మనస్తత్వాన్ని పోల్చుతూ "గెలిచినప్పుడు గెలుస్తాం, ఓడిపోయినప్పుడు ఓడిపోతాం' అనేది మా నాన్న మనస్తత్వం. 'గెలవడానికి ఆడాలి, ఓటమిని అంగీకరించకూడదు' అనేది నా మనస్తత్వం"[23] అని చెప్పి, జీవితాన్ని ఒక స్పోర్ట్‌గా ఛాలెంజ్‌గా తీసుకుంటానన్నాడు. తనను తిడితే కుంగిపోవడం, పొగిడితే పొంగిపోయే తీరు మనిషిని కానని చెప్పాడు.[24] దీన్నిబట్టి చూస్తే "రానీ, రానీ, రానీ కష్టాల్, నష్టాల్, కోపాల్, తాపాల్" అన్నంత ధీమాగా ఉంటాడు శ్రీశ్రీ. కొందరు ఒంటరిగా నడవడానికే ఇష్టపడతారు. అలాంటి మనస్తత్వం శ్రీశ్రీలోనూ ఉంది.[25] తనలో ఉత్తరాలను రాసే గుణం గురించి చెబుతూ "నేను

ఉత్తరాలు రాస్తే అదే పనిగా రాస్తుంటాను. లేకపోతే అసలే రాయను. ... అందిన వెంటనే రాశానా సరి! లేక, రేపు రాయొచ్చునులే అనుకుంటే మరి రాయడమే ఉండదు"[26] అని తన బద్ధకాన్ని నిస్సంకోచంగా చెప్పుకున్నాడు. 1975 లో మొట్టమొదటి ప్రపంచ తెలుగు మహాసభలు జరిగాయి. అప్పుడు శ్రీశ్రీ 'విరసం' అధ్యక్షుడు. ఆ సభల్లో విరసం పాల్గొనాలనీ, ఆ సభలకు నిరసన తెలుపవద్దని తన వ్యక్తి గత అభిప్రాయాన్ని విరసానికి తెలిపాడు. కానీ శ్రీశ్రీ ఉద్దేశానికి భిన్నంగా సభలను బహిష్కరించాలని విరసం కార్యవర్గ సభ్యులు నిర్ణయించడంతో మెజారిటి నిర్ణయానికి అనుకూలంగా ప్రవర్తించాడు శ్రీశ్రీ. ఈ విషయమై విశ్వనాథకూ లేఖ రాశాడు. విశ్వనాథ, శ్రీశ్రీలు కలసి ప్రపంచ తెలుగు మహాసభల్ని బహిష్కరిస్తున్నట్లు ప్రకటించడమూ జరిగింది. చివరికి ఈ విషయమై శ్రీశ్రీ అరెస్టు కూడా అయ్యాడు. సభల్ని వ్యతిరేకించాలనేది శ్రీశ్రీ వ్యక్తి గత అభిప్రాయం కాదని అది విరసం నిర్ణయంగా శ్రీశ్రీ 'స్వీయ చరిత్ర' వల్ల తెలుస్తుంది.

విరసం రాజకీయాలకు అతిగా ప్రాధాన్యం ఇవ్వడంవల్ల, సాహిత్య కర్తవ్యాలను విస్మరించినందుకు ఇప్పటి వరకు అఖిల భారత విప్లవ రచయితల సంఘం ఆవిర్భవించలేక పోయిందని తను అధ్యక్షుడుగా వుంటూ విరసం చర్యల్నీ విమర్శించాడు.[27]

**వ్యక్తులు**

సాధారణంగా స్వీయ చరిత్ర కారులు అక్కడక్కడ తమకు పరిచయమున్న ప్రముఖ వ్యక్తుల ప్రస్తావన తెస్తారు. ఇది శ్రీశ్రీ స్వీయ చరిత్రలోనూ చూస్తాం. శ్రీశ్రీ సాహిత్య రంగానికి సంబంధించిన వాడు కావడంవల్ల సాహితీవేత్తలతో తనకు కలిగిన పరిచయాన్ని అనంతంలో తెలిపాడు. వారిలో కొంపెల్ల జనార్దనరావు, తన గురువులు, తన తండ్రి, అబ్బూరి రామకృష్ణారావు, విశ్వనాథ మొదలైన వారెందరో ఉన్నారు.

శ్రీశ్రీకి విశ్వనాథతో వ్యక్తిగత పరిచయం మొట్టమొదటిసారి కాటూరి నరసింగరావు యింటిలో జరిగినట్లు తెలుస్తుంది.[28] 1928 లో కృష్ణ శాస్త్రితోనూ,[29]బసవరాజు, నండూరి, వేటూరి ప్రభాకర శాస్త్రి, ముద్దుకృష్ణ, విశ్వేశ్వరరావు మున్నగు వారితో మల్లంపల్లి సోమశేఖరశర్మ గారింట్లో పరిచయం జరిగింది.[30] పఠాభితో, కాళీపట్నం రామారావుతో కలిగిన ప్రథమ పరిచయాన్నీ చెప్పిన శ్రీశ్రీ, కొంపెల్ల జనార్దనరావు, అబ్బూరి రామకృష్ణారావు, రుక్మిణీనాథశాస్త్రి, నారాయణబాబు, రోణంకి అప్పల స్వామి, హరీంద్రనాథ చటోపాధ్యాయ, తాపీధర్మారావు లాంటి రచయితల నెందరినో సందర్భాను సారంగా తనకెట్లా పరిచయమయ్యారో తెలిపాడు.

## వివిధ రచనల గురించి

'అనంతం'లో వివిధ రచనలపై విమర్శ కూడా కనిపిస్తుంది. ఈ విమర్శకు గురైన వాటిలో తనవి, ఇతరులవి వున్నాయి. అయినా తన రచనలపై చేసుకున్న విమర్శే ఎక్కువ. కవిత్వంలో తను చేసిన ప్రయోగాలు 'కవిత్వ ఆరంభం' అని ప్రత్యేక అధ్యాయంలో పేర్కొన్నాడు. వీటిలో 1930-50 ల మధ్య తను రాసిన కవితా ఖండికలపై ఇతర రచనల ప్రభావం ఉన్నట్లు చెప్పుకున్న శ్రీశ్రీ తనకు ఎక్కువ పేరు తెచ్చిన 'మహాప్రస్థానం' కావ్యంలోని ఖండికల్ని సోదాహరణంగా విశ్లేషించుకున్నాడు.

'మహా ప్రస్థానం' కావ్యంలోని చాలా కవితల్ని ఒక్కో పూట సృజించినట్లుగా చెప్పుకున్నాడు. ఈ కవితలు ఏ వరసలో ఉండాలో చెబుతూ మొదటి గీతంగా 'మహాప్రస్థానం', చివరి గీతంగా 'జగన్నాథుని రథ చక్రాలు' ఉండాలన్నాడు. ఈ కావ్యం ప్రథమ ముద్రణ 1950 లో జరిగింది. అప్పుడు ప్రూఫులన్ని స్వయంగా కనీసం పదిసార్లు చూసుకున్నా, అందులో ఒకే ఒక్క ముద్రారాక్షసం దొర్లినట్లు ఒప్పుకున్నాడు. కవరు పేజీ అక్షరాల్ని ఆంధ్ర పత్రికాఫీసులో పని చేసే తేజోమూర్తుల కేశవరావు చేత రాయించాడు. ఇలా 1930-40 ల మధ్య ఎక్కువగా రాసిన కవిత్వమే 'మహాప్రస్థానం' కావ్యంగా ఆవిర్భవించింది. ఈ కవితల నేపథ్యం కూడా 'అనంతం' లో చర్చించి, మహాప్రస్థానం గీతాలలో మొట్ట మొదటి గేయం 'జయభేరి' అనీ, జూన్ 1933 లో దీన్ని రాసినట్లు పేర్కొన్నాడు.

'మహాప్రస్థానం' గేయం గురించి చెబుతూ 'మరోప్రపంచం' అని వ్యాసం రాద్దామని కలం తీసుకొని 'మరో ప్రపంచం' అని శీర్షిక రాయగానే పెన్నులో సిరా అయిపోయిందనీ, వెంటనే ఒక పెన్సిలు తీసుకొని రాయనారంభించిన తర్వాత అది గేయంగా ఐదే ఐదు నిముషాల్లో పూర్తయినట్లు చెప్పుకున్నాడు.[31] ఈ కవిత ఆరంభం "మరో ప్రపంచం / మరో ప్రపంచం / మరో ప్రపంచం పిలిచింది" అన్నది "భజగోవిందం / భజగోవిందం / గోవిందం భజ మూఢమతే" అనే దాని ప్రభావంతో రాసినట్లు తెలిపాడు.[32] ఇంకా 'ప్రతిజ్ఞ', 'ఒకరాత్రి', 'కేక', 'ఆకాశదీపం', 'కవితా! ఓ కవితా!', 'బుక్కులు', 'గర్జించు రష్యా' మొదలైన కవితలపై నున్న ప్రభావాలు వాటి తీరును వివరించాడు. 'ఖడ్గ సృష్టి', 'సిరిసిరిమువ్వ శతకం' లోని కొన్ని కవితల నేపథ్యాల్నీ, మాత్రా ఛందస్సు, వృత్తాల ఆవిర్భావాన్ని పేర్కొన్నాడు. ఇలా కవితా రచనల ప్రస్తావనే తప్ప వచన రచనలపై చర్చించనేలేదని చెప్పుకోవచ్చు.

'అనంతం' లో తను చదివిన, తన రచనలపై ప్రభావం చూపిన ఇతరుల రచనల్నీ పేర్కొన్న సందర్భాలూ వున్నాయి. రస్సెల్ బేకర్ రాసిన 'Star Trekking' అనే ఇంగ్లీషు రచనని చదివి, దాన్ని 'నక్షత్రయానం' పేరుతో అనువదించి 'అనంతం'లో చేర్చాడు. యురోపియన్ కవితా ధోరణుల్ని తెలిపే 'Max Nordan' రాసిన 'De-Generation' చదివాడు. ఎడ్గార్ ఎలన్ పో, స్విన్ బర్న్‌ల కవితలతోపాటు మాగ్జిం గోర్కి నవలలు, కథలతోపాటు ఆయన రాసిన సాహిత్య విమర్శకూడా చదివిన శ్రీశ్రీ జేమ్స్ జాయిస్ రచనలలోని చైతన్య స్రవంతికి బాగా ప్రభావితుడయ్యాడు. డాడాయిజం, సర్రియలిజం వంటి ధోరణులున్న పుస్తకాల్ని విస్తృతంగా చదివాడు. అయితే తెలుగులో వెలువడిన రచనల్ని క్రమంగా అధ్యయనం చేస్తూ వచ్చిన శ్రీశ్రీ పై తిక్కన, వేమన. గురజాడ, విశ్వనాథ, కృష్ణ శాస్త్రి మొదలైన వారి రచనల ప్రభావమూ కన్పిస్తుంది. ఇలా ఎన్నో పుస్తకాల్ని పుంఖాను పుంఖంగా చదివాడు. ఒక దశలో రోజుకో పుస్తకం చదివినట్లు 'అనంతం' వల్ల తెలుస్తుంది.[33] ఇంతగా చదవడం వల్ల తనపై ప్రభావం చూపిన రచయితల్ని తన గురువులుగానే భావించాడు శ్రీశ్రీ.[34]

**సినిమాలు**

శ్రీశ్రీ ఎన్నో రకాల ఉద్యోగాలు చేశాడు. ఎక్కడా నిలకడగాలేడు. కానీ భుక్తి కోసం సినీరంగంలో చాలా కాలం పని చేశాడు. డబ్బింగ్ రచయితగా, మాటల, పాటల రచయితగా ప్రసిద్ధుడయ్యాడు. స్వీయ చరిత్రలో 'సినిమా సరదాలు' శీర్షికన 10-8-1975 నుండి 12-10-1975 వరకు 'ప్రజాతంత్ర' పత్రికలో తన అనుభవాల్ని వివరించాడు.

10–12 సంవత్సరాల వయస్సు నుండే సినిమాలు చూడడం ఆరంభించాడు శ్రీశ్రీ. అప్పుడు సినిమాలు విశాఖపట్నం లైట్ హౌస్ దగ్గర గుడారాలలో చూపేవారు. శ్రీశ్రీ బాల్యంలోనే 'Maciste' అనే ఇటాలియన్ సినిమా చూడడం తటస్థించింది. ఒక సామాన్య ప్రేక్షకుడిగా సినిమాలను చూడనారంభించిన శ్రీశ్రీ, 1950 లో 'ఆహుతి' చిత్రానికి రచయితగా చలన చిత్ర రంగానికి పరిచయమయ్యాడు.

'Picture Goer' అనే వార పత్రిక, పుడోవ్‌కిన్ రచించిన 'Film Technique' అనే పుస్తకాలూ చదివే వాడు. మూకీ సినిమాల గురించి చెబుతూ "Charles Farrell, Janet Gaynor కాంబినేషన్‌లో వచ్చిన 'Seventh Heaven' అనే మూకీ చిత్రాన్ని చూస్తున్నంతసేపూ ఏడుస్తూనే ఉన్నాను"[35] అని బాధపడ్డ శ్రీశ్రీయే ఒక సెక్సు చిత్రం చూసి తన దగ్గరున్న మూడు నాలుగు రూపాయలు ఒక వేశ్య కోసం ఖర్చు చేశానని చెప్పుకున్నాడు.[36] సినిమా ప్రభావంవల్ల ఎట్లా ప్రతిస్పందించాడో అవగతమవుతుంది.

చార్లీ చాప్లిన్ సినిమాలు చా[illegible]ందికి నవ్వు తెప్పిస్తాయి. కానీ తన వంటి కొందరు మాత్రం ఆ నవ్వు వెనుకున్న బాధ, దుఃఖాన్ని ఆపుకోలేరన్నాడు.[37] ఈ నవ్వూ, బాధా ఒకేసారి కలిగించే మనఃస్థితిని తను ప్రతిపాదించిన 'రసన' సిద్ధాంతానికి ఉదాహరణగా చూపాడు.

బొంబాయిలో ఏర్పాటైన మొదటి అఖిల భారత చలన చిత్రోత్సవాలకి జడ్జీలుగా మద్రాసు ఫిలించాంబర్ పక్షాన శ్రీశ్రీ, ఆత్రేయ వెళ్ళారు. అక్కడ చూసిన చిత్రాల వివరాలనెన్నింటినో 'అనంతం' లో పొందుపరిచాడు.

యం.హెచ్.యస్. మునాస్ వారి సిన్మాలో పనికిగాను నెలకు రెండు వందల రూపాయలు, ఇతర సిన్మాలలో పని చేసినందుకు సుమారు మూడు వందల రూపాయలూ, అంటే మొత్తం మీద రు. 500/- దాకా నెలకు సంపాదించేవాడు శ్రీశ్రీ. ఈ సంపాదనతో ఆయన దారిద్ర్యం పోయి ఆర్థికంగా మంచి స్థాయికి వచ్చే అవకాశం ఏర్పడింది.

'రామశ్రీ పిక్చర్స్' పతాకం కింద శ్రీశ్రీ, ఇంకా కొందరు మిత్రులతో కల్సి సినిమా తీసే ప్రయత్నమూ చేశాడు. ఇలా సినిమాలకు సంబంధించిన వివిధ అంశాలెన్నో 'అనంతం'లో రికార్డు అయ్యాయి.

**నాస్తికత్వం**

శ్రీశ్రీలో హేతువాదం మొదటి నుండీ కనిపిస్తుంది. కానీ నాస్తికుడుగా మాత్రం చివరి రోజుల్లోనే మారాడు. చాలా కాలం దేవుడున్నడా ? అనే 'సదసత్సంశయం'లోనే గడిపాడు. కొన్ని రచనల్లో అక్కడక్కడ నాస్తిక భావాలను వెల్లడించడమే కన్పిస్తుంది కాని 'అనంతం'లో 'నాస్తికత్వం' పేరుతో ప్రత్యేకంగా ఒక అధ్యాయమే రాశాడు.

'అనంతం' మొదటి పుటనుండే నాస్తిక భావాలు కనిపిస్తాయి. అందులో " . . . పురోహిత వర్గానికి తెలుసు - నిప్పు, నీరు, గాలి, నేల, నింగి - ఏదీ దేవుడు కాదని, కాని ఒక ఉత్సవ విగ్రహం అవసరమయింది. కార్మికుల కండబలం దోచుకోవడానికి మేధావుల మెదడు సృష్టించిందొక మిథ్యా దైవాన్ని !"[38] అని దేవుడు అన్న భావజాలం పుట్టుక చెప్పి, అంతిమ విజయం మానవుడిదేననడం వల్ల దైవత్వం కంటే శ్రీశ్రీకి మానవత్వంపై ఉన్న అపార నమ్మకం వ్యక్త మవుతుంది.

శ్రీశ్రీ జాతకం అతని పెద్ద బావ (ఆరుద్ర తండ్రి) రాశాడు. అందులో జరిగిపోయినవన్నీ సరైనవిగానే ఉన్నాయి. ఇంకా జరగాల్సిన వాటిలో శ్రీశ్రీకి పిల్లలు పుట్టరని, రాష్ట్రంలో కానీ కేంద్రంలో గానీ మంత్రి పదవి లభిస్తుందని, తొంభై ఏళ్ళకు మరణిస్తాడని రాశాడు.[39] వీటిలో ఏ ఒక్కటీ నిజం కాలేదు. కాబట్టి జాతకాలను ఎంతవరకు నమ్మవచ్చో తన జీవితాన్ని ఉదాహరణగా చూపాడు. అంతేగాక అప్పుడప్పుడు ఏవో కొన్ని నిజమైనంతమాత్రాన జ్యోతిశ్శాస్త్రాన్ని ఒక శాస్త్రంగా గుర్తించలేనని ఖండించాడు. "దేవుడి చుట్టూ మనం ఎన్నో మూఢ విశ్వాసాలను పెంచుకున్నాం. ఆ భ్రమలోంచి బయట పడలేకపోతున్నాం. మన శక్తి మీద నమ్మకం లేక మన జీవితాలకి పూచీ వహించే మరేదో శక్తి ఉందనుకుంటున్నాం. ఇదే బానిస మనస్తత్వం"[40] అని విమర్శించాడు. సత్యాన్వేషకులైన సైంటిస్టులను మత గురువులూ, మహారాజులూ చిత్ర హింసల పాలు చేసిన సంఘటనలు చరిత్రలో ఉన్నట్లు చెప్పి, ఈనాడు మాత్రం మతం ఓడిపోయి సైన్సు గెలుస్తోందని

అభిప్రాయ పడ్డాడు. ఈవిధంగా మతాన్ని, దానిలో భాగమైనదైవం, కర్మకాండ ఇత్యాది అంశాలన్నింటినీ నిరసించాడు శ్రీశ్రీ.

ఇలా స్వీయ చరిత్రలో వివిధ రచనలు, సినిమాలు, నాస్తిక భావాలపైన నిర్దిష్టమైన అభిప్రాయాలు ప్రధానంగా గోచరిస్తాయి. వీటితోపాటు తన వ్యసనాలు, ఉద్యోగాలు, తను గురైన వ్యాధులు, తానున్న నగరాల (విశాఖ, మద్రాసు)పై అనేకానేక విషయాలను ప్రస్తావించాడు.

కేవలం 'అనంతం' కొరకు రాసినవేగాక ఇతరత్రా రాసిన రచనలూ 'అనంతం' లో అచ్చయినాయి. 'కృష్ణశాస్త్రి జ్ఞాపకాలు' గా రాసిన రచన, కృష్ణశాస్త్రి స్వర్ణోత్సవ సంచికలో రాసిన వ్యాసం. 'అద్దం ముందు ప్రార్థన' గా 'నవోదయ' (21-9-1947) లో అచ్చయిన వ్యాసం వంటివి 'అనంతం'గా 'ప్రజాతంత్ర' లో 11-1-1976 లో పునర్ముద్రితాలైనాయి. ఇలా కొన్ని వ్యాసాలే గాక ఉపన్యాసాలూ, సంపాదకీయాలూ, లేఖలు కూడా 'అనంతం' లోకి చేరాయి.

ప్రయోగాత్మక దృష్టితో రాసిన 'అనంతం' లో చివరికి సెక్సు విషయాలూ దాపరికం లేకుండా చెప్పుకున్నాడు. ఇలాంటివి పాఠకుల్లో అలజడి కలిగించాయి. రంగనాయకమ్మలాంటి మార్క్సిస్టులు 'అనంతం' లోని కొన్ని అంశాల్ని తీవ్రంగా విమర్శించారు. ఈమె 'అనంతం' పై "మార్క్సిస్టునని చెప్పుకుంటూ, దోపిడీ వ్యవస్థలో మార్పు కోరుతున్న శ్రీశ్రీ - ఎటువంటి సంకోచమూ, పశ్చాత్తాపమూ లేకుండా, అతి జుగుప్సాకరమయిన ఆదోపిడీ వ్యవస్థ లక్షణాలే బయట పెడుతుంటే - దిగ్భ్రాంతి కలుగుతోంది"[41] అని విమర్శించింది. ఇంతేగాక "మార్క్సిస్టులు కూడా ఇంతేనా ? మార్క్సిస్టుల దృష్టిలో కూడా స్త్రీల విలువ ఇంతేనా ? స్త్రీ పురుష సంబంధాలింతేనా ? అని పాఠకులు అడిగితే మార్క్సిస్టుగా ఏం జవాబు చెపుతారు శ్రీశ్రీ ?"[42] అని అన్న రంగనాయకమ్మ విమర్శకు 'అనంతం' లోనే జవాబు చెప్పుకోవచ్చు. " . . . మన సమాజంలో ఆడది డబ్బిచ్చి కొనుక్కునే భోగ వస్తువు కావడంకన్నా హేయమైన విషయం ఇంకొకటి ఉండబోదు"[43] అని అనటంవల్ల శ్రీశ్రీ పరోక్షంగా జవాబు చెప్పినట్టు అవగతమవుతుంది.

'స్వీయ చరిత్ర' ప్రక్రియపై ఒక వ్యాసంలో కోడూరి శ్రీరామమూర్తి " . . .స్వీయ చరిత్రలో శ్రీశ్రీగారు కనబరచిన నిజాయితీ మరొక ఎత్తును. సాహిత్య పరంగా మాత్రమే గాదు, సెక్సు సంబంధాల విషయంలో కూడా ఏ మాత్రమూ దాపరికాన్ని కూడా శ్రీశ్రీ యిందులో కనబరచలేదు"[44] అని 'అనంతం' ను శ్రీశ్రీ మలిచిన తీరును విశదీకరించాడు.

ఈ పుస్తక సమీక్షలో హరి " . . . శ్రీశ్రీ ఎదుర్కొన్న బీభత్సాలూ శ్రీశ్రీ చేసిన బీభత్సాలూ (సెక్సు సరదాలు) సున్నిత మనస్కులు చెదిరిపోయేటట్లు నిర్భీకంగా, సవివరంగా చిత్రించాడు శ్రీశ్రీ. . . . 'చేసిన పాపం చెబితే పోతుంది' అనే నిజాయితీని ఈ సందర్భంలో గమనింపవచ్చును"[45] అని చెప్పి " . . . అక్కడక్కడ కీచుగా అనిపించినా 'అనంతం' ఒక ఎడ్యుకేషన్" అని చమత్కరించాడు. ఆ విధంగా శ్రీశ్రీ 'అనంతం' పాఠకుల్లో 'ఒక ఎడ్యుకేషన్'గా భావింపచేస్తూ సంచలనం సృష్టించి సాహిత్యలోకంలో ఒక ప్రత్యేక స్థానాన్ని ఏర్పర్చుకుంది.

# యాత్రాచరిత్ర

"మానవ జీవితమే ఒక మహా సాహసిక యాత్ర"[46] గా భావిస్తున్నప్పుడు కొత్త కొత్త ప్రదేశాల్ని చూడాలనిపించడం మానవ సహజం. తీర్థయాత్రలు, విజ్ఞాన, వినోద, నూతన స్థలాన్వేషణ మొదలైన ఎన్నో రకరకాల యాత్రలు చేయడం పరిపాటి. జీవితంలో యాత్రకు వెళ్ళడం ఒక భాగం అయినట్లుగానే, జీవిత లేదా స్వీయచరిత్రల్లోనూ 'యాత్రాచరిత్ర' ఒక భాగమే. అయితే తమ జీవిత చరిత్ర రాయక కేవలం 'యాత్రా చరిత్ర'ను మాత్రమే రాసిన వారూ ఉన్నారు (ఏనుగుల వీరాస్వామి). స్వీయ చరిత్రలోనే ఒక భాగంగా 'యాత్ర చరిత్ర'ను రాసి ప్రత్యేకంగా యాత్రా చరిత్రను రాయని వారూ ఉన్నారు (సంజీవదేవ్). స్వీయ, యాత్రా చరిత్రలను వేరు వేరుగా రాసిన వారూ ఉన్నారు (శ్రీశ్రీ). ఇలా తెలుగులో 'యాత్రా చరిత్ర'లు వెలువడుతున్నప్పటికీ "... ఒక ప్రత్యేక ప్రక్రియగా ఇంతవరకు గుర్తింపుపొందలేదు"[47] అని యాత్రా చరిత్రలపై పరిశోధన చేసిన మచ్చ హరిదాసు మాటలు గమనార్హమైనవి. తెలుగు 'సాహిత్య చరిత్ర' పుస్తకాల్లో మాత్రం ప్రక్రియగా పేర్కొనలేదు. కానీ ఆంధ్ర వచన వాఙ్మయము (1954), ఆంధ్ర వచన రచనా పరిణామము (1961) పుస్తకాల్లో మాత్రం ప్రత్యేకంగా యాత్రా చరిత్రలను వివరించారు. యాత్రలో తాము చూసిన దృశ్యాలు, సంఘటనలు అనుభవ పూర్వకంగా తమలో కలిగిన భావాలు, ప్రతిస్పందనలు వ్యక్తం చేయడమే యాత్రా చరిత్రల్లోని విషయంగా చెప్పుకోవచ్చు. ఈ 'యాత్రా చరిత్ర' అన్న పదబంధం ఇంకా తెలుగు నిఘంటువుల్లోకి ఎక్కనేలేదు. దీనికి 'Travelogue' అనేది ఇంగ్లీషులో సమనార్థకమైన పదం. ఈ మాటకు 'The Oxford English Dictionary' లో యాత్రానుభవాల్ని సినిమా, ప్రసార సాధనం, పుస్తకం మొదలైన రూపాల్లో వ్యక్తీకరించేదిగా పేర్కొనడం జరిగింది.[48]

స్వీయ చరిత్రల్లో ఒక భాగంగా ఉండే యాత్రా చరిత్రలు తెలుగులో ఇప్పుడిప్పుడు ఒక ప్రత్యేక ప్రక్రియగా గుర్తించే అవకాశాలు ఏర్పడుతున్నాయి. పరిశోధనలూ జరుగుతున్నాయి. ప్రచారంలోకి వస్తున్న ఈ ప్రక్రియలో మొట్ట మొదటి పుస్తకం ఏనుగుల వీరాస్వామి రాసిన

'కాశీయాత్ర చరిత్ర'గా యాత్రా చరిత్రల గురించి రాసిన పుస్తకాలు పేర్కొంటున్నాయి.[49] ఆయన తర్వాత కోలాశేషాచలకవి (నీలగిరి యాత్ర), బులుసు వేంకట రమణయ్య (నా దక్షిణ దేశయాత్రలు), జొన్నలగడ్డ సత్యనారాయణ (నా మహారాష్ట్రయాత్ర), శ్రీశ్రీ (చైనాయానం), సినారె (పాశ్చాత్య దేశాల్లో 50 రోజులు), ఆరుద్ర (అమెరికాపర్యటన అనుభవాలు), ఎ.బి.కె.ప్రసాద్ (పశ్చిమ జర్మనీ యాత్ర విశేషాలు), నాయని కృష్ణకుమారి (కాశ్మీర దీప కళిక) మొదలైన వారు తమ తమ యాత్రానుభవాల్ని గ్రంథ, వ్యాస రూపాల్లో వెలువరించారు. వీరిలో శ్రీశ్రీ రాసిన 'యాత్రా చరిత్ర' కు సంబంధించిన రచనల్ని ఇక్కడ వివరించడం జరుగుతుంది.

శ్రీశ్రీ 'యాత్రా చరిత్ర' ను రాష్ట్ర, దేశ, విదేశాల వివిధ ప్రదేశాల్లోని సమావేశాల్లో పాల్గొనడానికై వెళ్ళిన యాత్రలను సమావేశార్థ యాత్రలుగా, చలన చిత్రోత్సవాలకు పరిశీలకుడుగా వెళ్లి చూసి వచ్చిన వాటిని పరిశీలక యాత్రలుగా, ఎలక్షన్ల, పౌరహక్కుల ప్రచారార్థం వెళ్లి చూసిన ప్రదేశాల యాత్రలను 'ప్రచారయాత్రలు' గా, ప్రపంచ శాంతి సమితి సమావేశానికి భారత ప్రతినిధి వర్గంలో ఒకడుగా, చైనావారి ఆహ్వాన ప్రతినిధి వర్గ సభ్యుల్లో ఒకడుగా యాత్రలకు వెళ్లిన వాటిని 'సౌహార్ధయాత్రలు' గా విభజించవచ్చు. ఐతే స్టాక్ హోం, రష్యా, చైనాలకు వెళ్ళిన వాటినే యాత్రలుగా 'అనంతం'లో 'నా విదేశీ యాత్రానుభవాలు' శ్రీశ్రీ రాశాడు. చైనా యాత్రనుభవాల్ని 'చైనాయానం' పేర ప్రత్యేకంగా యాత్రా చరిత్ర పుస్తకాన్నే వెలువరించాడు. ఇలా శ్రీశ్రీ 'యాత్ర' గా పేర్కొన్న వాటిని మాత్రమే స్వీకరించి 'శ్రీశ్రీ యాత్రా చరిత్ర'లను వివరిస్తాను.

**విదేశీ యాత్రానుభవాలు**

ధనిక కుటుంబంలో జన్మించిన శ్రీశ్రీ ఉన్నత విద్యకై ఇంగ్లాండుక వెళ్ళ వలసినవాడు. కానీ, డిగ్రీ పూర్తయ్యే నాటికి వారి కుటుంబ ఆర్థిక స్థితి అత్యంత నికృష్టంగా మారింది. నిరుద్యోగిగా పస్తులున్న రోజులున్నాయి. ఎన్నో చిరుద్యోగాలకు ఎన్నెన్నో ఊళ్ళు తిరిగాడు. కానీ, ఎక్కడా స్థిరంగా నిలవలేదు. 1950లో 'ఆహుతి' డబ్బింగ్ చిత్రం ద్వారా చలనచిత్ర పరిశ్రమలో ప్రవేశించి ఆర్థికంగా నిలదొక్కుకున్నాడు. అప్పటికే 'మహాప్రస్థానం' కావ్యంలోని గీతాలన్నీ రాసి, ఆనాటి కవుల్లో ప్రముఖుడుగా నిలిచాడు. కమ్యూనిస్ట్ పార్టీ మద్రాసు (ఉమ్మడి) రాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడుగా ఉన్న రోజుల్లో 1953 లో 'చైనా ప్రభుత్వ ఆహ్వానం' వల్ల ఆ దేశానికి వెళ్ళే అవకాశం వచ్చింది. విదేశాలకు వెళ్ళడంలో ఇదే మొదటి అవకాశం. ఐతే పాస్‌పోర్ట్ దొరకని కారణంగా ఈ అవకాశం వాడుకోలేకపోయాడు.

1954 లో ప్రపంచ శాంతి సమితి సమావేశం స్టాక్‌హోంలో జరిగింది. దానిలో పాల్గొన్న భారత ప్రతినిధి బృందంలో శ్రీశ్రీ కూడా ఉన్నాడు. ఈ యాత్రకు 13-12-1954 నాడు బయలు

దేరాడు. కైరో, రోమ్ నగరాల మీదుగా లండన్ చేరుకున్నాడు. అక్కడ ఒక నల్లజాతి రచయితతో పరిచయం కలిగింది. లండన్‌లోని భారతీయ విద్యార్థులు ఈ బృందాన్ని ఆహ్వానించారు. ఇలా లండన్‌లో రెండు రోజులు ఉండి, స్టాక్ హోంకు చేరుకున్నాడు. వారంరోజులు జరిగే ప్రపంచ శాంతి మహా సభలకు వెళ్ళిన బృందానికి ఫాదర్ విలియమ్స్ అనే క్రిస్టియన్ ఫాదర్ నాయకుడుగా వ్యవహరించాడు. అక్కడ చిలీదేశకవి 'పాబ్లోనెరూడా' తో శ్రీశ్రీ మాట్లాడడంతో పాటు 'ఆటోగ్రాఫ్' కూడా తీసుకున్నాడు. ఈ సమావేశంలో శ్రీశ్రీ ప్రసంగించలేదు కానీ, ఒకటి రెండు కమిటీల చర్చల్లో మాత్రం పాల్గొన్నాడు. భారతదేశానికి తిరుగు ప్రయాణంలో అందరు ప్రతినిధులు తమ తమ భాషల్లో పాటలు పాడారు. వారిలో శ్రీశ్రీ తెలుగులో జానపద గేయాన్ని ఆలాపించాడు. కాని ఈ తిరుగు ప్రయాణం భారతదేశానికి కాక రష్యా శాంతి సంఘం, తమ దేశంలో వారం రోజులు పర్యటించడానికి ఆహ్వానించిందని మార్గమధ్యలో ప్రకటించడం జరిగింది. 'గర్జించు రష్యా' అని గేయం రాసి తన అభిమానాన్ని ప్రకటించిన శ్రీశ్రీ, అనుకోకుండా రష్యాకు వెళ్ళే అవకాశం వచ్చినందుకు ఎంతో ఆనందించాడు.

మాస్కో పట్టణానికి చేరిన తర్వాత మొట్ట మొదట క్రెమ్లిన్ భవనంలోని లెనిన్ సమాధిని చూశాడు. లెనిన్ శవాన్ని చూసినప్పుడు "చిన్నప్పుడు తిరుపతిలో వెంకటేశ్వర స్వామిని చూసినప్పటి మహోత్సాహం 1954 లో లెనిన్‌ను సందర్శించినప్పుడు నాకు కలిగింది"[50] అని తనలోని స్పందనని తెలిపాడు శ్రీశ్రీ. వెళ్ళిన నాటి రాత్రి ఏర్పాటైన సోవియట్ శాంతి సంఘం ఆహ్వాన సభలో భారత బృందం పాల్గొంది. ఆ సభకు రష్యన్ ప్రముఖకవి టికనోవ్ అధ్యక్షత వహించాడు. మాస్కోనుండి లెనిన్ గ్రాడుకు రైలులో వెళ్ళాడు. అక్కడ హోటల్ అస్టోరియాలో బసచేయడం, ఆ హోటల్ భవనం జారు చక్రవర్తుల నాటి రాజ భవనాల్లో ఒకటి కావడంవల్ల చరిత్ర జ్ఞాపకం వచ్చి శ్రీశ్రీ నాజీల ముట్టడిని సందర్భానుసారంగా వివరించాడు. లెనిన్‌గ్రాడ్‌లో లెనిన్ మ్యూజియం, వింటర్ ప్యాలెస్ మొదలైనవి చూశాడు.

అక్కడి 'ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఓరియంటల్ స్టడీస్' అనే సంస్థ శ్రీశ్రీని ఆహ్వానించి, తెలుగు భాషా సాహిత్యాలపై గోష్టి నొకదాన్ని ఏర్పాటు చేసింది. అందులో "తెలుగు భాషకు కవిత్రయం తిక్కన, వేమన, గురజాడలని . . . , తెలుగు భారతదేశం అంతకీ జాతీయ భాషకాగల అర్హత గలదని జే. బీ. యస్. హాల్డేన్ చెప్పిన మాటలను . . . , రోమన్ లిపిలో (a, aa, i, ee . . . ఈ విధంగా) తెలుగును నేర్పితేఅప్పుడు మనదేశం ఆధునిక యుగంలోకి ప్రవేశిస్తుందని నానిశ్చితాభిప్రాయం"[51] అని తెలిపాడు. అనంతరం మాస్కో రేడియో ద్వారా కూడా శ్రీశ్రీ ప్రసంగించాడు. అక్కడున్న తెలుగువారు కోలాచల సీతారామయ్య, పుప్పల లక్ష్మణరావులనూ కల్సుకున్నాడు. అక్కడి ఒక పాఠశాల చూసింతర్వాత ఒక చిన్న పుస్తకమే రాయాలనుకున్నాడు. ఇంగ్లాండువంటి దేశాల్లో, రష్యాలో పిల్లల అభివృద్ధి చెబుతూ భారత, ఇంగ్లాండు, రష్యాల్లో పిల్లల స్థితిగతులు పోల్చాడు. లెనిన్‌గ్రాడ్ నుండి తాష్కెంటు నగరానికి వెళ్ళాడు. తాష్కెంటు నగర

ప్రత్యేకత, రష్యా రైళ్ళ విశిష్టతా వివరించాడు. అక్కడి నుండి ప్యారిస్, జెనీవాల మజిలీలతో స్వదేశానికి రావడం జరిగింది.

రెండవ సారి ప్రపంచ శాంతి సభలకు భారత ప్రతినిధిగా 5-5-1959 న స్టాక్‌హోమ్‌కు వెళ్ళాడు. సినిమా నిర్మాతల వత్తిడి, తన స్వంత సినిమా 'చెవిలో రహస్యం' కు సంబంధించిన పనులవల్ల 14-5-1959 నాడు తిరిగి వచ్చేశాడు శ్రీశ్రీ.

'సోవియట్ లాండ్ నెహ్రూ అవార్డు' అందుకోడానికై రష్యాకు 10-5-1967న బయలుదేరాడు. ఈ సందర్భంగా తను 1954 లో చూసిన రష్యాతో, ప్రస్తుత రష్యాలోని పరిస్థితులనూ పోల్చి చెప్పాడు. అక్కడి కట్టడాలు, రైల్వే స్టేషను, టాల్‌స్టాయ్ సమాధి మొదలైనవెన్నో పేర్కొన్నాడు. తను అందుకోబోతున్న 'సోవియట్ లాండ్ నెహ్రూ అవార్డు' సందర్భంగా అవార్డులు రావడం వెనక ఉండే రాజకీయాల్ని వివరించాడు. 25-5-1967 నాడు తిరిగి స్వదేశానికి వచ్చినట్టు తన యాత్రా జీవితాన్ని 'అనంతం' లో వివరించాడు.

చైనాయానం

1953 లోనే చైనా దేశానికి వెళ్లే అవకాశం వచ్చినా పాస్‌పోర్ట్ దొరకక వెళ్ళలేకపోయినా, ఇరవైమూడు సంవత్సరాల తర్వాత 6-12-1976 నాడు శ్రీశ్రీ వెళ్ళగలిగాడు. 'భారతీయ మిత్రుడు డా॥ డి. యన్. కొట్నీస్ స్మారక భవనం' ఆవిష్కరణోత్సవంలో పాల్గొనడానికి వెళ్ళిన భారత ప్రతినిధి వర్గంలో శ్రీ బిషంచర్ నాథ్ పాండే, ఎం.పి., డా॥ మిస్. వత్సలా యన్. కోట్నీస్, శ్రీమతి మైత్రేయాదేవి, డా॥ హీరేంద్ర నాథ్ గోహేనీ, శ్రీజ్ఞాన్ సింగ్ ధింగ్రా, ప్రొఫెసర్ తారాచంద్ర్ గుప్తా గారలతోపాటు శ్రీశ్రీ కూడా వెళ్ళాడు. డాక్టర్ బిజయ్‌కుమార్ బాసు ఈ ప్రతినిధి వర్గానికి నాయకుడు. పెకింగ్‌లో చైనా చక్రవర్తుల భవనాలను, ఆప్టికల్ పరికరాల పరిశ్రమను దర్శించాడు. ఈ ఫ్యాక్టరీలో ఉద్యోగుల వేతనాలు స్త్రీ, పురుష భేదాలతో గాక వారు చేసే పనిని బట్టి ఉంటాయని చెప్పాడు. ఇంకా ముసలి వాళ్ళ జీవన విధానం రష్యాలో ఉన్న తీరును మెచ్చుకుంటూ అమెరికాలో, ఇండియాలో ముసలి వాళ్ళ జీవితం ఎంత ఘోరంగా ఉందో పోల్చిచెప్పాడు.

భారతీయుడైన డా॥ కొట్నీస్ గారు చైనా ప్రజలకు చేసిన వైద్య సేవకు గాను స్మృతిగా అతని పేరిట 'డా॥ డి. యన్. కొట్నీస్ స్మారక భవనం' అనే పేరుతో చైనా ప్రభుత్వం నిర్మించింది. దీనికి 9-12-1976 న ఆవిష్కరణోత్సవం జరిగింది. ఆ సభలో భారతీయ ప్రతినిధులూ పాల్గొన్నారు. అందులో డా॥ బిజయ్ కుమార్ బాసు ప్రసంగించాడు. చైనాలోని డా॥ కొట్నీస్ స్మారక వైద్యశాలా చూశాడు శ్రీశ్రీ. ఈ సందర్భంలో పెట్టుబడిదారీ దేశాల్లో వైద్య విధానం ఎలా ఉందో, చైనాలో ఎలా ఉందో పోల్చి చెబుతూ "పెట్టుబడిదారీ దేశాల్లో రోగి వైద్యుణ్ణి వెతుక్కుంటూ వెళ్ళతాడు.

చైనాలో వైద్యులే రోగి వద్దకు వెళ్ళుతారు. ఇది పెద్ద పెద్ద నగరాల్లోనే కాదు,చిన్న చిన్న గ్రామాల్లో కూడా సర్వ సామాన్యం"[52] అని చెప్పాడు శ్రీశ్రీ.

'చుంగ్' గ్రామంలో సమిష్టి వ్యవసాయాన్ని, పాఠశాలల్ని, పత్తి పరిశ్రమనూ చూడడం జరిగింది. వీటి నిర్వహణ గూర్చి చెబుతూ చైనాలాగే మన దేశం తొందరగా బాగు పడడానికి "... మన దేశం ఎంత పెందరాళే దేవుడనే భావం నుంచి విముక్తి పొందితే అంత తొందరగా మనం ముందుకు పోగలమని నేను దృఢంగా విశ్వసిస్తున్నాను"[53] అని నాస్తిక భావాభివృద్ధే దేశాభివృద్ధికి తోడ్పడుతుందని అభిప్రాయపడ్డాడు.

'గ్రేట్‌వాల్ ఆఫ్ చైనా' ను చూసి దాని చారిత్రకాంశాలతోపాటు కళల కర్మాగారం, రక్షణ శిబిరాలు, చక్రవర్తుల భవనాలను 'చైనాయానం' లో వివరించాడు. శ్రీశ్రీ బృందం 16-12-1976 నాడు రెవీ అలీ (Rewi Alley) అనే న్యూజిలాండు కవి ఆతిథ్యాన్ని పొందారు. అతనితో శ్రీశ్రీ సాహిత్య విషయాలు చర్చించాడు. అతను శ్రీశ్రీకి తన మూడు కవితా సంపుటాలు బహుకరించాడు.

చైనాలో ఎన్నెన్నో చూస్తున్న శ్రీశ్రీకి 'రవిరాజ్ ఇంటర్‌నేషనల్' వారి నుండి వెంటనే స్వదేశానికి తిరిగి రావలసిందిగా టెలిగ్రామ్ వచ్చింది. ఇహ అప్పటి నుండి మనస్సంతా స్వదేశంపై మరలి, చివరికి నిర్ధారిత సమయంకంటే ముందే ఇండియాకు 28-12-1976 నాడు తిరిగి వచ్చేశాడు. ఇలా సాగిన 'చైనాయానం' లో రాజకీయాల్ని, నాస్తిక భావాల్ని సందర్భం వచ్చినప్పుడల్లా చర్చిస్తూ భారతదేశాన్ని చైనా అభివృద్ధితో పోలుస్తూ తులనాత్మకంగా చర్చించాడు.

శ్రీశ్రీ యాత్రా చరిత్రలో మొత్తం మీద రాజకీయాలు, నాస్తిక భావాలతో పాటు తను సందర్శించిన విదేశాలతో తన దేశాన్ని పోల్చి ఇంకా ఎదగనందుకు బాధపడిన సందర్భాలు అనేకం ఉన్నాయి.

# లేఖలు

లేఖల ద్వారా స్వవిషయాలతోపాటు ఆ లేఖకుల సమకాలీన పరిస్థితులూ తెలిసే అవకాశం ఉంది.[54] ఆ 'లేఖ' ఎవరికి రాస్తున్నారో వారికీ, రాస్తున్న వారికి మధ్య ఉన్న సంబంధం, చొరవ, వృత్తి, ప్రవృత్తి మొదలైన అంశాలు సర్వ సాధారణంగా వ్యక్త మవుతుంటాయి. ఈ లేఖల్లో సాహితీవేత్తలు, రాజకీయవేత్తలు, శాస్త్రవేత్తలు వంటి వారు రాసే లేఖల మధ్య భిన్నత్వముంటుంది. వ్యక్తికీ వ్యక్తికీ మధ్య తేడా ఉన్నట్లే, ఒకే రంగానికి చెందిన వ్యక్తులు రాసుకునే లేఖల మధ్య కూడా ఎంతో వైవిధ్యముంటుంది. ఇలా ఉండే ఈ 'లేఖా సాహిత్యం' రాసిలో చూస్తే "మన ఆంధ్ర సాహిత్యంలో ప్రచురించబడ్డ లేఖలు తక్కువ. ఆంగ్ల సాహిత్యంలో ఈ శాఖ వృద్ధిగాంచినట్లు మన భాషలో కూడా పెరిగినపుడే సజీవ సాహిత్యం కనిపించగలదు"[55] అని 'సంజీవదేవ్ లేఖలు' పుస్తకం పీఠికలో గొర్రెపాటి వెంకట సుబ్బయ్య పేర్కొనడం నిజమనిపిస్తుంది. ఆ ప్రక్రియ గురించి 'Cassell's Encyclopaedia of world literature' లో " . . . The self distancing inherent in letters, Particularly long letters, distorts the inner workings of the psyche, for the evocation of which other devices had to be invented"[56] అని పేర్కొనడం జరిగింది.

తెలుగులో కందుకూరి, గురజాడ వంటి రచయితల లేఖలు డైరీలతో కలగలసి ముద్రితమైనాయి. బ్రౌన్, చలం, శారద, సంజీవ్‌దేవ్ మొదలైన వారి లేఖలు ప్రత్యేక పుస్తకాలుగా వెలువడ్డాయి. శ్రీశ్రీ వంటి కొందరు రచయితల లేఖలు వారి రచనల సంపుటాల్లో చేరాయి. ఇలా తెలుగులో ఒక ప్రక్రియగా 'లేఖ'లు అతి స్వల్పంగా ఇప్పుడుప్పుడే చోటు చేసుకుంటున్న ఈ నేపథ్యంలో మహాకవి శ్రీశ్రీ రాసిన లేఖల్ని ఇక్కడ వివరిస్తాను.

శ్రీశ్రీ సాహిత్య సంపుటాల్లో అచ్చయిన లేఖలు సుమారుగా నలభైదాకా ఉన్నాయి. ఈ లేఖల్లో 'ఉదయిని సంపాదకులకు' 10-6-1935 నాడు రాసింది దొరుకుతున్న వాటిల్లో మొట్టమొదటిది. ఇవి వివిధ పత్రికలకూ, సాహితీవేత్తలకు, రాజకీయవేత్తలకూ రాసినవి. వీటిని సాహిత్యం, రాజకీయాలు, నాస్తికత్వం, సినిమాలు, స్వవిషయాల గురించి ఆయా వ్యక్తులకు రాసిన లేఖలుగా విభజించవచ్చు.

## సాహిత్య లేఖలు

శ్రీశ్రీ లేఖల్లో ఎక్కువగా కనిపించే అంశం సాహిత్యం. 'జలసూత్రం'కు రాసిన లేఖలో "లోకం దుఃఖం అంతా మన గొంతుకలో ఉండకట్టుకోవాలని కోరుతాము, సుఖాలు లోకానికి వదలి"[57] అని కవుల, రచయితల బాధ్యతను గుర్తుచేశాడు. ఇది 3-10-1939 నాటి ఆలోచన. శ్రీశ్రీ లోని ఆ ఆలోచననే దాదాపు ఒక సంవత్సరానికి చలం (17-7-1940) " . . . శ్రీశ్రీ అందరి బాధనూ తనలో పలికిస్తాడు. . . ప్రపంచపు బాధ అంతా శ్రీశ్రీ బాధ"[58] అని కవిగా శ్రీశ్రీ బాధ్యతను, బాధను కవితాత్మకంగా మహాప్రస్థానం పీఠికలో చెప్పాడు.

శ్రీశ్రీ అధ్యక్షుడిగానే 'విరసం' ఆవిర్భావం జరిగింది. 'జై ఆంధ్ర ఉద్యమా' నికి అనుకూలంగా 'విరసం' తీర్మానించినప్పుడు దానికి నిరసనగా విరసానికి రాజీనామా లేఖను సమర్పించాడు. అందులో "విప్లవం వర్ధిల్లాలి. విప్లవ రచయితల సంఘం వర్ధిల్లాలి. వేర్పాటు వల్ల విప్లవం వర్ధిల్లదు. లచ్చన్నల, యజ్ఞనారాయణల ఉద్యమం విఫలం కాక తప్పదు"[59] అని విమర్శించి, కర్షక కార్మికుల కళ్ళే తన కళ్ళుగా, వారి కంఠమే తన కంఠంగా చెప్పుకున్నాడు. ఈ రాజీనామా గురించే చలసాని ప్రసాద్‌కు రాసిన లేఖలో "నేను విరసం నుంచి వైదొలగి నందుకు ఆరుద్ర వగయిరాలు ఆనంద పడితే పడనివ్వండి. మనమెందుకు కాదనాలి? కాని ఒకటి మాత్రం ఖాయం. ఇక నుంచి నేనే సాహిత్య సంస్థలోనూ (కవితా సమితి అయినాసరే) వుండను"[60] అని అన్నాడు. ఇలా చెప్పిన శ్రీశ్రీనే ". . . వేర్పాటు వాదాన్ని పునరాలోచించే నిమిత్తం విప్లవ రచయితల సర్వ సభ్య స[illegible] జరగబోతున్న కారణం చేత నేను నారాజీనామాను ఉపసంహరించుకొని అధ్యక్షుడుగా ఆ సమావేశంలో పాల్గొనబోతున్నాను"[61] అని లేఖ రాసి ఆ సమావేశానికి హాజరయ్యాడు. ఈ విధంగా యావత్ తెలుగు జాతి అఖండంగా ఉండాలని ఆశించాడు. దాని కొరకై విరసాన్ని త్యజించడానికైనా వెనుకాడలేదు. ఆ తర్వాత 'పాక్షిక నిరహారదీక్ష' పేర విశాలాంధ్ర దిన పత్రికకు 19-3-1973 నాడు లేఖ రాశాడు. ఇది తెలుగు ప్రాంతాన్ని వివిధ రాష్ట్రాలుగా విభజించడానికి ఒప్పుకుంటూ, అందునా 'విశాఖ' కూడా రాష్ట్రంగా ఏర్పడడానికి తాను పోరాడుతాననీ, కర్మ సిద్ధాంతం, దైవాన్నీ నమ్ముతాననీ వ్యంగ్యంగా రాసిన ఉత్తరం ఇది. ఈ విధంగా వేర్పాటు వాద వ్యతిరేకతని తెలియజేశాడు శ్రీశ్రీ.

## రాజకీయ లేఖలు

తాను ప్రధానంగా సాహితీవేత్తనని చాలా సార్లు చెప్పుకున్న శ్రీశ్రీ, పురిపండా అప్పల స్వామికి రాసిన లేఖలో "గ్రాడ్యుయేట్సు నియోజకవర్గం నుంచి కౌన్సిలుకి నిలబడుతున్నాను"[62] అని చెప్పుకున్నాడు. కమ్యూనిస్టు పార్టీ తోడ్పాటుతో ఇలా పోటీ చేసి మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలుకు 1953 లో ఎన్నికయ్యాడు. ప్రత్యక్షంగా 1955 ఎన్నికల ప్రచారంలో పాల్గొన్నాడు. అంతకుముందే మాస్కోను సందర్శించి వచ్చాడు. దీన్ని అప్పుడు ఆంధ్ర పత్రిక లో విమర్శించడం జరిగితే దానికి సమాధానంగా అదే పత్రికకు ఒక ఉత్తరాన్ని రాశాడు శ్రీశ్రీ. ఆ ఉత్తరంలో ఎలక్షన్ల గురించి "భారతదేశాని కంతటికీ ఆంధ్రమాత నాయకత్వం వహించగల అవకాశాన్ని చరిత్ర నేడు మనకు ప్రసాదించింది"[63] అని చెప్పి, ఎర్రకోట మీద కాంగ్రెసు జెండా ఎగురుతున్నంత మాత్రం చేత, ఆంధ్ర పత్రికా కార్యాలయానికి రీడర్స్ డైజెస్టు రవాణా అవుతున్నంత మాత్రం చేత తెలుగు డొక్కలు నిండిపోయాయని గాని తెలుగు పుణ్యం పండిపోయిందనిగాని భ్రమపడే వాళ్ళుంటే వాళ్ళని చూసి జాలిపడాలి[64] అనీ విమర్శించాడు. ఈ విమర్శపై మళ్ళీ పత్రికలో విమర్శలు రాశాడు. దానికి రాసిన సమాధాన లేఖను ఆంధ్ర పత్రిక వారు పరిహాసంగా 'వేంకటేశ్వర స్వామి ముందున్నట్లే అనిపించింది' అనే శీర్షికతో అచ్చేశారు.

ముగ్గురు విరసం కవుల్ని అరెస్టు చేసినపుడు అప్పటి హోం మంత్రికి రాసిన లేఖలో "ఆనాటి ఇంగ్లీషు ప్రభుత్వం విశ్వనాథవారి 'ఆంధ్రపౌరుషం' నిషేధించింది. హింసను రెచ్చగొట్టాడని ఆరోపించింది. ఇంగ్లీషు వాళ్ళు చాలా నాగరికులు. అందుకే ప్రమాదకరమైన పద్యాలు రాసిన కవిని ఖైదుచేయలేదు"[65] అని ప్రభుత్వ విధానాల్ని తీవ్రంగా నిరసించాడు.

ఆంధ్ర సచిత్ర వార పత్రిక 'తెలుగు వెలుగులు' శీర్షికలో 'పుచ్చలపల్లి సుందరయ్య'ను కర్ణునితో పోల్చడం జరిగింది. దీన్ని విమర్శిస్తూ శ్రీశ్రీ లేఖ రాశాడు. అందులో ఆనాటి రాజకీయ, సాహిత్యవేత్తలను కౌరవులతో పోల్చుతూ సుందరయ్యను మాత్రం 'ధర్మరాజు'తో పోల్చాడు[66]

ముఖ్యమంత్రిగా పి.వి. నరసింహారావు హయాంలో విశ్వనాథ సత్యనారాయణ ఆస్థాన కవిగా నియమించబడడం, తిరుపతి యూనిట్ విరసం వారి కావ్య సంకలనం 'లే'ను నిషేధించడం జరిగింది. ఈ రెంటినీ విమర్శిస్తూ "ఇవాళటి వారు నిన్నలో కలిసి పోయినవారు. రేపటి మేము ఇవాళగా ఆవిర్భవిస్తాము"[67] అని ఆశను వ్యక్తం చేశాడు.

తన లేఖలలో అధికారంలో ఉన్న కాంగ్రెసు పార్టీని విమర్శించడమేగాక, ఎన్నికల ద్వారా కేరళలో అధికారంలోకి వచ్చిన నంబూద్రిపాద్ కమ్యూనిస్టు ప్రభుత్వానికి ఒక లేఖ ద్వారా

అభినందనలు తెలిపాడు. మూడవ ప్రపంచ యుద్ధానంతరం యావత్ ప్రపంచ వ్యాప్తంగా కమ్యూనిజం అధికారంలోకి వస్తుందని 'జయభేరి' పత్రికలో అభిప్రాయపడ్డాడు.[68] ఇలా లేఖల ద్వారా ప్రభుత్వాన్ని విమర్శించి, సామ్యవాద ప్రభుత్వం ఏర్పడుతుందని ఆశించాడు శ్రీశ్రీ.

**లేఖలలో నాస్తికత్వం**

ఆధునిక కవిత్వం వైపు మొగ్గినప్పటి నుండీ శ్రీశ్రీలో హేతువాద ధోరణి కనిపిస్తుంది. అప్పుడప్పుడు హేతువాదాన్ని దాటి నాస్తిక భావాల్ని వ్యక్తీకరించాడు. అటువంటి లేఖల్లో ఒకటి, 'కళాకేళి' సంపాదకుడూ, సాహితీవేత్త అయిన ఏ. సోమసుందర్‌కు రాసింది. అందులో మూఢ నమ్మకాలను విమర్శించాడు. ప్రజాతంత్ర 'పాతక పర్వం' శీర్షికకు రాసిన లేఖల్లో "ఋజువు కాని దాన్ని సైన్స్ సత్యంగా అంగీకరించదు"[69] అనీ, మరో ఉత్తరంలో "ఈ దేశం నుంచి దేవుడికి ఉద్వాసన చెప్పిన మరుక్షణం దారిద్ర్యం అనే పిశాచికి ఈ దేశం నుంచి ఉద్వాసన జరుగుతుంది. ఇదే నేను నిన్న గాక మొన్న చైనాలో కళ్ళారా చూసిన వాస్తవం!"[70] అని చైనా దేశం నాస్తికత్వం వల్ల ఎలా ముందడగు వేస్తోందో వివరించాడు శ్రీశ్రీ. విశాలాంధ్రకు రాసిన ఒక లేఖలో " . . . ఇప్పుడు కర్మ సిద్ధాంతాన్ని కూడా నేను పూర్తిగా బలపరుస్తున్నాను. . . . నాకు మా అనకాపల్లి నూకాలమ్మ ఉంది. సింహాద్రి అప్పన్న ఉన్నాడు. విశేషించి విశాఖపట్నం ఎల్లమ్మ తల్లి ఉండనే ఉంది. ప్రస్తుతం మట్టుకు వీళ్ళ ఆశీర్వాదం చాలు. అవసరమైతే ఆ తర్వాత మన ముక్కోటి దేవతల్ని ఆవాహన చేస్తాను"[71] అని వ్యంగ్యంగా 'దైవం' అనే భావాన్ని హేళన చేశాడు శ్రీశ్రీ. ఇలా సందర్భం వచ్చినప్పుడల్లా, నాస్తిక భావాల్ని వ్యక్తపరిచాడు.

**లేఖల్లో సినిమాలు**

లేఖల ద్వారా, ఏఏ సినిమాలకు శ్రీశ్రీ రచనలు చేస్తున్నాడో, ఏ ఏ సినిమాల కొరకు మద్రాసుకు వెళ్తున్నాడో మొదలైన అంశాలు తెలుస్తాయి. పురిపండా అప్పల స్వామికి 21-10-1949 నాడు రాసిన లేఖలో ఒక హిందీ సినిమాను తెనిగించడానికి 20-10-1949 నాడు మద్రాసుకు వచ్చినట్టుగా చెప్పాడు. ఆ సినిమానే 'ఆహుతి'. ఇది 1950 లో విడుదలైంది. ఈ సినిమా విడుదలయ్యాక 23-6-1950 నాడు రాసిన లేఖలో "మీరు (ఆహుతి) ఫిలిం చూసి ఉంటారనీ భావిస్తున్నాను. ప్రజాభిప్రాయం ఎలా ఉంది? (అంటే గల్లా పెట్టే యేమంటోంది?) . . . Classes ఏమనుకుంటున్నారు? Masses ఏమనుకుంటున్నారు ? ఈ విషయాలన్నీ మీరు రాయాలి"[72] అని పురిపండా అప్పల స్వామిని కోరాడు. అంటే తను మాటలు, పాటలు రాసిన తొలి చిత్రం ఎలా ఉందో, అది ఆర్థికంగా విజయవంతమవుతుందో లేదో అన్న బెంగ శ్రీశ్రీలో ఉన్నట్టుగా మనం గ్రహించవచ్చు. పురిపండకు రాసిన మరో లేఖలో "ప్రస్తుతం (28-5-1950) నేను హెచ్.ఎమ్. రెడ్డి

గారి రోహిణీ పిక్చర్స్‌లో పనిచేస్తున్నాను"[73] అని చెప్పుకున్న ఆ సినిమా పేరు 'నిర్దోషి'. ఇలా సినీరంగ ప్రవేశం చేసిన శ్రీశ్రీ క్రమంగా ఎదిగాడు. 'చెవిలో రహస్యం' అన్న చిత్రానికి సంబంధించి చెబుతూ "ఈ పిక్చరులో నాకూ కస్తూరీ ఫిలిమ్సుకూ Partnership ఉంది"[74] అని తుమ్మల వెంకట్రామయకు 30-6-1950 నాడు రాసిన లేఖలో తెల్పి, ఈ సినిమా అడ్వర్‌టైజ్‌మెంటును విశాలాంధ్రలో ప్రచురించడం గురించి రాశాడు. ఆ తర్వాత కూడా తుమ్మలకు రాసిన మరి కొన్ని లేఖల్లోనూ ఈ సినిమాకు సంబంధించిన విషయాలున్నాయి. ఇలా తన దగ్గరి మిత్రులకు లేఖల్ని రాసినప్పుడు, తాను పని చేస్తున్న చిత్రాల గురించి రాసేవాడు.

**లేఖలలో స్వవిషయాలు**

సర్వ సాధారణంగా ఎవరి లేఖల్లోనైనా ఎక్కువగా ఉండేది స్వవిషయాలే. శ్రీశ్రీ ఉత్తరాల్లోనూ ఎన్నో స్వవిషయాలు దొరకుతాయి. తన కుటుంబ విషయము కావచ్చు. తన రచనలూ కావచ్చు. తన బంధువైన ఆరుద్రకు రాసిన చాలా ఉత్తరాల్లో కుటుంబ విషయాల ప్రస్తావన ఉంది. 19-10-1943 నాడు ఆరుద్రకు రాసిన లేఖవల్ల శ్రీశ్రీ లక్నోలోని IAMC Training & Dept. Centre' లో Laboratory assistant గా డెబ్బై అయిదు రూపాయల జీతంతో ఉద్యోగం చేస్తున్నట్లుగా తెలుస్తుంది. అక్కడ తన జీవన విధానం గురించి చెబుతూ "డేరాలలో జీవితం ఒక్కొక్క tent లో నలుగురం. తెల్లారగట్టే పి.టి. తర్వాత టీ. ఉస్కోబాదు Parade. పిమ్మట First Aid మీదా Hygiene మీదా పాఠాలు, తిండి, నిద్ర Afternoon Tea మళ్ళా Parade. ఏడుగంటలకి తిండి. Back to the tents. ఇది ఇక్కడ జీవితం"[75] అని చెప్పడంవల్ల, అప్పుడు శ్రీశ్రీ జీవితం ఎలా సాగుతున్నదో తెలుస్తుంది. ఇంకా ఈ లేఖ వల్ల పదిహేను రోజులు మలేరియాతో ఆసుపత్రి పాలు కావడంవంటి విషయాలు కూడా తెలుస్తాయి. అలాగే పురిపండా అప్పల స్వామికి రాసిన లేఖల్లో ఉంది. ఒక లేఖలో తను భార్యా సమేతంగా విశాఖకు వస్తున్నట్లు రాసి, "మా బంధువర్గం వారు ఎవరైనా కనబడితే మేము వస్తున్నట్లు చెప్పండి"[76] అని రాశాడు. ఇట్లా ఉత్తరాలలో వెల్లడయ్యే స్వవిషయాలవల్ల లేఖా రచయిత మనస్సూ తెలుస్తుంది. ఈ అంశాన్నే చింతాదీక్షితులు "ఈ ఉత్తరాలు చదివితే వేంకటచలంగారి హృదయానికి సమీపముగా పోవచ్చు. దాని లోతూ వైశాల్యమూ తెలుసుకోవచ్చు"[77] అని చెప్పింది శ్రీశ్రీ కి కూడా అనువర్తింపజేయవచ్చు.

1946 లో హైదరాబాదు నిజాం సెక్రటేరియట్‌లో ఉద్యోగం చేస్తూ 'పురిపండా'కు రాసిన లేఖలో "నెలకు 200 రూకల జీతం. ఆరు నెలల దాకా ఇలా బతకడానికి వీలుంది. ఖాసింఖాను కరుణాదృష్టి వల్ల నేనూ అబ్బూరి వరద రాజేశ్వరరావూ రెండు తాత్కాలిక ఉద్యోగాలు

సంపాదించాము"[78] అని చెప్పాడు. ఈ లేఖను "ఎక్కడో ములిగి హైద్రాబాదులో తేలిన నేను ఒక Beer బుడ్డీ ముగించి Rum సేవిస్తూ ఈ ఉత్తరం రాస్తున్నాను"[79] అని ఏ దాపరికమూ లేకుండా చెప్పుకున్నాడు శ్రీశ్రీ. మరో ఉత్తరంలో తన కూతురు 'అనామిక' (లెనినా) బలహీనంగా ఉండడం, తేనెను పంపమని కోరడం వంటి కుటుంబ విషయాలూ ఉన్నాయి.

అంతేగాక ఈ ఉత్తరాల్లో స్వీయ రచనల గురించీ వివరించాడు. 19-10-1943 నాడు ఆరుద్రకు రాసిన ఉత్తరంలో తను 'హంసతో ఆరునెలలు' అనే నవలికను రాయాలనుకుంటున్నట్లు,[80] పురిపండాకు రాసిన లేఖల వల్ల తను ప్రతీవారం పత్రికల్లో రాసిన రచనలు 'వారం వారం' పేరుతో పుస్తకంగా అచ్చయినట్లు,[81] తాను 'ధ్వని' పత్రిక తేవాలనుకోవడం, 'మహాప్రస్థానం' కావ్య ప్రచురణ ఇలా అనేక రచనల ప్రస్తావన వస్తుంది.[82] ఈ విధంగా శ్రీశ్రీ లేఖల్లో తన రచనలతో పాటు తాను రాసిన, రాయబోయే రచనలపై ఇతరులు లేఖల్ని రాస్తే వాటికి జవాబుగా రాసినవి కూడా ఉన్నాయి. అలాంటి వాటిలో 25-1-1970 లో రంగనాయకమ్మకు తన రచన 'అనంతం' ఎందుకొరకు రాస్తున్నాడో తెలిపాడు.

ఈ విధంగా రాసిన శ్రీశ్రీ లేఖల్లోని 'మహాకవి గజ్జెల మల్లారెడ్డికి బహిరంగ లేఖ' ఏ కావ్యాన్ని ప్రశంసిస్తూ రాశాడో ఆ కావ్యం తర్వాతి ముద్రణల్లో పీఠికైంది. ఇలాగే ఏదైనా పుస్తకం చదివి ఆ రచయితకు రాసిన లేఖలెన్నో ఆయా పుస్తకాల తర్వాతి ముద్రణల్లో 'ముందుమాట' స్థానాన్ని పొందాయి. ఇలా శ్రీశ్రీ లేఖలు 'లేఖాసాహిత్యం' లోనే ఓ ప్రత్యేకతను సంతరించుకున్నాయని చెప్పవచ్చు.

ఐదో అధ్యాయం

# శ్రీశ్రీ శైలి

"కుకవుల శైలి నాకు వచ్చదు. గవర్నమెంటాలిటీ నాకు వచ్చదు. డొంక తిరుగుబాట నాకు వచ్చదు. బుర్ర తిరుగుడు మాట నాకు వచ్చదు. రూపాయలు మాట్లాడే శైలి నాకు వచ్చనే వచ్చదు. ఆ రూపాయలు జేబుల్లో గాని, బ్యాంకుల్లోగాని, ఇనుప మందసాల్లోగాని, ఇతరచోట్ల గాని వినిపించే శైలి నాకు వచ్చదు."

- శ్రీశ్రీ

(శ్రీశ్రీ వ్యాసాలు (౧౯౭౦), పుట - ౧౨౯)

# శ్రీశ్రీ శైలి

ఇంతవరకు శ్రీశ్రీ వచన రచనలను కథా సహిత, కథా రహిత, స్వీయాత్మక సాహిత్యంగా విభజించి వివరించడం జరిగింది. వీటిల్లో వ్యక్తమైన విషయాలతో పాటు ఆ రచనల నిర్వహణలో శ్రీశ్రీ ప్రత్యేకతనూ చర్చించడం జరిగింది. ఈయన వచన రచనలను శైలీ పరంగా ఈ విభాగంలో పరిశీలించవలసి ఉంది.

శైలీ శాస్త్రం (Stylistics) దృక్పథం నుండి కవిత్వాన్ని పరిశీలించడం తెలుగులో ఈ మధ్యే ఆరంభమైంది. కవిత్వంతోపాటు కథ, నవల, నాటకం, వ్యాసం, స్వీయ చరిత్ర మొదలైన ప్రక్రియల్లో కూడా ప్రారంభంకావాలి. కవిత్వాన్ని 'శైలి' పరంగా ఎంతో కొంతైనా కొందరైనా చెప్పడం జరిగింది. కాని వచన రచనల శైలి గురించి రావలసినంత విమర్శ రాలేదంటే అతిశయోక్తికాదు. శ్రీశ్రీ రచనలకూ ఈ విషయం వర్తిస్తుంది. ఈయన కవిత్వ శైలిని గురించి కొంతైనా వివరించిన వారున్నారు. కానీ శ్రీశ్రీ వచన రచనలపై శైలీ శాస్త్ర దృష్ట్యా ఇంతవరకు పరిశీలనలు వెలువడలేదు. ప్రస్తుతం ఇదే మొదటి ప్రయత్నంగా భావించవచ్చు.

'శైలీ శాస్త్రం' తెలుగులో అంతగా ప్రచారంలోకి రాలేదు. కాబట్టి 'శైలి' గురించి మొదట చెప్పి, అది శ్రీశ్రీ వచన రచనలకు అనువర్తింపచేసి చూపుతాను.

'శైలి' (Style) అంటే "నడవడి, ప్రవర్తన, రచనారీతి"[1] గా శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు అర్థాల నిచ్చింది. వీటిలో 'రచనారీతి' అన్నదే ప్రస్తుతానికి సరిపోతుంది. శైలిని గురించి తెలుగులో కొందరు నిర్వచన ప్రాయంగా చెప్పారు. వారిలో బూదరాజు రాధాకృష్ణ 'శైలి' పదం గురించి " 'శైలి' రచనా పద్ధతి అనే అర్థంలో సాహిత్య పరిభాషలో ఇటీవల ప్రవేశించిన శబ్దం"[2] గా చెప్పారు. ఇది శాస్త్రంగా ఆవిర్భవించడాన్ని "...సాహిత్యాన్ని అర్థం చేసుకోడానికి భాషా శాస్త్రం, సాహిత్య (విమర్శన) శాస్త్రం (కలసి లేదా విడివిడిగా) ఏవిధానంలో తోడ్పడుతాయో చర్చించటానికి మరొక విభాగం శైలీ

శాస్త్రం (Stylistics) పేరిట వెలసింది"[3] అని చెప్పి, "ఏ వ్యక్తైనా ఇతర వ్యవహర్తలతో ఏకత్వాన్ని పంచుకుంటూ వ్యక్తిగతంగా వైవిధ్యాన్ని వ్యక్తం చేస్తే దాన్ని శైలిగా స్థిరపరచవచ్చును"[4] అని కుంట ముక్కల లక్ష్మీ నారాయణశర్మ వివరించారు. ప్రముఖ విమర్శకుడు రాచమల్లు రామచంద్రారెడ్డి శైలిని గూర్చి "సాధారణంగా రచయితలు పనిగట్టుకొని సాధన చేసి యేదో ఒక రచనా విధానాన్ని అలవరచుకొంటారు. దాన్నే శైలి అంటాం"[5] అని రచయితల్లో శైలి ఏర్పడే విధానాన్ని చెప్పారు. ఎల్లూరి శివారెడ్డి " . . . భావ వ్యక్తీకరణ విలక్షణతను శైలి (Style) అనవచ్చు"[6] అని నిర్వచించారు. ఇంకా యాకూబ్[7] , వై. కామేశ్వరి[8] మొదలైన యువ పరిశోధకులు కూడా శైలిని నిర్వచించారు.

తెలుగులో 'శైలి' అన్న పదానికి ఇంగ్లీషులో 'Style' అనే పదం వాడకం లో ఉంది. 'Style' అంటే "Manner of writting"[9] అని Collins Gem English Dictionary చెప్పగా, 'A Hand Book of Literature' లో "The arrangement of words in a manner which at once best expresses the individuality of the author and the idea and intent in the authors mind"[10] గా పేర్కొనబడింది.

G. W. Turner రాసిన 'stylistics' అనే మరో పుస్తకంలో "Linguistics is the science of describing language and showing how it works ; stylistics is that part of linguistics which concentrates on variation in the use of language"[11] అని చెప్పిన దానివల్ల భాషా శాస్త్రంలో భాగంగా ఉంటూ రచనలోని భాష తీరును చెప్పేదిగా భావించవచ్చు.

'International Encyclopaedia of Linguistics' లో "Literary stylistics is the study of the aesthatic use of language (Phonetic, prosodic and lexico-syntactic) . . ."[12] అని భాషను చక్కగా వాడిన తీరునే 'శైలి' గా చెప్పబడింది.

మొత్తం మీద 'శైలి' ని తెలుగు, ఇంగ్లీషులలో పైన పేర్కొనబడిన వాటి ననుసరించి ఈ విధంగా చెప్పుకోవచ్చు. పదాల ప్రయోగం, అమరిక, వాక్య నిర్మాణరీతి, అలంకారాల వాడకం మొదలైన వాటి ద్వారా సాధించే సౌందర్యంతోపాటు ఆయా రచయితలను ప్రత్యేకంగా గుర్తించడానికి అనువైన భాషాప్రయోగమే 'శైలి' గా పేర్కొనవచ్చు.

'శైలి' అనేది పదాల ప్రయోగాన్ననుసరించి, చెప్పేతీరును బట్టి, రచనా విధానాల ననుసరించి వివిధ రకాలుగా ఉంటుంది. పదాలననుసరించి 1) పదగుంఫన శైలి (Rhetoric Style). 2) సరళశైలి

(Simple Style), అనీ రెండు రకాలు. 'పదగుంఫన శైలి' గురించి రాచమల్లు రామచంద్రారెడ్డి "...శైలిలో గాంభీర్యమూ, ఉదాత్తతా, వేగమూ, ఉద్ధతి లాంటి గుణాలు బలీయంగా వున్నప్పుడు, ఆ శైలి పాఠకులను ఊపిరాడకుండా ఉక్కిరి బిక్కిరి చేసి భళీ అనిపించుకుంటుంది. డి. యం. కె. నాయకుల వాగ్ధాటిలాగా Rhetoric అంటే అదే"[13] అని తెలిపాడు. దీనికి ఉదాహరణగా పానుగంటి లక్ష్మీ నరసింహారావు రాసిన 'సాక్షి'లోని భాషా ప్రయోగాన్ని చూపవచ్చు. 'సరళశైలి' అంటే పదాలకు ప్రాముఖ్యత ఇవ్వక చెప్పే విషయానికే ప్రాధాన్యత నిచ్చి, అతి సులభంగా పాఠకులకు అర్థమయ్యేట్టుగా ఉండేది. దీనికి ఉదాహరణగా కొడవటిగంటి కుటుంబరావు రచనల్ని పేర్కొనవచ్చు.[14]

చెప్పే తీరునుబట్టి శైలి నాలుగు రకాలు. అవి: 1). సంక్షిప్త శైలి (Conscise Style), 2). సూక్తి శైలి (Sententious Style), 3). సూత్రప్రాయ శైలి (Laconic Style), 4). వాగ్మి శైలి (Copicious Style). వీటిలో 'సంక్షిప్త శైలి' అంటే పదాల్ని అతి పొదుపుగా ప్రయోగించి చెప్పేవిధానం, 'సూక్తి శైలి' సూక్తులు బోధించినట్లు చెప్పేతీరు, 'సూత్రప్రాయ శైలి' సూత్రాలను చెప్పిన విధంగా చెప్పేది, 'వాగ్మి శైలి' అంటే అతి విస్తారంగా వివరించి చెప్పేది.

రచనా విధానాన్ననుసరించి శైలిని శైలీ శాస్త్రవేత్తలు పది రకాలుగా విభజించారు. 1). వాదాత్మకం (Argumentation), 2). విమర్శనాత్మకం (Critical), 3). వర్ణనాత్మకం (Descriptive), 4). నాటకీయం (Dramatic), 5). విశదాత్మకం (Explository), 6). కథనాత్మకం (Narrative), 7). ఉపన్యాసాత్మకం (Oratorical), 8). తాత్త్వికం (Philosophycal), 9). వ్యంగ్యాత్మకం (Satirical), 10). లేఖాత్మకం (Epistolery).

ఈ విధంగా రకరకాలుగా చెప్పబడిన శైలిపై శ్రీశ్రీ కూడా 'నాకు నచ్చిన వచనశైలి' అనే రేడియో ప్రసంగంలో చర్చ చేశాడు. అందులో "కుకవుల శైలినాకు నచ్చదు. గవర్నమెంటాలిటీ నాకు నచ్చదు. డొంక తిరిగుబాటు నాకు నచ్చదు. బుర్ర తిరుగుడు మాట నాకు నచ్చదు. రూపాయలు మాట్లాడేశైలి నాకు నచ్చనే నచ్చదు. ఆ రూపాయలు జేబుల్లోగాని, బ్యాంకుల్లోగాని, ఇనుపమందసాల్లోగాని, ఇతర చోట్లగాని వినిపించే శైలి నాకు నచ్చదు"[15] అని చెప్పిన దాని వల్ల గవర్నమెంటుకోసమో, డబ్బుకోసమో, డొంక తిరుగుడుగా చెప్పే తీరు తనకు నచ్చదని ఖచ్చితంగా చెప్పాడు. ఆ తరువాత తనకు నచ్చేశైలిగా తన శైలితో పాటు జనార్ధనరావు, ఆంగ్ల రచయిత 'ఈ ఈ' (E.E.), ల శైలీలనూ పేర్కొన్నాడు శ్రీశ్రీ.[16]

శైలి పద్ధతుల్ని తెలిపే పై అంశాలన్నీ 'కవిత్వ శైలి' ని గుర్తించడానికి బాగా పనికొస్తాయి. కానీ వచనంలో 'శైలి' ని పసికట్టడం అంత సులువుకాదు. ఈ విషయాన్నే 'Style in Fiction' అనే పుస్తకంలో రచయితలు "The students of literature is, perhaps, more likely to accept the usefulness of linguistic analysis in the study of poetry than prose"[17] గా చెప్పారు. ఇంకా ". . . no, adequate theory of prose style has emerged"[18] అని 'వచన శైలి'ని వివరించడానికి ఇంకా సరైన సిద్ధాంత మంటూ ఏర్పడలేదన్నారు. రచనల్ని శైలి దృక్పథంతో వివరించడం 1980ల నుండి ఆరంభమైనట్లుగా 'International Encyclopaedia of Linguistics' లో చెప్పబడింది.

వచనాన్ని శైలీ శాస్త్ర దృక్పథంతో పరిశీలించడం ఇప్పుడిప్పుడే ఆరంభమైంది. అందుకే వచన శైలి వివరించడానికి సరైన ఆకరాలు లేవు. వచన శైలిని వివరించడంలో ఇబ్బందులున్నప్పటికీ శ్రీశ్రీ వచన రచనల శైలిని గురించి కొంతైనా వివరించే ప్రయత్నం చేయడం జరుగుతుంది.

దాదాపు అన్ని వచన ప్రక్రియల్లోనూ శ్రీశ్రీ రచనలు చేశాడు. వాటిల్లో శ్రీశ్రీ 'శైలి' ని తెలపడమంటే ప్రధానంగా భాషా ప్రయోగాన్ని వివరించడమే. 'శైలి' ని గుర్తింప జేసే పదాలు, వాక్య నిర్మాణ రీతులు మొదలైనవన్నీ శ్రీశ్రీ వచన రచనల్లో ఎలా ఉన్నాయో పరిశీలించ వలసి ఉంది.

# పద ప్రయోగం

రచనల్లో పద ప్రయోగ విధానం రచయితలకు ప్రత్యేక గుర్తింపును తెస్తుంది. కొందరు రచయితలు తమ రచనల్లో కొన్ని పదాల్ని విరివిగా వాడడంకద్దు. ఇలా తమకిష్టమైన పదాల్ని ప్రయోగించడం శ్రీశ్రీ వచన రచనల్లోనూ కనిపిస్తుంది. అవి : 'అనంతం', 'సత్యం', 'ఆధ్యాత్మికత' 'ఝంఝ' వంటి పదాలు.

'అనంతం' పదంపై శ్రీశ్రీకి చాలా మోజు ఉన్నట్లు కనిపిస్తుంది. తన స్వీయచరిత్రకు 'అనంతం' అని పేరు పెట్టాడు. 'చిత్ర రహస్యం', 'సంపెంగతోట' కథలలో 'అనంతం' పాత్ర ఉంది. 'ఆదర్శ జీవులు' నవలలో 'సుదర్శనం : లోకం' అని శ్రీశ్రీ రాసిన భాగంలో "లోకంలో ! విశ్వం ! లోకం పరిమితి విశ్వం అనంతం. లోకంలో నా జీవితం పరిమితం. విశ్వంలో నా ఆత్మ అనంతం"[19] అని ఒకే వాక్యంలో 'అనంతం' పదం రెండు మార్లు ప్రయోగించాడు. స్వీయచరిత్ర 'అనంతం' లో "... ఆ కానివి ఇంకో అనంత సంఖ్య. ఎటొచ్చీ మొదటి అనంతంలోనే రెండో అనంతం గర్భితమయి ఉంటుంది. అందుకే అన్నాను ఎంత ద్వ్యర్థి సృష్టి! అని అసలు ఇలా రెండు అనంతాలు లేవు"[20] అని ఈ విధంగా 'అనంతం' పదాన్ని ఈ పుస్తకంలో పలుమార్లు ప్రయోగించాడు. ఇలాగే ఇతర వచన రచనల్లోనూ ఉంది.

'అనంతం' పదం తర్వాత 'సత్యం' పదంపై శ్రీశ్రీకి ఏక్కువ మోజు కన్పిస్తుంది. అందుకే ఆ పదాన్ని పదే పదే వాడుతాడు. 'సాహిత్య రచన: ప్రక్రియలు' అనే రేడియో ప్రసంగంలో "ఇవాళ ఎవరికీ బోధపడని సత్యం రేపు అందరికీ అందుబాటులోనికి వస్తుంది. కవిత్వం చేసే ప్రయోగాలన్నీ ఆ సత్యాన్ని అన్వేషించడం కోసమే. ఏరూపు ధరించినా కవిత్వానికి పరమార్థం ఆ సత్యాన్ని చాటడమే"[21] నని చెప్పిన దానిలో 'సత్యం' పదంపై శ్రీశ్రీకి ఎంత ఇష్టముందో తెలుస్తుంది. ఇలాగే 'తెలుగు సాహిత్యంలో గూఢత -వేమన', 'సాహిత్యంలో పాతా కొత్తా', 'విశాలాంధ్ర' వంటి

ప్రసంగాల్లోకూడా 'సత్యం' పదాన్ని విరివిగా ప్రయోగించాడు. 'అంగార వల్లరి', 'లే', 'ఎర్రగాలి' మొదలైన పుస్తకాలకు రాసిన పీఠికల్లోనూ, సమీక్షలు, సంపాదకీయాలు, స్వీయ చరిత్ర ఇత్యాది వచన రచనలన్నింటిలోనూ 'సత్యం' పదం తరుచుగా కనిపిస్తుంది.

శ్రీశ్రీ రచనల్లో 'ఆధ్యాత్మికత' అనే పద ప్రయోగం కూడా ఎక్కువగా ఉంది. ఆత్రేయ రాసిన 'విశ్వశాంతి' నాటకానికి శ్రీశ్రీ రాసిన పీఠికలో "అత్యున్నతమైన ఒక ఆధ్యాత్మిక స్థాయినందుకుంటే తప్ప ఏ రచయితా ఇటువంటి నాటకాలకి ప్రయత్నించి కృతకృత్యుడు కాలేడు"[22] అని వాడాడు. ఇలాగే 'స్వీయ చరిత్ర' లోనూ ప్రయోగించాడు. 'నాకవిత్వం', 'తెలుగు సాహిత్యంలో గూఢత - వేమన' మొదలైన ప్రసంగాల్లోనూ 'ఆధ్యాత్మిక' పదం ఉంది. ఇంతేగాకుండా 'ఆధునిక సాహిత్యంలో ఆధ్యాత్మిక చింతన' అనే ప్రసంగంలో "ఆధ్యాత్మిక చింతనకు నేనిచ్చే అర్థం ఇదే. అంగీకరించిన దానికి అభ్యంతరం చెప్పడం, పాత పుంతల్లో ప్రయాణం మాని నూతన మార్గాలను అన్వేషించడం"[23] గా అర్థాన్ని చెప్పాడు.

అనంతం, సత్యం, ఆధ్యాత్మికత పదాలతో పాటు 'ఝంఝ' పదప్రయోగం కూడా శ్రీశ్రీ రచనల్లో విరివిగా కన్పిస్తుంది. నవకవనానికి "ఝంఝూ నిల షడ్జధ్వానం"[24] ఉండాలని కవిత్వంలో చెప్పిన శ్రీశ్రీ వచన రచనల్లో 'ఝంఝ' పదాన్ని పలుమార్లు ప్రయోగించడం కనిపిస్తుంది. సౌందర్య ఝంఝ[25](వ్యాసం); విప్లవ ఝంఝ[26], రాజకీయ ఝంఝ[27] (ఉపన్యాసం) ; మృత్యు ఝంఝ[28] (పీఠిక) ; ప్రేమ ఝంఝ[29] (సమీక్ష) ; ఉద్రేక ఝంఝ[30] (సంపాదకీయం) ; భీత్యుగ్ర ఝంఝ[31] (స్వీయ చరిత్ర) ఈ విధంగా పలు వచన ప్రక్రియ రచనల్లో ఏదో ఒక విశేషనాన్ని ముందు చేర్చి 'ఝంఝ' పదాన్ని ప్రయోగించాడు.

ఇంకా 'ఇత్యాది', 'అనేక', 'పరాస్తం' వంటి పదాలనూ ఎక్కువగా వాడాడు. ఈ విధంగా మొత్తం వచన రచనల్లో సాధారణంగా కనిపించే పదాలే గాక ఒక్కొక్క ప్రక్రియలో ఒక్కొక్క రకం పదం ఎక్కువగా వాడడం కూడా కనిపిస్తుంది. స్వీయ చరిత్రలో 'జ్ఞాపకం' అనే పదం, సమీక్షల్లో 'దొర్లింపబడినవి', 'మా భావం', 'మా ఉద్దేశం', 'మా అభిప్రాయం' అనే పదాలు, లేఖల్లో 'బొగట్టా' అనేది చాలా చోట్ల ఉంది. ఇలా భిన్న ప్రక్రియల్లో వివిధ రకాల పదాలను విరివిగా ప్రయోగించడం గమనిస్తాం. ఈ విధమైన పదాల ప్రయోగం సాధారణంగా " . . . నువ్వు ఎప్పుడు వస్తావో ! ఎలాగ వస్తావో ! నువ్వు cycloneలాగో, sulphuric acid లాగో ! గంధ సింధురంలాగో గండబేరుండంలాగో . . . "[32] వంటి కవితాత్మక వాక్యాలుగా తీర్చిదిద్దుతాడు. ఇలా వచనంలో వేగం, చురుకుదనం పాఠకుల్లో ఉద్రేకం సృష్టించడానికి అనువైన పదాల్ని ఎంపిక చేసి వచనాన్ని పరిగెత్తిస్తాడు శ్రీశ్రీ.

# వాక్య ప్రయోగం

శైలిని గుర్తించడానికి ముఖ్యమైన వాటిల్లో వాక్య నిర్మాణరీతి ఒకటి. శ్రీశ్రీ వచన రచనల్లో రెండు మూడు రకాల వాక్య నిర్మాణ రీతులు ప్రత్యేకంగా కనిపిస్తాయి. అవి : వాక్యాన్ని తిరిగేయడం, ఒకే వాక్యంలో ఒక పదాన్నిరెండు మార్లు ప్రయోగించడం, వాక్యంలో ఒక అక్షరాన్ని గానీ, పదాన్నిగానీ, పలుమార్లు, అవృతి చేసి శబ్దాలంకారం సాధించడం, వాక్యాంతంలో 'మానలేను' అనే పదాన్ని విరివిగా వాడడం శ్రీశ్రీకి పరిపాటి.

శ్రీశ్రీ శైలిలో వాక్యాన్ని తిరిగేయడం అతి ప్రధానమైంది. ఇది కవిత్వ రచనల్లో "కడలివలపూ, వలపు కడలీ" (స్విన్‌బర్న్ కవికి) ; "చీకటి లోపల నాగదిలో / నా గదిలోపల చీకటిలో" (కేక) ; "చేదు విషం జీవఫలం / జీవఫలం చేదు విషం" (చేదుపాట) అని కనిపించినట్లుగానే వచన రచనా ప్రక్రియల్లోనూ ఉంది. మొదట కథల్లో ఉన్న తీరును చూద్దాం. "మా నాయనమ్మ బతికున్నంతకాలం ఈ సందేహం నాకు కలుగలేదు. ఇప్పుడు బతికున్న నాయనమ్మ లెవరూ ఈ సందేహం తీర్చలేరు" ; "నాయనమ్మలు ప్రారంభించే కథలు కంచిలో అంతమైతే, కంచిలో ప్రారంభమయ్యే కథలు నాయనమ్మలో అంతమవుతాయా?" (చరమరాత్రి); "కడుపువల్ల ప్రేమ, ప్రేమవల్ల కడుపు" (ఒసే తువాలు అందుకో); " . . . సాహిత్య రాజకీయాలకీ, రాజకీయ సాహిత్యాలకీ" (హేమంతం). ఈ రకంగా పదాలను, వాక్యాలను మాత్రమే తిరిగేయడం గ సామెతలనూ తిరగేసి ప్రయోగిస్తాడు. "నలుగురితో చావు పెళ్ళితో సమానం / నలుగురితో పెళ్ళి చావుతో సమానం" (బొమ్మ); 'అగ్గిమీద గుగ్గిలం' అనే సామెతను "గుగ్గిలంపక్ష అగ్గిలా" (హేమంతం) అని ఇలా భాషతో వినూత్న ప్రయోగాలు చేశాడు శ్రీశ్రీ.

ఈ విధంగా పదాలను, వాక్యాలను, సామెతలను తిరిగేయడమే కాదు, పేర్లను కూడా తిరిగేసే లక్షణం శ్రీశ్రీలో చూడొచ్చు. ఇది కవితల్లో "గుడివెంకటపాటి చలం"[33],

"శాష్టకృస్త్రిప్విష్ఫరించు"[34], "జలరుక్మిణీ సూత్రనాథ శాస్త్రి . . ."[35] అని ప్రసిద్ధ సాహిత్య వేత్తలయిన గుడిపాటి వెంటకచలం, కృష్ణ శాస్త్రి, జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి గారల పేర్లను విచిత్రంగా తిరిగేసినట్లుగానే 'ఐశ్వర్యం ఎదుట దారిద్ర్యం' అన్న కథలో 'కుంటి బిచ్చ కుర్రవాడు, కుంటి కుర్రబిచ్చగాడు, కుర్రబిచ్చకుంటివాడు, బిచ్చకుంటి కుర్రవాడు, బిచ్చకుర్రకుంటివాడు' అని ఆ పాత్రను పేర్కొన్నప్పుడల్లా మార్చి మార్చి పలు విధాలుగా పేర్కొన్నాడు. కథా సహిత ప్రక్రియల్లోని ఒక నాటికలో "బతికి చచ్చి పోయాను, చచ్చిబతికి పోయాను" (విదూషకుడి ఆత్మహత్య) అని సందర్భానుసారంగా తిరిగేశాడు. ఇదే విధంగా వ్యాసాలలో "ఎలకమీద పిల్లి, పిల్లి మీద ఎలక" (ఔరా వచన రచన), ఉపన్యాసాలలో "వచనమే కవిత్వం-కవిత్వమే వచనం" (నాకు నచ్చిన వచన శైలి), "నందిని పంది, పందిని నంది" (సాక్షి క్లబ్‌లో శ్రీశ్రీ), పీఠికలలో "విచిత్రమే సౌందర్యం! సౌందర్యమే విచిత్రం" ('ఫిడేలు రాగాల-డజన్' పుస్తకం పీఠికలో), సంపాదకీయంలో "నువ్వు చెప్పినది నాకు నచ్చదు. నేను చెప్పినది నీకు నచ్చదు", (శ్రుతులు), ప్రశ్న జవాబులలో "వచనమైతే కవిత్వం కాదు, కవిత్వమైతే వచనం కాదు" ('దిగంబర కవులతో ముఖాముఖి' లో), స్వీయ చరిత్రలో "లేస్తూ పడుతూ పడుతూ లేచే . . ." ('మరో ప్రారంభం'లో) ఇలా తిరిగేయడం దాదాపు అన్ని ప్రక్రియల్లోనూ ఉంది.

ఇలా తిరిగేయడం శ్రీశ్రీ 'కవిత్రయం'లో ఒకరైన గురజాడ రచనల్లో కనిపిస్తుంది. ఈయన తన కథలలో ఒక కథకు పేరుగా 'దేవుడు చేసిన మనుషుల్లారా, మనుషులు చేసిన దేవుల్లారా' అని తిరిగేశాడు. ఇదే ఒక కవితలో 'పెరిగి విరిగిఁతి, విరిగి పెరిగిఁతి' అనీ ప్రయోగించాడు. ఈవిధంగా తిరిగేసే అలవాటు శ్రీశ్రీకి బహుశా గురజాడ ప్రభావం నుండే వచ్చి ఉంటుంది.

శ్రీశ్రీ వాక్య నిర్మాణ రీతుల్లో కన్పించే లక్షణం – ఒకే వాక్యంలో ఒక పదాన్ని రెండు మార్లు ఉపయోగించడం. 'విదూషకుడి ఆత్మహత్య' (నాటిక) లో "దయచేసి నువ్వు దయచేస్తే సంతోషిస్తా", 'ఆంధ్ర రాష్ట్ర యువజన మహాసభ' (ప్రసంగం) లో "వాడుక భాష వాడుకలోకి వచ్చింది", 'ప్రారంభం' (స్వీయ చరిత్ర) లో " . . . నిశ్చయంగా దేని సంగతీ చెప్పలేమని మాత్రం నిశ్చయంగా చెప్పగలం" అనే విధంగా అర్థ భేదం ఉండేటట్లుగా, లేని విధంగానూ ఒకే పదాన్ని రెండు మార్లు ప్రయోగించి వాక్యానికి వన్నె చేకూర్చడం శ్రీశ్రీ శైలిగా గుర్తింపజేస్తుంది.

ఒకే వాక్యంలో అక్షరాన్ని గానీ పదాన్ని గానీ పలుమార్లు ఆ వృతిచేసి శబ్దాలంకారాలనూ సాధించాడు. 'చరమరాత్రి' కథలో "పునః పునః పునః పరీక్షలు చేసుకున్నావో నా హృదయ హృదయాంత రాంత రాంతరాలలో", 'చలికాలపురాత్రి' లో " . . . మెల్లి మెల్లిగా వేగంగా క్షణం బద్దలై చచ్చిపోవడం, క్షణం యొక్క, మృత్యువు యొక్క, యొక్క యొక్క మృత్యువెవరిది ?" అని ఈ విధంగా కొన్ని కథల్లో శబ్దాడంబరం కనిపిస్తుంది. నాటికలోని 'చతురస్రం' లో "కళని నేను

కళత్రంగా చేసుకోవాలనుకున్నానే" అని ఇలా కథాత్మకాల్లో శబ్ద వైవిధ్యాన్ని కనబరిచాడు శ్రీశ్రీ. కథారహితాలలో " . . . సమిష్టి క్షేమాన్ని దృష్టిలో పెట్టుకొని సమిష్టి కృషిని సాగించాలి" ('ప్రబంధాల్లోని శృంగారం' ప్రసంగంలో), "అధర్మ పక్షం ధర్మ పక్షాన్ని అధర్మ పక్షమనీ, ధర్మ పక్షం అధర్మ పక్షాన్ని అధర్మ పక్షమనీ నిప్పులు చెరుగుతూ . . ." ('ఫిస్కాలజీ' - వ్యాసంలో) అనీ ఆ విధంగా వివిధ ప్రక్రియల్లోని వచన రచనల్లో అలంకారయుతమైన శబ్ద చమత్కారం కనిపిస్తుంది.

శ్రీశ్రీ వాక్య నిర్మాణంలో అగుపించే మరో విశేషం 'మానలేను' అనే పదాన్ని వాక్యాంతంలో ప్రయోగించడం. కథాత్మకమైన కథ, నవల, నాటికలలో లేదనే చెప్పుకోవచ్చు. కానీ కథేతర రచనలైన వ్యాసాలు, పీఠికలు, సమీక్షలు వంటి వాటిల్లో ఉంది. ఇదే విధంగా స్వీయాత్మకాలైన. స్వీయ చరిత్ర, యాత్రా చరిత్రల్లోనూ 'మానలేను' అన్న పదం వాక్యాంతంలో గమనిస్తాం. " . . . వాళ్ళ సంకుచిత దృష్టికి నేను జాలిపడడం మానలేను" ('ఆంధ్ర దేశంలో సాహిత్య సంఘాలు' - వ్యాసం); " . . . తిక్కన, వేమన, గురజాడలు మహాకవులని చాటడం మానలేను" ('కవిత్రయం' - ఉపన్యాసం); "బీభత్స భయానకాలు ఈనాటి కావ్యరసాలుగా నేను పేర్కొనడం మానలేను" ('వేడిగాలి'కి రాసిన పీఠిక) ; "ఈ కులాలూ, మతాలే మనదేశాన్ని పట్టి పల్లారుస్తున్న వేరు పురుగులని ఒకటికి పది సార్లు చెప్పడం మానలేను" (ఆంధ్రజ్యోతి వార పత్రిక 'ప్ర / జ' లో) అని ఈరకంగా కథేతర రచనల్లో ఉన్నట్లుగానే 'ఆత్మచరిత్ర' రచనలైన స్వీయ చరిత్రలో " . . . నా రచనా నిలవదు అని తెలిసినా వ్రాయడం మానలేను" (ప్రారంభం), యాత్రా చరిత్రలో "... తెలుగుదేశం అంటే మాత్రం మైమరచిపోవడం మానలేను" (చైనాయానం) అని ఇలా వాక్యాంతాల్లో 'మానలేను' అనే పదాన్ని విరివిగా ప్రయోగించడం కనిపిస్తుంది

